# శ్రీమద్రామాయణ కల్పవృక్షము

## కిష్కింధ కాండము



విశ్వనాథ సత్యనారాయణ

ఆఱవ ముద్రణ : 1992
ప్రతులు : 1000



ధర : రూ. 55/-.
లైబ్రరీ ప్రతి : రూ. 80/-.

**D.T.P., Printing**
**INDIA BLOCK MAKERS**
VIJAYAWADA - 520 003.

ప్రతులకు:

విశ్వనాథ పబ్లికేషన్స్
విశ్వనాథపురము,
మారుతీనగర్, విజయవాడ - 520 004.

# ఒక్కమాట

విశ్వనాథ సత్యనారాయణగారు 1895 సెప్టెంబరు 10న (అనగా మన్మథ నామ సంవత్సర భాద్రపద బహుళ షష్ఠి) కృష్ణాజిల్లా నందమూరు గ్రామంలో జన్మించారు.

1976 అక్టోబరు 18న (అనగా నలనామ సంవత్సర ఆశ్వయుజ బహుళ దశమి) పరమపదించారు. హరిత సగోత్రీకుడైన వీరి తండ్రి శోభనాద్రిగారు, తల్లి పార్వతమ్మగారు.

ఈ కల్పవృక్ష రచన 1932 ప్రాంతాలలో ప్రారంభింపబడింది. 1944లో నాటి ముక్త్యాల జమీందారుగారి ద్రవ్య సహాయంతో బాలకాండ ప్రథమ ముద్రణ అయింది. 1944 ప్రాంతాలలోనే అయోధ్యకాండ కూడా పూర్తయింది. దానిని కూడా ముక్త్యాల వారే ముద్రింపించారని వినికిడి. 1950 ప్రాంతాలలో అరణ్య, కిష్కింధకాండలు పూర్తి అయినాయి. వాటిని ఎలాగో అలాగ విశ్వనాథవారే ముద్రింపించుకో గలిగారు.

1950 నుంచి 1962 వరకు సుందర, యుద్ధకాండల రచన సాగింది. సుందరకాండ తొలిముద్రణ 1956. యుద్ధకాండ తొలిముద్రణ 1962 నవంబరు. ఇవి కూడా విశ్వనాథవారు స్వయంగా ముద్రించినవే. 1970లో ఈ మహాకావ్యానికి భారతీయ జ్ఞానపీఠం వారి లక్షరూపాయల బహుమతి లభించింది.

1976లో అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు, విద్యామంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావుగార్ల కృషి వలన ఐదవ ముద్రణకు ప్రభుత్వ సహాయం కొంత లభించింది. అప్పుడు విశ్వనాథవారు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆస్థాన కవి.

ఐదవ ముద్రణ ప్రతులు అయిపోయి చాలాకాలం అయింది. ఎంతో మంది సహృదయులు రామాయణ కల్పవృక్షం ప్రతులు కావాలి, కావాలి అని అడుగుతున్నప్పటికీ- పెరుగుతున్న ధరలకి తట్టుకోలేక ఇంత పెద్ద కావ్యాన్ని ముద్రించటానికి పూనుకోలేక పోయాము.

మా నాయనగారైన విశ్వనాథ సత్యనారాయణగారిచే "తొలినటి జనుష
లందలి చెలిమికాడు"గా వర్ణింపబడిన (భ్రష్టయోగి-ఖండకావ్య సంపుటి- అంకి
పద్యాలు) శ్రీ జువ్వాడి గౌతమరావుగారు ఇంతలో మాకు అండగా నిలిచారు
మరి కొంతమంది సహృదయ వదాన్యులు ద్రవ్యసంపత్తి నందించారు. వా
సహాయ సంపత్తులతో ఈ ఆరవ ముద్రణను ఆంధ్రపాఠకలోకం ముందుంచగల
గుతున్నాము. వారి పేర్లు గ్రంథముచివర ముద్రింపబడి ఉన్నవి. వారికి మేమ
సర్వదా కృతజ్ఞులము. వీరంతా కలిసి మాకు కల్పవృక్ష ముద్రణకు కావలసినదా
కంటే కొంత ఎక్కువే అందించారు. ఆ మిగిలినదానితో ఒక పద్యకావ్యసంక
టము, ఒక నవల కూడా అందించే ప్రయత్నం చేస్తున్నాము.

ఇది కంప్యూటర్ సాయంతో చేయబడిన ఆఫ్ సెట్ ముద్రణ. దీనిలో సాధ్య
మైనంత వరకు ముద్రారాక్షసాలు లేకుండానే జాగ్రత్తపడ్డాము. ఏవైనా కొన్ని
ఉంటే వాటిని వచ్చే ముద్రణలో తప్పక సవరిస్తాము. పూర్వపు ముద్రణలలో
లేని, ఈ ముద్రణలోఉన్న విశేషం విషయసూచిక.

రామాయణ కల్పవృక్షంపై ఇంతవరకు దాదాపు ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని విశ్వ
విద్యాలయాలలోను M.Philలు Ph.D.లు ఎన్నో జరిగాయి. ఇంకా అనేకం జరు
గుతున్నాయి. వాటిలో కొన్ని ముద్రణ కూడా అయినాయి.

విశ్వనాథ పావనిశాస్త్రి

# ఈ గ్రంథము ఆరవ ముద్రణకు ద్రవ్యసహాయము చేసిన దాతలు

| | | |
|---|---|---|
| శ్రీ కందుకూరి శివానందమూర్తిగారు, (భీమునిపట్నము) వారిశిష్యులు | | 15,000-00 |
| * శ్రీ బి.వి.ఎస్.ఎస్. మణిగారు | మద్రాసు | 18,000-00 |
| **కీ.శే. జువ్వాడి చొక్కారావుగారి జ్ఞాపకార్థము** | | |
| శ్రీ జువ్వాడి గౌతమరావుగారు | కరీంనగరము | 12,000-00 |
| శ్రీ జువ్వాడి రామేశ్వరరావుగారు | కరీంనగరము | 8,000-00 |
| శ్రీ జువ్వాడి రఘునాథరావుగారు M.D. | నిజామాబాదు | 20,000-00 |
| **కీ.శే. జువ్వాడి వరదరావుగారి జ్ఞాపకార్థము** | | |
| శ్రీ జువ్వాడి హనుమంతరావుగారు | కరీంనగరము | 5,000-00 |
| శ్రీ జువ్వాడి రామచంద్రరావుగారు | కరీంనగరము | 5,000-00 |
| శ్రీ జువ్వాడి మదనమోహనరావుగారు | వరంగల్లు | 5,000-00 |
| **కీ.శే. జువ్వాడి తిరుమలరావుగారి జ్ఞాపకార్థము** | | |
| శ్రీ జువ్వాడి మధుసూదనరావుగారు | కరీంనగరము | 4,000-00 |
| శ్రీ వెలచాల కొండలరావుగారు | కరీంనగరము | 4,000-00 |
| శ్రీ చీటి అయోధ్యరామరావుగారు | కరీంనగరము | 4,000-00 |
| శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు | కరీంనగరము | 2,500-00 |
| శ్రీ నేదునూరి బాబూరావుగారు | కరీంనగరము | 2,400-00 |
| శ్రీ నేదునూరి మనోహరరావుగారు | కరీంనగరము | 1,000-00 |
| శ్రీ నిమ్మగడ్డ రామమోహనరావుగారు | కరీంనగరము | 1,116-00 |
| శ్రీ జి. రంగాచారిగారు | కరీంనగరము | 1,000-00 |
| శ్రీ చీటి ముత్యంరావుగారు | కరీంనగరము | 1,000-00 |
| శ్రీ ఎస్. జగన్మోహనరావుగారు | కరీంనగరము | 1,000-00 |
| శ్రీమతి మంగాదేవిగారు | కరీంనగరము | 1,000-00 |
| శ్రీ సిరికొండ ప్రభాకరరావుగారు | కరీంనగరము | 1,000-00 |
| శ్రీ నూకలమర్రి గంగయాచారిగారు | కరీంనగరము | 2,000-00 |
| శ్రీ గంద్ర నారాయణరావుగారు | హైదరాబాదు | 1,000-00 |
| శ్రీ ఆర్. మాధవరావుగారు | హైదరాబాదు | 1,000-00 |
| శ్రీ తులా ప్రభాకరరావుగారు | హైదరాబాదు | 1,000-00 |
| శ్రీ సిరికొండ వేంకటరావుగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ ఎ. రామరాజుగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ అవటపల్లి రాధాకృష్ణమూర్తిగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ సి. హెచ్. రామచంద్రరావుగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ డి. చంద్రారెడ్డిగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ ఉప్పల వేంకటేశముగారు | సిద్దిపేట | 1,000-00 |

| | | |
|---|---|---|
| శ్రీ బి. రవీందర్ గారు | సిద్దిపేట | 1,000-0 |
| శ్రీ టి. పద్మనాభంగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ పొన్నాల తిరుమలరెడ్డిగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ కె. చంద్రశేఖరరావుగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ బి. రాజారెడ్డిగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ కోవెల సంపత్కుమారాచార్యగారు | వరంగల్లు | 4,000-00 |
| శ్రీ అనుమాండ్ల భూమయ్యగారు | వరంగల్లు | 1,000-00 |
| శ్రీ జి. అప్పయ్యశాస్త్రిగారు | ఖమ్మం | 1,000-00 |
| శ్రీ జనమంచి కామేశ్వరరావుగారు | రాజమండ్రి | 4,000-00 |
| శ్రీ సత్తి చంద్రారెడ్డిగారు | రాజమండ్రి | 4,000-00 |
| శ్రీ సిరిపురం వరదేశిగారు | రాజమండ్రి | 1,000-00 |
| శ్రీ ఎఱ్ఱాప్రగడ రామకృష్ణగారు | రాజమండ్రి | 1,000-00 |
| శ్రీ కుతపా వేంకటేశ్వరరావుగారు | రాజమండ్రి | 1,000-00 |
| శ్రీ పెదపాటి సత్యనారాయణగారు | రాజమండ్రి | 1,000-00 |
| శ్రీ బేతవోలు రామబ్రహ్మంగారు | రాజమండ్రి | 1,000-00 |
| శ్రీ కట్టి నాగార్జునశ్రీ గారు | చిల్లంగి | 1,000-00 |
| శ్రీమతి జి. పుల్లమాంబగారు | గుంటూరు | 558-00 |
| * శ్రీమతి భద్రమ్మ శ్రీ మల్లినరామచంద్రరావు దంపతులు | తణుకు | 4,000-00 |
| * శ్రీమతి విజయ శ్రీ చిట్టూరిబాపినీడు దంపతులు | తణుకు | 4,000-00 |
| * శ్రీమతి యశోదాదేవి శ్రీ కరటూరు సూర్యారావుదంపతులు | బెంగుళూరు | 4,000-00 |
| * శ్రీమతి రంగనాయకమ్మ సకలావరసింహులుచెట్టిచారిటీస్ | బెంగుళూరు | 4,000-00 |
| * శ్రీ ఎం. రుక్మాంగదనాయుడుగారు | బెంగుళూరు | 1,000-00 |
| * శ్రీ ఎన్. రాజారెడ్డిగారు | బెంగుళూరు | 1,000-00 |

*కీ.శే. సీతామహాలక్ష్మి, తంగిరాల వెంకటసుబ్బావధానులుగార్ల (తణుకు) జ్ఞాపకార్థము*

* శ్రీ తంగిరాల సోదరులు :
సోమయాజులు, వేంకటసుబ్బారావు,
భాస్కరరావు, కృష్ణమూర్తిగార్లు 2,000-00

| | | |
|---|---|---|
| శ్రీ తుమ్మపూడి కోటేశ్వరరావుగారు | అనంతపురం | 1,500-00 |
| శ్రీ శలాక రఘునాథశర్మగారు | అనంతపురం | 516-00 |
| శ్రీ ముక్తిమాతల గురునాథరావుగారు | విజయవాడ | 4,000-00 |

*** వీరు సుందరకాండ (2000 కాపీలు) ముద్రణకై ప్రత్యేకముగా సమర్పించిరి.**

# విషయ సూచిక

(అంకెలు పద్య సంఖ్యను సూచించును)

## <u>మీకరణఖండము</u>- పుటలు 125-161

రాముని వద్దకు సర్వసేనాసమూహముతో సుగ్రీవుని రాక, వానరవీరుల పరిచయము 4- సుగ్రీవుడు సీతను వెదకుటకై వానరయోధులను నాల్గు దిక్కులకు పంపించుట 57- వినతునికి సుగ్రీవుని పూర్వదిశా మార్గోపదేశము 61 - అంగదునికి దక్షిణ దిశా మార్గోపదేశము 105- సుషేణునికి పశ్చిమ దిశా మార్గోపదేశము 159- శతవలికి ఉత్తర దిశా మార్గోపదేశము 218- స్వనామాంకితమైన యంగుళీయము శ్రీరాముడు గుర్తుగా హనుమంతునికిచ్చుట 285- వినత, సుషేణ, శతవలుల తిరిగి రాక; హనుమంతుడు తప్ప సీతను మరొకడు కనుగొన జాలడని ముప్పురు సేనాపతులు రామునికి విన్నవించుట 326.

## <u>ప్రేషణ ఖండము</u> - పుటలు 162-212

సీతను కనుగొనలేని హనుమంతుని దైన్యము, క్షుత్పిపాసా పరిపీడితులైన వానరులు 2- ఋక్షబిలమునందు వానరుల ప్రవేశము 26- పుష్పఫలసమృద్ధమైన బిలములో వానరుల స్వయంప్రభాదేవి దర్శనము 51- దేవికి హనుమంతుని విన్నపము 54- వానరుల క్షుత్పిపాసాపనోదనము 61 - ప్రసన్నురాలైన స్వయం ప్రభాదేవి వానరులను బిలమునుండి వినిర్గమింపజేయుట 90- నిరాశచెందిన వానరవీరుల మనస్సులందు సుగ్రీవ వ్యతిరేక బీజ నిక్షేపమునకై అంగదుని యత్నము, హనుమంతునిచే తద్విఘటనము 102- అంగదుని ప్రాయోపవేశము, వానరుల అనుసరణము 165- వానరులను భక్షింపవచ్చునన్న సంపాతియాశ 193- సంపాతిని చూచిన యంగదుడు తనకు జటాయువు వలె సార్థకమైన మరణము రాలేదని యాక్రోశించుట 201- జటాయువు పేరు విన్న సంపాతి వానరులతో తద్వృత్తాంతమడుగుట 214- సంపాతితో వానరులమైత్రి 250- సంపాతి చెప్పిన రావణ వృత్తాంతము, సీత జాడ 266- నిశాకరముని వరముచే సంపాతికి గరుదుద్గమనము, సంపాతి వీడ్కోలు 351- సముద్రము తరింపజాలని కపుల నాశ్వాసించి జాంబవంతుడు హనుమంతుని స్తుతించుట 403- హనుమద్విజృంభణము 434- సముద్ర తరణమునకై హనుమంతుడు మహేంద్ర పర్వతము నెక్కుట 453.

# నూపురఖండము

క. శ్రీ వినతాసుతసుషమా గ్రీవాదేశాభిరామ! కృతనూపుర సం
ధ్యావిమలితామృతాంశు వ్యావర్తపదాభిరామ! అర్ధకృతోమా! 1

శా. ఆకుల్ పూవులు తప్తకుంభ శిఖర వ్యాకీర్ణముల్గా దృశాం
తాకుల్యాకృతి దైన్యధైర్య రమణీయంబై విడంబింపగా
నాకూతిం జనెడున్ బ్రియావిరహి మత్తానేకపం బొండు పం
పాకేళీవని మందఘీంకృతిరవ వ్యాహారసాహస్రియై. 2

చ. మరియు మతంగమౌని మహిమస్పృశముల్ పరమానుకూలశాం
తరసము మానలేవు రతినాయకసాయక తీవ్రరూప బం
ధురతఁ ద్యజింపలేవు సుమనోవ్రజ మల్లులఁ బంప నీటితుం
పురులను జల్లగాలులను మోచి సుమావళిమాత్ర మైనవై. 3

శా. కంబళ్ళన్ మెయినిండఁ గప్పికొని యీ గండైన భల్లూక రా
జం బేదల్ తమిఁదేంట్లు చేయునదిలే కల్లాడి గగ్గోలుగా
సంబాధంబగు తేనె సీత్కృతులఁ బీల్చంజూచు నాకాశ శా
ఖం బట్టూడకయుండఁ గాలదిమి చక్రభ్రామ్యదక్షంబుగన్. 4

క. ఆ చెట్టున కా తీవకు రాచి పెనంగొనిన ప్రణయరాగము కలుగన్
వీచీదక్షిణవాయువు త్రోచెన్ మృదువల్లి దూరదూరంబులకున్. 5

ఉ. ఇంత మయూరరాజునకు నేమి పొసర్చెనొ దుష్ట పాము దు
ర్దాంతగళోగ్రసారణ విసారితషడ్జముగాఁగ నేగుచున్
దాంత పదాభిఘట్టిత పదంబున నర్ధవికీర్ణ పింఛమై
ప్రాంత మహోగ్ర నాకువివరాంత ప్రవిష్టముఁ జూచి రోఁజెడున్. 6

చ. తిరిగిన పంపనీరములు తీర్చని సారణులై లతల్ పొదల్
తరువుల చిక్కపచ్చనల తన్కల యాకులు నేత్రతర్పణ
స్ఫురణముచేయ నియ్యటవి ముగ్ధమనోహర కేళికాననా
దరము గడించెడున్ నవ లతాంతమహోయుధు బాకుటెల్లునాన్. 7

ఆ. రేఁగి ముదురు వెల్గఁగ క్రింద ముగ్గినపండ్లు రాలి కమ్మతావి గాలి సాగ
మూగికొనిన తేఁటి మొత్తమ్మునకు స్పృహో స్పృహలనడుమ తత్తఱింపు లయ్యె.

మ. వన మీనాఁటికి నయ్యె బిల్వఖదిరాశ్వత్థంబు లీ తీర్పు తీ
ర్చిన రేఖన్ దొలినాటి కిద్ది క్రతుధాత్రింబోలెఁ గన్పించుచున్
దనయున్ జానకియున్ జనుర్విభవ వృత్తాంతబు నా పంప యొ
డ్డున దుఃఖోల్బణ కంఠరోధములు గండూషించెఁ బ్రాణేశుఁడున్. 9

చ. పొరిఁ జిఱుపిందెలున్ ముదురుపూతలు తేలిన నింబవృక్షముల్
విరిసి కషాయవాసనల వెల్లువలై నవవత్సరంబు దు

ర్భరమయి సేవ్యతాగుణము వాసినయట్టులఁ దోఁచు శాఖికా
విరుదిత వాయసీకుల దవిష్ఠఫలాగమ సంధిబంధమై. 10

గీ. వెనఁగొనియె నిందు నశ్వత్థ వృక్షకంబు నింబవృక్షంబు, మిన్ను పూనినది తాళ
ముంబెనంగొనెనిచ్చట భువినిగూటములు పవిత్రము లపవిత్రములు స్ఫురింప.

శా. పంపాకానన భిన్న దేశముల సౌభాగ్యంబు చిత్రంబు నె
లింప శ్రీకముగాఁ గనంబడెడు వల్లీగుల్మవృక్షాదులం
దింపౌ నీడిగచెట్ల ఆగరప తానిచ్చోటు నిచ్చోటు చా
క్కంపుంగుమ్ముల జీడిమామిడిపొదల్‌గా సైకతశ్రేణులున్. 12

గీ. గగనమునయందుఁ బూచె జూకాలమల్లి తొడిమపట్టింతలేని కూతుండ్ర తల్లి
నేల రాలినపూలలో నిలిచి తేంట్లు విరవిరల తేనె గ్రహియింప వెక్కసించు. 13

ఉ. కాశ సితాంబుజంబు లనగాఁ జను తారల పంపనీటి యా
కాశముమీఁదఁ బాదహతిగా సితమత్స్యమటన్న సీతఁ గా
కాశరుఁ డిట్లె తన్నుకొని యక్కట యేగెను డేగయొక్కఁడా
హో శరమట్లు వచ్చినను నాగక తప్పకపోయెఁ గాకమున్. 14

చ. అలఘులు పారిజాతము లనార్తవ మీ తరురాజి ప్రొద్దుటిం
త లనుచులేదు కాదు దిననాథుఁడు తా నడిమింట నుండె నం
చలయదు ప్రొద్దు క్రుంకిన దటంచును లేదు మనోజ్ఞ భావనా
విలసిత హేలయౌ ననుఁగుఁ బ్రేయసివోలె సదాసుమాకృతిన్. 15

చ. మరి తెలిరేకు లెఱ్ఱతొడిమల్ నునుమల్లెలకంటె నందముల్
పరువములై కనంబడని స్వర్గమునందలి సౌఖ్య మూహసుం
దరమయినట్లు లీ పులులతావియు నూహకొలంది స్వాదుసుం
దరము నకృత్రిమంబయిన నాస ప్రధానగుణంబు చుట్టమై. 16

ఉ. పూవులవింటిజోదు మరి పూర్వపుమాదిరికాదు క్లిష్టమౌ
త్రోవలు చూచి లొద్దుగల దుమ్ములు కన్నులఁజల్లుఁ దంగెడుం
బూవుల నిండుగుత్తులయి పొల్చెడు కారపుటుండలన్ గనుల్
క్రేవులఁగొట్టు వట్టి యపకీర్తి గడించె నయోధమార్గుఁడై. 17

ఆ. ఇంత పెద్దవృక్ష మీ పూఁత చుక్కలు పొడిచినట్లు సాగుఁబో రసాలి
తేంట్లుకామమార్గభ్రష్టముల్ కాలెందుమోవు నెపుడు రసము పొందు నెందు.

ఆ. కొన్ని చెట్లు వ్రాలుకొమ్మల ధాత్రిని గదిసి యుచటె పూచుఁగాచు నిచటె
కొన్ని బెరిఁగిపెరిఁగి మిన్నుల గాలికిఁ బోయి హద్దు మీఱి పోవు నెచటొ. 19

శా. మత్తానేకపహంసయానను బికీమంజు ప్రియాలాపనున్
నృత్తప్రౌఢ మయూరపింఛ కబరిన్ నిర్వ్యాజముగ్ధాకృతిన్
జిత్తంబందున మాహచేసెదను నా సీతన్ సరఃకానవా
యత్తోద్యన్మధుమూర్తి సస్పృహముగానై నిస్పృహం జెందుచున్. 20

క. ఆవిష్కృత్యభిముఖ నవ భావజ సుమనో మనోజ్ఞ బంధుర హేలా
జీవన వసంతవేళా యౌవతమును బోలుఁ గాననాంతరవల్లుల్. 21

మ. ఉదితేద్యజ్మధుమాస వంచితుఁడ నేమో సీత జీవించియు
న్న దట న్నాశయు లేదు నాకును నరణ్యానీ సమాసన్న సం
పద యీబాలరసాల సూనవిభవప్రాకృష్ట పృష్ట్యాది మో
హ దళ త్కామముగాక దైత్యులు సతిన్ బ్రాణాలతో నుంతురా! 22

క. ఇది యొక యాశావృక్షము మొదలు మొదలు చివరిదాఁక భువి ప్రాణులయున్
బ్రదుకుల జగత్తు కట్టిన యది నే నిందొక్క రెమ్మనై యారటముల్. 23

గీ. నష్ట సారంగపతి సమాకృష్ట యామె సంగతాకృష్ట ముగ్ధసారంగ వీవు
విప్రతీప దశాగత పృథ్వితనయ నీకుఁ గనిపించెనా జెప్పవే! కదంబ! 24

ఆ. అదిగొ! సీత యంబుజాప్తకరోద్దీప్త మైన చీరచెఱఁగు లాఱ నేగు
దవ్వు భ్రాంతిదంబు దగ్గఱకును జిగిర్చినది యిద్ది లేఁత రేలకొమ్మ. 25

చ. తునుకలు కొట్టుచున్ జెఱకుతోఁటల వింటికి విత్తనాలు పా
తిన తఱిఁ గర్షకుండయిన తియ్యనివిల్తుముదారు సీతఁ గై
కొని చనుదెంచి మైథిలులకోటకుఁ బంపమ యింతదాఁకఁ, బం
పునది యికేమి యున్నయది, పోవుట నేనునులే దయోధ్యకున్. 26

క. తెలిసిన వయసున నన్నుం గొలుచుట యబ్రమ్మకాదు క్షోణీసుతకున్
దెలియని వయసున నన్నుం గొలిచినయది సర్వదైవకూటమ్మువలెన్. 27

ఉ. భార్యకునంచుఁ బ్రాఁజదువు బాటల నేమి గుణాలి యున్నదో
భార్యకు ధారుణీసుతకు బంధుర మాగుణపాళి యున్న దీ
యర్యమ వంశ నూత్నవధు వామెకునాకు వియోగకల్పనా
ధుర్యము దైవ మే గుణము తోఁచని యంధముగాఁ గనంబడున్. 28

సీ. నీటిమట్టముగాఁగ నీలముల్ పరిలఘుల్ జలములు ఱెక్కలఁ జరణములను
గదవుచు నెగురు నీ మదమరాళంబులు కాళ్ళయెఱ్ఱనయు ఱెక్కలచివళ్ళ
పసిఁడికాంతియుఁ బరిప్లవమాన శీకరగత బాలమార్తాండ కరనివహము
పంపైకదేశంబు పాకారి నవచాప ఖండ మనోజ్ఞ రేఖం దనర్చు
గీ. వారిజాంతరోచ్చలిత బంభరగరుత్స్వరాగ సాధుకిర్మీరవర్ణములు కలిసి
రామణీయకతావారిరాశి పంప నమృతవీథులయందుఁ బ్రాణములు పంప. 29

శా. ఇంతాలస్యము చేసినా ననుచుఁ దానేమైన నాకోస మై
కాంతారంబునయందునన్ వెదకఁగా క్ష్మాపుత్రి యేతెంచెనా
ప్రాంతారణ్యములందు నామెఁగనఁగా రక్షోదురాచార వృ
తాంతం బాతఁను మఱఁపెటుకొనఁ [illegible]

ఆ. వేఁపకొమ్మమీఁద విరుదించుఁ గాకమ్మ దీనిఁబ్రశ్న యడుగఁగానువలయు
మీకు ననుఁగుఁదల్లి కాకమ్మ! కాకమ్మ! వనిత యెపుడుతిరిగి వచ్చుఁ జెపుమ.

ఆ. గంతువేసి కూయకయ లేచిపోయెను పాడుకాకి ప్రాఁతపగ తలంచి
తల్లి బిడ్డలకునె చెల్లనీయదుగదా కోప మెంతయైన కుటిలగుణము. 32

క. మునికాళ్ళ నిలిచి కుందెలు ననుఁ బరకాయించి చూచు నలినాక్షి కథల్
తనకుం దెలిసినఁ జెప్పను దనచేతంగాక పోవు దక్షిణదిశకున్. 33

శా. నోరున్ వాయియులేని జంతువులు నన్నుంజూచి జాలింబడున్
దా రక్షఃకటుజాతి యూరక విరోధంబూను నేనన్నచో
నౌరా! సృష్టి సమస్త మొక్కఁడును దైత్యశ్రేణి యొక్కండునున్
స్ఫారంబై చను సృష్టి యిర్మలకలై చైతన్యధారాస్రుతిన్. 34

మ. ఒకసీతం గొనిపోయె రావణుఁడు నాకొక్కొక్కవల్లీ నికుం
జకమం దొక్కొక సీత యున్నది పరిష్వంగంబులం బట్టెదన్
బ్రకటంబైన సహస్రబాహువుల నే రాముండ నా భార్గవుం
డొక తచ్ఛత్రువు కార్తవీర్యుఁడును దామున్నారు నాయందునన్. 35

చ. మును పొకసీతఁ గౌఁగిలికిఁ బొందిన సౌఖ్యమొకండె యిప్డొ
జనకజలన్ సహస్రశతసంఖ్యలఁ గౌఁగిళులన్ సుఖంబులం
గనుఁగొనఁగా సహస్రమునుగాక యొకండుగఁదోఁచె భ్రాంతిపొం
దిన మది విచ్చిపోయి సుదతీ విరహానలభాజనుండనై. 36

మ. ఇదిగో దైత్యుఁడు చాఁచి బాహువులు తానేతెంచు నేత్రంబు లి
ర్వదిగాఁ గన్పడు వీనిఁజంపుట కహో రక్షస్సు కాఁడాయెఁ దా
నిదియుం బూరుగుచెట్టు మిణ్గురులకట్టే దీర్ఘచైత్రక్షపా
మదలిప్తల్ పరిలుప్తధైర్యుఁడ ననున్ మల్లాకృతుల్ తూల్చెడున్. 37

మ. అనయంబున్ జలజాప్తుఁడై యుభయసంధ్యా కామినీ కోపభా
జనుడై యాసతి యుష్ణబాష్ప సలిలవ్యాసక్త చిత్తాబ్జగాన్
దినముల్ పుచ్చెడు నీ వియోగమునకుం దీరంబు లేదాయె నా
దనుజగ్రస్తకుఁ గాఁడు భాస్కరుఁడు సంధ్యా వేళకేయింతయున్. 38

సీ. ఇది సరస్సుకు వర్షబుతువున విమలపాథస్సులు తెచ్చెదు తల్లికయ్య
కడు గ్రీష్మమునఁ దటాకమ్ము నీరమ్ములచే నతార్యంబయి చెందియుండ
నిఱుప్రక్కఁగొంతార మెనసి గోలాంగూల సమితి యట్టిటు దాఁటు జతనమందు
నన్యోన్య హస్త పాదాలంబనంబున నుభయ తటీ సంగతోన్నత తరు

గీ. శాఖికాగ్రహణంబు సంస్పందమానమైన యుయ్యాల వంతెన ప్రాణయుతము
కట్టిన నసాధ్య మగు కార్యఘటనగాఁగ వానరంబుల దగు బుద్ధివైభవంబు. 39

శా. నానా మౌనికులంబులన్ బ్రియసఖుల్ నానా మునీంద్రాంగనల్
కాన ల్కోనలయందుఁ బందుగులకుం గైకొంచుఁదా రేగి డో
లానిర్వ్యాజ రసానుకూలమగు హేలన్ వల్లులం దూఁగి నా
తో నా వార్తలు చెప్ప జానకియుఁ జేతోవీథి బాధించెడున్. 40

ఆ. బిగిసి కౌయ్యబాఱు వేలుపుఁబగతుఱ యందు సురభిమాస మనుచు లేదు
తరులలోన గాలిదారి గగుర్పాటు మొలకలే వసంత ముగ్ధ సుషమ. 41

ఉ. క్రిందికి వ్రేలు హారమును గేవలమున్ గుడిమూఁపునం జనన్
మందితరశ్మి సప్త ఋషిమండల మట్లుగ స్వేదబిందు ని
ష్పందము శ్వేతవారిదలవంబులుగాఁగను దీర్ఘచైత్రమా
స్సుందరయామినీ గగన శోభను దత్ప్రియకేళి నెన్నెదన్. 42

ఆ. ఎగిరిపోవుదాఁక నిది కొంగయో తమ్మి మొగుడుపూవొ తెలియఁబోకయుండ
గుమ్ముగాఁగ నున్న గొడుగాకులకు మధ్య భంగ పెట్టెఁ గొంగ దొంగతబిసి. 43

సీ. ఒడ్డున నెత్తైన యుర్వీరుహమ్ముల వరుసల నీడలువాఱు నెడలు
నింద్రనీలమ్ముల నెసలారు బురుజులై యెత్తుకల్వలుపూయు నెడలయందు
మాణిక్యతోరణమండపవ్రజమునై పల్లటీల్గొను చిన్నిపక్షివితతి
గాలికూగెడు పతాకా శ్రేణియయి వైడితమ్మిపూఁదోట సౌధములుగాఁగ
గీ. వరుణ దేవుని దుర్గసౌభాగ్య మెల్లఁ బ్రకటముగఁ జూపుచుండెఁ బంపాసరస్సు
తెల్ల తామరపూవుల దిమ్మలందు మధుకరీగానములు ప్రేమమధువు లూన. 44

మ. కనులందున్ ఖగముల్ లతాంతములు వృక్షంబుల్ సరోవారి య
ల్లిన వల్లీచయమున్ మృగంబులు సుమాళిన్ యౌగపద్యంబు గాఁ
గ ననిర్వాచ్యమనోజ్ఞతామధురిమల్ కల్పించుఁపో వాకొనన్
మనసాక్కొక్క మనోజ్ఞవస్తువె పరామర్శింపఁగాఁ గల్గెడిన్. 45

శా. పారావారము ధారుణిం బుడిసిటం బట్టంగ సామర్థ్య సం
భారం బుండిన నుండవచ్చు నొనరింపంబోవ నైకైక దే
శారంభంబు ఫలంబునన్ గ్రమముగా స్వాధీనమౌఁ గాని ద్రా
క్స్ఫారవ్యక్తము గావు సర్వజగతీ సంసృష్టిసంహారముల్. 46

క. అట శబరియు నిట పంపయు నటు లాత్మకు నిటులఁ గనుల కనవధి భూత
స్ఫుటతర సుఖానుభూతిం ఘటియించిరి యింత కష్టకాలమునందున్. 47

క. ఆ యాపద యచ్చోటిది రా! యని తెలిసినను గొంత రాపిడి తగ్గున్
గోయిలయు నల్ల కొండల లోయలలో నుండి యెడఁదలో నిడియించున్. 48

శా. పాప మ్మీ పులి పీఁట వెట్టికొని యీ బాటం దువాళించెడున్
వే పుచ్ఛాహతి తర్జనోగ్రరదనావిర్భూత రక్తచ్ఛవిన్

జాపం బెత్తక హస్తకర్షణముగా జ్యావల్లి మ్రోయింపుమీ!
ప్రోపుం జెందుత దాని దారి నదిపోవుం జంపఁగా నేటికిన్. 49

ఉ. చంపుట చంపుటే యనును జానకి హేతువివక్షచే ఫలం
బింపగుఁగాని యిప్పటికి నేమగునో యఘమేమొ యన్న వా
క్యంపు యథార్థమున్ జరిగె నక్కట తాదృశసీతఁ బాసి సై
రింపులు దక్కియుండుట భరింపఁగఁజాల నిమేషమేనియున్. 50

మ. ఇదిగో నిల్చినపాటు నిల్చినటు లిట్లే చేరుకొంటిన్ వియ
త్పద మాలంబముగాఁగ దైత్యపదవీ విధ్వస్తదేశంబు నే
మొదలన్ సర్వచరాచరంబు విలువింపున్ మీటునన్ దేల్తున
న్నది కాదంటేని పోవనిమ్ము యిపుడైనన్ నాసతిం జూడఁగన్. 51

వ. అని యనుచున్న యన్న సౌమిత్రి మధురప్రియాలాపంబున సుగ్రీవ ప్రసంగమ్ముల
నాదుకొంచున్నంత. 52

సీ. ఋష్యమూక గిరీంద్ర శృంగమ్ములను మ్రింగనైన యుత్తాల దేహముల వారి
సప్తసాల సముత్థశాఖాంతముల చెంత నమరు కోదండచూడములవారి
నీరా కరంబు డిండీరమ్ములకు సమ్ముఖములైన జాటజూటములవారి
నాహవనీయవహ్న్యతిపవిత్రతకు గోత్రమ్మైన మేనియందములవారి
గీ. గుమ్ములుగ నున్న తరువులకొమ్మలందు నుండి గిరిరాజు కొమ్మలనుండి వారి
దగ్గరయు దూరములనుండి యిగ్గి మొగ్గి సూర్యసూతి వారిద్దఱఁ జూచి చూచి.

మ. ఇద మిత్థమ్మని నిర్ణయించుటకు లే దీ వీరు లెవ్వారలో
మదదైత్యున్ పొనరించు యజ్ఞపరిహింసాకాండ మాన్పింపఁగా
ముదుకండ్రౌ ముని లూహచేసి ధృతిమన్మూర్ధన్యులన్ వీరిఁ దె
చ్చెదరో శౌర్యమహాంబుధుల్ తఱచి రాశీభూత తేజస్కులన్. 54

మ. తన యీచోటికి రాను జాలమికిఁ జింతంగూరి పంతంబు పూ
నిన యవ్వాలియు నా యుపాంశువధ పొంటెం దెచ్చెనో వీరిఁ గ్రు
వ్విన కోదండము నేర్పు నమ్మికొని జీవింపంగనౌ బీటవి
చ్చిన యౌదాత్త్యపురేఖ తోఁప దిట సుశ్రీప్రౌఢపాథో[illegible]న్. 55

చ. వెఱపున ఋష్యమూకమును వీడి యొకంగుళ మేగలేను ని
వ్వెఱ యగు నేరిఁజూచినను విజ్ఞతలేక జగత్ప్రవృత్తి నీ
తెఱఁగగు వార్త యేనరపతిప్రకటాన్వయమందుఁ బుట్టెనో
తఱచిన వార్ధి సారహయదంతుల మిన్నునఁ గ్రక్కినట్లుగన్. 56

శర్ఙితుఁడై త్వరాఘటన సుగ్రీవుండు సాలోచనా
[illegible]గ దూరమైన గిరికొప్పున్ లంఘనప్రస్తరో
నేగుచుండఁగను దూరానన్ విలోకించి త
వెనువెంబడిం జనిరి తత్ప్రౌఢోగ్రశృంగానకున్. 57

వ. తత్ర సమావిష్టులం బ్రవృత్తిజ్ఞానాశానిశితాక్షుల మంత్రులఁగాంచి సుగ్రీవుం డిట్లనియె. 58

క. ఆరూఢ మేరుశిఖరాకారుఁ డొకఁడు వార్షుకాభ్రకారణకాంతి
స్ఫార శరీరుం డొక్కఁడు మీరలు చూచితిరె మన సమీపాటవులన్. 59

శా. దృక్కోణంబులు పట్టరాక మలఁగెన్ గ్రీవాంతదేశంబు తా
దృక్కోదండప్రచండధారులును దాదృక్క్రూరబాహార్గళుల్
చిక్కంబట్టఁగ లేక నాదు నెడఁదన్ శీఘ్రంబ యేతెంచితిన్.
దిక్కుల్ నాల్గిట మున్ను తాదృశులు సందీపింప రీ ధారుణిన్. 60

చ. నియతముకాని కోపమును నిష్ఠురవృత్తి పరాక్రమైక జీ
వియు రిపుభావనిష్ఠుఁడును వెక్కసమై చను వైరవృత్తి వా
లియు నిది చేయుఁ జేయఁడని లేదు మఱెవ్వరొ పీ ఱెఱుంగఁగా
భయమగుఁ బూర్వ మెవ్వరయి వచ్చిరి యీదృశు లీ వనానకున్. 61

చ. కమలమునందునన్ వెడఁదకన్నులు మిన్నునఁ జాపకోటులున్
దమరు సహాయులై సకలధారుణియున్ సమకూర్చి పెట్టఁగా
దమరు విరోధులై యమ పదంబు నటుల్ గలిగింపఁజాలఁగా
నమరిన యాకృతుల్ మరి భయంబగు వారి నెఱుంగఁగానగున్. 62

శా. ఆ యేనాటికొ రాజసోదరుఁడనై యారాటమే లేక యొ
క్కా యేఁడాదియు రాజ నోట పరవార్తాధీన జీవుండనై
నా యీ దుస్థితి కూడఁ దాదృశముగా నై రాజ్యమేలేదు కా
నీ యీ కార్ముకరుద్రులం దెలియకన్ నిద్రింప లేకుండఁగన్. 63

వ. అనిన నమ్మంత్రులయం దొక్కఁడు చెక్కిటఁ బెద్ద కత్తిదెబ్బ నొక్కు గలయాయన యిట్లనియె. 64

శా. ఆ మూర్తిద్వయ మేనుఁ జూచితిఁ దదీయాకారరేఖల్ ప్రమా
సామానాధికరణ్యమై చను దిదృక్షాస్వాదురేఖావధుల్
కామారి ప్రథమాన మూర్తులు జటాకాంతిచ్ఛటావహ్ని రే
ఖా ముగ్ధైకజగత్ప్రదీపములు విక్రాంతిప్రథాపాతువుల్. 65

గీ. భావ మకుతోభయమ్మును శ్వోవసీయ మానసేందిరా పర్యాప్తమై వెలుంగు
నచ్యుతులకును బుణ్యభావ చ్యుతులకు నూహగతమును సంబంధ ముండఁబోదు.

ఆ. లౌకికాధికారలాభవాంఛాధౌర్త్య వశత నాచరించుఁబాప మెంతొ
యంత జనుఁడు దానిదగు దుష్టఫలమును దగులునంచు భీతిఁ దగులుచుండు.

మ. తమకం బందఁడు నూహచేతఁ బ్రియచేతన్ ఋష్యమూకంబుప్రాం
తములన్ ముట్టఁడు వాలి వాని వెడయౌ దర్పంబు వేఱొండు వి
క్రమ సాహాయ్యము సమ్మతింపదు పరాక్రాంత్యేకనిష్ఠంబు న
త్తమమౌ లక్షణ మొక్కఁడున్నది భుజోద్యత్కేళికిన్ వాలికిన్. 68

శా. వీరల్ వీరెవరో మఱేల యిటకున్ విచ్చేసినారో జటా
ధారుల్ చాపములూని క్లిష్టమగు వృత్తం బేలొకో శైలకాం
తారంబుల్ చరియించు టెక్కటమొ వృత్తాంతంబు దీపింపఁగా
నేరంగా నగుఁగాని భీతిఫల మున్నే కార్యమార్గంబునన్. 69

మ. అన, సుగ్రీవుఁడు నీవు చెప్పినది న్యాయ్యంబున్ సమర్థ్యంబు కా
ని నితాంతోగ్రశరాస శృంగక వృషాణి ప్రౌఢదేహుల్ నిజం
బునకున్ భీతి యదేల పుట్టదు దృఢవ్యూఢంబులౌ వక్షముల్
కనులం బట్టగరాని తేజమును నాకారంబులం జూచుచున్. 70

చ. ఉరవడి నున్నచోట నిలుచుండఁగనీయక బిట్టు నాలుగౌ
చెఱువుల నీళ్ళు తాచెఁ దుదిచెందినదంచనరాని వైర ని
ష్ఠురుఁడయి యెత్తినట్టిదగు సూడును దా నిటు తీర్చునంచు లే
దరియన వాలి యైనయెడ నక్కట! సౌఖ్యములేదు గుండెకున్. 71

ఉ. క్ష్మాపతి చారచక్షువును గార్యముపట్లఁ బరప్రయో క్తయౌఁ
బ్రాపితధారుణీశ్వర సపత్నత రాజదశాయమానమౌ
నా పురుషోత్తముల్ తెలియనైనది ముఖ్యము వారలెవ్వరో
యాపయి వారి నెంచిన సమర్థనితఁ బొందెదు భావమంతయున్. 72

ఉ. వేలుపువెజ్జు లిద్దఱును విండ్లనుబూని మహోజ్జ్వలౌషధీ
జాలము కోసమై యిటకు సాగిరొ! నీవుగఁబోయి సాధువౌ
వేళను జూచి వారల ప్రవృత్తి నెఱుంగుము రమ్ము వెంటనే
వ్రాలి ఛలాకృతిం జనుము వానరమంచు గణింతురో మఱిన్. 73

గీ. మూఁడుస్థితు లొక్కటి విరోధమునువహించు
టయును రెండు సఖ్యము పూనుటయును మూఁడు
నదియిదియుఁ గాక యుంటయు నద్దియేదొ
తెలిసినన్ భావికార్యంబు తీర్పనగుట.

వ. అనిన నట్లే యని యమ్మహానుభావుండు నిమేషంబున రాఘవులకు నంతద
వ్వునకు లంఘించి భిక్షుకా కారంబున రాఘవులఁజేరి వినయ భావ సమున్మిషిత
శరీరుండై యభివందనపూర్వంబుగ నిట్లనియె. 75

ఉ. ఇవ్వనరాజిలోఁ దిరుగు చెన్నఁడు చూడనులేదు మిమ్ము మీ
రెవ్వరు వ్యూఢవక్షులు మహేశ్వర తేజులు దీర్ఘబాహువుల్
నవ్వులరారు మోములఁ గనంబడు సన్నని దైన్యరేఖగా
నెవ్వరికోసమో వెదకు చేగెడునట్లుగఁ గానిపించుచున్. 76

ఉ. కవ్వినవౌ జటల్ చివురుకానుగుజొంపము లట్లుగాఁ గనుల్
పువ్వులమీఁద తేంట్లు ననువున్ విడుదుల్ పొనరించుకొన్నటుల్.

మవ్వపుఁగాంతియున్ సురభిమాస వికాసముగాఁగ నున్న మీ
రివ్వనపత్రపుష్పప్రభ లేచు పుమాకృతులా వచింపుడీ. 77

చ. కలిత తనూచ్ఛవి ద్యుతిత కానన భాగులు మస్తకోజ్జ్వల
త్పులకిత ధూర్జటాపతిత మూర్తులు నవ్యదురాపచాపవి
హ్వాలముఖకోటిశాత్రవ సమాగమచండులు శాంబరీజయం
తులు మఱి మీరలెవ్వరు వినూతన దైవత మోహనాకృతుల్. 78

ఉ. ఇక్షుశరాసుఁడున్ మధువు నిద్దరు జంటగ వచ్చిరో శమీ
వృక్షగతాగ్నికిన్ విచలితేంధన వహ్నికి రెంటి మధ్యఁ బ్ర
త్యక్షపరోక్ష భావ విదితంబగునట్టి యుషర్బుధాకృతుల్
దక్షులు మీర లెవ్వరు ప్రదక్షిణయోగ్య లుదాత్తతేజసుల్. 79

శా. వే విండ్లాక్కఁ పరిన్ ధరించునటులా విక్రాంతి తాదాత్మ్య పా
రావారీణులు సర్వలోకసృజనారంభాదివేళా ద్విధా
సౌవర్చస్వ్యలు సంవిదాసముదయ త్సంకల్పయుగ్మంబునా
నీ వేషంబులు మీర లెవ్వరు మహోపేలాప్రధానాకృతుల్ 80

చ. సకలచరాచరాగ్ర సహసా గమనాత్మకమైన కాలరూ
పక వినతాతనూజుఁడు శుభంబులు లిప్తలు వెల్లులై చక
చ్చకితముగా దివానిశలఁ జూచిన ఱెక్కలువోలె నున్న మీ
రకుటిలమూర్తు లెవ్వరు హృదంతరవర్తిప్రదీపికాకృతుల్? 81

వ. మఱియు నమ్మహామేధావి యిట్లనియె. 82

ఆ. అన్న వాలిచేత నపహృతరాజ్యదారుండు వానరేశ్వరుం డొకండు
సుగుణవారిరాశి సుగ్రీవుఁ డనువాఁడు అతని కేను సచివులం దొకండ. 83

క. మీతో సఖ్యము చేయఁగఁ జేతోగతి నతఁడు వాంఛ చేయుచు నుండెన్
నాతోడ వార్తనంపెను వే తెలియఁగ మిమ్ము ఛలితవేషము తోడన్. 84

వ. నా తండ్రి కేసరి, మాయమ్మగా రంజనాదేవి. నాపేరు హనుమంతుఁ డని
యూరకుండిన శ్రీరామచంద్రుఁడు లక్ష్మణునితో నిట్లనియె. 85

ఆ. తెలియ నీయనయు నధీతఋగ్యజుష్కుండు స్వరనిబద్ధ శుద్ధ సామవేద
నిత్యగాన జనిత నిభృత సమశ్రుతి సర్వశాస్త్రములయు జ్ఞానరాశి. 86

గీ. అనపమృషితంబు ఘుషితంబునైన వాక్కు త్రిస్థల వ్యంజకంబగు దీప్రరవము
పూత వేదశిఖా సారభూత బుద్ధి యౌచితీజ్ఞాన పర్యాప్తమైన మనసు. 87

ఉ. దర్శనమాత్ర తర్పిత హృదంతర భావుఁడు సాధుమూర్తి యా
దర్శగతాత్మబింబ కలితంబుగ నక్కపిరాజుఁ జూపెడున్
స్పర్శముచేత వాయుసుఖశైత్యము దీపితమెట్లొ భావనా
మర్శితవాక్కుచే నుభయ మంజులభావము దీప్తమయ్యెడున్. 88

ఉ. ఇంతటి చారుధీకు వినయేందిరు సాధుని వాక్ప్రతిష్ఠు నా
చెంతకుఁ బంచినట్టి కపిశేఖరు నౌచితి హృద్య మయ్యెడున్
జింత సురారి చెప్పినది చెప్పినయట్టులఁ గానిపించుఁ దా
నింతటి మంత్రి నేలెడు కపీశ్వరుఁ డెంతటివాఁడు కావలెన్! 89

క. ఇది కాలఁదవులు తీవియ వెదకంబోయిన దటంచు వే చెప్పమనన్
గదలి సుమిత్రాసూతియు మృదులోచనకాంతి హనుమ కిట్లని పలికెన్. 90

క. మీ యధిపతి కెట్లున్నదొ మా యెడ, మీ రాజునెడల మాకు నదె యభి
ప్రాయమ్ము దానికోసమె మా యిట కరుదెంచుటయును మతిమన్మౌళీ. 91

గీ. హనుమ తా మాటలాడుచున్నంతసేపు వ్రాల్పకయ ఱెప్ప నాతనివంకఁ గనుచు
లక్ష్మణుఁడు ప్రాణముల నూర్మిళామనస్కుఁడయ్యె నవిదితసర్వవృత్తాంతుఁ డగుచు.

గీ. హనుమ తా వారిఁ జూచుచున్నంతసేపు నన్నదమ్ముల కన్నులయందుఁ గనుచు
రాముకన్నులఁ బరమేశ్వరత్వ మనుజుకన్నులను యోగిరాజులక్షణము గంచు. 93

గీ. వేయిపడగలు విచ్చిన విధము వేయియంచు లాడిన విధము రత్నాంశు లరసి
సుసమధిగతయాథాతథ్యుఁ డసువులందు వానరేశ్వరు సుగ్రీవుభాగ్యమెంచి. 94

శా. స్వామీ! తమ్మునితో ద్వితీయుఁడవుగాఁ బంపాసరోభూవనీ
సీమన్ వచ్చితి, మీరలెవ్వరు ధరాసీమంతినీ మోహనుల్
హేమాద్రింబలె దేవతాయతను లుర్వీశాన మూర్ధన్యు లం
హోమిథ్యాకరణప్రభావులు సమప్రోన్మీలదంతర్ద్యుతుల్? 95

ఆ. అన్న కనుల దీనమైన యంగీకృతి నరసి స్వామి యిట్లు లాడెఁ గపికి
నాడఁబోవునంత నాయన కీయన ప్రాణబంధుఁడన్న పగిది తోఁచ. 96

సీ. జన్నంపుఁబొగలచే మిన్ను మేదిన నైల్యభావ మాకల్పశోభానిధాన
మైనట్టి యజమానుఁ డాయన రఘువుల తలమానికంబైన దశరథుండు
పరమచాతుర్వర్ణ్య పరిపాలనాకార్యసాధుచిక్కణ పరిష్కర్త నృపతి
తానుద్వేషింపఁడు తన్ను ద్వేషింపదు జగము మర్యాదాప్రసన్నమూర్తి
గీ. అమృత రసభావ పర్యాప్తి నందినాఁడు దశరథావనీపతి యయోధ్యాప్రభుండు
ఆయనకు జ్యేష్ఠపుత్రుఁడీ యనఘమూర్తి మేనుతాల్చు త్రయీధర్మమైనవాఁడు.

సీ. నలువుర మన్నదమ్ములము మే మన్నయెడన్ దాసభావంబు నంది, నేను
వనవీథులకు వెంట వచ్చినా, నన్న కులాంగనతోఁగూడ నడవి కరుగ
నాయమ జానకి యాయమ మున్ను శైవధనుర్వికర్షణ పణము దేవి
తా జగజ్జన మార్గదర్శియై యన్న, యనుగ్రహించెను దండ్రినుడి పౌనర్ప
గీ. దైత్యుఁ డెవ్వఁడో భూమిసుతన్ హరించె జన్నపుం బైఁడినాఁగేటి సన్నకొఱ్ఱు
గీఁతఁ గనుగొన్న శ్రీపరిపూత సీత నిటుఁ దదన్వేషణార్థుల మేగుచుండి. 98

క. ఒకఁడు కబంధుఁడు శపితుఁడు మొకరియయిన పెద్దమద్దిమొద్దువలెన్ మా మక
మార్గరోధి సహసానికృత్తబాహుఁడును నింగి నిండెను వేల్పై. 99

శా. పే సౌహార్దనిధాన మా దితిజుఁ డుద్వేలప్రియవ్యక్తి మా
తో సుగ్రీవునిహార్పై కీశపతి యెంతో మంచివాఁడంచు నెం
తో సమ్యఙ్మతియంచుఁ జెల్మికిని బాత్రుం డంచు నన్వేషణా
గాహాసామర్థ్యవిచార సాధన సమగ్రుండంచుఁ జెప్పెంజుమీ. 100

క. ధృతి నెత్తిన చాపమునకుఁ బ్రతిలేని మహాప్రతాపవార్నిధి నతది
క్షతి యున్న, యహో శరణాగతుఁడై చనుదెంచెనయ్య కపిరాజునకున్. 101

క. మతి సంరూపితవేదత్రితయార్థ వినిర్ణయైకధీకుఁడు నుతవా
క్కృతి యున్న యహో శరణాగతుఁడై చనుదెంచెనయ్య కపిరాజునకున్. 102

గీ. అన్న శరణాగతుండయి యరుగుదెంచెనెన్న సుగ్రీవునకు వానరేశ్వరునకు
శబలితములైనయవి యశస్సాధుజగము లెవనిచేఁ బితృవాక్యసాహిత్యుచేత. 103

గీ. అన్న శరణాగతుం డయి యరుగుదెంచె నెన్న సుగ్రీవునకు వానరేశ్వరునకు
స్పర్శమాత్రవిఘటితముల్ శైవవైష్ణవములు ధనువు లెవ్వనిచేతఁ బ్రభువుచేత.

శా. కందర్పారి సకామనిష్ఠుర తపత్కార్మంది త్రేతాపరా
స్కందిక్రూరశిరశ్ఛిదా శిత పృషత్కప్రౌఢుఁడౌ నన్న తా
నొందుంబో శరణంబు మీప్లవగరా జూహ ప్రియుండంచు నం
చుం దీప్తోరుమతిప్రభావయుతుఁ డాశుప్రక్రియాబుద్ధియై. 105

శా. నిర్ధూతాఖిల లోకకల్మషుఁడు మన్నీఁడై పుమాకార వే
దార్థీభూత సమస్తధర్మచయుఁడై తానైన మా యన్న తా
నర్ధాంగీ విరహార్తిచేత శరణంబందున్ గపీశాను స్నే
హార్ధస్వీకరణాభియానరచనా హైయంగవీనార్ద్రిణిన్. 106

ఆ. ఒక్కరేకు హంసముక్కుతోఁ జీర్చిన నవ్యమైన కోకనద ముకుళము
ప్రొద్దుపొడుపువేళ పుల్లమైనట్లుగా హనుమ వదనసీమ యందగించి. 107

ఆ. ఇంత మంచితనము నింత పాండిత్యంబు నింతశౌర్యరేఖ యింతదీప్తి
సాధులోకమౌళి సరగ సుగ్రీవుండు చూడవలయు మిమ్ముఁ జొక్కవలయు. 108

ఆ. అన్న వాలిచేత నపహృతరాజ్యుఁడై గూడ సూర్యసూతి వాఁడిమగఁడు
అతని పాల్యవర్గమైన పే మున్నాము పృథ్వీతనయ మేము వెదకఁగలము. 109

ఆ. మీరు మీరు కలసి మిత్రు లౌటయ మాకు జక్షురస్తిభావచారితార్థ్య
మఖిలసృష్టిసారమైనది యొక్కఁడే యరయ సాధుజన సమాగమంబు. 110

వ. రండు, దయచేయుండు, సుగ్రీవుపాలికిఁ గొనిపోదు నన లక్ష్మణుండు శ్రీరా
మచంద్రునితో నిట్లనియె. 111

చ. పరముఁడు సాధుశేఖరుఁడు పండితమౌళి యబద్ధమాడునే
విరిసినమోమునం దెడఁద విప్పి కనంబడుఁ గంటికాంతులన్
బెరసి సుఖానుభూతి కనిపించెడుఁ బ్రశ్వసనీయతాగుణ
స్ఫురణము కోటికెక్కినది పోవను వచ్చును వీనివెంబడిన్. 112

క. పరివిదిత ప్రసన్నాంతఃకరణుండవు నీదు వెడఁదకన్నుల వెలుఁగుల్
ధరణిజను గుహుని శబరిని బరికించినయట్లు దీప్తిభాస్వరములుగా. 113

గీ. (శ్రీ) హనుమ భిక్షురూపు పరిత్యజించి ప్రోడ కపివృషభాకృతి మోకరించి
బుజములం దెక్కుడీ కొంచుఁబోదు ననిన నన్నదమ్ములు బుజముల నధివసించి.

గీ. మహితపరిణాహములును మాంసలములగుచు మృదుపిశంగజాంబూనదమృష్టలోమ
సమితి చిక్కణ వినిభృతాస్తరణమైన నన్నదమ్ములు బుజముల నధివసించి. 115

గీ. సరగ నాగ్నేయమునకు నీశాన్యమునకు వ్యాప్తమైన మహేంద్రచాపంబు కొసల
వరుణ పర్జన్యు లధివసింప నయినట్లులన్నదమ్ములు బుజముల నధివసించి. 116

ఆ. పక్షియెగురు దూఁకువానరం బిది దూఁకినాఁడొ హనుమ యెగిరినాఁడొ తద్భు
జాగ్రసంస్థులయిన యన్నదమ్ములును సుగ్రీవబుద్ధు లవధరింపలేదా! 117

చ. నడచియ పోవునంచును మనంబుల నెంచిరొ దూఁకుచుండఁగాఁ
గడువడి వానరంబె యవుఁగా ’యని యెంచిరొ! పోవుచుండఁగా
నిడివిగఁ జిత్రమంచును గణింప రహో! ఖగవాహనత్వ మే
ర్పడి చిరకాల మద్ది యలవా టయినట్లుగ రామభద్రులున్. 118

మధ్యాక్కఱలు

ఈ యనంతాకాశ మెల్ల నీయన యీగతిఁ జనునొ
మాయురే యీ మింట నేగు మహిమంబు మహితుండు పైన
తేయుండు మింటిలో జెక్కతీర్చిన తీర్పుగా నెగడె
నీయన యెంతటివాఁడొ యెఱుగంగ నే గతి నౌను. 119

భావమం దీయన దేహ పరిమాణ పరిణాహములను
భావింపఁగాఁ గొంతయైన వఱకైనఁ బట్టుందఁబోదు
తా వచ్చి భిక్షువై యల్పతను వున్నతబలిష్ఠదేహుఁ
డై వానరం బంసములను నష్టాపదాదిచూడములు. 120

వ. అనుకొన్నంతసేపు లేదు రామలక్ష్మణులే జెక్కలుగా హనుమయన్న గరుడి
సుగ్రీవునిముందు వ్రాలి యిట్లనియె. 121

చ. దశరథుఁడన్న కోసలుఁడు ధారుణీనాథుఁడు జన్నపుంబొగల్
విశదముగాఁగ మింటికిని బెట్టిన పూఁతలుగాఁగ నొప్పెఁబో
ప్రశమితచిత్తుఁ డాయనకు రాముఁడు లక్ష్మణుఁడన్న పుత్రు లీ
విశదమతుల్ జటా[illegible] 12[illegible]

చ. తనదగు రాజ్యమున్ సవతితల్లి మనస్సును బట్టి తండ్రి పం
పను విడి శాంతుండై వటశిఫాఘటితోగ్రజటానిటాలుండై
వనమున వచ్చినాండు పితృవాక్యగతాదరవార్ధి గుండెయం
దున ననుజాతుతో వనితతో నెడఁబాయు టెఱుంగరానిదై. 123

చ. పసితనమందు గల్లమున వజ్రపుఁ బెట్టున బాధలేద యీ
మసృణతనుల్ బుజాలవయి మన్ననగా దయచేసినంత వె
క్కస మయిపోయెఁ గార్ముకశిఖాజ్వలదగ్నులు ధర్మలగ్న చే
తసులు గభీరభావులును ద్రాస విహీనులు మైత్రిదీనులున్. 124

ఉ. రావణుఁడన్న దైత్యుఁడు ధరాతనయామణి దొంగిలించె నా
దేవియు మైథిలేశుసుత దీపితబాల్యమునందె రాముఁడున్
శైవధనుర్వికర్షణ విశారదబాహుఁడు పెండ్లియాడెఁ దా
మీ వన మెల్లచో వెదకు చిచ్చట వచ్చిరి పంపఁ జూడఁగన్. 125

ఆ. వీరు మొదట వాలి వేరైన నెఱుఁగరు దను కబంధుఁ డల్ల నిను వచింప
వెదకికొంచు నిన్ను విచ్చేసి రిచటకి పరమమైత్రిభావబద్ధు లగుచు. 126

చ. నిను శరణంబు పొందెదరు నీరజనేత్రులు భాస్కరాన్వయుల్
జనకసుతాగవేషణ వశంవదచిత్తులు మిత్రభావ సం
జనిత షడంగలాభగత చారుమనస్కులు రాజచూడముల్
ధనురుదితప్రచండ నిభృతంబగు శక్తి మదిం దలంచుచున్. 127

గీ. అర్చనముచేసి యర్ఘ్యపాద్యంబు లిచ్చి రమ్యవాక్యమర్యాదాపురస్సరముగ
సఖ్యభావ మర్థింపు నిస్సంశయముగఁ దీర్ఘభూతు లలౌకికాతిథులు వీరు. 128

ఉ. మానుషమైన రూపము సమంజస గౌరవభావ మంతఁ దా
నూనిన సూర్యసూతి మఱియున్ మృదులోచన మందహాసుఁడై
తానుగ నంజనాసుతుఁడు తమ్ము బుజంబుల మోసి తెచ్చినన్
నేనును దెచ్చినట్లె యగు నీరజపత్రవిశాలలోచనుల్. 129

చ. హనుమ వచించె నీ సకలమైన కథావిషయంబు తోడఁ ద
మ్మునిఁ గొనివచ్చి నిర్చితివి ముంగిట నేస్తముగోరి, నేను రా
నని తొలుదొల్త రాచబిగువైనను చేయవు నిన్నుమించి నా
యునికియు లేదు రాజ్యమును నుగ్మలి లేరనుటన్ సమానుఁడన్. 130

క. ఈ కొండ వదలి రాలే నా కారణమెక్కుఁడుండె నది పాలింపం
గైకొంటె నన్ను నెచ్చెలిఁ గైకొంటివి యావదసునికాయ కృతజ్ఞున్. 131

క. వాగర్థభూతబుద్ధిస్థాగూ సమదీపితాంతరానందాస్యా!
నా గడప త్రొక్కి తనుటకు నేగడపయు లేని నే నదేమనఁగలనో. 132

వ. అనిన మరాళ ముఖకేళితేందీవరమువోని హస్తాకర్షణంబులఁ గైలాసగిరి శిఖ
రనికషకాదంబినివోని పరిష్వంగంబుల హనుమత్కృత సర్వసంభారసామగ్రీకం
బగ్నియందు పేర్చి. 133

మధ్యాక్కఱ.

ఈ మేనిలోపలఁ బ్రాణ మెన్నాళ్లు లెసలారుచుండు
నీమైత్రి యన్నాళ్ళు నాకు నిరపాయనిర్నిద్ర మొప్పు
నీ మేనిలోపలఁ బ్రాణ మెన్నాళ్ళు లెసలారుచుండు
నీమైత్రి యన్నాళ్ళు నాకు నిరపాయనిర్నిద్ర మొప్పు. 134

వ. అని ప్రతిజ్ఞ లాడుకొన్నంత హుతాగ్నిలో. 135

క. వెలి సమిధ లెరిసి పొనువడు తెలి సడలని బూది బీట్లు తేలి తదంతః
కలితారుణానలచ్ఛవి వెలిలిచెఁ గపిరాజ రాజ విస్రబ్ధాక్షుల్. 136

వ. సుగ్రీవ హనుత్కృతాస్తీర్ణ సాలచందనశాఖలమీఁద నన్నదమ్ములు విశ్రమించి
నంత సుగ్రీవుఁ డిట్లనియె. 137

చ. ప్రభువులు మీరలిద్దరును బచ్చనియాకులపై నిషణ్ణులై
ఋభు పరిషన్మణీ స్థలిని నింద్రబృహస్పతు లట్టివారలై
శుభమతు లొచు నన్నుదయఁజూచెద రీగతి భాగధేయ వ
ల్లభనవవల్లి మోక ద్విదళంబుగఁ బూతను బట్టినట్లుగన్. 138

ఉ. అచ్చట మిమ్ము మామకగుహామణిరాజ సభాంతరంబునన్
మెచ్చగు రత్నవేదికల మిమ్మును జేరిచి నాదుగుండెకున్
నచ్చిన మిమ్ము గౌరవసనాథుఁడ నౌటకు లేదు లేదనన్
గ్రుచ్చిన బల్లెమైనయది గుండెకు భ్రాతృవిరోధిదుష్టుఁడన్. 139

చ. ప్రియతముఁడైన తమ్ముని సరే! యెవరైనను దాసభావ భా
రయుతుని నేల పొనడచి రాళ్ళల ఆప్పల నుండనిత్తురా
దయయని మాలి వాలియును దా నొకరుండును దక్కఁ బోవనీ
స్మయమతి నాదుభార్యను రుమన్ హరియించుట కేమిచెప్పుదున్. 140

ఉ. మీ స్థితి చూచెదం బ్రతినిమేషము తమ్ముఁడు మ్రుక్కనేమొ య
న్నాస్థ కనంగ నయ్యె నయనాంతములందున నీకు నిట్టి నీ
సుస్థితి వాలి దుస్స్థితికిఁ జొచ్చిన భేదము కొండలందు రా
జ్యస్థితిఁబాసి మిత్త్రియుల కైనను నేనది కాకపోవుటే. 141

క. కోపమ్మును రావచ్చును గోపమ్మును నంటిపెట్టికొనియుండుట యుం
గాపురుషలక్షణం బగు నా పొనరించినది చూచినన్ స్వల్ప మగున్. 142

క. అయనయో నేనో మఱి యీ యిలపై బ్రదికియుండు టిద్దఱ మనమా
దేయము నసంభవమును అయన యది యటు నేనె నంభోజాక్షా! 143

ఉ. నిద్దురపోవుచుం దొరలి వే నొకవేళను ఋష్యమూకపున్
హద్దునుదాఁటఁ బైఁబడి యమాంతముగా నను మ్రింగివేయు నీ
యెద్దడి తట్టుకో ననువొకించుక లేదనుమీ దివానిశల్
దద్దరిలంగ నయ్యెడిని దా నిది నాకు సుహృత్త్వ వార్నిధీ. 144

ఉ. కన్నులకేమొ కల్వచెలికాఁడుగఁ దోచితి వీవు నాకు లో
నున్న భయాన వాలి మఱియున్ నినుఁ బంచెనొయేమొ యంచు నీ
సన్నుతబుద్ధి మారుతి వెస న్నినుఁ గొంచును వచ్చెఁ గాక నా
కన్నులతెల్వి యేమనుచుఁ గావలె నీలసరోజలోచనా! 145

చ. తనకును బ్రాణపుంబదము తార, రుమన్ గ్రహియించుటేల, కా
దని తనభార్యఁ జేసికొనెనా! రుమ పిచ్చిది దాని జీవితం
బునకును భర్తయంచనినవానికిఁ బ్రేమయులేదు భర్త చ
చ్చినదియుఁ గాదు, నేను గతిచేద్వడి కొండొక న్యాయమైచనన్. 146

వ. లక్ష్మణుని కన్నులఁ గించిదరుణాంశువులతోఁ బాటు రాముండిట్లనియె. 147

గీ. సజ్జనుని మానసమున కశాంతి గూర్చువాఁడు లోకాన నిజముగా బాగుపడఁడు
నీవు సుగుణగరిష్ఠుఁడ వీవు సుజనలోకచూడామణివి నతిలోకమతివి. 148

శా. వాలిన్ నే వధియింతు నిక్కువముగా వాగ్దానముం జేసెదన్
గాలోగ్రంబులు నా పృషత్కములు చక్రభ్రాంతిమచ్చండముల్
నీలో నింతటి దుఃఖ మాపుకొనియున్ నీకింత సౌజన్యమై
పోలున్ హోవళిలేని నీ యెడఁద యింపుల్ సొంపు లేలాటివో. 149

ఉ. ఆ భరతుండు తాఁ గఠినుఁడైన ధరాపతి వ్యత్యయంబు క్షో
ణీభరణంబునన్ జరుగనేరదు మాతృగతంబు ధర్మ సం
క్షోభము నామతింపఁడు విశుద్ధమనస్కుఁడు వాని కర్తనై
యీ భయ మేర్చి రాజ్యమును నిచ్చెద నీ సతి నీ కొసంగెదన్. 150

గీ. వాలి యితఁడని తెలియఁగావలయు గాని నాకు, మఱునిమేషముక్రూరనారసమున
నింద్రవజ్రాహత గరున్నగేంద్రువోని యతనిఁ గాంచెదు నీకు భయంబులేదు. 151

ఉ. ఆసమయంబునన్ వికసితారుణ నీల పిశంగవర్ణముల్
భాసురమూర్తి సీతకును బంధురదానవలోకభర్తకున్
గీశధరాధినేతకును గేవలవామవిలోచనంబులున్
బ్రీ సమకూర్చి బెట్టు నదరెన్ గతధైర్యత గర్వరేఖలన్. 152

క. కుడికన్నును గుడిభుజమును గడువడి సుగ్రీవునకును గదలెన్ ఫల మి
బ్బడియుగ సమకూరు ననన్ గడిఁది మగండైన స్వామి కైకొను బ్రతినన్.

వ. అంత సుగ్రీవుం డిట్లనియె. 154

ఉ. ఆయమ సీతకావలయు నప్పుడు మువ్వురు మంత్రు లేమనుం
బోయి గిరీంద్రపున్ శిఖరభూమిని నుంటిమి మింటిలోన దై
తేయుఁడు నొక్కరుం డొకసతిం గొనిపోవుచునుండె దైత్యుఁడున్
మాయెడ కెంతొదవ్వుగను మానిని గైకొనియేగె నెత్తుగా. 155

ఉ. ఆ పరమాభిమానవిభవాకృతి యా సతి రామనామ శ
బ్దాపయ దంబరాధ్వమున నార్తరవ ప్రతిరావ నిర్గతా
శాపరితోనిరాశముగ సాగిన దవ్వుగఁజూచినాము క
ట్టా! పరమాప్తురాలనిన నచ్చట నచ్చటె యాపియుండమే. 156

ఉ. ఈ పవమానసూతి వచియించెను సీతను రావణాఖ్యదై
త్యాపహృతన్ గవేషణకృతాధికయత్నుఁడ వీవు కాననా
శీపవమాన ధూత కదళీకృత దేహుఁడ వంచు లక్ష్మణుం
డోపికతోడఁ గంబముగ నూనుచుఁగైకొని తెచ్చు నంచునున్. 157

ఉ. దారిని బక్షిరాజు కటుదానవు నాఁగిప్రాతాసు వయ్యె నం
చో రఘురామ! యీవిరహ మోపనుజాలవు నీ వటంచుఁ బ్ర
జ్ఞారమమాణచేతసులు సంగతదుఃఖము నోర్చికోనులే
రోరిమి యున్నదా గుణ మికొక్క యెడం గనరాదు చూచినన్. 158

ఉ. ఈ చతురంబురాశివలయాకృతధాత్రిని నెందు జానకిం
దాఁచిననైన బూతక్రతుధాత్రిజ నే వెదకించి తెచ్చెదన్
నీ చెలికార మెంతయున నేర్చు నసాధ్యకృతిప్రయత్న రే
ఖాచణ మాశరాన్వయ శిఖానిహితాగ్నికణంబు రాఘవా! 159

ఉ. ప్రాజ్ఞతవీడి బాహుబలబంధురమంథరబుద్ధి నూని తా
నాజ్ఞయటంచు నేరఁడు ధరాధిపుఁడయ్యుఁ జమూసమూహ కా
ర్యజ్ఞత లేదు రాజగుచు నన్యకపీంద్రప్రయుజ్యమాన కా
ర్యజ్ఞతలేదు వాలికి భుజార్గళబద్ధనృపోగ్రనీతికిన్. 160

ఉ. నా కనుసన్నలం బ్లవగనాథు లసాధ్యు లనంతకోటి సం
ఖ్యాకులు కామరూపులు దిగంత వియద్గమనక్రియాప్రచం
డాకృతు లుర్వరా దశదిశాద్రిగుహా బహుకాననోగ్రవీ
థీకృతపర్యటుల్ వసుమతీసుత యొక్క యభిజ్ఞ నేర్తురున్. 161

చ. కడువడి మబ్బులో మెఱుపుగాఁ గొనిపోఁబడినట్టి యామెయే
పుడమి తనూజ యేమొ యదిపోల్చుకొనంగవచ్చు నామెయుం
దొడవులుతీసి మూటయిడి త్రోచెను మా నిలుచున్నచోట బ
ల్విడి కొనచీర చించి ముడివేసెను దానిని జూతువా యనన్. 162

గీ. ఇద్దియడుగనువలయునా యింకనిచటెకూరుచుంటివా యనియె రఘుప్రభుండు
నిజరహోగుహాగ్ర ప్రవేశనిష్క్రమణముగను గపీశ్వరుఁ డివ్విగో యనుచుఁ జూపె.

చ. ఒక నిఱుపేదకున్ మణిమయోగ్రనిధానము తోఁచినట్లు నే
త్రకములు విచ్చి రాఘవుఁ డుదారగళస్వనమొప్ప నింద్రియ
ప్రకరము సంజ్ఞమాలి ధరపైఁబడి మూర్ఛితుఁడైన లక్ష్మణుం
డొక పరిదీనదృక్ఛవియు నూని సహోదరునూఁది తేర్చెనన్. 164

మధ్యాక్కఱ.

హో! హో! పయోధరకైశికా! మనోజ్ఞాకారకా! వి
దేహరాజకుమారికా! క్షితివ్రతతీవిలాసాంగి!
యూహాసౌందర్యరేఖానవోదయవ్యూహ సౌశీల్య
ప్రోహోద్ధ్వభర్తృవ్రతానిరూపితారుంధతీతుల్య. 165

మ. కనుగ్రుడ్డుల్ నవవార్షుకాభ్రపటలీ గండూషిత క్షోణిభృ
న్మణికూటంబులుగాఁగ బాష్పపటలిన్ క్ష్మాకన్యకాభర్త కెం
చు నగల్ నూపురమంచుఁ గంకణములంచున్ రత్న కేయూరమం
చు నిది న్నేరఁగరాదు రాదురలుచుం జూపంబునిష్పీడమై. 166

క. ఎందుకు చూపించితి నంచుం దిగులుం బడనుజొచ్చె సుగ్రీవుఁడు నే
త్రాందోళిత మాశ్చర్యస్పందమునం బ్రణయ గౌరవము తొలుకాడన్. 167

మ. ఒకయేదైనను గుర్తు కల్గినదా లేదో తేల కామాట తీ
రిక సౌమిత్రిని జూడుమంచనియె సుగ్రీవుండు సౌమిత్రియుం
జకితాక్షంబులుగాఁగఁ జూచుచు శిరస్సంచాలన ప్రక్రియా
ధికయత్నంబున నూపురద్వయము గుర్తించెన్ దృశాంతంబునన్. 168

క. అవి తల్లి కాలియందెలునవి గురుతే నాకు నిచ్చ లాయమ చరణ
చ్ఛవిదీప్తములై వెలిఁగెడునవి రూపముచేతఁ గష్టమయ్యె గురు తిడన్. 169

గీ. సంజలను రెంట నా నమస్కారసరణి నేను పదుమూఁడువర్షంబు లెఱిఁగియుంటి
నివి విడిగ నూపురములని యిపుడు తెలిసె చేతము విభక్తికిని నింతసేపు పట్టె.

వ. నే నింకేమియు నెఱుఁగను, నాకు తెలియ దనిన. 171

క. స్మృతిమార్గాతీతంబై వ్రతను మహోధర్మశిఖర పర్యంతంబున్
మతి మానవ నృపనాగరకతఁ గని సుగ్రీవుమేన గగురయ్యె వెసన్. 172

గీ. అంత రాముఁడు బాష్పపర్యాకులేక్షణుఁడు సుమిత్రాతనూజుఁ గన్గొంచుఁ దెల్ల
నైన మంజిడికన్నుల నాత్మయందు నంగనారూపధేయంబు నరయునట్లు. 173

చ. పృథివితనూజ తాను గనిపింపక భూషలు కానిపించు టీ
పృథుశకునంబు లగ్గునొ యెగ్గునో తెలియంగరాదు సా
రథి కనిపించి మేఘములక్రమ్మి యొకింతన సూర్యుఁడున్ వియ
త్పథమునఁ గానిపింపమియు వార్షుకవేళఁ గ్వచిత్స్వభావమే. 174

ఉ. తమ్ముఁడు నందెలే యెఱుఁగుఁ దమ్ముఁడుగాఁ డొకదైవ మీతఁడీ
క్రమ్మిన బాష్పరోధమునఁ గాంచఁగఁ జాలను భూషణచ్ఛవుల్
తమ్ముల నిచ్చెనాకు మఱి దైవము జానకి నిచ్చె నాకు నీ
తమ్ములు దేవతాసములు తన్వియు దైవత లోకరత్నమై. 175

మ. తన సేమమ్మును దాను చూచుకొనఁగా ధైర్యంబు లేకున్నచో
జనకక్ష్మాపతిపుత్రి యేమిటికి భూషల్ విడ్చునిచ్చోట నీ
తనకు న్నాకును బొందుగల్గుటయుఁ దద్భావప్రభావంబు పొం
తనయే నాకును దారిచెప్పుటయె యేతత్సర్వతాత్పర్యమున్. 176

వ. అంత శ్రీరామచంద్రుండు తేరుకొని యిట్లనియె. 177

ఆ. తాను పెద్దదైన తరువాతఁ జేయించి నాఁడివెల్ల నగలు నాదుతండ్రి
మా విభూష లెల్ల మాకిచ్చి చన్నది గాక సీత దైత్యలోకనీత. 178

గీ. నాయనా! యోయి నా లక్ష్మణా! నగ లివి చూచి నంతన నాగుండె నురిగిపోవు
నివియుఁ గనిపింపకున్న ముందే నయంబు రీఢచే మొద్దువాఱినిద్రించుచుండె.

మ. అవు నాతమ్మునకున్ నమస్కృతి సమర్హంబైన యీ నూపురం
బవు నే మోవ బుజాలపైఁ దల సమర్హించు భూమీసుతా
ధవుఁడా యందియలన్ బుజాలనిడి చింతామగ్నుఁడయ్యెన్ మనో
భవనైరాశ్యము భ్రూశరాస లతికాప్రహ్వీకృతిం దోఁపగన్. 180

వ. అట్లు చాలసేపుండి శ్రీరామచంద్రుండు సుగ్రీవునితో నిట్లనియె. 181

ఉ. ఈ యొకమేలె చాలు సఖ! యిప్పటి కింక భవత్కృతంబునై
పోయెను జానకిన్ వెదక పుత్తువు పుచ్చువు నీ చమూతతిన్
నా యెదయందు నీవయి పొనర్చిన యీకృతి బ్రహ్మలోక సౌ
ఖ్యాయతిగాఁ దనర్చినదయా! సదయాంతరుదారతానిధీ. 182

శా. ఆ యంభోజదృశన్ పిశాచకవశన్ బ్రాణేశ్వరిన్ వీడి య
న్నా యీ ప్రాణము నిల్పునట్టులుగఁ గన్పట్టంగరా దీవునన్
మా యీ తమ్ముఁడు జానకిన్ వెదకి వే ప్రమందింపు డాదుష్ట దై
తేయున్ జానకితోడఁ జెప్పఁడు తదర్థీభూత మద్దుస్థితిన్. 183

ఉ. భూసుత స్త్రీజగత్తునకు భూషణ మాయమ భూషణంబులన్
భాసురముల్ కనుంగొనెడు భాగ్యముకంటెను భాగ్యమున్న దే
యీ సొబగైన భూషణము లెవ్వఁడు చూపెను వాఁడె మిత్రమౌ
నీ సొబగైన భూషణము నెవ్వఁడు గుర్తిడె వాఁడె **తమ్ముఁడౌ**. 184

వ. అనుచున్నంత సుమిత్రాంజనాతనయు లొక్కరినొకరు చూచికొని హనుమదక్షి
చాలన నిబంధమ్ముగ నొక్కవానరంబు తరుశాఖనవతరించి శ్రీరామచంద్రుని

ముందుకూర్చుండి జానకినగలుతీసికేయూరంబు కంఠమున నూపురంబు గళం బునఁ గంకణంబు పాదమునఁ దొడిగి కుండలంబు లేమిచేయవలెనో తెలియక నోటితోఁ గొఱుకఁబోవ శ్రీరామస్వామి పకాలుననవ్వి యిదియేమి సంచారి యనిన నందఱు నవ్వులందేలి సుగ్రీవుండు రామున కిట్లనియె. 185

క. నీ వంటివాఁడె యిటు మోహావేశము పొందునేని యస్మాదృశులున్
ధీ విరహితు లేమి మఱింగావలెఁ గాకుత్స్థవంశకల్హార హితా. 186

క. మాదగు సృష్టికి మఱియును నీదగు సృష్టికిని భేద నియమం బున్నన్
పైదలి వలని వియోగజమౌ దుఃఖము మాకుమాత్ర మల్పమ్మె సఖా. 187

ఉ. గుండియజాఱిపోవుటకుఁ గోవిదమస్తక దేశరత్న మొ
క్కండు మహామహోజలధి కావలె నంచని యున్నదేమి యె
వ్వండునుజాలు శత్రుజనపాపభుజంగఫణాప్రణీత పా
దుండును దుష్టశిక్షణకుఁ దూఁగనిచో జగ మేమి కావలెన్. 188

చ. ఉవిదను బాసియున్ బ్రదికియుంటినిగావున నీదు సఖ్యసం
భవదతిలోక భవ్య సుఖ భాజనుఁ డైతిని దీని చేత నా
యువిదను రాజ్యమున్ మఱలనొందెద నంచనునట్టి ధైర్యముం
దవిలితి మేనుపోయిన యనంతర మేమిపొనర్తు మేమగున్. 189

ఉ. ఇంతయినట్టి ధైర్యము వహించితి నీవును ధైర్య మూనవే
గొంతునఁ బ్రాణమున్న యెడ క్షోణిసుతన్ వెదకించి తెచ్చి యి
ప్పింతున యాయలేనియెడఁ బిల్వకు నన్నును నాదుపేరఁ బ్రా
ణాంతకమయ్యె నీదు విరహస్థితి నాకు సుమిత్రబిడ్డకున్. 190

క. నీవిటు లయ్యెడివాఁడవు నీ వెనుకన తోఁకలట్లు నీ విలసన మే
మా విలసన మగు మేమే కోవిదమణి, వేళ్ళు పాతుకొను వారమునా. 191

ఉ. తెచ్చినయట్టి ధైర్యమును దేల్చకు నీదగు పున్నెమాయె నీ
పచ్చని నీడచూచికొని భార్యయుఁ బిల్లలుగా సుఖంపడన్
వచ్చునటంచు నెంచితిని వచ్చితి నీవుగ నీవు మైత్రికై
వచ్చినపైని నీవెవరివాఁడవు మా కధికార మున్నదిన్. 192

వ. అంత శ్రీరామచంద్రుండు సౌమిత్రిసమానీత జలంబుల ముఖమార్జనంబుచేసి చిఱునవ్వున నిట్లనియె. 193

క. మీరంత భయంపడనగుఁ గారణమేమియునులేదు కాంతావిరహా
స్ఫారాగ్ని యుండియుండి జ్వాలారూఢిం గాంచుననుట యద్ది ప్రకృతియే. 194

ఉ. నీ చెలికారమున్ హృదయనిర్మలమైనది వాక్యధోరణీ
ధీచతురత్వమున్ నరపతిప్రకటోన్నత భావరమ్యమై

తోఁచిన దేమి మిత్రుఁడవు తోఁచితి తమ్ముఁడు నీవు నాకు దో
శ్శ్రీ చెలువారు వేఱయిన చేతులుగాఁగఁ జతుర్భుజత్వమై. 195

చ. క్షితిసుత నేమియైన వెదకింతును దెత్తునటన్న మాట నీ
మతి పరికింపఁగా నతిప్రమాణము నీ వనినట్లు నాపయిన్
గతమయి నాకులేద యధికారము జానకి యేలుచుండెఁ ద
త్కృతముగ మీరలేలెదరు కేవల మీ విరహార్తుని న్నమున్. 196

గీ. వాఁడెవఁడొనాకు జూపింపవలయుమీరు మేనఁగల మాంసశకలముల్ మెరికలుగను
లీన రక్తబిందువులు జల్లింతు మేను తూట్లుతూట్లుగా బాణాలతోడ విద్రిచి.

వ. వాఁడెవఁడో నాకుఁ జెప్పు మన సుగ్రీవుండు దీనానుండై యిట్లనియె. 198

శా. నాసామీ! యది నేనెఱుంగను గదన్నా, వాఁడెవండో మఱిన్
నీ సీతంగొని యెచ్చట న్నిలిపెనో నిక్కంబుగా యోగ్యవే
శాసంపన్నముగాఁగఁ బంపి పటుగోలాంగూలసైన్యంబు నా
నీ సీతన్ వెదకించి తేనియెడఁ గానేకాను సుగ్రీవుఁడన్. 199

చ. వలువుగ నమ్మి మచ్చముగ నా పనులం బొనరించుకొంట కే
సలుపఁగలేదు నీ దయిన సఖ్యము నీదగు సఖ్యమన్నచోఁ
దెలియనివాఁడగా నదియు దేవతలైనను బొందలేరు నా
తొలుతటిజన్మలన్ ఫలముతోఁచుట యియ్యది లక్ష్మణాగ్రజా! 200

ఉ. నా రఘురామ! నాయెడల నమ్మకముండిన మైత్రి సాగ ని
మ్మారక వట్టిమాట లని యుల్లమునందునఁ దోచెనేనియున్
నీ రమణీ గవేషణము నీవును దమ్ముఁడు చేసికొండు నా
వైరము తీర్చిపెట్టుటకు వచ్చితివా! యటవీప్రదేశముల్. 201

గీ. అనిన రాముఁడు చాలులేవయ్య సఖుఁడ! మన ప్రతిజ్ఞలు నాకష్టమునకు నీవు
నేను నీకష్టమునకును నీ వెఱుఁగవు నతని నే నెఱుంగి ననంగ నర్థమేమి.

క. నీకేమొ మంచిదినములు రాకుండఁగఁ జేసిపెట్టు రా ముందర నీ
నా కార్య మనుచు నెవ్వఁడయా కోరెదు నిన్ను నిట్టి ప్రాంచితశీలున్. 203

ఉ. అన సుగ్రీవుఁడు రావణుం డనిన పేరంచున్ వినంగంటె నా
తని శౌర్యాదులు వానిదౌ కులము నేతద్వృత్తముల్ నేనెఱుం
గను నాయన్నకు వాలికిం దెలియు దక్షన్సుండు టే మూలనో
జనకక్ష్మాపతిపుత్త్రి నెందునిచెనో చారైకవేద్యం బగున్. 204

ఉ. వాలిని బోయి నీవడుగ వాలికి వట్టి పరాక్రమైక దు
శ్శీలికి భోగశాలి కవశీకృతచిత్తునకున్ భవత్ప్రిభా
జాలము నీ వియోగభరసంగతమైన యుదాత్తభావము
ద్వేల మెఱుంగనైన దగు పేర్మియు నోర్మియు లేవు రాఘవా! 205

వ. అనిన శ్రీరామచంద్రుం డిట్లనియె. 206

మధ్యాక్కఱలు.

నీవును హనుమయు వాలినిం గూర్చి నిట్టి పల్కెదర
ఆ వాలి యెవ్వఁడో వాని వ్యవహార మదియేల నాకు
నీవు నానెచ్చెలి వతఁడు నీ నేల నెలత హరించె
నా వేల్పు నీతోడిచెలిమి నాడెన యతనితోఁ గాదు. 207

అతనికి నాతోడఁ గానునైన కార్యంబింత లేద
యతనిని జని నేనుగాని యాశ్రయ మందినయెడల
నతనికిఁ దేలిక యగుదు నది శ్రేయ మతనికిఁ గాదు
తత కర్మగతిఁ బట్టి చెలిమి తగు సపత్నతయు ఘటిల్లు. 208

అతఁడు నీకింతగాఁ జేసె నన్యాయ మదియు శిక్షార్హ
మతఁడా యపేతధర్ముండు నతనికి నక్కట! నాకు
జతనుగాఁ గలయిక యనుచు సమకూరఁ జనుటస్వభావ
గతి కాదు దైవ మంథమ్ముగాదు సంకల్పవిజ్ఞమ్ము. 209

అది యట్లు జరిగిన దనఁగ నది యెప్పు డట్టులే జరుగు
మదికి నూహింపఁగా వేయి మార్గముల్ మసలునేగాని
యది కర్మనిర్ణీతమైన దా యొక్క యధ్వమే పోవు
నది మంచిదా చెడ్డదా యటంచను నదియొండె ప్రశ్న. 210

క. నా కహితము స్ఫురియింపదు నాకు హితముగాఁగఁ దోచినను దత్కాల
వ్యాకృతి శుభతమ పరిణామాకారకమై సుధర్మమై ఫలియించున్. 211

చ. కపిపరమేశ్వరుం డనియె క్ష్మాతనయాహృదయేశ! నీదు జీ
వపుఁ దొలినాఁటికూర్పు బలవత్తమ మూర్జిత మయ్యు వట్టి ని
స్త్రపము జగత్తు, భూతమయతం దనురూఢము, వాలి లోహ శై
ల పటుశరీరుఁ డాతనిబలంబు సచేతనపర్వతాభమున్. 212

చ. నిను మునుజూచి నీవు కడు స్నిగ్ధుఁడ వం చనుకొంటి వాలి వం
చె ననుచు నెంచినాఁడ నిది చేతము చిత్రముగా మెలంగెడున్
సనద నదీ ధరిత్రీధర సాగర మీ యవనిన్ ద్వివిధాప్రభే
దన మొనరింతు వేనెఱిఁగి తత్కపిభీతిఁ దొలంచజాలనున్. 213

సీ. హనుమకు నీకును నగ్నిహోత్రమువేళయైనది రేపు మాటాడవచ్చు
ననఁగ రాముఁడు మందహాసచాంద్రీ ముఖాబ్జుండు మైత్రీసితాక్షుండు లేచె
లవలీలతా కిసాలభ్రాంతిఁ బరికాఁడు తరుశాఖవోని ప్రస్తరము చిదిమె
రమణీయ సిత చకోరభ్రాంతి గిజిగాఁడు కొమ్మప్రేలెడు తనగూఁడు వదలె
గీ. ఋష్యమూకధరాధర శృంగములను నుర్వితెట్టెలుగా దోచెఁ బర్వచంద్ర
చంద్రికా వాహినీ పరిస్ఫార మృదు తరంగరంగానుషంగ సారంగములుగ. 214

మ. చనుదెంచెన్ విలసన్మతంగ మునిరాజప్రాణ తేజశ్ఛటల్
చనుపల్ కైరవిణీసతీమధుర లజ్జా మందహాసచ్ఛటల్
వనసంభూత సితాంశుమూర్తి హిమరుక్పంచాస్యలోలత్సటల్
కనదంశూజ్జ్వల ఋష్యమూక గిరిశృంగస్విన్నచాంద్రీఘటల్. 215

ఉ. పేరిమి మౌనిరాజు తన బిడ్డల శిష్యులకంటెఁగూడ ము
ద్దారఁగఁ బెంచుకొన్న తరులందపు దీవలు సాగులాడి జ్యో
త్స్నారుచిరప్రభా శకలితచ్ఛవి గుచ్ఛము లూగులాడె గం
బూరయు బచ్చకప్పురము బువ్వముబంతులయాటవోలికన్. 216

గీ. అరయఁ దెలిదీవిలోని యిల్లాంద్రయొక్క తనకుఁదలకట్టు సహజావదాత మదియు
నరయు, రాకానిశాదేవి మఱియు శ్వేతవేగ నామెకుఁ తలసూపె వేఁగు నరలు.

గీ. చెడి పనికిరాకపోయిన శీతకిరణు స్థూలకిరణంబులను ప్రాంతదూలములను
గుట్టగాఁ బోసిరో యనఁ గొండవోని యొక మహాస్థిపంజర సమీపోర్వియందు.

వ. మంత్రులతో సుగ్రీవుండును సౌమిత్రితో శ్రీరామచంద్రుండును దత్ప్రాతఃకా
లంబున విహరించుచు రామచంద్రుండిట్లనియె. 219

చ. అరుదగు కొండవోని మహిషాకృతి రిక్తవసాత్వగస్థిపం
జర మిది ముగ్ధపత్రకకిసాలయ సూన మనోజ్ఞతా జలా
కరమగు ఋష్యమూక గిరికాననలక్ష్మి శరీరమందునం
బురిపిడికాయనా వెగటు పుట్టఁగఁజేసెడు చూచుకంటికిన్. 220

ఉ. ఎంతటి బ్రహ్మనిష్ఠుఁడో మహేశ్వరుఁ డాముని యంత భావుకుం
డెంత యసహ్యమైనయది యిచ్చట నెట్టుల నోర్వగల్గె నీ
ప్రాంత ధరిత్రిశోభ కపవాదిది తా శ్రమణిన్ మదర్థమై
యింతట నుంచిపోయిన మునీశ్వరు ప్రీతియొనర్తు నిచ్చటన్. 221

వ. అని శ్రీరామచంద్రుఁడు కాలిబొట్టనవ్రేల నాకళేబరంబు లీలగా నెత్తి విసరిన 
నదిఆకాశంబున హిమగిరి శిఖరంబునాఁబోయి యెచ్చటనో పడిన సుగ్రీవుని
మంత్రులు వెదకుచుఁబోయి చూచి వచ్చి పడిన దవ్వు పదియామడ యని
చెప్పిన. 222

గీ. అంత సుగ్రీవుఁ డిట్లనె నార్య! దీని యునికి యిచ్చట మునిరాజు నోర్వలేద
యోర్వలేదు కావుననె నాయునికి యిచట సంభవించెను వాలి రాఁజాలకిచట.

ఉ. వీఁడొకరాక్షసుం డితనిపేరును దుందుభి దుందుభిస్వన •
క్ష్వేఁడుడు వేయియేనుగుల చేవగలాఁడు జగద్భయంకర
క్రీడుఁడు దిక్షురాంచల వికీర్ణ వియద్గత మృత్పయోధర
క్రోడవిలాస విష్ణుపద కుత్సిత కాలకభావుఁ డుగ్రుఁడె. 224

చ. బలమని యున్నచో నొడల వాఁడునుగాని స్వభావదుష్టుఁడై
వెలసిన వాని నొంచెదను వీని గలంచెదనంచుఁ గారణం
బులకయి సర్వదా వెదకుఁ బొందని గారణముల్ ఘటించు గొం
దలపడు నవ్యవస్థితమనస్కుఁడు వానికి సౌఖ్యమున్నదే. 225

శా. పైఁగా నీతఁడు బ్రహ్మచేత వరముల్ ప్రాపించి తత్ప్రాప్తి రే
ఖాగంధంబున మిన్నుమన్ను గయికోకన్ గొమ్ములం జిమ్ముచున్
వే గిట్టల్ బడి దున్నుచున్ బరిలుఠ ద్వీచీప్రచండాకృతిన్
చేగన్ సాగరరాజుఁ దాఁకెఁ జని యక్షిప్రోజ్జ్వలద్వహ్నియై. 226

ఆ. అంతరూర్జితైక హవ్యవాహన దహ్యమానుఁడైన జలధి మహిషదనుజ
క్రూరనేత్రవహ్నిగోళద్వితయ మెంచి యుండియున్నయటుల నుప్పఁబడియె. 227

మధ్యాక్కఱ.
కదలి విజృంభించి యసుర కాల్దువ్వి కహకహ నవ్వి
యదియేమిరా సముద్రా! ధరాంతంబు నావరించితివి
బెదరనేటికి నల్లు డుండె విష్ణువన్ బేరు పెట్టికొని
కొదువయే సాయమ్ము తెచ్చికొమ్ము నా కొమ్మునఁ జెడక. 228

గీ. అంత చేతగానియతండ వాకనమ్ము తగిలి లేలిపోనమువోలె నెగిరెదేల
యనిన భయపడి జలధిరా జంతయెత్తు కెరటముల నొడ్డునన్ విరిగించుకొనియె.

క. కదలి కడలి నీ ప్రళయపు విడివడుటలు చెప్పఁ బ్రజలు విరిసెదరయ్యో!
జడిసెద వేటికి నాతోఁ దొడరుము కయ్యాని కంచు దుందుభి మొరసెన్.

ఉ. ప్రన్నన వార్ధి యిట్లనియె రాక్షసరాజ! మఱేమి నిన్ను నే
నన్నదిలేదు మున్నెఱిఁగి యాడుటయెట్టులు? నీదు క్ష్వేడముల్
విన్న చెవుల్ బడల్వడఁగ వెక్కసపాటయికూడ, నింతలోఁ
తున్నది నేను నీపటిమయు న్నిజ మింత యెఱుంగలేమికా! 231

ఉ. ధాతయు నిన్నువంటి సముదారభుజాపరిపాకదీపనో
పేతమహానిధానమును బృధ్వీతలంబున సృష్టిచేసి క
ట్టా! తగువాని శౌర్యప్రకటత్వము కోసము సృష్టిచేయునే
కా [illegible]నెవ్వఁడో వెదుకఁగావలె నెచ్చట నుండియుండునో. 232

క అదికాదు నే నదెవ్వఁడు విదితంబుగఁ జెప్పికొనఁగ వినుటయె కానీ
కదలి చనలేద యిట, కన్నదికా దాతనిఁ దుషారనగవరమేశున్. 233

గీ. అతఁడు బలశాలియందుర యౌషధీ సమూహములచేతనేకాక మొదలులేని
మంచుచెఁగూడ బిగిసిన మల్లుఁడందు రట్టిబిగువు గలానిపై నరుగవలయు. 234

వ. దారి యెఱుఁగుదువుగదా యన సరిగా నుత్తరమేకదాయని. 235

చ. శరభమృగంబుచొచ్చిన యసాధ్యగజేంద్రఘటానుకారిగా
విరవిరలాడుచున్ విరిసె విస్ఫుట తన్నగపాదదేశ ప్ర
స్తరము లుపత్యకాశిలలు జాఱుచు వ్రీలుచు దైత్యశృంగని
ర్భరతర ఘోరదారణపురాణ నిబంధపరిశ్లథంబులై. 236

చ. బరుజుల దున్నకొమ్ములకుఁ బట్టిన యొఱ్ఱని మట్టి హైమభూ
ధరపతి దేహయష్టిగళితంబులు కండలవోలె నొప్పఁ ని
ర్దర తటసీ ఘటాకృతికచక్రము కాళ్ళల మట్టగింపులై
బురదలపిండుగా నెగడె బుద్బుదమంథరరావబద్ధమై. 237

శా. అంతం గాళ్లల ముండ్లు గ్రుచ్చుకొనునట్లై హైమభూమీధరుం
డంతర్యామిసుపర్వచేతనము ముద్దై మూర్తిగానై మహః
శాంతుం డంబుజపత్రశేఖర శిరస్త్రాణంబుగాఁ దోచి దు
శ్చింతుం దుందుభిఁజూచె శృంగవిగళజ్జృంభచ్ఛిలాగహ్వరున్. 238

క. ఇటుచూడుము నీ వెవ్వర వటు కోరాడెద వనంగ నసురయు నాసా
పుట వమదగ్నిజ్వాలానట వికటాననుఁడు శీతనగమున కనియెన్. 239

శా. నేనా! దుందుభినాముఁడన్ దనుజకంఠేకాలుఁడన్ యుద్ధరం
గానన్ నా కెదురై నిలంబడనులేకం బోయి రత్నాకరుం
డీ నిన్ జెప్పె శిలానిబంధ పటుతాహేవాక దోశ్శాలి వం
చీ నాతో నెదిరించి నిల్పుకొనుమీ యీ నీ యశోబంధమున్. 240

గీ. అనినహిమవంతుఁడనియె సురారి! యతనికెవరుచెప్పిరోతెలియ దేనెపుడుయుద్ధ
మాడియెఱుఁగన యాడెడువాఁడఁ గాను నేనువతిథులౌ ఋషులునునిదొక గోడు.

గీ. అసుర పకపకనవ్వి కొండంత మేను నందులోఁ జూడఁగా నలుసంత మనసు
పోవనీ! నన్ను నెదిరించు పురుషుఁడున్న నీవెఱింగినఁ జెప్పెదవే యటన్న.

క. ఎఱుఁగుదువా యనియెదవా యెఱుఁగుదు ననుకొందుఁ గాని యిప్పుడుపోర
క్కఱగా నెంచఁడొ యాతఁడు గఱితల కౌఁగిళ్ళ మనికిగా మనుచుండెన్. 243

ఉ. ఐనను వెట్టపుట్టునటు లాడుమ యీపయి నీ యదృష్ట మీ
వైనను బోయి వార్ధిని హిమాద్రినిఁ జూచుఫలంబు పందు రే
లైనను ముందు మేల్కనియ యాతఁడు శీధురసోగ్రపాయి, యీ
పానము తూలనాడుము విపత్తును నెత్తికిఁ దెచ్చికొంటివే. 244

గీ. అనిన నతఁడంతవాఁడా యటంచు నసుర వానిపేరును చెప్పినవాడ వేమొ
కావనఁగ నవ్వుచును హిమగ్రావరాజు వాలి, కిష్కింధపురి నేలు వానరుఁ డనె.

వ. అంత దుందుభి దక్షిణాభిముఖంబుగ నార్చినహిమగిరియిట్లనియె. 246

క. నిన్నొక్కటే యర్థించెద నిన్నాతఁడు కొమ్ములూని నింగిని విసరున్
నన్నుం జెప్పకు కోపము న న్నా మీఁదికిని విసరినన్ విసరుఁజుమీ. 247

వ. అనిన దుందుభి హిమగిరిమీఁద మలుసంజవారినట్లు చూచి చని, యదిపున్నమ రాత్రి, యమావాస్య దాడిపెడలినట్లు కిష్కింధాపురి గవనుద్వారము కొమ్ములతోఁ దాడించి చేసిన మహోధ్వనికి. 248

ఆ. వాలి పెదవివద్ద వనితాశిరోమణి తార చేత నిడు నుదారశీధు
కనకపాత్ర జాఱి కాళ్ళపైనొలికిన క్రొత్తవేఁడి వాలి నెత్తికెక్కె. 249

చ. మరల ఫెడేలుమం చసహమానము రాజగుహాముఖోగ్రవ
స్త్రరపటుతాడన ధ్వనియు సాగెను వాలియు లేచెఁ దీక్ష్ణుఁడై
కరమున భర్త నాపి చిఱుకన్నులఁ దారయు నట్లె నుంత ని
ల్చి రట ప్రఘూణ ఘూర్ణన విశీర్ణ మహోగ్గళరావముల్ వినన్. 250

గీ. వాలి గవనికి లంఘించి ద్వారమైన జాయి తొలఁగించి యెవ్వఁడురా యటంచుఁ
జూచె నిర్యాత దక్షిణాక్షుతమువోని కాసరమ్ము బర్హిశ్శిఖాకేసరంబు. 251

వ. అంత మే మందఱము ద్వారదేశ మాశ్రయించి నిలంబడిన వందకాగడాల వెలు తురుచే వెన్నెల లెట్టనైన వికృతభయంకరాకృతి దుందుభి యిట్లనియె. 252

శా. ఆ నీ వేమొ మహాబలుండవట భూమ్యాకాశముల్ పట్టవం
టా నీరాకరమున్ హిమాద్రియును నిన్నాఁడంగ నిన్ దీవ్రశృం
గానన్ దూయఁగ నూహచేసితిని నాకంటెన్ బలాఢ్యుండ టం
చి నేలం గలఁడొక్కరుం డనెడు పల్కే నోర్వఁజాలమ్మి! కపీ! 253

శా. ఆ వారాశి నెదిర్చి హుమ్మనుచు నే నార్వంగఁ గంపించి నా
నావిక్షేపమునందె నాతఁడు దురంతంబైన మచ్ఛౌర్యరే
ఖావిస్ఫూర్తిగ దున్నినాఁడ సికతాక్ష్మావీధి నా చాళ్ళవీ
శ్లైవచ్చెన్ బడి నుప్పుమళ్ళుగను బాధాక్రాంతుఁ డైనట్లుగన్. 254

మ. హిమశైలంబఁట తాను కాదఁట సరేలే! యంచు నేనేగ నా
హిమశైలానికిఁ జీమునెత్తురులు లే వేమందు నిల్వెల్ల ర
క్తము లేనట్లుగఁ బాలిపోయె నిఁక నాకా! వీనితోనా! రుజా
శ్రమ తీర్పంగను శాంతులున్ వ్రతములున్ సంతర్పణల్ తీర్పఁగా. 255

ఆ. మూలనున్న యట్టి ముసలమ్మఁ గొట్టెనుసాగి యాఱునెలలు సామువేసి
యన్న యట్లుగాఁగననుకొంచు నుండంగ నతఁడు నిన్ను జెప్పె నంతనంత.

వ. అంత దుందుభి యర్ధక్లిన్నఘాసం బంగిలినుండి దంతదేశమ్మునకుఁ గ్రుమ్ము కొను పశువువోలె నవ్వి. 257

ఉ. వీరుఁడవే! బలే బెదురు పెట్టితి చెట్టుకు మంచుగుట్టకున్
నేరక నిన్నుఁజెప్పినది నీకును నెక్కడఁ జెప్పిపోదునో
వారక నే నటం చతఁడు పడ్డ భయంబును జిట్టులయ్యె నా
పారభుజాబలంబునకు సాటిగఁ జెప్పటయున్ విచిత్రమై. 258

క. కేవల బాహోస్తర్దయె యావెనుకను నీవటన్న నది యిప్డు సురా
సేవాదుష్టుండ వీ వని నే విని ద్వేషమ్ముగాంగ నెగడినది కపీ! 259

మ. తొలినా డబ్ధి మథించుచో సురయు నుద్భూతంబుగా నద్ది వి
హ్వలతాసంజనకం బటం చనుమతింపంబోరు సద్ధీకులై
తొలివేల్పుల్ మలివేల్పు లల్పధిషణాదుష్టప్రచారుల్ మదా
విలులై త్రావిగి త్రావువాండనిన నా వేరం బపారం బగున్. 260

ఉ. త్రావినవానికిన్ స్మృతిపథంబునయందునం గోంతులాండు నా
త్రావుట కోతియైనయెడం ద్రావినవానికి ‹దేలు కుట్టిన
ట్లే వెడబుద్ధియై యతండు నెంచడు తల్లినిం దోడుం, జూడ లే
దా! విబుధుల్ సురావు లయినంతట దైత్యుల వెళ్ళంబుచ్చుటల్. 261

ఉ. 'వాండెటువంటి వాడయిన వా డనినట్టిది నిక్కువంబు వాం
డాడినయట్లు వాలియును నక్కట సోదరు వెళ్ళంబుచ్చె న'
న్నాడికలైనం బానవిషయంబున వాలి మహాగ్రహంబునన్
గోడిగ నిల్చి నిందయెల గోలగు కోసమొగంబు నవ్వులై. 262

క. తన యాత్మనిగ్రహము మాలినవానికిం ద్రాగకయునులేదు వ్యవస్థా
వినియతము మనోభావము తన యింద్రియనిగ్రహము ప్రధాన మెవనికేన్. 263

ఉ. త్రాగని మీరు దానవులు త్రావినవారె నయంబనన్ గ్రుధా
భోగులు మీరు చేయవలె భూమికి ధర్మవినిర్ణయంబు మీ
చేగయుం దెర్వి యెంతయినం జెప్పవలెన్ మఱి దున్నపోతవై
యీగతి వచ్చుటే తెలుపు నేమిర! త్రావుటగూడం దప్పరా? 264

కొంచె మాలోచనము చేసికొమ్ము నీదు తెలివి స్పష్టమ్ముగా నీకె తెలియంగలదు
ఎచటఘోరాంబురాశి నీవెచట నెచటహిమగిరీంద్రంబు నావ! నీవెచటచూడు.

. వట్టి వెఱిపప్ప క్రిందం గట్టిరి నిన్నుంచుం దార కై కైకొనిపో
వట్టి మగుడ దుందుభియును గిట్టలతో మన్ను చిమ్మ కీశేశువయిన్. 266

జ. గప్రయాతము.
అ: చేతకాదేని యట్లాడి పోరాబిరానన్ సతీసంగవీరా! చనంగన్
గిరీంద్రాంబురాసుల్ ప్రకృష్టాత్ములైనన్ మఱెంబోయితేల్తున్ జమత్కారమెల్లన్.

అని వాలియు మోమునన్ బిగిసి తానచ్చోటనే నిల్చి యి
ట్లనియెన్ నీ విటనుండి వెళ్ళినం గదా యంభోధి శీతాద్రులం
గనుటన్నన్ సురవైరి త్వాదృశులు నిక్కం బంగనాసన్నిధిన్
మొనగాండ్రంబలె మాటలాడెదర యంభోజాక్షు లాలింపగన్. 268

క. అను మాటవెంటఁ బౌరుషఖనియైనన్ నీవు ప్రథమ కక్ష్యాగతుఁడౌ
దనినఁ గపిరాజు కానిమ్మనినన్ దుందుభియు రమ్మటంచు వెనుచనెన్. 269

ఉ. తీక్ష్ణమరుత్ప్రవేగమున దెప్పరమై చనుదెంచుచున్ గుశ
శ్లక్ష్ణము కొమ్ముచేఁ బొడిచెఁ జండుఁడు రక్కసిదున్న తన్మహో
భీక్ష్ణము నుగ్రమున్ కడిఁది బెట్టిదమై చను తాఁకునన్ గ్రుధా
తీక్ష్ణతఁ బూనెగాని మఱి తీయఁడ యొ క్కఁడుగైన వాలియున్. 270

ఆ. ఏడు పర్వతమ్ము లెంత బర్వెంత బర్వాని చివరికొండ యొరుగఁగలుగ
మొదటికొండ కెంత మోపైనదెబ్బ కావలయు నంతవలయు వాలి యొఱుగ.

క. నే నెఱిగినంతవఱకున్ దా నంతయు లేద సగమొ దానన్ మఱి పా
పైనను వేగము బలమును బూనింపంగలుగు తీవ్రభుజుని ధరిత్రిన్. 272

శా. పక్ష్మభ్రాంతి విచిత్రచంక్రమణ సంచారుండు రక్షోలులా
యక్ష్మాభర్తయు నట్టిటుల్ విద్రిచె శృంగాగ్రోగ్ర భుగ్నక్రియన్
సూక్ష్మంబైచను రేఖయుం గదలఁ డాశుక్రీడచేతన్ బ్లవం
గక్ష్మాభర్తయు రొప్పికొం చసుర చక్రభ్రాంతి నూటాడఁగన్. 273

క. ఒక నిట్టమెఱుపు మేఘమ్మొకఁడు పెనఁగునట్లు బిడుగు లుఱుములుగా వా
రక పెనఁగి రిద్ద రక్షుల్ చకితములయ్యెన్ వియత్తు క్ష్మా చలియింపన్. 274

ఆ. మహిషదనుజుఁ డంత మందేహుఁడై రక్తదిగ్ధసాంధ్యజలద దేహుఁడయినఁ
గానిపించె నంత గమలబంధు సితాబ్జకేసరాభ ధవళ కిరణకాంతి. 275

క. శ్రమమెఱుఁగఁడు వాలి పరాక్రమ మెన్నఁడు వాలివాని కాయ మనిర్భే
ద్యము లయఝంఝా పవమానము వానిఁ గదల్పలేదు నలినాంతదృశా! 276

వ. అంత నవ్వాలి వాలం బసుర వెనుగాళ్ళఁ దగిలించి లాగి కోలు కొక్కరగాఁ బడ
నొత్తి ప్రక్కటెముకల మోఁకాటితాఁపున విఱుగ బొడిచిన నసుర మూరెఁడు
నాలుక వెలికిజాఱఁ బుట్టెడు నెత్తురు గ్రక్కికొని చచ్చిన, వాని కళేబరంబున
కటునిటు దూఁకి నిలఁబడి పకాలున నవ్వి నాని యిరుకొమ్మలూని యీ
యామడ దూరంబునకు విసరివైచె. 277

శా. ఆ వేగంబునఁ బెద్దగాలియును రివ్వే సాగి తద్వాయుధా
రావిద్ధంబుగ దైత్యవక్త్ర విగళద్రక్తోపగా బిందువుల్
ప్రోవుల్ గాఁగను మౌని యీ వన లతా పుష్పాగ పత్రోపరి
స్రావంబై మునిరాజు నాశ్రమ గవాక్ష స్యందిగా నై చనన్. 278

క. అపవిత్ర స్పర్శఁ గ్రుధా విపులం బగు నడక నిల్లువెడలి చని తపః
కృప మాలిన యెడఁదఁ గపిన్ శపియించె మతంగమౌని సాధూత్తముఁడై. 279

శా. ఈ నా యామడమేర యాశ్రమములో నెందైనఁ గాలూదినం
దానై వాలి మృతింగనున్ మఱియునుం దన్మంత్రు లీ యాశ్రమా

స్థానిన్ తేపటిదాఁక నిల్చినను బాషాణంబులైపోవ, వీ
రో నిక్షేపమువంటి పత్రకుసుమవ్యూహంబు ప్రత్యూహముల్. 280

క. అని స్నానమాడి హోమములను జేసి పునర్వినిర్మలత్వము శౌచం
బును బొందియుండ వాలియు మునిఁ గన్గొన వచ్చి కృతనమోవాకముగన్.

క. ఈ నాయం దెపుడేనీ మౌనుల కపకారమన్న మాటయుఁ గలదే
పూను భుజాబల మధికంబైనది మీకంటె నన్న యజ్ఞుఁడఁగానే. 282

మ. అనినన్ మౌనియుఁ జీదరించుకొని యేమన్నానా యన్నాను పో
కను నా యాశ్రమభూమికాని ధరణిం గాంతార మెంతున్న దం
దున నీ విక్రమమున్ వెలార్చుకొను నా తోఁటల్ప్రవేశింపకు
న్నను ప్రాణమ్ములు నీకు నిల్వవో యటన్నన్ వాలి జాలింజనెన్. 283

వ. అంత శ్రీరామచంద్రుం డిట్లనియె. 284

గీ. కనలి తిట్టుటయున్నది కాళ్ళవ్రేళ్ళఁబడిన వెంబడి జాలిఁజేపట్టు టున్న
దెందు మౌనులు వాలియందేమి కలదొపరముఁడొ మునికోపంబు మఱలకునికి.

గీ. అనిన సుగ్రీవుఁ డిట్లనె నది యెఱుఁగడు వాలి లోకాన నెఱుఁగ రెవ్వరునుగాని
యితరులేమనుకొందురో యేమొయంచుఁ జెట్టియాధిక్యమును బ్రదర్శించుకొంచు.

శా. ఆ దూరమ్మున సప్తసాల మది తా నవ్వాలి యొక్కొక్కటన్
గోదండంబునయందు నమ్మునిడి యాకుల్ డుల్చు నాచెట్టు పెం
పేదన్ సప్తకమం దొకొక్క శరమై యే యాకు లేకుండఁగా
నీ దర్పంబగుచేఁత యుత్సవముగా నేటేటఁ గిష్కింధలో. 287

ఉ. తూచినయట్టి వేగమును దోర్బలమున్ శరచారణాత్తశి
ల్పాచరణం బనన్యకృతమై యొక యద్భుతమై కనంబడన్
రాచినయట్టి యుత్సవ పరంపర పెంపఱరాని క్రోఁతి గో
లై చివరల్ గ్రహించిన మహాముని యోర్మిశ్లథాభిముఖ్యమై. 288

గీ. తుదకు నీదైత్యతనుపాత ధూననమునవెడఁద పగులు ఫెళ్ళుమన బీటచ్చియుండు
మఱియుఁ దుదిగాలిపొరచేతమందునన్నీ యూవెనుకగాలు లాభిముఖ్యమునమర్ప.

మ. కృతసంస్మేరుఁడు రామచంద్రుఁడనె సుగ్రీవా! మఱిన్ జీవి సం
సృతి చిత్రంబగు మూలభూతమగు దుష్కృత్యంబు ప్రాణంబు నం
దతుకున్ బ్రాణిమొనర్చు సర్వమగు కార్యంబందు దీపించు బో
కృతులౌ మౌనులు సూక్ష్మదర్శులును దర్శింపంగ మూలాఘమున్. 290

చ. మఱియును నవ్వి శ్రీరఘుకుమారకమౌళి ధనుర్ధరేంద్ర మీ
ధరణి మహావిచిత్రముగదా యది మీకును వాలి నే ర్పటం

చురవడి నమ్మదూసి పతి యొక్కటి చిత్రవిచిత్ర వేగ బం
ధురతర తీవ్రచంక్రమణ ధూననవైఖరి నేసినంతటన్. 291

గీ. ఒక విచిత్ర ఖడ్గక కేళియో యనంగ పుల్లపత్రావళిన్ దుల్చి బోద నఱకి
తీవ్ర ఝంఝా మహామరుత్ప్రేరకముగ నావెనుక ధాత్రి పెకలిచి యమ్మతూఱె.

శా. సుగ్రీవుండును రామచంద్రుని పదద్వంద్వం ప్రణామ క్రియా
వ్యగ్రుండైనను స్వామి నవ్వుచును బాహాస్పృష్టిగా లేపి హో
స గ్రంథిస్ఫుట ముగ్ధ ముగ్ధ వదనచ్ఛాయా మిళత్సాంత్వనం
డగ్రియంబగు మాటలెత్తి మఱి యేలయ్యా! భయంబందగన్. 293

క. మరి యందుచేత వాలియుఁ బరువడి నీ ఋష్యమూక పర్వతధాత్రిం
జొరరాఁడు గాన నీకిది యిరవుగ నైనయది యంతియే కదవయ్యా! 294

క. ఎపుడా వాలికి నింతగు నపకృతి చేసితివి నిన్ను నతఁ డద్దానం
గృపమాలి వెంబడింపఁగఁ ద్రపమాలినయట్టు లన్నదమ్ముల మధ్యన్. 295

వ. అనిన సుగ్రీవుండు జానకీదేవుని యౌదార్యంబు కృపగా మాఱునన్న భీతి నిట్లని
నియె. 296

క. ఒక యపకృతి యని యాతని కకటా! నేఁ జేసిననుగదా యటులాడన్
వికృతమతి యతఁడు మనమేయొకటియుఁ జేయకయ యట్టులూహించుకొనున్.

క. బతిమాలితి బామాలితి మతి సర్వస్వంబు తన్ను మన్నించుటయై
నుతిచేసితి నతిచేసితి మతికిని నెక్కించుకొనఁడు మత్ప్రార్థనముల్. 298

ఉ. ఒక్కనిపై విరోధమును నొక్కనిపైఁ బ్రణయంబు లేద త్వా
దృక్కృత సర్వవిద్యులకు దీపదమం దభిమానభావమున్
జిక్కఁగఁ బూనఁగా వలయుఁ జెప్పెద సర్వము నాలకింపుమీ
యక్కడ నాది తప్పయిన నాతనినే గ్రహియింపవే ప్రభూ! 299

ఉ. లీలగ మీరు లోకమును లెక్కయె చేయరు, మీకు సర్వముం
దేలికగాఁ గనంబడును దీర్పని కార్యము తీర్చినట్లుగా
బోలు నపారశక్తిగల బుద్ధికి, మాయెడ నట్లుగాదు, ప్రా
ణాలును బ్రాప్తకార్యకరణంబును తూనిక పట్టినట్లుగా. 300

మ. మదవ ద్దుందుభి బంధువౌ నసుర య మ్మాయావి మాయా విశా
రదుఁడున్ దానొక యర్ధరాత్రమున ద్వారక్షోణిఁ గిష్కింధకుం
గదియన్ జేరి ప్రశాంత వాయువు కలంగన్ సింహనాదంబు దు
ర్మదుఁడై చేసిన నిద్ర మేలుకని ద్వారక్షోణి కే మేగఁగన్. 301

గీ. అర్ధరాత్రంబు కాక వేఱైనవేళ పనికిరాదేమి వీరి కన్పగిది నన్న
ప్రళయకాలోగ్రరుద్రుని పగిదియున్న, నసుర చూచుచు గుండియ లావటిల్లి.

చ. పరచిన వానివెంటఁబడి పట్టుకొనంగను సాఁగె నన్న యొం
టరిగను నన్న పోవుటకు నా మన సొప్పక నేను వెంబడిం
బఱచితిఁ ద్రోవ వెన్నెలలు వారెను ముగ్గులు పోసినట్లు క
ర్పూరములు చల్లినట్లు కనుమూఁతలు విప్పినయట్లు రాఘవా! 303

క. మా యిద్దఱ యప్పటి స్థితి యా యామినియందు నాకు ననిపించెను దై
తేయకుల మ్మఖిలంబును మాయించియ యుందుమన్న మంటగ నుండెన్. 304

శా. ఆమాయావి పలాయితుం డగుచు దూరానేక కాంతార వీ
ధీ మధ్యంబులఁ బాఱి పాఱి శతధాదీర్ణంబుగానైన క్షో
ణీ మధ్యంబున రాళ్ళు ఱప్పలగు నా నేలన్ మహాగహ్వర
వ్యామిశ్రంబు బిలాస్యమందునఁ జొఱంబారెన్ జలంబాఱగన్. 305

చ. తెలతెలవాఱెఁ దూర్పు సతి తీర్చిన కుంకుమబొట్టువోలెఁద
మ్ముల చెలికాఁడు తోఁచె బిలముం జొఱఁబాఱె శ్లథాంధకారసం
కులముగ నంతటన్ దనుజకుంజరుఁ డంతరవర్తి దైత్యవి
హ్వలతర గ్రామనృత్య కలితారవముల్ వినవచ్చుచుండగాన్. 306

. నీ విందుండుము నేను వచ్చెదను వానిం జంపి యం చన్నయుం
బోవం జూడఁగ నేను జెప్పితి, బిలంబున్ ఘోరవక్త్రంబు నా
లో విజ్ఞాతముకాని యాపదలు క్రాలున్ గ్రాల, వేకైక వీ
రావేశంబునఁ బోవనేమిటికిఁ గాలాధీనతం జూడకన్. 307

. కయ్యంబందున నీవు నజయ్యుండవ యనుము, వట్టిశ్రమ యేలా వాఁ
డొయ్యన యాపరి వచ్చినఁ జయ్యనఁ బోకుండఁ బట్టి చంపఁగవచ్చున్. 308

. అని వారించిన వాలి కైకొనక నే నట్లాడకుండన్ మఱిం
దనపై నొట్టిడుకొంచు దూఁకె చనెఁ బాతాళాధ్వదేశంబునన్
నను నా గహ్వర వక్త్రమున్ గదలకుండం జెప్పె నే నంద యుం
టిని సంవత్సర మానిశాదివముగా వ్యగ్రైకనేత్రంబుగా. 309

నేనున్ లోనికిఁబోయి చూత మనినన్ నేనొక్క త్రోవంజనన్
దా నింకొక్క బిలాన వచ్చినయెడన్ దా నేను లేకున్కి నే
మైనానో యని దండడించునని నే నచ్చోటునందే ప్రతీ
క్షానైశిత్యము సర్వవృత్తియయి దీక్షావ్యగ్రుఁడై యుండఁగా. 310

బిలముఖంబున నెత్తుటేఱులు స్రవించె గహ్వరాంతరమున దైత్యఘటల వికృత
మోదకృత నర్తనారావములు వినఁబడెఁ దొలుత నేమి చేయను నాకుఁదోఁచలేదు.

కడువడి నన్నుఁ జంపి **రతిగాక జయోన్మదవృత్తు** లూరిపై
బడిమెదరేమొ దానవులు వచ్చి యటంచు గుహాముఖంబు చొ
ప్పడు నొకకొండవంటి పెనుబండను దైత్యులు తూల్పరానిదౌ
పెడిదవుదానిఁ ద్రోసి పురవీధికి వచ్చితి నొచ్చితిన్ మదిన్. 312

చ. అతనికిఁ దర్పణాదికము లవ్వియుఁ జేసితి నంత బిట్టు దుః
ఖితుఁడగు నన్నుఁ బ్రెగ్గడలు కేశధరిత్రి యరాజకంబుగా
నతికెడు నట్లు చెప్పి మఱి యౌనని చెప్పిరి రాజనైతి నీ
చతురుదధి ప్రణీత కపిసంగత ధాత్రికి శౌర్యధాత్రికిన్. 313

మ. ఒకనాఁ డేనును జేరి ప్రెగ్గడలు కొల్వుండంగ ద్వారంబునన్
వికటాస్యుండగు వాలి భీకరుఁడు కన్పించెన్ ఘరట్టోగ్రదం
తక నిష్పీడన రావఘూర్ణిత సభాధాముండు లాంగూల వ
ల్లిగ కృతాస్ఫోట విశీర్ణ భిత్తి శకల క్షోదంబుగా ముందటన్. 314

శా. నా ప్రాణమ్ములు లేచివచ్చినవి యన్నం జూచినంతన్ మఱిన్
బై ప్రాణమ్ములు పైనిబోయినవి యవ్వాలిం గనన్ గ్రోధరే
ఖా ప్రస్ఫీతుఁడు గాఁగ నున్నతని వంకంగాంచి సింహాసనం
బప్రార్థ్యంబుత్యజించి నేగురుని పాదాంభోజముల్ మ్రొక్కుచున్. 315

చ. ప్రభువవు వచ్చినావు కపిరాజ్యరమారమణీమయూరి వ
ల్లభ సుకుమారమోహనవలాహక మూర్తివి నిన్నుఁ గాని సై
రిభదనుజాత మర్దను నరిందము ఘోరమహాపదబ్ధి వీ
చిభర రుజా భుజాతరణ సింధురబంధురవీరుఁ జూచితిన్. 316

ఉ. నా పొరపాటు గాని భుజనాళ వినిస్రుత దివ్య శౌర్య ధా
రా పరిణామ దుర్ధర పరాక్రమ వార్ధికి భంగ మున్నదే
యే పరమాభిముఖ్యమున నే నిముసంబు ప్రసన్న మానాకో
యోప మెఱుంగఁగాక మఱియు న్నినుఁ జూచితి నే యదృష్టమో. 317

శా. రాజాంతఃపురమెల్ల దుఃఖమయవారాశి ప్రకీర్ణాంబు ధా
రా జీమూత మహాంధకార మయమై మ్రగ్గున్ భవద్దివ్యమౌ
తేజస్సంగత మూర్తి దర్శన హరాద్రీప్తోరు మోదప్రభా
భ్రాజిష్ణుత్వము సంతరింపవె మహోవారాన్నిధీ! శ్రీనిధీ! 318

ఉ. ఏదిన మోదరేఖయయి యిర్లయి పొల్చిన నా యెడందఁ జం
ద్రోదయమైన దుజ్జ్వల గురూదయమైనది మన్మనోవియ
ద్వేదికమీఁద సర్వకపివీర జగత్ప్రథమాన నూత్న మ
ర్యాదుఁడవైన నీదయిన రాక నిమిత్తము గాఁగ నగ్రజా! 319

మ. అవివేకం బగునేమొ నే నెఱుఁగ దోషాచారుఁడన్ గాను ని
న్నవమానించెదు నంత దుష్టమతిఁగా నన్మత్పురాభక్తి నీ
వవలోకింపుము నీకు నీడవలెఁ దోడైతిన్‌గదా సర్వమౌ
వ్యవసాయంబున నంత దాఁచుకొని తా నన్నాళ్ళు లెట్లుండనో. 320

వ. అనుచున్న నన్ను ముంగాలఁ బెడఁద్రోచి నామంత్రుల నదలించి తోలి యొక్కఁడు సభామధ్యమ్మున నిట్లనియె. 321

గీ. అన్నదమ్ముల కొక తండ్రి యగుటకంటె నన్నదమ్ములకొక తల్లి యగుట కాదొ
ఋక్షరజసుని మఱియాద యెంతొ తలంచుకొన్న నిప్పటికినినాదు గుండె లవియు.

చ. తెలియని యాపదల్ గలుగు తెన్నని చెప్పి బిల ప్రవేశమున్
వలదనె నెంతొ తమ్ముఁడగువాని విధంబున నల్లె యైనచోఁ
దలఁప గురుండు చెప్పినది దాఁటుదురేమి యనిశ్చితార్థమౌ
పొలమునఁగాక తా నగుచుఁ బోరఁడొ పోఱడుకాని తమ్ముఁడై. 323

చ. క్రమమునఁ జూడఁడా మహిష రాక్షస పర్వతదేహ ధూననం
బమరిన సప్తతాళ దళనాద్భుత కృత్యము లోకజేతృ వి
క్రమమునఁ బొల్చునట్టి దశకంధరు చేతను బ్రార్థ్యమాన వి
క్రమమున నేను చచ్చితినిగాఁ దలపం బసిబిడ్డ నేర్పడొ. 324

ఉ. ఎన్నడులేని పేర్మి వెలయించుట యన్నది చాల చిత్రమై
కన్నులు కప్పఁగా నపరకర్మలు చేయుట చేసినన్ మృతిం
గన్నటు లైననున్ ఫలము గన్నటులైనను బొల్చుఁ బ్రేతమున్
దిన్నదికాదు ప్రాణియును దిన్నదికాదును గ్రొత్త నేరుపై. 325

చ. నెలవునఁ జూచుచుండ మరణించిన నమ్మరు కాలుచేతులున్
జలువలు క్రమ్మెనో యనుచు సన్నగ నూపిరి యాడునో యటం
చొలిసిన తెల్లగ్రుడ్లు పడెనో యని చూతురు ప్రేమకల్గు బం
ధులు బిలమందు నెత్తుపడె తోఁచెను లెక్కకువచ్చె వాలియున్. 326

ఉ. ఆ పనియే పొనర్చుటయు నచ్చట రక్షగ నుంచినందుకై
యే పనివారు చేయుదురొ యేమొ యటంచును భీతి కల్గుటన్
బ్రాపుగ నుంచినంత బిలవక్త్రము దైత్యులుగాని పూడ్తురా
హా పరమాధముల్ కితవు లాత్మ పదార్థ పరార్థ విద్విషుల్. 327

చ. అదిర! వసంతుఁ డెన్నడును నాకులు రాలిన వల్లిఁ జూచు ట
న్నది యెఱుఁగండు నయ్యదియు నాకు ఘటించెను దారయందున
య్యదియుఁ బదాభిఘాతముల నా శిల విచ్చెను గాని లేని య
య్యదనున దబ్బుఱే యగుయథార్థముపై నది యాప్త వాక్యమై. 328

ఆ॥ తార తెలివి యేమి తన రుమ మిక్కిలి యందకత్తె యంత యందకత్తె
రాణి కానువలయు రాజు వేఱొక్కఁడు అట్టి యందకత్తె యెట్టులగును. 329

వ. అంత నత శిరస్కుండనై నిలుచున్న నా కిట్లు వినిపించె. 330

విజయభద్రము.
ఇది ఋక్షరజస్సుత హిత వానరాభినుత
కపిలోక పరమేష్ఠి కదన భీకర ముష్టి
విదళితాసురపాళి విగాహిత లోకాళి
వాలిసుమహారాజ వల్లభేంద్రుని యాజ్ఞ. 331

ద్విపదలు.

మున్ను రాజునకుఁ దమ్ముండు సుగ్రీవుఁ డన్నట్టి వానరు నంద తెరుగుదురు
చన్న రెండేండ్ల కిచ్చుట నొక్క రాత్రి దున్నరాకాసి పుత్త్రుని దాడిరాక.
వెన్నంటి చనియెఁ బృథ్వీజాని రక్క సు న్నీల్గఁజేయఁగా శూరమార్తాండుఁ
డన్నయందునఁబ్రేమ యభినయించుచును నిన్నీచుఁడగు తమ్ముఁడే గెఁబిఱుంద.

హరిగతి.

అసురయుఁ దప్పించుకొనన్ బిలమున యందునఁ జొచ్చెన్ వెంబడి
కసిమసఁగంగా రాజుం బోవం గాంక్షింపంగా నీ తమ్ముండున్
మసలున్ ఘోరమహాపదలంచును మాన్పించుటకై యత్నముచేసెన్
బ్రసరద్బాహుమహాబలవిక్రము వారింపఁగరామి యెఱింగియునున్. 333

నీ విందుండి బిలద్వారంబును నిర్నిద్రముగా రక్షింపుమనన్
భూవలయంబున నాశం బొండెన్ భూపతిచావునుగల్పించుచు నన్
భూవిభునాశము కల్గఁగ లోపలఁ బూడిచిపెట్టిన యట్టులు ద్వారం
బీవల పెకలుపరాని ఘనశిలాపిహితముగాఁ గిష్కింధకు వచ్చెన్. 334

రాజాజ్ఞోల్లంఘనమును మఱియును రాజద్రోహమునివి రెండగుచున్
రాజాజ్ఞోల్లంఘనమునకును గారాగృహవాసము శిక్షవిధింపఁబడెన్
రాజద్రోహమ్మునకును పైని శిరచ్ఛేదంబొండు విధింపఁబడెన్
తా జీవద్భూమిపతి కపర కర్మలుసేసి పదికశాఘాతంబుల్. 335

వ. అంత నపగమిత రాజ పురుషయోగ్యవస్త్రాభరణుండ నయిననన్ను రాజభటులు నిగ్రహింపరాఁ దక్కిన మన్మంత్రులవనతశిరస్కులుగా నీ హనుమంతుఁడు సభా మధ్యంబున భయంకరమూర్తియై నిలుచుండిన సర్వకపిలోకంబు విహ్వలించె నంత వాలి యిట్లనియె. 336

ఉ. ఈతఁడు తమ్ముఁడౌట క్షమియించితి మంతటి యుగ్రశిక్షలన్
జేతము సమ్మతింప దదిచేయఁగఁ గావున నిర్వసింపఁగా
నీతని నేకవస్త్రుని బహిర్గతుఁ జేసితి ధాత్రినుండి వే
యీతని భార్యయైన రుమ నేము గ్రహించితిమిందు రాణిగా. 337

వ. అని సింహాసనమునుండి లేచి నిష్క్రమించిన నే నున్నవాఁడనున్నపాటుగాఁ గిష్కింధ పొలిమేరలకు వెడలింపఁబడితిని. కానిమ్ము, నన్నంత నా బ్రదుకు నన్ను బ్రదుకనిచ్చెనా! 338

ఉ. ఓయి రఘుప్రవీర! కరుణోదధి! ప్రాణసఖా! జగత్ప్రభూ!
పాయనిచోట పాసితిని బట్టెడు నిద్దురనుండి లేచితిన్
బోయినచోట నిల్వను ప్రభూ! పగమే తిని లేచి పాఱితిన్
మాయను కన్నుపొంచువధపొంచెఁ మహాభయమగ్నవృత్తినై. 339

వ. చిట్టచివర కీ మతంగాశ్రమము స్మృతికిఁ దగిలి యిచటఁ జేరితిని. నామంత్రులును నన్ను వెదకికొంచు వచ్చిరి. భయరహితముగ నిద్రాహారములు లభించుచున్నవి. అంతకునూరకుండలేదు. మతంగాశ్రమపుఁ బొలిమేరయందు శిలావానరులను జూడుము నేటికి. 340

గీ. నవ ప్రతీక్షా పవిత్ర మైన దగు శుక్తిలోనఁ బడె స్వచ్ఛమౌ స్వాతివాన చినుకు నిన్నుసఖునిగమన్నింతు నిన్నుదైవముగనుయజియింతు నీవె నేనుగ రమింతు.

వ. అనిన శ్రీరామచంద్రుం డిట్లనియె. 342

క. ప్రతి చిన్న విషయ మాలోచితముం బొనరించి వాలి చేయును నీవో ద్రుతమతివై భగవత్ప్రేరితమై చన్నట్లుగఁ బొనరింతు కపీంద్రా! 343

ఆ. అతఁడు పురుషకారమం దధికాదరుండీవు విశ్వసింతు దైవమందు నతఁడు రాజభావమం దతి· తీక్ష్ణుఁడు నీకు బంధుభావమే కడింది. 344

క. పొసగించుట కైనను మఱి పొసఁగుదలకు నమరు మార్గముల నన్నింటిన్ విసిగించి కంప కొట్టెను మసలుటకును వీలులేని మాదిరి నతఁడున్. 345

క. అతని వధించుట కాక మఱితరము కనఁబడుట లేద యే నే పోతు ప్రతతి కలిపించిచంపుట యతఁడును దెలిసియెదిరింపఁ డరుదెంచినను న్.

వ. మఱియు సుగ్రీవుం డిట్లనియె. 347

చ. ఉబుసులఁబట్టుపట్టి మునుపొక్కొకరాడెడు వేళలన్ సమా
న బలుల మేము నిద్దఱము నాకొక వేళకు రొప్పవచ్చు వా
ని బరడుమే న్బడల్పడదు నీలిగినంతఁ బునస్సమిద్ధమౌ
చబుకు విధాన సాగి పరిచంక్రమణోజ్జ్వల దేహుఁడై చనున్. 348

గీ. నన్నుఁ దేలికగాఁ జూచు నాటినుండి యందుచేత నాతో యుద్ధమాడు తఱి న తం డడంగిన వాని మదం బడంగుఁ బూని సౌదర్య మర్యాద లేనివాడు. 349

ఆ. అనినరామచంద్రుఁడనియె మీరుసగంబు మృగములు నరులుపెఱసగము రెండు ధర్మములు వహింపఁ దద్వృత్తులుం గనశిక్ష రెండు గతులఁ జెంది వచ్చు. 350

శా. ఈ సర్వంబగు ధాత్రికిం బ్రభువులై యిక్ష్వాకు వంశ క్షమా
ధీశుల్ ధర్మపుష్టనియై చెలఁగు నెందెం దందునందున్ సమా
జ్ఞా సంపన్నము నార్జవంబు నుపపన్నంబౌ గతిన్ జేంత తా
రా సూర్యంబగు నిత్య ధర్మమయి నిత్యంబై విడంబించెడున్. 351

చ. అతని కెఱుంగఁ బుచ్చెదము నాహవ మాడఁగ నీవు పిల్తు వే
ను తరువు చాటున న్నిలిచి నూల్కొను బాణమునన్ వధింతు ను
ద్ధతమగు క్రూరజంతువు వధం బొనరించిన యట్లు జంతువై
మృతి గనునో మఱేమి యొనరించునొ మానవ భావ మేర్పడన్. 352

మ. ఉరువౌ కొండొక తీవ్రకామము బడిన్ వ్యూహంబునిర్మించుకొం
దురు తామే తమచుట్టు కొందఱు మఱెందుం ద్రోవలేకుండ ని
ర్భరమున్ దుర్ధరమైన యా స్థితికి నే భంగంబు వాటిల్లినన్
మరణం బెంతయు బుద్ధిపూర్వకముగా మన్నించుటే మార్గమై. 353

ఆ. పరగనేని యొకఁడు బంధురకామంబు దురభిమాన మదియుఁ దోఁచ బెరుగు
దురభిమాన మొకఁడుమరణంబు రెండును గవలలనగఁదగిన ఘనగుణములు. 354

ఆ. అతని కిచట రెండె యాచరణీయతాయోగ్యములగు గుణము లూహసేయ
దురభిమాన మూవి మరణంబు పొందుటో తాను సన్యసించి ధర వదలుటో!

ఆ. నీకు వానరావనీరాజ్య యువరాజ పదము మఱల నొసఁగి భ్రాతృభావ
సామరస్య మొసఁగు సర్వమార్గంబుల నిప్పు పెట్టినాఁడు నిర్గుణుండు. 356

మ. ధరణీ రాజ్యము నీకొసంగి మునివృత్తం బూనునో లేక ని
ర్భరుఁడై నన్నెదిరింప వచ్చునొ మహాబాహుండు తా వచ్చినన్
దొరయై తాను కబంధుఁడో మఱి విరాధుండో యగున్ రాక సో
దరునిన్ నిన్నును నింత చేసిన మహోద్యత్క్రోధముం బండెడున్. 357

వ. అనిన సుగ్రీవుం డిట్లనియె. 358

గీ. ఇది యతనితోడఁ జెప్పఁగా నెవరు సాహసింప రాక యంగదునితోడఁజెప్పవలయు
నాతఁ డైనను దల్లితో నాడు నామె క్ష్మాపతికి నిద్ది చెప్పుట సంభవించు. 359

గీ. అతని మరణంబు నిశ్చయమైన పిదప నతఁడు నీకు క్ష్మాపతి యయ్యె ననియెస్వామి
యంత సుగ్రీవుఁడాస్యంబునందు విరిసి వెలతెలంబోవు నవ్వున విహ్వలించె.

మ. తనకుం బ్రత్యయమింతయుం గలుగమిం దా రాముఁడెంతే గ్రహిం
చెను దత్ప్రత్యయమున్ ఘటించుటకునై చేసెన్ మహాశ్చర్యముల్
కొనగోటన్ విదలించె దుందుభి తనూగోళంబు కంకాళమున్
దన బాణంబున సప్తతాళ దళనోద్యత్కేళి నిర్మించుచున్. 361

ఆ. సర్వజీవ హృదయ సంగత పరిసూక్ష్మ భావవేత్త యేమొ ప్రభు వితండు
సుప్రసన్నుఁడైనఁ జొచ్చి యీపనిచేయు నిద్ది చేయడనుచు నెంచలేము. 362

క. ఒక పర్వత శిఖరంబును బెకలింపంబడి లయోగ్ర భీకర ఝుంఝూ
ప్రకరముచేఁ దాఁకిన వాలికి నా వీరుఁ డడుగుం జలింపడు కానీ. 363

గీ. తాను సప్తతాళ దళనంబు చేయఁగాఁ బంపఁబడిన రామబాణమునకు
లిప్తలోన నంత సప్తమారుత వేగమందుకొనిన దాని కాఁగఁలేదు. 364

సీ. మానసకాసార యానాభిముఖరాజహంస పక్షచ్ఛాయ లవఘళించి
యనిలధూ తారగ్వధావనిజాత పల్లవ మాలికా కాంతి సవదరించి
సంగతాస్కంది తాజానేయ చూడాగ్ర సితచామరప్రభ చెంగలించి
ప్రస్ఫోట నాంచలప్లవమాన గోధూమ కింశారు సుషమలఁ గ్రేణిసేసి

గీ. బాల ఖర్జూరికా శిరోభాగ గర్భతోర్ధ్వ నిర్గత నవదళాహంయువులయి
బాలలవలీకిసాలయ ప్రభల నొరసి స్పర్శసహములు సూర్యాతపములు కాచె. 365

సీ. శ్రీ భావగత పుండరీకాగ్రకింజల్క కాశ్మీర కాంతులు కందళించి
ఆరామ తరు శేఖరానీత మధుర కిసాలయారుణిమము లందగించి
రాజత్కుజాగ్ర నిష్కూజ స్తిమిత కోకిలాంగనా నేత్రాంశు లనుగమించి
మధ్యాహ్న సంధ్యా సమాత్త దృష్టాదృష్ట సూక్ష్మారుణాంశు రింఛోళి బెరసి
గీ. పృధివిధర పార్శ్వ ధాతుచ్ఛవి ప్రతాడి తారుణాతప చక్రమ్ము లభిచరించి
ప్రకృతిగతమైన యొక నిత్యరక్తకుల్య జాలు వాఱినయట్లుగా జాలువాఱె. 366

శా. ప్రభువై హేళి వియత్త్రికోష్ఠమున హేరాళాంశుమాలా దహ
త్ప్రభలం జిమ్మిన సూర్యకాంత శిల శౌర్య ప్రౌఢ వహ్నిచ్ఛటా
స్వభువై నిప్పులు పుక్కిలించెను దదచ్ఛస్వాదు కోష్ణాంబులన్
ప్రభువై వెచ్చని నీటిబుగ్గలను నాస్వాదించె మార్తాండుడున్. 367

వ. అంత వనంబుల దూరానఁబోవు నంగదుని నీలుండు పిలిచి యతఁ డిష్టంబు
లేకుండ నాగి యెందుకన నేమియు లేదని నీలుం డిట్లనియె. 368

చ. మన వనదేశమం దసహమాన పరాక్రమవహ్ని కోసలే
శుని తనయుండు రాముఁడను శూరుఁడు సౌర్యుఁడు ధర్మభంగకో
పనమతి చాప ధూర్జటి ప్రభాజలజాప్తుడు తాదృశానుజుం
డును మఱి తాఁజరించెదుఁ గనుంగొనినావె వనాంతవీధులన్. 369

వ. అనిన నంగదుండు సరేయని పోవుచుండ నీలుం డిట్లనియె. 370

క. వట్టి సరేకా దాయన ముట్టిన బాణంబు వేగమునఁ గ్రౌంచాద్రిం
ఘట్టించిన భార్గవ శర పట్టాభిషవణము ప్రయ్యపఱచినది సుమీ! 371

వ. మఱికొంత దవ్వున నలుం డంగదుని నిలిపి యిట్లనియె. 372

గీ. నీవు వినివావా యిచటి వనీతలముల రాముఁ డనువాఁడు ఘోర సంగ్రామదహనుఁ
డుగ్రతేజుఁడు తిరుగుచు నున్నవాఁడు కార్ముకియు భగవంతుఁడౌస్కందుఁడట్లు.

గీ. మఱియు నొకమాట యాయన మహితమూర్తి
మన వివేకమున్నించు మఱియుమనల
సగము మృగములుగాఁ జూచుఁజాటునుండి
మనలఁజంపను వచ్చునుమాటుపెట్టి. 374

గీ. వనమున కుపద్రవంబైన వ్యాఘ్రమైన వానరేశుండు వాలి కావచ్చుఁ జూడు
తనకుమాటుగ మీపినతండ్రి కలఁడు విభుఁడు రాముఁడు క్రూరుఁడౌ వేఁటకాఁడు.

వ. అనిన దుర్ధరంబగు కోపంబును నిర్భరంబగు భయంబును గా బాలుండైన
యంగదుండు మొగమడ్డంబు త్రిప్పికొనిపోఁగా మఱి కొంత దవ్వునఁ దారుండు
కనిపించి యిట్లనియె. 376

ఉ.నీ కొకమాట చెప్పుటకు నే నిటనిల్చితి రాముఁడన్న వాఁ
డా కుటిలోగ్ర భూమి భుజగాభుఁడు నీ పినతండ్రితోడ తా
నై కరముల్ కరమ్ములను నగ్గియు సాకిరిగాఁగఁ గట్టి నా
రా కపిలోక రాక్షసుఁ డహంయువు నీ పిత యేమి కానగున్. 377

గీ.వాలి దుందుభి దనుజ శవంబును నిరు గేలఁ బూని యామడదవ్వు తూలవేసె
కాలి బొట్టనవ్రేలఁ గంకాళ మతని దనఘుఁ డాయన పది యామడలకు విసిరె.

గీ.వాలి యొక్కొక్క బాణాన సాలశాఖ లేదు నేడు సాలుగ దూయించుచుండు
రాముఁడొకబాణమునవెపత్రములుదూసి మొదలుకొమ్మలువిదళితంబులుపొనర్చె.

ఆ.సగము మనిసి మృగము సగమైన మనజాతి యందు రామచంద్రుఁ డట్లె చూచు
రెండు జాతులయును వృత్త సౌఖ్యము లంది రెండు నైన శిక్ష లుండ వెట్లు.

క.వే నవమర్యాద బడిన్ దానై యెదిరించు నొక్కొ తమ్ముని పగకున్
వానర మర్యాదంబడి ప్రాణము పాయునొ వికల్పభావము పొంటెన్. 381

వ.నేఁడో తేపో సుగ్రీవుఁ డాహవమునకుఁ బిల్వకమున్న నిర్ణయించు కొనవలయును. నేను తేనియం దభిమానము కలవాఁడను గానఁ జెప్పితిని. నీవు వెంటనే తండ్రికిఁ దెలియఁజేయు మన నంగదుండు తీవ్రాలోచనాముద్రిత వదనుండై చనిన. 382

శా.సప్తర్షుల్ విమలాంబరంబు విడి భాస్వద్దేవ కార్యార్థులై
దీప్తిం బోయెదరేమొ వాలిదెస నర్థింపంగఁ గిష్కింధ నా
దృప్తాకారులు బద్ధచూడులు సమాధి వ్యగ్ర దృక్సారణుల్
సప్తాంభోధులు మౌని యాశ్రమ పరిస్పందంబు లైనట్లుగన్. 383

మ.అల వ్యాయామముచేసి చన్న పదినా ళ్ళా సూర్యపుత్రుండు ను
జ్జ్వల బాహానవ దండమండలు డుదంస క్షోణిభృచ్ఛేఖరుం
డు, లఘు ప్లావిత జంఘుఁ డున్నమితకంఠుం డుజ్జ్వలన్నేత్రుఁడై
వెలలెన్ సాంధ్య శరత్పయోధర వియద్వీధీ చలత్క్రీడగా. 384

మ.హరువౌ నాస్యము జానకీ విరహవేళాయాస భావస్ఫుర
త్పరిదీనాసిత నేత్ర కోణములుగా వర్షాంత వేళాపరి
స్ఫురితాంభోజముగాఁ గనంబడ భుజామోఘస్థి తేష్వాసనో
ద్ధురతూణీరుఁడు రామమూర్తి నడచెన్ దుంగాద్రిసానుక్రియన్. 385

చ.తన యెదయెల్ల రామపదతామరసంబులఁ జిక్కి యంజనా
తనయుఁడు పోయె నా కడక తత్పద కోమలభావ మంత ప్ర
న్నని వగు సీలమండల కనత్ప్రభ మోహము నెల్ల గుత్తకొం
చును జనినట్లు తోఁపఁగ విశుద్ధ హృదంతర దివ్యభావుఁడై. 386

చ.తాదృశుఁడైన యా భరతుఁ దానుగ పూర్వము సంశయించె నా
హా! దయమాలి లోకమున నందఱు నన్నలు రామచంద్రుతె

పోదురా! కాను గల్గుదురా! భూతనయాపతి వాలిమీద ని
ల్లై దయమాలు టక్కతన నంచును లక్ష్మణుఁ డెంచుచుం జనెన్. 387

ఆ. సప్తతాళ దళన సమయంబునందునఁ జూచె మఱల నేడు చూడవలయు
రామశరము దుర్ధరము వేగమంచును నడచె నీలు డల్ల పుడమి యద్రువ. 388

ఆ. నడువఁజొచ్చె నలుఁడు నవ్వుచు లోలోన సగము మృగము సగము చంపవలయు
మనిసితనము కూడ మడియించు టగుఁ గదా అంగదుండు చెప్పెనా యటంచు.

మధ్యాక్క-ఱ.
తారుఁడు తాఁ జివురెత్తు తరువు నుత్తాలంబు చూచి
దూరాన వాలియు రాముతోఁ బోర దూఁకివచ్చునొ య
పారాభిమానుఁ డంచుఁ దనుపారఁగాఁ బాఱగాఁ జూచు
వారితో నడువఁగా వెన్కఁబడి తోన పరువెత్తి కలియు. 390

శా. కిష్కింధాపుర మేగుదెంచెఁ బరితః కీర్ణోర్వీజాతోల్లతా
పౌష్కల్యంబునఁ జూపఁగావలసి సంబద్ధోగ్రభూ భృద్దరీ
కిష్కుప్రాంగణ మాత్రలక్ష్య మగుచుం గ్రేణించి లోకైక ధా
నుష్కుండౌ రఘురామమూర్తి గనె గన్నుల్ సూదులై మోవఁగన్. 391

శా. సుగ్రీవుండును మందయానమున నాశుప్రస్థలద్గ్రీవుడై
యగ్రీయుండయి చేరి కోట్టముఖ సింహద్వార దేశంబు క్రూ
రోగ్రాట్టంబుగ సింహనాదమును వీరుండై పొనర్పన్ దిశల్
ప్రగ్రాహో ద్వమనంబుగా విఱిచె దూరాకారమున్ ధ్వానమున్. 392

మధ్యాక్క-ఱలు.
అంతట నాకాశమందు నండజాతానీక మురిసె
ప్రాంత కిష్కింధాపురాగ్ర ౧పన భూభాగంబులందుఁ
జింత యివుళ్ళైన కనుల చెందిర చిఱువన్కె లొలయ
గంతులు నఱవులు తక్కి కపిచమూ కాండమ్ము నిలిచె. 393

వాలి మహాంభోధి భంగ భయద దోఃపాండిత్యశీలి
వ్రాలి యుడ్డీనోగ్రయాన పరిలఘు ప్లవమాన కేళి
తూలి సుగ్రీవునిఁ జూచి దుష్టుఁడా! దోఃక్రీడ నేలి
వాలి నెదుర్పంగ నీవు వచ్చితివా బుద్ధిమాలి. 394

పదరి వారిద్దఱుఁ గలియఁబడి మహాభయద నఖాళి
చిద్రుపలై కండలు వదన సీమలు చీలుచుకొంచు
నదిరదిర యంచు ఓట్టు నార్చుచు నలఘు భుజా స
మద నినదరేఖ రంగమధ్య ధర్మంబులు చెడక. 395

త్రోచిన త్రోచును, వాలి దుమికిన దుముకును బెరిగి
[illegible]

చూచినఁ జూచును వాలి చొచ్చినఁ జొచ్చును సమతఁ
గ్రాఁచిన శూరుఁడై చెలఁగెఁ గదనానఁ గమలాప్తసుతుఁడు. 396

రెండు భూధరములువోలె రెండు వారిధరంబు లట్లు
రెండు వరాహము లనఁగ రెండేచు మృగరాజులట్లు
రెండు వాహినులట్లు రెండు రెండు వార్నిధు లన్నయట్లు
దండి వీరులు పోరి రన్నదమ్ము లుద్ధత శౌర్యనిధులు. 397

వడ్లు దంపిన రీతిగాఁగఁ బటు ముష్టిపాత రావములు
గొడ్లు తొక్కిన రీతిగాఁగ క్షుణ్ణమై క్షోణిదేశంబు
గ్రుడ్లు వెళ్ళుక వచ్చునట్లు గ్రుద్దుచుఁ గుములఁ బొడ్చుచును
నొడ్లు నేరని రీతింగాఁగ నుద్ధత యుద్ధ పండితులు. 398

ఒక కొంతవేళకు డస్సి యుగ్రత యుడిగి సుగ్రీవుఁ
డకట! శ్రీరామబాణమ్ము నరుదెంచునం చెదు రరసి
యొక గడియయు నొక్క గడియ యురువేది యొక్క నిమేష
మొక నిమేషము నొక్కలిప్త యొకలిప్తయును జూడఁ జూడ. 399

అనుకొంచు రామచంద్రుండు నగ్రజుఁ డనుజుం డటంచు
ననుజుండు నగ్రజుఁ డన్నయట్లుగా నతఁ డితఁ డౌచుఁ
గను ముక్కు తీరును సంధిఘటన చంక్రమణ వైఖరియు
ఘన సింహనాదంబు నొకటెగా విడిగా నెఱుంగకయు. 400

నిస్తబ్ధుఁడై నిలిచిపోయె నిర్వ్యాజ నిభృతాననుండు
శప్తమౌ బుక్షరజసుని సద్భావ సంగతి మెచ్చు
చస్తోక మైనట్టి వారి యాకృతులందు సామ్యమున
మస్తకకంప మోహనుఁడు మహిజాత మానసపాళి. 401

ఇఁక నాఁగ లేక సుగ్రీవుఁ డెట్టెట్లో యింత నంతటను
చకితుఁడై పోరుచు నాశ సన్నమై జాఱిపోవంగ
నొక యింత నిల్వఁగా లేక యురియుచు నూడని బాడె
వికృతాననుఁడు వాలి విద్రిచి కవ్వించి నవ్వంగ. 402

ఖండాంతము

గీ. ఇద్ది నూపురఖండ మహిపరివృఢ పదాగ్రనూపుర! ముక్తీల యువనిపతికి
నీ సపత్నునామునకుఁ బండించిపెట్టు నవ యశోభూమి వంకసన్నాలు స్వామి!

ఉ. నా యెదలోన నుంటి వయినన్ వెనుచూడనులేదు కన్ను సా
ధీయము మంగళం బుభయ దృష్టి యెఱుంగదు కన్ను మిన్ను వాఁ
గై యెసలారు నీ శిరసునందలి తుంపురు గుంపు సోఁకి తం
డ్రీయొక చెమ్మ యింత ఘటియింపవె కంటికి వెన్కతట్టునేన్. 404

తోదకము.

ఆహృత సంయమి హారి తపోర్థే! యాహత నాద విహారి శిరోగ్రే!
మోహా వియుక్త విభూతి మనోభూ! ధీహృతి సంగత దీప్తి మహర్షీ! 405





# గజపృష్ఠ ఖండము

క. శ్రీయోజనాపగతమతిప్రాయశ్చిత్తాభిధాన! ఫణిరాజగ్రై
వేయ శిరోమణికాంతి వ్యాయామ విదీర్ణ కంధరాసిత కాంతీ!

మధ్యాక్కఱలు.

అవనతవదనుఁడై యనియె నంబురుహాప్త సుతుండు
తవిలి నీ బాణవేగమ్ము తత్పరతం జూచి చూచి
అవుర! నీవిచటఁ జాలవంచు నందునా యగ్నిసాక్షికము
నవు చెల్మి నీవు మన్నింప వందునా! అగ్నిహోత్రివయి. 1

గడియయు నిముసమ్ము లిప్తగాఁగ లెక్కలు చూచుకొంచు
వడి నాతనికిఁ జిక్కఁబోక బరిమీఁదఁ బాముగా శరము
విడిచెద విప్పుడిప్పుడని వ్రేఁగయి విహ్వాలించితిని
జడుఁడు పొమ్మని నన్ను జాలిచేఁ జంపక విడిచె. 2

ప్రభువై యతఁడు పాఱిపోయి ప్రాణాల రానిచ్చినాడు
నిభబలు డాతండు వెంట నేతెంచి యింతంతఁ గొని, శ
లభము వోలికఁ గాలరాచి లాఁచి యిలాస్థలిఁ బెట్ట
సభయుఁడ దిక్కేమి నాకు చాపశిక్షా నీలకంఠ! 3

వ. సుగ్రీవ పలాయనానంతరమున ఋష్యమూకగిరిశేఖరంబునఁ దత్ప్రస్తుత సమా
వేశంబున సుగ్రీవుఁ డిట్లు పరిదేవనంబు చేయ శ్రీరామచంద్రు డిట్లనియె.

గీ. ననుదురర్థము చేసికొన్నావు నీవు నతఁడునిను వెంబడించిన, నపుడె వాని
హృదయనిర్భేదముగ సంహరించియుందు సడలినవ్వేడువానిని జంపుటెట్లు? 5

ఉ. నీవు విచిత్ర చంక్రమణ నిర్భరవృత్తి మెలంగ నేను నీ
వే విను! వాలివంచు నెద నెంచితి నమ్మును దూసినాను కా
నావల నీవలై మెఱపులై చరియింపఁగ మీరలిద్దఱున్
నీవా యతండా యెవ్వరని నిర్ణయముం బొనరింతు వాలిగన్. 6

గీ. కవలు కా కింతయైన యాకారసామ్యమునకు మీ తల్లి కివియ నమోవచస్సు
లంతగా నామె స్వచ్ఛదివ్యాంతరంగ పొగుచుకొనె నెంతగాఁ బతిమూర్తి ముద్ర.

క. మీ తండ్రి ఋక్షరజసుఁడు చేతఃపావిత్ర్య పరమసిద్ధుడు కృతియున్
మీ తల్లి చిత్తశుద్ధి స్ఫీతహృదంతర పతిప్రవిష్టాత్మయునున్. 8

మధ్యాక్కఱ.

అనినంత సుగ్రీవునకును నానందమై బాధ మఱచి
తన తల్లియును దండ్రిదైన తపము నుత్తమము కొండాడ
మనుకులేశుఁడు లేఁతనవ్వు మసలఁగా మఱియు నిట్లనియె
నిను నీ వటంచు నే నెఱుఁగ నిజముగా నేరగావలయు. 9

వ. అంత శ్రీరామచంద్రుండు సౌమిత్రిం గాంచి యయ్యా! లక్ష్మణ! అడవియెల్లఁ గన్నులు విచ్చినట్లున్న యీగజపుష్పి గుర్తుగా సుగ్రీవుని కంఠమం దుంచుమన నతండు పోయి యాపూలు త్రెంచి మాలగా నిర్మించి సూర్యసూతి కంఠదేశమం దమర్చిన. 10

సీ. సిత బాలపత్ర భూషిత నాగవల్లి హారాకృతిఁ బ్రాఁకిన యతసివోలె
నిరుపేటగానైన శరదంబుధరరేఖ యల్లుకొన్నట్టి జాబిల్లి వోలెఁ
బుష్పాటవిం జొచ్చి పోవఁ దద్వల్లికారచిత హారము మృగరాజువోలె
సితబలాకా సమాశ్లిష్ట వర్షామిల త్సంధ్యా పయోధర స్వామివోలె
గీ. వెల్లకొట్టిన బురుజుల విభవ మెసఁగి దూరధాత్రి సంజ్ఞాతమౌ దుర్గమట్లు
కంఠగత గజపుష్పి ప్రకాశమానుఁ డంబుజాప్తసుతుండు వెల్లందగించె. 11

మ. మధుమాసోజ్జ్వల పుష్ప కేసర మిళన్మాంజిష్ఠ వర్ణుండు సా
రథి వీర్యేందిరకున్ శ్రమాపనయన ప్రారంభణోద్యోగి శై
లధునీ సంగతభంగ కుట్టమిత హేలా హేతు శృంగార వా
ర్నిధి మందానిలుఁ డేగుదెంచె సుమనోప్రాచ్చోరుఁడారాద్వనిన్. 12

క. శకలితమణి పార్శ్వచ్ఛవి నికాయముల కాణయాచి నిభృత తరులతా
ప్రకర దళోపరి సంశ్లథ చకితము తరుణాతపంబు జాలులుకట్టెన్. 13

గీ. బేడిసలు పైకి నెగిరెడు విమల వాహినీ విధంబున నిభృతముల్ నేత్రకాంతు
లురల హరిణీచయంబు వనోర్వియందు సాగెఁ గొంతులపైఁ దరుచ్ఛాయలాఱ.

చ. తన గజపుష్పిమాలఁగని తామరసాప్తసుతుండు కోర్కిమైఁ
దన మఱునాఁటిదైన కపిధాత్రిపతిత్వపు లక్షణంబుఁగా
దనరుట నెంచె నన్నియును దా రఘురామునకున్ వచించెఁ బో
ల్కిని వచియించి యుండినను గేవల మిప్పటికే ప్రభుండగున్. 15

మ. తొలి వర్షాసమయంబునం దసితవృత్తుల్ తాముగా నొచ్చుఁ ద
మ్ములకుం జేసిన కీడుమాపె శరదంభోదంబు లంతన్ మఱిన్
జెలిమిన్ నిల్పఁ దటాకరూపమున వచ్చెం ధాత్రికిం దాము ను
జ్జ్వలుఁడౌ రాజున కింతమాత్రమును సౌజన్యంబు లేదాయెఁగా. 16

క. హనుమంతుని సుగ్రీవుని కనులకుఁ గరయుగము నీడగా నిడి కనుచున్
వనిలో శాఖామృగములు తునిఁగి కనుచుఁ జనియె దూరదూరంబులకున్. 17

ఉ. వ్రాలి మనుష్య విస్ఫాలిత వాసన పట్టుచు గాలిపోట, శా
ర్దూలములున్ మృగేంద్రములు దూరపునేలఁ దొలంగిపోఁ దదు
ద్వేలములైన గుజ్జులు నుదీర్ణలతాహతి గుర్తుపెట్టుకొం
చోలి ఖగంబులుం గపు లొకొక్కఁడు పిల్పులు పెట్టుచుండగన్. 18

ఉ. తన్నెదిరింపఁగా భయగతంబగుచిత్తముతోడ వాలియున్
మిన్నకయుండె మొన్న తనమీఁద శరంబును వ్రాల కున్కి కిన్
దన్ను వధించు టెంతయు నధర్మముగాఁగఁ దలంచియుండు నం
చెన్నెనొ ధర్మసూక్ష్మము వహింపరు స్వార్థము పట్టుచోటులన్. 19

గీ అని తలంచుచు గాఢబాహావలీఢ ఘనభుజోత్తుంగ మూర్తియై చనియె స్వామి
యుభయపార్శ్వ వనీతరులూహచేయుచమ్ముతుదివాఁడి వ్రేళ్ళులనంటుకొంచు.

శా. శ్రీపుల్లంబులు గంధసార తరురాజి వ్యగ్ర చక్షుశ్శ్రవ
స్త్రీపూత్కార సమోద్గిర త్పరిమళ చ్ఛిన్నైక భాగంబుగా
శేఫాలీ సుమమాలికా విదళన స్నిగ్ధంబు కాంతార వీ
ధీ ఫల్గూచ్ఛలనంబు తావితెర యేతెంచెన్ సమాఘ్రాతమై. 21

గీ. అంచ దమరేందిరా గుంఫితార్ద్ర యౌవనం బనెడి పున్గుకాయ గంధంబు గుబులు
కొనఁగవిచ్చినయట్లుగా గుమ్ములగుచునొక్క పరిమళవీచికయొద్దువిఱిగె. 22

ఉ. అంచితమైన యా పరిమళానిలసంహతి వెంటనంటి తోఁ
తెంచెను కేళినర్తనగతి స్ఫురితామరలోక కామినీ
చంచల మధ్య తాళకృతి సంగతపాణి నటత్పదాంగుళీ
కొంచి వినూత్న రత్నమయ కంకణ నూపుర కింకిణీధ్వనుల్. 23

క. మొలనూలు పసిఁడిగంటల సలలిత మవ్యాప్తరవము చరణాబ్జయుగీ
చలిత నవకాంస్య కింకిణు లురివును మిను మన్ను గంగలో యనసాఁగెన్.

గీ. ఎలమిమీఱ దధీచి వెన్నెముక కథలు మధురమవు గొంతుసవ్వడుల్ మక్కళించి
పాల్కడలిలోనఁజిలుకుకవ్వంపుఁగొండయంచులురివుగాఁబాడిరి యచ్చరలును.

క. అమరాంగన యొక్కర్తుక యమరసభా దేశిరాగ మాలాపింపన్
గమలాక్షుఁడైన రాముఁడు కమలాక్షాంతముల నుంతగాఁ జెమరించెన్. 26

ఉ. ఏ విసురొప్ప వాలి వధియింపఁగ నేగిరొ మొన్న మొన్న నీ
త్రోవనె రానులే దెడమఁ దోఁటను జూడనులేదు తచ్ఛిఖా
కేవల నిర్గతంబులయి గీతిసుధల్ కలితాప్సరోజన
శ్రీవిభవాత్తభూషణవిశేష నినాదములున్ స్ఫురించెడున్. 27

శా. ఆ మిన్నందునఁ బక్షి యాడదు గరుద్వ్యాపారపారీణమై
యీ మన్నందున జంతువుల్ తిరుగ వాహిండక్రియాదక్షమై
భూమీజంబుల శేఖరాళి నటదంభోదంబు మార్దంగిక
శ్రీమీమాంసక గర్జల న్నెఅపుఁబో నృత్యానుకూలంబుగన్. 28

శా. ప్రాతఃకాల తుషార ధూసరరుణ మృత్రపత్యంత భూమీధరో
త్థాతక్రీడన రమ్యకానన కరీంద్రారక్ష మాంజిష్ఠమై

యాతోద్యస్వన రమ్యమై యెసఁగె సంస్యంద్యండ వేళా మరా
శీ తీవ్రోదర వర్ణమై పరినటల్లీలాంబువాహం బొగిన్. 29

శా. తాచ్ఛీల్యప్రవిభాస్వరంబుగ సముద్యద్రూపమై యేకదే
శచ్ఛత్రంబుగ నేకదేశ పటహ స్కంధంబుగా నేకదే
శచ్ఛిన్నాంబుకణాత్త మౌక్తిక సరస్సంవ్యాన భృత్కాయమా
నచ్ఛాయంబుగ నందముల్ వెలిచెనన్నా! వారివాహం బొగిన్.

గీ. ఓయి సుగ్రీవ!యీతోఁటయునికి చూడ మనికి చరితార్థమైనట్లు మది కరంగు
నిచ్చటి విశేషమేదియో యెఱుంగఁ జెపుము తిరుగ నీదారిరాఁబడదేమొ మఱల

వ. అనిన సుగ్రీవుం డిట్లనియె, ఓయి రఘుప్రవీర! యీ వనంబెల్ల నీ సప్తజ
నాఖ్యులైన ఋషులయు మతంగ మౌనియు మహత్త్వంబున నిత్యవసంతంబు.
ఇది తుది గ్రీష్మం బయ్యును బంపాసరస్యాదిఁ గిష్కింధాంతము వఱకు నీ
వనంబెల్ల వసంతర్తువే. 32

మ. శతవర్షంబులుగాఁగ స్వర్గపదవీ సంప్రాప్తులైనారు స
న్నుతులై సప్తజనాఖ్యులైన మును లిందున్ వారు మున్నాశ్రమ
స్థితియై యుండి రథశ్మిరుల్ పరిణతశ్రీకుల్ తపోభాగసం
గత నానా మహిముల్ తపోవన కృతాకాంక్షామహశ్లాఘ్యులై. 33

ఉ. వారు త్యజించిపోయినను వారి తపోవన దేశ మీదృశో
దార విచిత్రభోగమహితంబయి యొప్పుచునుండు నిద్ది యె
వ్వారికి నప్రవేశ్య మొకవంకను జొచ్చిన వేఁడు సాహస
ప్రారభమాణుఁడై తిరిగివచ్చుట యన్నది లేదు రాఘవా! 34

ఉ. ఈ పరమర్షి దేశమున కెత్తిన జోతలుగాఁగ మస్తకా
రోపిత హస్తయుగ్మునకు రూపముపొందున యెల్ల కోరికల్
దీపితభక్తివై యనుమతింపుము నీవును రాఘవా! ధర
న్నోపిన శీర్ష మెత్తు నదనుంబడి సర్వశుభంబు లాడెడున్. 35

గీ. అనిన రాముండు మొన్ననీయధ్వముననె పోయితిమొయన్న నిట్లనే పోతిమనినఁ
జూడు మద్దాననే కపిక్ష్మోణిపతివి నా సఖుఁడ వీవు నేఁడు నైనావు కావు. 36

ఉ. మిత్రజనానుకూలుఁడు నమేయభుజాబలశాలియున్ ససౌ
మిత్రి రఘూద్వహుండు ఋషిమేదినికిం దలవంచుచున్ నమ
ద్గాత్రుఁడు నంజలించె ఋషికానన నిర్గమితాప్సరో వధూ
మాత్ర పరిస్ఫురద్విస్మృత మంజులగీతిక లాలకించుచున్. 37

శా. అంతన్ స్నాతుని యజ్ఞపూరుషుని చూడాంతంబునా నాశ్రమ
ప్రాంతాకాశ పథాంత రాజ్యకృత ధారాపూత సాన్నాయ్య వ
ర్గ్యంతాసారిత ధూమరేఖ చెలఁగెన్ రాజీవనేత్రంబులన్
శాంతం బద్భుతముం బెనంగొన రఘుస్వాముల్ విలోకింపఁగన్. 38

శా. అధ్వం బంతటఁ గోమలాతప సహంబై పార్శ్వభూమీలతా
సాధ్వారామమునై మనోజ్ఞకదళీ సంచారరమ్యంబునై
ప్రధ్వస్తశ్రమవారివాహ నివహోపాత్తంబు శీర్షంబుగా
మాధ్వీక ప్రసవోపరి ప్రవిచలన్మందానిలాపూర్ణమై. 39

క. కనుచూపుమేరఁ గనిపించెను కిష్కింధాపురంబు ఛిన్నద్రుమ ధా
త్రిని భూధరకందరధాత్రినిఁ బటువానరచమూ ప్రదీపితధాత్రిన్. 40

వ. అంతఁ గటిబద్ధోత్తరీయులు సజ్యకార్ముకులు యుద్ధసన్నద్ధులైన రామలక్ష్మణులం
గాంచి సుగ్రీవుండు సింహనాదంబు చేసిన. 41

మధ్యాక్కఱ.

తమతమ పనులలోఁ గపులు తలలెత్తి తా ర్వెనుదిరిగి
కమలాప్తతనయుండు సింహగర్జన కావించు టరసి
యమరేంద్రసుతునకుఁ జెప్ప నరిగినా రందు గొందఱును
కమలాప్తకులులను దవ్వుగాఁ జూచి కదలి రందఱును. 42

వ. మఱియు సుగ్రీవుం డిట్లనియె. 43

ఉ. ఓయి మహాప్రభూ! రఘుకులోదధి పూర్ణశశాంక! వచ్చినా
మీయెడ కీర్తి యింద్రజ కపీశ్వరగుప్తము వానరోగ్ర సే
నాయుత రక్షితంబు నిఖిలాసుర దుర్జయమౌ పురంబు న
న్నీ యెడ కీవు తెచ్చితివి నేనె భవత్పరిరక్ష వచ్చితిన్. 44

క. తననేర్చిన విద్యంగాకను నితరోపజ్ఞకంబు కళ నాధారం
బునుగాఁ గైకొని కయ్యంబునకుం గాల్దువ్వువాఁడె మూర్ఖుఁడు ధరణిన్. 45

శా. తాదృఙ్మార్గశిరోవతంసమను నాథా నన్నుశాసింపవే
కోదండోగ్రశరాభిపాతమున నాకుం దెన్ను చూపింపవే
నీ దీప్తోరుశరంబు సాగర హిమానీశైల పర్యంత ధా
త్రీదర్పప్రవిభేదనోగ్రము మదారి ప్లోషణేషుచ్ఛటా! 46

క. ఈసారికూడ సామీ! భాసురముగ గుర్తుపట్టఁబడకుంటిని బో
నీ సుగ్రీవునకు జలము చేసేతన్ వదలుకొమ్ము చేతః ప్రభువా! 47

శా. సేసిన్ రక్షణచేసికొందు గజపుష్పిం గంఠమం దో ప్రభూ!
సాగించుం గుదియించుఁ గర్షణ విధాచండుండు నవ్వాలి బా
హాగోళంబుల దండ త్రెంచిన నతం డౌదేను గుర్తింప నీ
ప్రాగల్భ్యంబును నా యదృష్టము ద్విధాపర్యేషణాదుష్టమై. 48

మధ్యాక్కఱ.

ఆవాలి వచ్చెడులోన నాశ నిరాశలు తేల్చు
మావిష్కృతదయాసముద్ర! యంబుజాతాక్ష! శ్రీరామ!

నీవు నన్నేమొ యాదుకొని నిజముగా నిలువ నెంచెదవొ
నీవు కేళీ విలాసివి వనీదేశ నిర్యాతుఁ డైతొ? 49

గీ. వేగ నా చేతిలోఁ జేయువేసి కాని నేను బోనయ్య ప్రియసఖా! నేను బోను
కాదయేనియు ఋష్యమూకంబు గలదు పరమ మునిదత్త వాలిశాపంబు కలదు.

మ. అనినన్ శ్రీరఘురామమూర్తి దరహాసాంకూర మాస్యాంత సం
జనిత జ్యోత్స్నయుగా శశాంక వదన చ్ఛాయాసనాథంబుగా
ననియెన్ నమ్మకమన్నయట్టి దినుసాహొ! స్వచ్ఛమైకూడ నే
చిన వక్రంబగు సన్నివేశమున వంచింపంబడున్ స్వచ్ఛతన్. 51

గీ. మొన్నఁ జంపక పోవుటయు న్నిజంబు బాగుగనె యున్నయది సుమీ వాలితార
చేతవారింపబడవచ్చుఁ జేతమందుమఱియునూహించుకొని, పోరుమానవచ్చు. 52

చ. పగ యెదఁ దీసివేసికొని భ్రాతృత నిన్ యువరాజుఁ జేసినన్
బగయె ప్రధానమా మనకు వానరరాజ్యము నేలనిమ్ము తాఁ
దెగి కపిసేనతో నెదురుతీర్చిన లక్ష్మణు చేతిలోపలం
దెగునది నేను వాలిని వధింతును నీకును రాజ్య మేర్పడున్. 53

శా. ఆలోచించి పొనర్ప రే పనియు మోహాగ్రస్తులై జీవుల
వ్వాలిం జూచిననైన నల్లె కనిపింపంజొచ్చెఁ గానిమ్ము యా
గోలాంగూల ధరాతలేశ్వరుని మత్కోదండ నిర్యచ్ఛర
జ్వాలా దగ్ధశరీరుఁ జేసెదుదెసన్ సందేహ మేలా పడన్. 54

ఉ. నీ వాకవేళ మెత్తపడి నీదగు నన్నయెడన్ సమార్ద్రుఁడై
కావు మటంచు నన్నడుగఁగా జెలికారముచేఁ గృతాఘునిం
గావక తప్పదంచు నెదఁగ్రాఁగుచు నూహ పొనర్చుచుంటిఁగా
నీ విను నీ కొసంగుటకు నేలను నమ్ముమ గ్రుచ్చియుంచితిన్. 55

శా. మందేహారుణ రక్తదిగ్ధము దివామాంజిష్ఠ భోగంబు మే
లొందన్ వేచెదు నగ్నిహోత్రివలె ని న్నూహింతు ని న్నింకఁజే
రుం దీరంబునుబోలె రాజ్యరమ ఖర్జూ దుస్సహోర్మిల బా
హాం దేవాధిపసూతిఁ గర్కశమతి వ్యూహాత్మమన్నింపకన్. 56

గీ. ఇంతలోఁజూచెదవు నవాసృక్ప్రహితుని ధారుణీశయాను నతని సంధ్యామహోగ్ర
నటమురజనిస్వనము సింహనాదమునకు నిలువెడలివాలియేతెంచు నెంతలోన.57

వ. అనిన సుగ్రీవుండు దిగ్భిత్తికల బెత్తిక లాడివడ రణాహ్వానంబు సేసి కిష్కింధాద్వారనికటధాత్రి కేగి శ్రీ రామచంద్రాదులు వృక్షాదులుచేతఁ దిరోహితులై ప్రతీక్షించుచుండ. 58

గీ. వాలి సుగ్రీవకృతము రావంబును విని మండిపడి లేచి యీ సిగ్గుమాలినతని
వేగ వధియించి కాని యీ విసుగు తెగదటంచు నడుమునఁగానె బిగించికట్టె.

క. సన్నద్ధంపడఁదారయుఁ గన్నుంగొనలందు భీతిగా నిట్లనియెన్
మొన్న విఱిగి దిక్కఱి తాఁ జన్నయతని నేఁటిరాక చను హాస్యంబై. 60

గీ. అనిన వాలియు నిట్లనె నంబుజాక్షి! యోడిన కొలందిఁ గొందఱ యురిసిపోక
యిట్టులేయుండుననఁ దారయిట్టులనియె మున్నునినుయుద్ధమాడ రాఁబోనివాడు.

శా. ప్రాంచన్నీతి పథ ప్రమాణధిషణా భావుండు తానై విచా
రించున్ జేయకమున్న సర్వమును సుగ్రీవుండు నీ ముందుఁ దా
నంచున్ నిల్వఁగలే డెఱింగియును నేలా వచ్చె గర్వించుచున్
గించిత్తైనను జేయఁడాతఁడు వృథాకృత్యమ్మనుత్యంబుగన్. 62

గీ. మొన్న లేదా విచారణ నిన్న నేఁట వచ్చెనా యన్న నామొన్న వచ్చినపుడె
యద్ది యున్నది యున్నదం చంగదునకు నీల నలతారు లాడిన నీ వెఱుఁగుదు.

శా. ఆయేదో యది మొన్న నేమిటికిఁ జేయంజూడలేదన్న న
జ్ఞేయం బేమి ఘటిల్లెనో యచట నీ నేఁడీ గతిన్ వచ్చుటే
యాయేదో కలదన్నమాట ఋజువౌ నా రాముఁ డారామ వృ
క్షాయాతానిల పోతముల్ సయిత మాహా యూఁదు దచ్ఛౌర్యముల్. 64

మ. మునువిన్నాము భార్గవుండయిన రామున్ విన్న రామాహ్వయం
బునఁదచ్ఛౌర్యము శైవభక్తియు మనంబున్ ముట్టి మెచ్చించు, నీ
తని పేర్విన్న హృదంతరంబున విచిత్రంబైన యాకర్షణం
బును దీపించెడుఁదత్స్వభావము మనంబున్ దాఁటు నూహింపఁగా. 65

మ. మఱియున్ నీవునుగాని యెవ్వఁడయినన్ మన్నింతువే వానిపై
నఱుకంబోయియ యుందు వీవఱకె యా యుల్లోక సౌజన్య వి
స్ఫురితాత్మాఖ్యుఁడు రామచంద్రుఁడు మఱిన్ సుగ్రీవుతో మైత్రికిన్
దొరకెన్ వానియదృష్ట మండదొరకెన్ దూకెన్‌సమిద్భూమికిన్ 66

ఉ. అకడ రామశౌర్యమహిమాదుల మాట యటుండనిమ్ము యి
క్ష్వాకుల బిడ్డ యాతఁడు రసాతల సర్వదిశాభిరక్షు లి
క్ష్వాకులు సూర్యదీధితి భవంబగు తేజము జీవలోక ధ
ర్మాకృతి పూర్వకల్పనిభమై స్మరియించిన నాఁటినుండియున్. 67

ఉ. ఈయనయేమొ సూర్యులకు నెల్లర కాదిమ సూర్యుఁడైన య
ట్లాయతధర్మమూర్తి ప్రభువై పితృవాక్యరహస్యచాలనం
బై యరుదెంచెఁబో స్మృతిగతార్థము స్పష్టము చేసినట్లుగా
నాయెడ వేదమార్గముల కరము చెప్ప మహారికలుండె. 68

ఉ. తాదృశులైనవారలు వృథా ధరణీతలరాజ్య మేటికిం
గాదని వత్తు రెచ్చట నికామ మధర్మము గూడుకట్టె నా
పాదులు పెల్లగించుటకు వత్తురుగాని యధర్మలక్షణం
బాదిమమూర్తులా ప్రభువులైన నెఱుంగుదు రంతియేసుమీ. 69

శా. లోకం బాపని యీా పనిం బొనరుచున్ లోకుల్ ప్రమాణంబుగా
నాకార్యంబులె ధర్మమంచుఁగొని దేశాచారమైనట్టుల
స్తోకంబౌ పరిపాటి ధర్మమని యెంచున్ ధర్మమో నిత్యమో
క్షాకారాభిముఖంబుగా నడచు జీవాద్వైక సూక్ష్మస్థితిన్. 70

శా. ఆ రాముండును దొల్తగా నిటకు రాఁడాయెన్ సఖిత్వంబు నీ
తో రాణింపదు, సూర్యసూతికది యే త్రోవన్ లభించెన్ మహా
శూరుండాతఁడటంచు నెవ్వడు వచించున్ నిన్నుఁగాదంచు నౌ
రౌరా! కర్మపథంబు నిట్టిదని యేర్పాటున్నదే యిద్ధరన్. 71

మ. అతఁడేమేమి వచించెనో యవియ యాథార్థ్యంబు లన్వించు స
న్మతియున్ దొల్తగ విన్న దాన నభిమానంబూను, నీకున్ నిరా
దృతి, నీపై యనుకొన్నదే నిజము, సుగ్రీవుండునుం దోషిగా
మతికిం దోచిన దంతియే యతని యేమాట న్నిజం బెన్నకన్. 72

ఉ. ఊహ యొనర్ప మంత్రబల మున్నది పెద్దయు సూర్యసూతికిన్
బాహుబలంబు నున్నయది పండితలోక శిరోవిభూషణం
బా హనుమంతుఁడుజ్జ్వలమహోమతి తానె రఘు ప్రవీరుతో
స్నేహము కల్పియుండును గణింపవు నీవు మఱంత వానినిన్. 73

ఉ. భ్రాతృత నిల్పి వాని యువరాజ పదంబును వానికిచ్చి ధా
త్రీతలనాథుఁడైన రఘుదేవుని రాకయె నేరనట్లుగా
నీతిని నిల్పునిన్నును గణింపడు నీవు గణింప వాతనిన్
సీతను బొంద నింక నెదిచేయునొ కాననవీథులన్ బడిన్. 74

మ. మనమున్ వారి విధాన నుంటిమికదా మాటాడి యూహించి ధీ
ఘనమౌ మానవవృత్తమున్ నడిపి శాఖావృత్త మొక్కండు క
ల్గిన దోసాన మృగాల మౌదుమె శరక్రీడాసమారూఢ దు
ర్జన రేఖావ్యసనుండుకాక హితకార్యక్లేశవృత్తుండునై. 75

ఉ. నీవు కులాచలేంద్ర సమ నిశ్చల దేహబలుండ వద్రి నీ
పై విసరన్ మఱిం గదలఁబాఱవు తాదృశుఁడయ్యుఁగూడ నో
హో వెస సప్తతాళదళనోగ్రము బాణము నెంచ గుండెలో
నావులు తేరు నిల్వగలవా! రఘురాముని యంపఱివ్వనన్. 76

శా. నీవే యుద్ధము చేయఁబోయినను గానీ నేను భీతిల్ల సు
గ్రీవుల్ వందలువచ్చినన్ భయపడన్ శ్రీరాముఁడచ్చోట నే

దో వృక్షంబును జాటుచేసికొని దూయున్ బాణ మేవేళనో
యా వేళ న్నినుఁగాచుకోఁగలుగు నూహంజేయలేనయ్యేదన్. 77

శా. ఏదైవంబులు వచ్చి సాయపడఁగా నేనివ్వడర్థింతు నా
నా దైవంబులు మూటకట్టికొని యైనాడా మహోస్వామి వెం
పేదం బౌరుష మాశ్రయించి చనఁగా నేమౌను శ్రీరాఘవుం
గోదండోగ్రుని ముందు నిల్చుటకు నీకున్ సాధ్యమా చెప్పమా. 78

శా. ఏనొక్కండు వచింతు నిశ్చితముగా నేర్పాటుగా శౌర్యపా
రీణంబైనది వచ్చి పిల్చినది సుగ్రీవుండె యా వెన్క నేఁ
డో నారాచనిగూఢుఁడుండికద యా యూఁతంబడిన్ వచ్చెఁ దాఁ
గానన్ వాని నెదుర్చు మూఁతను బరిష్కారంబుగా సర్వమున్. 79

మ. ఇవి రెండే తుదకున్ వినిశ్చితములై యేపారు సుగ్రీవునిన్
యువరాజుం బొనరించి శత్రుతకు స్వస్త్యుత్క్రాంతులం జెప్పటో
ప్రవిభక్తంబగు శౌర్యదీపనముగా రామున్ ఘనశ్యాము నా
హవ రంగంబునయం దెదుర్చుటయొ వీరానీకసంశ్లాఘ్యమై. 80

మ. అదియున్ నీకును రామచంద్రునకుఁ బ్రత్యక్షంబు వైరంబు లే
దెదురై పోరఁడు దాన రాముఁడటులే యౌవున్, మఱే చెట్టునో
మదుగై నిన్ను వధించు దాని కదియున్ మర్యాదయై పొల్చు తా
నదియే హేతువుగాఁగ నీవతనిమాత్రై పోరవచ్చుంజుమీ. 81

క. ఈ మాటలు సుగ్రీవునితో మాటాడుము బహిర్గతుం డగు నతఁడున్
రాముండేమనునో సుత్రామసుతా! యిట్లు పోవఁదగ దెవ్వరికిన్. 82

గీ. అనిన వాలి మందహాసాస్యుఁ డిట్లనె నింత సూక్ష్మబుద్ధి నెవరు చెప్ప
రైన నింతకంటె నతిసూక్ష్మమున్నది తగవు నీకుఁ జెప్పెదను లతాంగి. 83

ఉ. ఏనెదిరింతు నాతని సరే యెదిరించుట లేదు చూడ, నే
నైనను మల్లహస్తముల నాహవ మాడుదుఁ జాపహస్తుఁడై
తానెదిరించు నన్నతఁడు దానికి దీనికిఁ బొత్తులేదు వి
ల్లేనును బూని యేగ నతఁడెక్కడ నెక్కడ నేను తన్విరో. 84

శా. నాకోసమ్మతఁడేమొ మల్లుని విధానన్ వచ్చునా దూరమం
దే కోదండవినిర్గతాశుగములన్ దీర్యత్తనుం జేయుఁగా
దీ కైపట్టులఁ బట్ట రమ్మనుదునా యెవ్వాడునున్ స్వస్వభా
వైకొన్నుఖ్యము నాయుధంబున సపత్నానీకముం దూల్చెదున్. 85

చ. అతఁడఖిలాస్త్రవేది యొకయమ్మున ఝంఝును బెట్టునో సమా
హిత లయహ్ని కూర్చునొ మహేంద్రుని బ్రహ్మను సంతరించునో
యతనికిఁ జాపపాణికెదురై చనుటన్నది లేదు మల్లుఁడై
యతఁడును రాఁడహో యసమమైనది యీ విషమంపుఁ గార్యమున్. 86

క. నా కస్త్రబాధ యన్నది లేకుండఁగ వరములైన లే, వాతనికిన్
జేకోఁ గైకోను శరాళీకృత గుంఫన మెడమ్ము లేదు లతాంగీ. 87

ఉ. దుందుభి ముఖ్యరాక్షసులు దోర్బలసాధ్యులు వారి వేగమం
దొందు నెడమ్ము నిర్మథనయోగ్యముగా మఱి శక్తి క్షీణతం
జెందును గొంతసేపటికిఁ జెందదు నా కధికత్వ మద్దియై
పొందును రామునందదియుఁ బొందెను నా కధికత్వ మొప్పనే.

ఉ. అతని సప్తతాళదళనాత్మక దుందుభి కీకసోగ్ర మా
లాతను ధూననాత్మక విలాస మహాబలకార్యముల్ వినం
జేతమునం దతండు పయి చేయిగ నెంచితి నాకు మల్లయు
ద్ధాతతకేళి నిత్యకలితాభ్యసనం బొకఁడున్న దంగనా! 88

గీ. పైని నెగిరి నల్గడ దూఁకగాను గలను జేతులకుఁదోడు వాలమ్ము చేతఁగూడఁ
గర్షణాకుంచనంబులు గడపఁగలను నఖములం జీల్పఁగల నెలనాఁగ నేను. 90

మ. సమయుద్ధానఁ బరాజయంబొ జయమో సంధిల్లు దుఃఖంబు లే
దమరేంద్రాత్మజుఁడై మృగంబువలెఁగట్టా! బాణపాతంబుచే
త మృతింజెందుట కష్టమైనయది యింతన్ వాఁడు సుగ్రీవుఁ డీ
సమరోదంతము తెచ్చిపెట్టినది నేఁ జంపన్ వలెన్ వానినిన్. 91

క. నే గుహలో నున్నప్పుడు ఆ గుట్టలు పేర్చి కందరా ముఖమందున్
దా గురు పీలిగినాఁడని వేఁగి యెడఁద గ్రుమ్గెనంట వీఁడఁట బళిరే. 92

క. మృగములకును మనుజులకును దగు భేదము బుద్ధిబలము తగ బుద్ధిబలం
బగుపడియెడు మనయందున మృగబుద్ధింజేయు టేమి మేల్ రఘుపతికిన్ 93

క. నిన్నొక్కఁడు బోరికి రమ్మన్నను నీవెనుక నున్న యాతని మును ర
మ్మన్నను మును నాతోరా! నన్నీ వెదిరించి బ్రదికినం జూతు ననున్. 94

గీ. గొంతులో నాకుఁ బ్రాణ మున్నంతవఱకు వీనిచే నంతమాట యన్పించుకోను
అతనినెదిరించుటన్నది యసలులేద యీవెలితిమాటయేటికే యిందువదన.

ఉ. రాము నెదుర్చు టాపగిది రాజముఖీ! యది యెట్లొ చెప్పితిన్
రాముని నేస్తు వాని యువరాజుగఁ జేయుటయన్న దెట్టిదో
నీమది నీగ చూడు, మతనిన్ యువరాజునుజేతు నిన్ను ర
మ్మా మనలోపలన్ మనకు నంత విరోధ మదేల నన్నచో. 96

మ. అతఁడేమంచు వచించునో తెలియునా? యన్నన్న యెన్నాళ్ళ కీ
మతి సౌభ్రాత్రము ప్రేమ యొడ్డిగిలెడున్ మాయన్న యేమన్న మ
న్న తినున్ నాఁడును నేఁడటంచు నెఱచిందుల్ ద్రొక్కుఁబోరాడఁ బి
ల్చితి నీవో మఱి నేనొ యంచుఁ బలుకున్ లేనట్టి శౌర్యంబునన్. 97

క. వానిని నేను నెఱుంగుదు వానిని వీవెఱుఁగుదువును వాఁడా! చలముం
బూనిన బ్రహ్మచలం బది మానిని! మా జన్మకింతె మది వెఱపేళ్లా. 98

శా. ఆ యీ చెప్పిన యెల్లన్యాయముల వైయర్థ్యమ్ము చూపింపఁగా
నే యుద్ధంబున కేగుటొండె మిగిలెన్ నీవింక నేమందు విం
తై యాశాంకుర మొక్కఁడున్నయది తానై రాముఁ డన్యాయమున్
జేయం బోడను నమ్మకంబు మఱి యా స్నేహం బికేమై చనున్. 99

గీ. ఎంత యాలోచనముచేసి యంతమునకు నద్దియే నిశ్చయంబన, నంబుజాక్షి
తార ప్రాభాత హైమపాతమున సరసిఁ బోలెఁ జెల్వేది పరిదీనమూర్తి యగుచు.

వ. ఆవురుమని కుప్పగూల వాలి యామెనెత్తి కవుంగిలించి యోదార్చి. 101

మ. సమరాహూతుఁడ నౌచు శూరజన భాస్వద్ధర్మముం బుణ్య ము
త్తమముంజేయఁగ నేను పోవుతఱిఁ జింతంబొందు టేలే సకీ!
భ్రమ బేల్పోకుము నొక్కబొట్టు నిడ నాపై నొట్టు కన్నీటి ము
త్తములం జేర్చుట వీరపత్నికి నుదాత్తశ్రీ కయోగ్యంబగున్. 102

వ. అనిన తార యతనికి సమంత్రంబు శ్వశ్రేయసంబాడి ప్రదక్షిణించి గవనుద్వా
రముదాఁకఁ దోడు నడచి దుఃఖమూర్తి యంతిపుర మేగిన నిట సుగ్రీవాదులు
వాలి తడయుటకుఁ జాలదవ్వ ప్రతీక్షాతీక్ష్ణులయి వెక్కసంపడుచు నతండు రా
వ్యగ్రతం గన్న వాలి యుత్తరీయంబు బంధించి నిశ్చల పురోన్యస్త దృష్టియయి
నడచుచు సుగ్రీవు ముందరఁ గాంచి యుఱికి యిట్లనియె. 103

క. ఈ యొక్క ముష్టిఘాతము తో యమలోకమున కేగుదు దురాచారా!
నా యేకోదరుఁ డగుటకు నా యెద నిప్పులను బెట్టినావు దురాత్మా! 104

క. అనుచున్న వాలి కన్నులఁ గనఁబడియెన్ రామబాణ కథ సర్వంబున్
దనుజారిసూతి యెఱిఁగిన సునిశిత తీవ్రత్వ మెల్ల సుగ్రీవునకున్. 105

క. ఆ ముష్టిఘాతమునకున్ రాముం డెదఁ దల్లడిల్లె రవిసుతు ప్రాణ
గ్రామమ్ము దక్షిణేశ గ్రామము పొలిమేరలందుఁ గదలునొ యంచున్. 106

చ. గిలగిలలాడి యంతఁ బయికిన్ జనుదెంచెడు వాలిఁ దప్పకోఁ
దెలిసి ప్రచండుఁడై నికట దేశమునందలి పెద్ద వృక్షమున్
జలమునఁ బీకి వాలి నొక చాపున మోదిన వాలి తూలి వి
హ్వలుఁడయి యిద్దఱిద్దఱు మహోగ్రహవృత్తులు క్రూరచిత్తులున్. 107

వైతాళీయము.

ఎగిరియెగిరి పోళి మార్గముల్ చిగిరిచి చిగిరిచి చీల్చుకొంచునున్
తగిలి తగిలి దండనోగ్రులై రగులుచు రగులుచుఁ బ్రౌఢవహ్నులై. 108

ఆపాతలిక.

కడఁగి కడఁగి క్రమ్ముదు రుగ్రుల్ సుడియక సుడియక చొత్తురుదారుల్
కడచి కడచి ఘాతలు గాఁగన్ బొడుతురు విడుతురు భూరిభుజోగ్రుల్. 109

మహాస్రగ్ధర.

గజమున్ వ్యాఘ్రంబు రెండున్ గదిసి మలగి ఘీంకారగర్జావియద్దే
శ జర్రదేఖాపథంబై చటుల కర నఖోర్వా మహాకర్షణాస్ప
క్ష్మిజనిక్రూరవ్రణంబై వన జగతిఁ బ్రతిధ్వాన దర్పోద్ధతంబై
గజమొగ్గన్ వ్యాఘ్రమిగ్గన్ గదనమొనరుచుం గాఁగ సుగ్రీవవాలుల్. 110

లయగ్రాహి.

ఝొమ్ములను గ్రుద్దుచును గ్రుమ్ముకొను బాహువుల
గ్రమ్ముకొను చిద్దఱు గజమ్ముల విధానన్
జెమ్ముకొను కండలుగ దిమ్ముకొను పోటులుగ
దుమ్ము దివిలేచు పెనుదొమ్మి చెలరేగన్
సమ్ముఖము వేచుచును ఝుమ్ముమని హుంకృతిగఁ
గ్రుమ్మి పెనుగర్జగ నభమ్మొగురు చట్లొ
క్కుమ్మడిగఁ బర్వతబలమ్ము మృగరాజుల చ
లమ్ము గొని పోరిరి బలమ్మినుమడింపన్. 111

లయహారి.

పిడుగు లురలినగతిని బొడుచుచును నడఁచుచును
బెడిదముగ విదలుచుచు విడివడని పట్టున్
నడగిరులు వెడదరులు విడులుకొను పెనుగరుల
సుడివడిన యులివులను బొడుచుకొనురీతిన్
దొడలు తొడలు విఱుచుచు మెడలు మెడలు విఱుచుచు
నొడలు నొడలు కుములగఁ బొడుచుచు మహోగ్రుల్
విడివడిన కనలు వెలువడిన పెనుపరిచలము
కడవ నొకఁడొకఁడు పెనవడినగతి పోరన్. 112

ప్రహేయము.

అమరపతిసుత ప్రాలంబబాహు భ్రమణచటుల ధూఃపాతంబు క్రాలన్
కమలపతిప్రసూకాయంబు గ్లానిన్ జెమరిచి కలఁగెన్ జేతంబు తూలన్. 113

స్రగ్విణి.

వాలి బాహామహాపాతనోగ్రత్వమై తూలి సుగ్రీవుఁడున్ దూఁగలే కాహవా
ఖీలదంగంబునన్ బిట్టుగా నొడ్డుకొం చాలమున్ జాగుచేయన్ ఫలాకారుఁడై.

త్రిభంగి.

బలి, కపిపతి, కరతలమునఁ జమరఁగ, బలముఱి యంతట
సుగ్రీవుఁ డవగ్రీవుండయి దుగ్రీ
తులు కళవళపడఁదొలఁగుచు మలఁగుచు ఫలపఱచెన్ మఱి
వాలిన్ ధృతిమాలిన్ సంగరకేళిన్

నిలచిన యదనున నిలువక పదమున, సలలిత వేగ గ
తుండై వినయుండై హోసరతుండై
కలఁచును వెలుచును వెలిఁజను బలమగు పోటులు
తప్పన్ జవమొప్పన్ లాఘవ మొప్పన్. 115

శా. శ్రీరాముండును దూరమందునవె సుగ్రీవున్ విలోకించి బా
హోర్యాక్షత్వము సన్నగిల్లి రిపుబాహాఘాతముల్ తప్పఁకొం
చారూఢిన్ లఘుభావ లంఘనవిధా వ్యాజత్వ మొక్కండె యా
ధారంబై రణభూమి నిల్చెనని చిత్తంబందు దీపింపఁగా. 116

మ. ప్రభుహస్తాంతమునన్ దిశా గగన కంపం బుద్భవిల్లెన్ మహా
బుభులోకంబులు తల్లడిల్లె భయసద్రీచీనముల్ హీణముల్
రభసారావ విదీర్ణకర్ణకుహర ప్రాంతమ్ములై దిగ్గజ
ప్రభువుల్ మొగ్గతిలం బడెన్ రఘుపతి ప్రౌఢోగ్ర మౌర్వీధ్వనిన్. 117

ఉ. కామ నికామ భావమును గర్వగుణం బభిమాన మింద్రియ
గ్రామమునం బ్రభుత్వమును గల్గఁగఁజేయు నొకొక్క యప్డు శ్రీ
రాముని చండబాణ గుణ రావము దిక్కునఁ జూడలేదు సు
త్రామ సుతుండు వాలి పటు దర్పమహోగ్ర విలోచనాంతుఁడై. 118

ఉ. ఆ శర మిట్లు వచ్చెనని యైన నెఱుంగఁగ రానిమట్లుగా
కీశ ధరాతలేశ్వరుని కేవలవక్షమునందు జొచ్చె ఘో
రాశనిపాత మంత పటువై చనుదెంచద యంత వేదనా
వేశము నూన దంత పరివేగము తాల్చద యంత కాల్చదున్. 119

గీ. ఒక మహాశనిచేఁ గనకోర్వీధరము సానువున వ్రయ్యలై ధాతు సంగతారు
ణాంబువులతోడి బుగ్గ పెల్లార్చి కొట్టి నట్లు కనిపించె వాలి మహాపఘనము. 120

గీ. ఎఱ్ఱవెన్నెల లుమిసెడు హిమనవాంశు బింబ సంగతై రావణ విమలదంత
మూడి పడినట్లుగా ధాత్రి నొప్పె వాలి శ్రమ నవాసృగ్ధలాఘుకర్దమ తనుండు.

గీ. వాలి ధాత్రిప్రపతితుఁ డుజ్జ్వలుఁడుతోఁచెఁబడియుగా నొక్కచోటనేర్పడిననీట
నింపుమీఱ నేకాకియౌ నెఱ్ఱ కలువ యూఁటిచనిన గంగానది యొడ్డువోలె.

గీ. మఘవదత్తము మౌక్తిక మణిసరంబు వక్షమునయందు దీపింప వాలి యొప్పె
నింద్రచాపంబు చేతఁ బ్రావృషము సాంధ్యదరనవారుణమగు జలదంబు వోలె.

శా. ఏఁడో దైవము శాపదగ్ధుఁడయి తానీ భూమిఖండాన స
మ్మాడుూర్జస్వల లక్షణాంకితుఁడునై వ్రాలెన్ దివఃఖండమున్
వీడంబాఱి దృఢోరసుండు నయనావిర్భూత దివ్యార్చిషం
డీడంబోయిన దేవతామహిమమై హ్రీతాత్మ తేజస్కుఁడై. 124

శా. బంధూకారుణ దారుణాతపములుం బాఱాడె జీరాడి కి
ష్కింధా పట్టణ గోపురోపరి పద క్రీడా ప్రచండంబులై
సింధుస్వామియు నింకిచన్న సికతాక్షేత్రంబుగానై ప్రవా
హోంధంబైనది యార్ద్రితావిరహితంబై ధూతమై భీతమై. 125

క. తనపాదధూళి తలఁ దా ల్చెను బూర్వంబునను నిచటి క్షితిమృత్తామృ
త్తును దానిపుడు తలం దాల్చెను దేహంబెల్ల దానిచేఁ బిహితముగా. 126

ఉ. తాదృశ దుస్థితింబడియుఁ దా నయనంబున రాచఠీవియుం
బోదు, ముఖాంబుజాతమునఁ బుట్టదు దైన్యము, దేహకాంతి మ
ర్యాదయుఁబాయ, దామరవనాంతర కల్పకశాఖ యొక్కఁడు
త్పాదిత ఝుంఝుచేఁ జెదరి వచ్చి ధరిత్రిని బడ్డయట్టులై. 127

క. పరమేశ్వర నిర్మాల్యము పురాణ సంతాన రమ్య పుష్పస్రజమున్
ధరణిం ద్రోసిరొ యనఁగను సురరాజసుతుండు వాలి క్షోణిం దోఁచెన్. 128

మ. ధరణిం దాఁకియుఁ బాతకాల కలితోద్యత్కాంతివారంబు వీ
సర వోకుండినయట్టిదొ గగన నక్షత్రైక ఖండంబునాన్
బరమోదార విచిత్ర భాసుర మహఃపర్యాప్తదేహుండు ది
వ్యరమం బొల్చెన యశ్మకుట్టనవ్రతుండో యోగిచందంబునన్. 129

వ. అంత లక్ష్మణ సహితుండై శ్రీరామచంద్రుడు ధరణీశయానుండయిన వాలి నుపసర్పణంబు చేయఁగా వాలి శ్రీరామచంద్రుని దీక్ష్ణ నేత్రముల నిలువెల్లఁ జూచి మొగము త్రిప్పికొని నిట్టూర్చి యుసురంచు నిట్లనుకొన్నట్లు వచియింప నారంభించె. 130

శా. అహా! యెంతటి సౌమ్యమూర్తి ప్రవిలోకానంద పర్యాప్తమౌ
దేహచ్ఛాయయుఁ జంద్రమో విమలసందీప్తాస్య మంభోరుహా
స్నేహం బొప్పెడు నేత్రయుగ్మము మఱి న్నిర్వ్యాజసౌందర్యమున్
దేహాతీత మచింత్యవైభవ మహోదివ్య ప్రభారేఖయున్. 131

క. నీవేమిటి శ్రీరామా! యీ విమలేతరము కార్యమేమిటి రామా!
నే విన్నదాని కెంతో పై వెలసిన దీ మహానుభావత చూడన్. 132

క. ఇది యేమి చేసినాఁడవు త్రిదివాయోగ్యంబు కర్మ దెవ్వరమున్ బె
ట్టిదమును నింద్యంబును దుర్మదు లస్వర్గ్యులు పొనర్చు మలినంపుఁ గృతిన్.

ఉ. ఉన్న పరిస్థితుల్ సకల మూహ పొనర్చితి నొక్క ధైర్యమై
యున్నది దాని మాపితి వయోగ్యముగాఁబొనరించి, త్వాదృశుల్
సన్నుతులే యధర్మపథసంగతులై నెడ నింక నేమిది
కున్నది ధర్మదేవత కహో విపరీతమయైన సృష్టిలో. 134

మ. సొరిదిం జెప్పెను తార పోవలదటంచున్ నీ మహాధర్మ సుం
దర శీలంబునయందుఁ బొల్చిన మహాధైర్యంబుతో వచ్చితిన్

బరమోదాత్తుఁడ విట్లు చేసితివి నీ పాపంబు నీచేత సా
కిరియై వానర రాజ్యలోభమతి సుగ్రీవుండు చేయింపగా. 135

శా. అయ్యో! రాఘవ యేమి చేసితివయా! యాచంద్రతారంబుగా
నొయ్యన్ నీదెస మచ్చచెప్పఁ బని యేఁడో వాఁడు దుర్మార్గుఁడై
ముయ్యేక్షై చను నీ యుదాత్తచరితంబున్ ఖండదేశంబునన్
జియ్యంబట్టు మతిన్ విసంబు కలిపించెన్ భాగలుబ్ధాత్ముఁడై. 136

మ. ఇదిగో వీనికి రాజ్య మిమ్మనిన నేనిత్తున్గదా నన్ను నే
పొదలన్ గుట్టలఁ గానలన్ వెలుగులన్ బొమ్మన్నఁ బోదుంగదా
అదియుం జూడుమ యాతఁ డైనదియు నీకా నేను గాకున్నయు
ట్టైది యేమున్నది భూసుతన్ వెదకుపొంటెన్ నీకుఁగార్యంబుగా. 137

క. అలఘుభుజాబలసా రోజ్జ్వలుఁడై విదలించి సప్తసాగరములలో
వల ముంచి యెత్తఁగల్గుదుఁ గలితమహాకేళిఁ బంక్తికంధరు నేనై. 138

శా. గోరంటం బొనరింపనైన పనియున్ గొడ్డంటఁ దీర్పంగనున్
నేరంగల్గుటయే విచిత్రమగు నీ నీచంబు కార్యంబు నీ
వారంభించుట యద్ది యట్లనుచు నీకా చెప్పఁగా రుండిరే
వారింగారించి చెప్పగావలయుఁ దద్వైదగ్ధ్యసంభారముల్. 139

ఉ. కోమలమూర్తి నిన్నుఁగని కోపము వచ్చుటలేదుగాని నీ
యీ మలినంపుఁ గార్యమున కేమియుఁ జేసినఁ జేయవచ్చు ని
న్నా మెయి నన్నెదిర్చి రణమాడవుగాని రణంబు లోపలన్
నీ మృదుదేహమున్ మెదిపి నిర్మథనం బొనరించియుండనే. 140

క. హారా! యా యిక్ష్వాకువు నా రఘువును నా దిలీపుఁడా దశరథుడున్
వారల ప్రతిష్ఠ యేమిటి వీరుఁడ వీ చెట్టుచాటు వెలివని యేమీ? 141

క. మా మాంసము తినియెదరో మీ మానవు లయిన వతులు మేము నభక్ష్యం
బౌ మృగపంచకముం దున్నామయ్యా! రామ! పంచనఖములయందున్. 142

మ. నలువౌ లక్ష్యము సుంతయున్ నిలువకుండన్ లిప్తలిప్తన్ మహో
జ్జ్వలధారా పరివేసుఁడై బహుదిశాస్పందోగ్ర దేహుండనై
చెలఁగ న్నేనును, నీకు లక్ష్య మెటునిల్చెన్ సూటిగా గుండెలో
వలఁ గొలాణువునందె లక్ష్యశర సంపాతంబు లెట్లొప్పెడిన్. 143

చ. ఇదియు మహాద్భుతంబగు సుమీ! రఘునాయక! నీ గుణధ్వనుల్
కదలినతోననేఁ బెడముఖంబయి పూర్వము పార్శ్వవర్తినై
మెదలితి నీదు లక్ష్య మది మేలుగ వక్షముమీఁద నే గతిం
బొదలిన దమ్ముఁవచ్చి యెదఁ బుచ్చిన సూటియువేళ యెట్టిదో. 144

ఆ. బాణ మేగు వేగవటిమ యెంతైనను బయలుదేఱుటకును బ్రాప్తి కెంత
లే దటన్ననైన లిప్తైకదేశంబు కావలయున దాని కలిమి లేదె. 145

శా. ఆ నీ చేసిన సప్తతాళ దళన వ్యాపార మాశ్చర్య హే
లానిస్తంద్రముగాఁగ నాడు టది యేలా! నాదు వక్షంబునం
దీ నారాచము క్రుమ్మటబ్బురము పై నెంతేని నబ్రంబు హే
లా నారాయణుఁడై సుదర్శన సముల్లాసాభ శార్ఙ్గక్రియన్. 146

శా. ఈ హేరామి శరంబు తీర్పు కులమం దేపారు నవ్విద్యయే
బాహాబాహి పెనంగ వాలి నెదిరింపంజూడ వల్లైనచో
నీ హేవాక మదప్పు డుండెడిది యీ నీ తొమ్ము దోర్యుగ్మసం
ధ్యాహిక్కోల్బణకంఠరావమున డిందం జేసియుందుం జుమీ. 147

మ. మఱి యింకే మనుమందు విందునవశంపా యజ్ఞసూత్రంబుగన్
సరసాషాఢమనోజ్ఞనీరదతనుం జంపంగ నిన్నప్పు దు
ర్భరమై యుండును నాకు నిట్లు జరిగెన్ బ్రారబ్ధ మీ నీ కహో
వరమంబౌ నవకీర్తి ధాత నొసటన్ వ్రాసెన్ ప్రమాణంబుగన్. 148

శా. నే నింకొక్కఁడు చెప్పెదన్ రఘుపతీ! నే నింత సౌజన్య రే
ఖానిష్పత్తిగఁ బల్కుచుంటి ననుటే కానీ హృదంతస్థితిన్
నూనంబై యది యెంతకోపముగ నుండున్ దృక్కృతి ప్రక్రియన్
దా నంతున్నది యేమి నిన్ననుటకుం దా జిహ్వ రాకున్నదిన్. 149

గీ. దేవగురునకుఁ జంద్రునిదీప్తివోలె నేయి యని ద్రావుటకును నూనె యనిదలకుఁ
బోసికొనుటకుఁగావైతి మోహనాకృతివి దురాచార కుటిలవృత్తివియు రామ!

కం. నా కంటె గూడ దారకు నీ కథ తెలియును జుమీ మనీషితర వృ
త్తీ! కలిత దృశామృత వర్తీ! కోదండకర నవపతిత సమవర్తీ.

చ. ఎవఁడును మధ్యవర్తియయి యెప్పుడు సంధినిఁజేయ యత్నముం
దవిలి పొనర్పుఁ దొల్తనది దాఁటినచోఁ దనకంత యిష్టమౌ
చు వెలయుఁ బక్షమందునను జొచ్చినఁజొచ్చునుగాక యీగతిన్
వివరములేనిదౌ కలహవృత్త మసాధుపదంబు దూష్యమున్. 151

ఉ. నీ బహుశూరకృత్యములు నిర్భరమోదమునన్ వినంగ నీ
యే బవరం బధర్మమగువృత్తము కల్మి యెఱుంగరాద యిం
దే బహివెట్టు నీ కుటిలవృత్తము చూపుట నా యదృష్టమో!
యో బహుమాన భావకలశోదధి! యిద్ది యిటన్ ఘటెంగన్. 152

ఉ. ఊపిరి యున్న యందనుక నూరక నిట్లనుచుందు నెద్దియో
యూపయి సర్వమున్ దనదె యంచును నీ సఖుఁ డూహచేయు నా
శాపరమానుకూల పథసంగతభావుడు గానఁ, గాని యా
హా! పరలోక మున్నయది యక్కట! పాపము బుణ్య మున్నవిన్.

ఉ. చిన్నతనంబు నుండియును జేవయుఁ దక్కువవాఁడు నాకుఁ దా
నిన్ననుగాక మొన్న నని నిల్వనులేక పలాయమానుఁడై
చన్నటువంటివాఁడును వెసన్ జనుదెంచినఁ బ్రోద్దుటన్ సుఖా
సన్నుఁడ వీవుకాక తనశక్తి యటంచ నుకొందునా మతిన్. 155

గీ. తెలిసియే వచ్చినాఁడ నీ తీరిదెల్లఁ దెలిసియే వచ్చుచున్నాఁడ దేశములకు
కాలమునకును నెల్లలోకంబులకును నాకు నష్టంబు లేదయ్య నాథ నాథ! 156

గీ. అంత సుగ్రీవు మొగమునయందుఁ జూడనొక్క నెత్తురుచుక్క లే దుపలవిగ్ర
హంబువోలిక నిశ్చలంబైన యంగకములఁ గన్నుల వాలిని గంచు నిలచె. 157

గీ. రెండుజాములుదాఁటె మార్తాండుఁడొకడు లక్ష్మణుం డొక్కరుండు వేళా నిగూఢ
గమనమూర్తులు కదలిన కదలికయును గనఁబడనియట్లు కాలసంకల్పదృఢులు. 158

గీ. హనుమదాదులు దూరంబునందు నుండి నికట దేశంబునకు వచ్చి నిలిచి కనిరి
హాలహల పానవేళా మహానుభావు నీలలోహితువలె యోగనిభృతు వాలి. 159

వ. అంత యుద్ధ మారంభించినవేళ సుగ్రీవుండు వాలిపై విసరిన వృక్ష మందుఁ
బడియుండ శ్రీరామచంద్రుండు దానిపై నాసీనుండై యిట్లనియె. 160

శా. తాతా! యూరక కోపగించకువె యీ ధర్మాధ్వ మీవంచుఁగా
దే! తాత్పర్య వినిర్ణయంబునను బ్రహ్మేంద్రాదులుం జాలరే
నా! తత్పర్వమునందుఁజాలుదును పైనం జాలుదున్ మోహముం
జేతో వీథిఁ దొలంచుకొమ్ము మఱియున్ సిద్ధించుఁ బెల్లర్థముల్. 161

గీ. కాలమునకును నెల్లలోకంబునకు దెలియఁజేసె చచ్చెదవు నా తీరునీవు
నీవలెనె గాఢమోహ సంభావితాత్ము లెలమి నెవరికెఁ గ్రొత్తగాఁ దెలుపవలయు.

గీ. ఎవ్వఁడెవ్వఁడు తనకర్మయెంతయెంతొ యనుభవింపఁగ వలయున యంతయంత
తదనుభూతిలో వాని చిత్రప్రవృత్తి కొంతభాగము తెలియని యంతవఱకు.

గీ. కర్మఫలదాత యెవ్వడు కర్మభోక్త యవు నెవండు వ్యాపారసమాశ్రయుండు
కర్మచేయుచు నెవనినిఁ గర్మయంట దీ వివేకంబు కృఛ్రము బుషులకైన. 164

చ. వదులుగ నున్న రాతిపయి బావికి నొడ్డునఁ గూరుచుండి యే
యదనునఁ దీవ్రభాషణ కృతాభినయాహతి నట్లు తూలునో
మది నెఱుఁగండు నుంతయును మానవుఁడుం బెఱవారి వృత్తమా
స్పదముగఁ దర్కవైఖరికిఁ జర్చయొనర్చుచునుండు మూఢుఁడై. 165

క. ధర్మార్థకామలౌకిక మర్మంబులు తెలియవట్టి మందవుబుద్ధిన్
ధార్మికుల యుపన్యాసము లర్మిలిఁ బలికెదవు దూషితాచారుఁడవై. 166

ఉ. మన్న్యవు దక్కి యాపదల మధ్యమునందున జీవకోటి సౌ
జన్యమునందు నప్పటికి సాధువె యెవ్వఁడు గాని మత్తధీ
జన్యము పూర్వకాలిక మసాధువు వాని చరిత్రఁ బొల్చినన్
వన్యమృగంబులున్ నయము వానికి, లోనికిఁగాని పైపొరల్. 167

శా. ఏమృత్యూపచయంబు సన్నిహితమై యిప్డింత సౌజన్యమో
యా మృత్యూపచయంబు నిత్యకృతభావాపన్నమై ధర్మర
థ్యామృష్టంబగు వృత్త, మప్పటికిఁ దా నాపత్తి యైనప్డు నీ
వేమీ యెవ్వఁడుగాని ధర్మకలితాహీనోహ భాగుండగున్. 168

ఉ. ఏ పురుషార్థమున్ విమలవృత్తిని సాత్త్వికవృత్తి ధారణా
దీపితబుద్ధచే ననుమతింగనుఁ దామస రాజసంబులై
యేపునఁ బొందెనేని తపమేని యుపాసనయేని రాక్షసం
బై పరిణామమందు విలయంబు ఘటించుటయొండె లాభమై. 169

క. మీరును మానవు లన్నం గారాయెను వృత్తిమాత్రగత వర్ణంబై
వారక వృత్త్యనుకూలో దారము ధర్మంబు నడపఁదగు మీ చేతన్. 170

ఉ. చోదిత దేవతాంశములు చొప్పడి జన్మల మానవత్వ మ
ర్యాదయు నార్యవృత్తము తదాగతధర్మము మీకుఁగాని సం
పాదితమయ్యె గొందఱకు మానవులందె యకర్మమార్గు లిం
పేదగ ధర్మహీనులయి యెందఱొ మీరును వట్టి ప్రాణులై. 171

గీ. శ్రీవిశేషధర్మంబులు లేవు మీకు వట్టి ప్రాణిధర్మంబులు వఱలుచుండు
జంతుధర్మంబులందున సాధులక్షణంబు సర్వోత్తమంబు వానరకులేశ! 172

క. అ సాధుత్వము నీ దెస భాసింపనెలేద మొన్నవఱకును ననుజుం
డౌ సూర్యాత్మజ చటకము వేసడమై యెంత ఛిద్ర వెట్టితివి కపీ! 173

చ. అతిబలశాలివౌట సహజాగతి కోప మనన్యసాధ్యక
ర్మతతిఁ బొనర్పఁగల్గు నభిమానము వెంబడినంత నంత యే
కృతియును జేయఁజొచ్చి యొనరించిన దంతయు ధర్మమంచు దు
ర్మతియగు నాత్మనిగ్రహ సమాధులు లుప్తములయ్యె నీ దెసన్. 174

ఉ. రాజ్యముకాని రాజ్యమున రాజవు నీకును వానర ప్రజా
పూజ్యత యెట్లు నీదయిన భూభరణక్రియ యెట్టి లక్షణ
ప్రాజ్యత కల్గు నింద్ర పరిపాలిత వృక్షఫలంబు లేరుటే
యిజ్యయు దాన భాగమున నేమి విచిత్రపు టర్థ మే చెడున్. 175

క. మేకములకుఁ దమకు మివులు నధికబలజంతువుల భీతి దీపించును నా
యకుఁ డట్టులైతి రాజవు ప్రకటితరంజనముపొంటె రాజగును కపీ. 176

చ. అల నలఁగొమ్మలం దిరుగుటై సహజంబగు నుంఛవృత్తియో
నల కపిజాతియందున షడంశము నీ పరిరక్ష యేగతిం
గలిగి గ్రహింతు విందు విడిగాఁ బురుషార్థము పల్క నర్థముం
బలుకఁగ ధర్మసమ్మతము పల్కఁగ నేమియులేద యేగతిన్. 177

గీ. ఇద్దికొట్టుక తినుటలో నేదొ కట్టు అలఘు పురుషార్థ మెఱుఁగని కలిసికట్టు
తనము, భయభీతజంతులక్షణము దానియందు నేల రాజ్యమ్ము రాజన్న పేర్లు

గీ. వేదహిత నాగరకతలో విభుఁడు మనువు నిహపరంబుల రెంటిని నేకపఱచె
బారలౌకిక సంపత్తి వదలి జంతు సములు గ్రహియించి దాని దుష్టతఁ జరింప.

శా. ఏకత్రస్థితముల్ పరస్పరము సౌహిత్యంబు దీపించు న
స్తోకంబౌ సహజస్వభావబలమై తోరంబుగా జంతువుల్
కాకే కొంచెము పైనిమెట్టునఁ జెలంగన్ మీరు సౌహిత్యమా
హా! కన్పించద యేకగర్భజ ఖుండౌ తమ్మునందేనియున్. 180

క. అది యేమి రాజ్యరమ తా నదితమ్ముఁడు దొంగిలించెనంచు దురాశా
మదవృత్తినేమి చేసితి తదనుచితంబగు నకాండతాండవము కపీ! 181

గీ. ధరణికొఱకును దండ్రి సోదరులనెల్ల జంపుటన్నది యుండు మ్లేచ్ఛజనవృత్తి
మంత్రిజనుల యిష్టంబుగా మహిని దమ్ముఁ డైనఁ బొందఁగఁ జనుట
యార్యజనవృత్తి.

క. ఒకవేళఁ గాదు తమ్ముఁడు ప్రకటితముగ రాజ్యవాంఛ పచరించిన వా
నికి రాజ్యమిచ్చి యన్నయు నకటా! పోనేల రాదా యడవులయందున్. 183

శా. ఆ సుగ్రీవుని మంత్రశక్తియు సదూహప్రక్రియా వైఖరుల్
ధీసామగ్రియు నార్యబుద్ధియు ధరిత్రీజానికిన్ యోగ్యముల్
నీ సంపన్నత బాహువిక్రమమునన్ నీవో చమూనాయకుం
డై సోదర్యుని రాజ్యరక్షణకళా వ్యాపారయోగ్యుండవున్. 184

గీ. ధర్మరహితంబులైన యర్థంబు కామ మెలమి సారథిలేని రెండెడ్లు సుమ్ము
బండితలక్రిందులైపడుఁబల్లమందు మడియునెడ్లును మెడలఁబట్టెడలు బిగిసి.

గీ. కర్మమార్గానఁబోని దుర్గతుల నెపుడు నర్థకామంబు లీ రెండె యనుమతించు
నొకని నర్థపిశాచికి నొకనిఁ గామ రాక్షసికి నుగ్రమైన యుగ్రాణములుగ. 186

గీ. స్త్రీ ప్రజార్థముకావుట శిష్టవేద మార్గమగు ధర్మయుతము కామంబు కొఱకుఁ
గావుట పురాణపథ మిట్లు కామి యధమజంతులక్షణ మోయి కీశకులనాథ.

శా. నీ కామాధ్వ మధర్మమై నెగడెఁ దూష్ణీంభావదూరంబుగన్
నీ కాయమ్ము మృగంబు జీవమయమై నిల్చెన్ సురాంశంబు శి

క్షాకాండం బఖిలంబు దేహమునకున్ సంబంధియై పొల్చు నీ
సాకల్యంబగు సూక్ష్మధర్మమున శిక్షావీధి యిట్లొప్పెడున్. 188

క. దోసము జీవకృతంబగు భాసురమగు శిక్ష దేహబద్ధంబగు శి
క్షాసమయమ్ము తదాత్వ వ్యాసక్త తనూ ప్రమాణమై యొప్పారున్. 189

గీ. కూఁతువంటేది తమ్ముని కోమలాంగి తదభిగమన మ్మధర్మవిద్ధంబు కర్మ
మరణశిక్షయె యట్టి పాపంబునకును జంతువులు చేయు నవిమృష్టసంగమంబు.

ఉ. ఆ యనుజుండున్ మరణమందిన నాతని భార్య దేవర
న్యాయముచేతఁ బొందనగు నంతియకాని యిదేమి న్యాయ మీ
తోయము రాజకీయ మగుదోషము చూపి తదంగనా రతా
ధ్యాయము సేఁతకున్ మఱుగుటమ్మన నేయుట శిక్షయై తగున్. 191

గీ. తమ్మునందున రాజకీయమ్ము దోష మట్లు చూపించి తద్భార్య నిట్లు దొంగి
లించితివి వానితోయుద్ధమట్లుచూపి యిట్లుశరమున నిను వధియించుటకును.

ఉ. ప్రస్తుత మీ ధరావహన భారము కైకయి పుత్రునందు న
భ్యస్తమగాఁగ నున్నయది వానికి నే నధికారినైతి ప్ర
ధ్వస్తమ కాకయుండ మను ధర్మము నిల్పితి నింద్యదుష్కృతి
ప్రస్తర మెప్పుడేనియును బ్రద్దలుకాకయె తప్పదో కపీ! 193

గీ. రాజు దండ్యుని నెదిరించి రణముచేయు నన్న ధర్మంబులేదె యట్లున్న నీవు
మున్ను సుగ్రీవునిన్ దేశమునను వెడల నడచినప్పుడు మఱి యుద్ధ మాడవేమి.

మ. ఒక యేకార్యము చేయఁగల్గుదు నటం చుండుంజుమీ సుంత వా
నికి నైత మ్మది తత్ప్రవేశమును గానీ యున్నఁ దద్విద్యలో
నకటా! త్వాదృశుఁడైనవానికిని దా నట్లున్కిలోఁ దప్పలే
దు కదా యుద్ధమునందు నన్నెదుర శక్తుండంచు నన్కొన్నచో.

శా. ఈ నిన్ జంపకముందుగూడ మది నిట్లేయెంచుకొన్నావొ ము
న్నీ నన్నున్ వినినప్డు నీ మనసు నిట్లే తీర్చుకొన్నావొ యే
మైనన్ బర్వత నిశ్చలుండ వని నిన్నన్నాడు సుగ్రీవుఁ డా
హో నారాచ మొకండు తాఁకిననె యిట్లైనావు చిత్రంబుగా. 196

మ. నిను మన్నించితినోయి వాలి! యదియున్ నీ కంఠమేనుత్తరిం
చను నీకాయ మదెచ్చటో విసరఁ, జంచత్ఖండ ఖండమ్ములై
చన భేదించను నీ యసుప్రచయమున్ సద్యస్సముత్క్రాంతి వ
ల్గనముం జేయన యెంతొ యంతయగు శిక్షాబుద్ధి మన్నించుచున్. 197

క. అల భరతరాజునకు నా తలవరితన మంత తూఁచి తాల్చితి వాలీ!
తెలిసికొని తప్ప శిక్షయు నలఘుమతియు స్వర్గసీమలఁ దేగుఁ జుమీ. 198

మధ్యాక్కఱలు.

రఘుకుల క్షీరాబ్ధిచంద్ర! రాజీవ రమణీయనేత్ర!
యఘనాశి గుణరాశి! మోహనాంభోధరానీల గాత్ర!
మఘవమాణిక్యాంశు మంజుమంజుల మధుర తోరణ స
రఘుమాలికారమమాణ రమ్యాంశు రథ్యాశరీర! 199

ఆనందవీథీవిహార! యఖిలలోకైకధానుష్క!
వూని వారించెను దార పోవద్దు పోరికం చతివ
నేనె వచ్చితినయ్య మోహనిహార నీరేజబంధు!
నా నిండు కోరిక పండినది నీదు నారాచముక్తి. 200

వ. నాకు దిగులు లేదు. సుఖముగాఁ జనిపోవుచుంటి నన్న వాలిం గాంచి శ్రీరా
మచంద్రుం డిట్లనియె. 201

శా. తాతా! యాగువె!* నాశరం బమృతదిగ్ధం బీవు మాహేంద్రలో
కాతిథ్యంబును స్వీకరించుటకుఁ బోనౌమున్న నీకోర్కెలున్
నాతోఁ జెప్పుము చెప్పనక్కఱయునైనన్ లేదు లోకానఁ బ్ర
ఖ్యాతంబైనవె యెల్లకోరికలు మోహాధీన చిత్తత్వమై. 202

చ. కొడుకయినట్టి యంగదునిగూరిచి యక్కఱలేదు చింత, నే
రడు పసివాడటం చెడద రాపిడిచెందకు సూర్యసూతికిం
గడువడి వాఁడటన్న మమకారము, నాతనిమీఁద బిట్టు ప్రే
ముడి గలఁడెందు నీ ముడులు పోవునె రక్తపుస్వర్శయున్నచో. 203

గీ. అన్నయన్న విరోధంబ యన్నకొడుకులన్నఁ బడిచచ్చుటయు నున్నదయ్య జగతి
నంగములను వ్రణగ్రస్తమైనయదియెఛేద్య మితరంబు సమభిలషితముకాదె?

గీ. అంగదునకును ప్రేమతో నబ్జబంధుసుతుఁడు యువరాజపదము నిచ్చుందనంత
నంత యీయకపోయిన నతఁడు నామతం బెఱిఁగిదాఁటిపోవునా దాఁటిపోఁడు.

చ. మరియును దారఁ గూర్చి యనుమానము లేదను మంతకన్న నం
బురుహ హితాత్మజుం డెపుడువూనఁడు కోపము తారఁగూర్చియుం
గొరకొరలేద యంగదుని గూర్చియు, నీదెసఁ గూడ గౌరవ
స్ఫురణములేక పల్కఁ డొక సూడును దీర్చుట యట్టెపెట్టెనన్. 206

ఉ. నీ తరువాత భద్రముగ నీదగు రాజ్యము నిల్వనెంచినన్
నీ తనయుండు నంగదుఁడు నీ యనుజన్మని పిమ్మటన్ ధరి
త్రీతలనాథుఁ డౌటయును ధీపదమం దభిలాషయేనిఁ దా
నాతఁడు తార నేమియవఁ డాయమ ధీగత గౌరవంబునన్. 207

ఉ. తారనుగూర్చి నే వినినదానిని బట్టి వచింతు దద్వ్వే
కారణమాణమె జరుగు ననియు నీ కపిరాజనందనున్

దారసుగార్చి నీదు నెడఁదన్ భయమింతయుఁ బెట్టుకోకు తా
తా! రుమ నీ కొకందుకును దార యొకందుకు సూర్యసూతికిన్.

ఉ. ఈమెయి నీవుగాని చను బెచ్చటొ యాయమ యేమియైన నీ
కేమి? మనుష్యజాతియు వహించుఁ గపిత్వము బుద్ధియందు మీ
రో మతియందు దేహమున యుగ్మమునందు వహించుచుండి రీ
ప్రేమలు శ్వాశతంబని జరింతురు ప్రాణము పోవునప్పుడున్.

మ. అమృతాసేచన మైనయట్లు కపిరా జస్మత్పురానేకపు
ణ్యములుం బండిన వీ విధాన రఘురామా! శాంతకామా! వికుం
ఠమహోధామ! వధించుటే కరుణ యన్నన్ స్వామి! నీయందె సా
ర్థముగానైనది శ్రీదయాగుణసముద్రా! రామభద్రా! ప్రభూ!

వ. అని మరణాయాసంబు తోడి చిఱు నవ్వున మఱియునిట్లనియె.

మ. కమలాంతర్మృదుకేసరాభ నయనాగ్ర స్వాదుకాంతీ! హృద
బ్జమిలచ్ఛాంతి! సమీక భూమ్యపగత శ్రాంతీ! రఘుస్వామి! చి
త్రము నీ చేత వధింపఁబడుటయున్ దానొక్క యర్చా విశే
షముగాఁ గన్పడు నిక్కమా! రఘుపతీ! సంతోషరోచిర్మతీ!

సీ. అనిన శ్రీరామచంద్రుఁడిట్లనుకొనియెను జిత్ర మీ జీవలోకంబు చెలఁగి బఁ
కెంతగర్వాదినిలయమోయంతలోన ముగ్ధమును దీనమును స్నిహోస్నిగ్ధముః

ఉ. లీలగ మృత్యువొందు విదలించును సర్వము, కాక పట్టఁ బ
గ్గాలవి యుండునే బ్రదుకఁగా నగు వేళను బొంగిపొంగి యు
త్తాలమహోగ్రవార్నిధి విధంబున నొక్కొకఁడేమియేమి పం
తాలు దురంతముల్ మతికృత ప్రళయంబులు చేయఁజొచ్చెదున్.

ఉ. వ్రాత్యునికన్న వ్రాత్యుఁడగు వాఁడయి వాని కిరాతకృత్యముల్
మత్యనుమేయతావధికమానము ముట్టుచునుండ నేగుచున్
మృత్యువు రాన్ దహద్స్పృహ సమీప ధరాస్థశిరీషవృక్ష వ
త్రాత్యతిదీనమై మఱియు నంతటిలోపల గ్లాని పొందెడున్.

ఉ. అత్తఱి వాలి నెంజిఱిఁ గృతాంజలి రామ! రమేశ! మోహవి
చ్ఛిత్తిపొనర్చి తింకఁ గృపనేసి యనుజ్ఞ నొసంగవే యనన్
గ్రొత్తళ మందుఁ బెద్ద మెలఁగోలయి యచ్చటఁ జూచె సాధులో
కోత్తముఁడైన స్వామి యసితోత్పలముల్ వికసించినట్లుగన్.

సీ. ఉత్తాలచూడాచలత్తాలతరువు శరీరమ్మున దిరస్కరించువాడు
నాభోగవివృతిరేఖాభోగఫణి, ధనుర్విధృతకోటి నధఃకరించువాడు
నాఖేటశబర మాలాఖేటమతి, సమాదృతచిత్తతఁ బురస్కరించువాఁడు
నొకఁడు లయాంతకుం డుగ్రుండు మానిసిదిండి వెన్వ్యాఘ్ర మేతెంచినాఁ

గీ. సకలవానర మారణచండుఁ డగుచు జ్యానినాదవిదీర్ణ దిశాకరీంద్ర
కర్ణకుహరుండు క్రూరదృ క్కర్ణఫణవిదీర్ణమౌళి జటాజూట దృప్తుఁ డొకఁడు.

ఉ. క్రొత్తడముల్ త్యజింపకుఁడు కోట కవాటములన్ బిగింపుఁ డు
ద్వృత్తిని గోటమీఁద కరుదెంచున యేనియు మీరలెల్ల నా
యత్తపడుండు దుర్గపు రహస్యబిలంబుల శైలకాననా
వృత్తిఁ పలాయమాను లగుడీ! లగుడాహతులైనయట్లుగన్. 218

మ. మన రాజంతటివాఁడు ధాత్రిఁగలఁడా మాహేంద్ర వజ్రాఘఁడం
చనుకోనైనటువంటివాఁ డతని ప్రాణాకర్షణ ప్రక్రియా
ఖనన క్రూర పృషత్క కర్మ సమలంకర్మీణుఁ, డెందైన నే
గినఁ బ్రాణంబులు నిల్చు, సీర్వదులుకోఁ గిష్కింధకున్ రోజులై. 219

మ. అని గర్గోల్వదుచున్ బిశంగనయనాంతావర్తమానాంశు వ
ల్గననిర్మాతృ త్రియామకాల దినకృత్కాషాయ వర్ణాతపా
యనులై యట్టిటు కోటలోఁ దిరుగుచున్నంతన్ దురంతంబు వా
ర్తను విన్నట్టిది తార దారహితు భర్తం జూడ రాఁగోరెనన్. 220

క. వారించుచు వానరచము వౌరారా! యేమి సాహసాధీనము నీ
ప్రారంభ మచట కేఁగిన నూరికి మఱి తిరిగివచ్చు టూరక యగునే. 221

గీ. ఏము మగవాండ్ర మచ్చటి కేగలేక నిలువ్రుగుడ్లుగా నుంటిమి నీ మగండు
సకల రాక్షస సంహార చటులభుజుఁడు నట్టులయ్యె నిదేమి సాహసము రాణి!

శా. నీ వున్నావు సమస్తవానరచమూ నిర్వ్యాజ రక్షాకళా
ప్రావీణ్యోజ్జ్వల ధీధురీణ వని మా ప్రాణంబులు స్నిపయుం
గా వర్తిల్లుచునుంటి మీవు నచటం గాల్వెట్ట మా జీవితా
శావర్ణాటుత మెట్టఁబట్టినది సంజ్ఞావృత్తిగా సిద్ధియున్. 223

శా. ఈ దేశంబును వీడి యేగెదము తల్లీ! యెందో దూరాటవిన్
నీదౌ బుద్ధియు నీకుమారుని భుజానిర్వాహకత్వంబుగా
మీ దాసేరులమై చరింతుము కృపామిథ్యాత్వ రూపుండు నా
కోదండోగ్రుని చెంత కేగకువె నీకున్ వేయి మ్రొక్కుల్ సతీ. 224

వ. ఇట్లు వారించు వారిఁ దొలంగి వచ్చు తారం గని వానరసేన యెలుఁగోలై. 225

గీ. అకట! పరికాఁడు చచ్చిన నావటేలుచు వచ్చుచున్న కరేణుకా ప్రసభ గతియుఁ
జంద్రుఁడస్తంగమించిన సమయదుఃఖ నిభృతదీన నిశాసతీ దీనముఖియు. 226

గీ. ప్రియసహచర వియోగాగ్ని భీత చలిత శీర్ణహృత్కోకకామినీ ఛిన్నరవయు
ప్రాణనాయక మృతశరీర పరిసర విచర కపోతికా ధూతపక్షయును దార. 227

చ. ఒక విసుగైనఁ దూలిపడునో కసుగందెడు కాలితమ్మియై
ఒక ముసురైన నొడ్డుకొనునో పయికెత్తిన కేలుజంట మై

ఒక తరగొత్తి యొద్దిగిలునో పెనుదుఃఖపుఁటేటి నావయై
సకియ విముక్తనూపుర విచారమనోహర తారవచ్చుచున్. 228

వ. రామసుగ్రీవాదుల నందఱను దాఁటి వాలి పడియున్న చోటికిఁ బోయి యత
నిమీఁద బడి యింతసేపేడ్చి. 229

శా. రాముండన్న యముండు కాచికొనె భర్తా! పోకుమయ్యా! మహో
క్షామంబైనది ధర్మయుద్ధమున కీ సంగ్రామ మాపూర్వసం
గ్రామంబుల్ బలెఁ గాదటంచుఁ బలుకంగా నీవు విన్నావు కా
దీ మాద్రిం జనుదెంచి కొంపకును నీ వీ నిప్పు ముట్టింపఁగన్. 231

ఉ. నెత్తిన నోరుపెట్టికొని నేనటుపోరఁగ నాదు మాటలన్
జిత్తమునందునన్ గణనచేయవు కాలవశాత్మబుద్ధివై
యిత్తరి నేమికావలయు నేనును నీ కొడు కిట్టి సాహసా
యత్తము జీవితాన కెపుడైన నిదిట్టిది యుండె నంచనన్. 231

ఉ. అంధువునందు దూఁకినటులైనది కన్నులు మూసికొంచు నా
బంధువ! యెన్ని త్రిప్పలయి వచ్చిన నీ చనిపోయినట్టి కి
ష్కింధకు వచ్చెఁ ద్రస్తులయి కీశచమూతతి ఘోరశైల సం
బంధులుగాఁగ నేగెదరొ పాడుగఁబెట్టుచు నీపురంబదిన్. 232

చ. రుమకును భర్తతో విరహ ర్యాక్షము దుస్స్థితి చేసినందుకుం
గమలభవుండు నీదు ప్రియకాంతకు భర్తృవియోగరోగదుః
ఖము సమకూర్చె నేర్చిన సుఖంబును దుఃఖము చేసిపెట్టుకొం
దుము దుముదారులొచు నవి నూతన కర్మచమూ శిరంబునన్.

చ. అలుపపువాని భార్య తదనంతరమౌ స్థితియందుఁబెద్దయున్
దొలిస్థితికంచు భేదమయి తోఁపద యెప్డు పేదరాలె, భూ
తలపతిభార్య రాణితొలుతన్ మఱి యిప్పుడు దాసి, నిన్న నం
దలమును నేఁడు జోలెయును నాన్ విపరీతవిధిప్రదూషితా. 234

ఉ. గాలికి లేచిపోయినది గంధగజోన్నతశౌర్య! కప్పు క
ప్పాలునుబిడ్డ యేమగుదు రంచుఁ దలంచితి వీరుఁడైన నీ
యాలగునప్పుడే తెలియనైనది యీ విధవాత్వ మయ్యయో
వ్రాలియుఁగూడ నీదు ముఖవర్ణము మారద యేమి చెప్పుదున్. 235

ఉ. అమ్మటులట్లు గాయమునయందునఁ బార్శ్వము లొత్తుకొంచు దుః
ఖమ్మగు బాధకల్గునని కైజతఁ గ్రుమ్ముకొనంగనైన దే
హమ్మునయందు వ్రాలుటకు నైనను జాలని యేమి భాగధే
యమ్మును బొందినావు మగఁడా! బెగ డింతగఁ దెచ్చి పెట్టుచున్. 236

చ. వెస దశకంఠ రాక్షసుని భీతి శమించెను సర్వదుష్ట రా
క్షస కులమందు వెక్కసము శాంతి వహించెను వీరలోకసా
ధ్వసమును బాసిపోయినది వచ్చి సమస్తభయంబు లుగ్రక
ర్మసముదయప్రదూషితను మానిని నన్నును బొందుచుండగా. 237

ఉ. నీవు యమాశఁగూర్చి చన నిర్భర శీతల వాతపోతముల్
రా వటనుండి కాలమును రాచి చనంగను నీ వు జైత్రవే
శావిమలోజ్జ్వలత్వపు హళాహళి కల్గదు చల్లవెన్నెలల్
రా వికముందు నీవు కపిరాజవు మింటఁ జరింప బోవగాన్ 238

గీ. అయ్యో! నాప్రాణములయందునగ్గివెట్టియెచ్చటికిఁబోవుచున్నావో యీవుగాని
కయ్యమున కేగవద్దనెఁ గొంత యనుచు మచ్చరము పూన నేటికి మామకీన.

వ. అని వివేకదుఃఖంబు పొందుచున్న తారకన్నంగదునిమీఁదఁ బడి యెలుంగెత్తి
చేతులు చాఁచి కొడుకుఁ గౌఁగిలించుకొని యిట్లు పగులఁబడియె. 240

ఉ. చూచితివయ్య తండ్రి! రిపుసూదనుఁడై చను నీదు తండ్రి యా
హో చనిపోవుచుండెఁగదరా! మన నోటను దుమ్ముకొట్టి నా
యీ చనినన్ని నాళ్ళ బ్రదుకేగతి పొగెదునయ్య నాకు నీ
రాచఱికంపుఁబెంపకము రాపిడిపొందిన దీ విధంబుగన్. 241

మ. పితృపైతామహమైన రాజ్యము మహావీరుండు తా నేలి త
త్సుతుఁడీ వాదువు రాజటం చనుకొనన్ దోదూయమాన క్రియా
హతుఁడై నీ పిత యిట్టు లయ్యెనుగదయ్యా! దయ్యమిట్లెంచి వం
చితమౌ రాజ్యవివాద మెంచికొని చచ్చెం దాను నన్ జంపుచున్. 242

చ. చటులమహాహవంబులను శత్రులు వీచు నగాభి పాత వి
స్ఫుటములు కాయలైన కిణముల్ మెను దిమ్మలుగాఁగ నైన ను
త్కటముగ రోమరాజియును గ్రమ్మిన నీ పితరొమ్ము పద్మసం
పుటములు శైవలంబులుగఁ బొల్చిన మానసచింత కూర్చెడున్. 243

ఉ. ఆడగ నుంత కానన పదాంతర వీథులనేగఁ బిల్లవాఁ
డేఁడి యటంచు నన్నడుగు నెప్పుడు నీ జనకుండు వీఁడు స
మ్రాడభిరామవక్షుఁడు ధరాతల సంవహనైకదక్షుఁ డీ
వాఁడిశరంబు తాఁకి యమవాటిక కేగుచునుండె నాయనా! 244

ఉ. వాలిని జూడు నా బ్రదుకు పైనను నిప్పులుపోసి పోయినా
డాలము సేంత కిచ్చుటికి నాగము సేఁతకు వచ్చినాఁడు నా
భీలుఁడు పృథ్విరక్షకుడు పృథ్విశయానుఁడు దీనుఁడై యస్ప
గ్జాలములోపలన్ మృగయు జాలములోపలఁ జిక్కియుండెడున్. 245

ఉ. తేలి యదృశ్యమౌ మన యదృష్టముకాకను లోకమందు రా
జ్యాలునుగల్గుఁ దత్కృత మహాహవముల్ ఘటియిల్లుచుండుఁగో
పాలును గల్గుఁ దత్కృత మహాహవముల్ క్రియలున్ ఘటిల్లుఁ బా
పాలును గల్గుఁ గ్రూరనరపాలకశిక్షలు సంఘటిల్లెడున్. 246

ఉ. అంచితమైన పాల్యజన మచ్చుట చేయు నఘంబు రాజు శి
క్షించును భూమిపాలకుఁడు చేసిన పాపము దైవ మొందు శి
క్షించును దైవముం దిరిగి చేసినదానికిఁ గర్మ యొందు శి
క్షించును గర్మ జన్మలను జెందెడు దైవ మనుష్య సంహతిన్. 247

ఉ. శ్రీహసన క్రియా పరవశీకృతచిత్తులు కొందఱుగ్ర దుః
ఖాహ్వాతకోపవేగ నిహతాత్ములు కొందఱు నందఱున్ మతి
వ్యూహకషాయకర్మ కలనోగ్రులె యీ ధరయందు మందస
న్నాహము పొందె నీదెసను నాదెస నేటి కదృష్టరేఖయున్. 248

వ. అనుచున్న తారా నిరూఢ నిగూఢ దుఃఖోల్బణజనిత వాక్యసంజాతమ్మునకు రామసుగ్రీవులు వెఱఁగొందుచుండ హనుమంతుఁ డామెతో నిట్లనియె.
249

చ. అతితరదుఃఖవేగ నిహతాత్మవు పండితురాల వీదృశో
ద్గత పరితాపతప్తియును దావకపూర్వవివేక భావనా
స్రుతమతియుం బరస్పరవిరుద్ధములైనవి వేని కెవ్వరీ
క్షితితలమందుఁ గన్పడుచుఁ జెందుచుఁ జిందుచు బుద్బుదంబులై. 250

ఉ. సొంపఱి నీవు దీనవును శోచ్యవు, దీనుఁడు శోచ్యుఁ డెవ్వఁడీ
తెంపున వానికోసమయి దీనత శోకము నీవు పొందఁగా
సంపుటి ఛిన్నభిన్నమయి చార్విఁడి దేనికదై చనన్ [illegible]వా
హంపు వియుక్త కాష్ఠకలనాద్భుతవృత్తికి నావటిల్లుచున్. 251

చ. అరయ నశోచ్యమైన విషయంబున శోకము పొందుచున్కికిన్
మఱియు నదీనమై చనిన మార్గమునందున స్రుక్కిపోవుచున్
వెఱఁగు భజింపనైనయెడ బిట్టగు కోపము శోకమందుచున్
బరువడి విజ్ఞులై జనులు పామరులంబలె నౌదురేలొకో. 252

చ. వికటపు మృత్యువీథి పలవింపగఁ నేటికిఁ దప్పినట్లు వే
ఱొక సమయంబు నందున మఱొక్కవిధంబున నైనఁగల్గుఁ బా
యక భ్రమపొంది యెప్పటికి నప్పుడె యిప్పుడు కాదటంచు ని
త్యకలితమాయ నేడ్వ రనునట్టిది యున్నదె మ్రొక్కుకొన్నటుల్. 25

గీ. ఈ మహాపయోరాశిలో నెన్నియెన్ని బిందువులు సూర్యరశ్మినిపీతము లగు
నెన్నియెన్ని బిందువులు వర్షేందిరానిబద్ధకంచుక జలధరోద్వాంతము లగు.

ఉ. అయనకేమి వాలి సహసాద్భుత సాహస శూరకార్యుఁడై
పోయెను ధాత్రి యేలి బహుభోగములంగనె వానికోసమై
యీ యపలాప మేమిటికి నే యపలాపములాడి వచ్చునా
పోయినవారికై పొగిలిపోవుట నీకునుగాదు ధీనిధీ!

మ. పసివాఁ డంగదుఁడుండె వానికి ధరాభారంబు కల్పించి బు
ద్ధిసమున్మేషణ రాజకార్యకరణాధీనాత్మ వీ వుండి వె
న్కఁ సముల్లాసిత భావ మింత యెసగంగాఁ జూచుకోలేక వె
క్కసపాటందెదు నీ మతిస్థితి కయోగ్యంబైన దైన్యంబునన్.

ఉ. అంగదుఁడున్ భుజాబలసమంచితుఁడైనను నేర్పుమీర రా
జ్యాంగము చూచుకోఁ గలుగునట్టి వయ స్సనుభూతి లేవ, యు
న్నం గదునీవలెం గలుగునా! కపిరాజ్యము నీవు ముందు ని
ల్వంగను వెన్కఁ దక్కిన బలంబు కలట్టిది కాని ధీమతీ!

చ. పొదలు ప్రవాహమందుఁ బడిపోవుట యిష్టమ యయ్యె నొడ్డు చే
రుదమని కోర్కిలేదు మఱి స్రోతసి యట్టుల లాగు నిట్లు లా
గుఁ దివియు లేవగొట్టునని కుందఁగ నేటికి దాని లక్షణం
బది, వలెనంచుఁ గోరికొనునట్టిది యందొక వై పనిష్టమా?

గీ. తూగి సౌఖ్యమ్ము వాంఛించి దుఃఖబహుళ మైన జన్మంబునందుట యబ్బురఁ
సాధుపానీయవాంఛమై క్షారజలనిధి ప్రవాహంబు నందు నీఁదెడు విధాన.

వ. అనినఁదార నిమేషైకభాగంబున నూరకుండి హనుమంతుని వంకఁ గాఁ
దుఃఖంబులో నవ్వి యిట్లనియె.

మ. అవునయ్యా! హనుమా! ప్రవాహమునయం దావర్తమైరా బయో
వివరంబందునఁ జొచ్చుచుంటిని శుచా వీరావఘోరంబుగా
నవు దుఃఖంబును దత్ప్రవాహ సహజంబౌ లక్షణంబే, మనో
ధవుఁ డిట్లైనెడ నొడ్డుచేర నికఁ జింతాసాగరం బీదెదన్.

క. పెనిమిటి స్వరాజ్య మతివకుఁ దనయుఁడు పరరాజ్య,మేనుతనరాజ్యము పో
యినదానను సుగ్రీవునకును నెక్కువ యైనయట్లు కోల్పడుదానన్.

ఉ. వానికి రాజ్యముం దిరిగివచ్చెను నాకును వచ్చునన్న యా
శానత మూలలేశమును క్ష్మాకుహరంబునఁ బెల్లగిల్లగా
వాని ధరాధిపత్యమున బాలకుఁ డంగదుఁ డేటికిన్ రిపు
స్థానము గల నీ తరముచాలక పెని నమ్ముతంబుగన్!

క. ఒకవంద యంగదులు మామకదుఃఖము పాపలేరు మహనీయమతీ!
యొక వేయి నీతివాక్యములకు నొక్క యథార్థవాగ్బలం బుండనటుల్. 264

గీ. వానకురియంగవలయును వసుధపండవలయుఁ బండుటకుంగానివసుధ దేని
కవు వసుధలేని వానయేమవునటన్న వానయన నీర మది సృష్టిప్రథమమూర్తి.

ఆ. మిన్నువగిలి ప్రళయమేఘగర్జలు మహానిలము లశనిపాతములును జేయు
భూమికూడఁబగిలి భూకంపములు మహాప్రళయములనుజేయు బలముకలదు.

చ. సబహుమతిప్రగల్భ మృదుసాంత్వనవా క్కలితాదరా! సురా
రి బహుళ మర్దనక్షముఁడు శ్రీనిధి వాలి మనోజ్ఞ మేఘమై
గుబురుల సస్యముల్ వెలుచు క్షోణిని వేనయి సృష్టికార్యమం
దబలనుగాక రాజ్యమున నంగదు నిల్పుబలంబు లేకనా. 267

గీ. అగ్రహముపూని యాహవ మాడఁగల్గుదున యెవనికోసమై యాడుదును కపీంద్ర!
యెవనికోసమో వాఁడు మహీశయానుఁ డుగ్రశోచ్యస్థితిం బడియున్నవాడు. 268

గీ. వారివారి ప్రతిజ్ఞలు వారివారి నిర్వహణశక్తులు తెలియని వెలఁది వికటీకృతము సేంతగా బొమిడికము కొడుకునకు నొసంగి నిప్పులు చెరిగికొననేల.

గీ. నడుమకంబమ్ము నాటిన నల్లచెఱువుఁబోలెఁబడియున్న వాలిలో మునుకలిడుదు
కూడియన్నింటి కతఁడెయున్నాఁడు నన్నుఁజంపినాతఁడుతీవ్రభాస్కరసుతుండు.

వ. అనుచుఁ దార చేతులు వాలిపై నుంచి తొడలపైఁ బడియున్న వాలి చేసన్న
సుగ్రీవునిఁ జేరఁబిలిచి యిట్లనియె. 271

చ. నిజముగ రామచంద్రునకు నీవలె సాయము చేసియుందునే
యజిరము చేరినన్ రఘుకులాంబుధిచంద్రుడు గర్వబుద్ధినై
వృజినములాడియుందు నొకవేళను జంపినఁ జంపియుందు నీ
రజదళ చారులోచనుఁడు రాముఁడు న న్నిది యెవ్వఁడున్నదే. 272

మ. ననుఁ జంపించెదునంతదాఁకఁ జనియున్నన్ నీదు కోపంబు పొం
దని యీ నాళుల పొందియున్న సమయానన్ నీ స్వభావంబులోఁ
తున నాయందలి నీదు గౌరవమునందున్ దీని చిన్నెల్ కనుం
గొనరాకుండఁగఁ నుండియుండునుగదా గూఢప్రమాణంబుగన్. 273

మ. కడు నీ కోపపు మూలఘాతపు టహంకారంబు నీ చిన్నయ
ప్పుడు నట్లున్నది రాజ్యపాలనము నీవున్ జేయఁగా గల్గు దె
క్కుడు నాకన్న నటంచు నున్నయది నీకున్ దాని నేనెప్డా గు
ర్తిడితిన్ దానఁ దలంచుచుంటె నినుదూరేత్యుం బొనర్పన్ మతిన్. 274

మ. నిను వేటాడితి నేల నాల్గుచెఱఁగుల్ నేనద్దియే యొందు చే
సినదోసంబును నీకుఁగూడ నదియే చెందించెఁ దా నింతయా

కనలున్ నీ కనుకూలమైనది సుమీ కాలంబు, కాలంబు వి
ప్పిన వృత్తంబు కనంబడున్ బురుష దోర్విస్ఫార కృత్యంబుగన్. 276

ఉ. కాలము పండఁగావలయుఁ గాని యొకానొక యెండుమ్రోడు ని
ర్వేల వసంత సంపదురరీకృతి భూషితమైన యప్సరో
జాలము పేల నవ్వులును జాలవు నా సుమనోమనోహర
శ్రీలకుఁ దావలం బగును జెందిన కాలముపంట పండగా. 276

ఉ. తల్లివరంబు కోరుటయుఁ దా వనసీమల సంచరించు టీ
యెల్ల భవద్విలాసపు టదృష్టము సాధుఫలాభిముఖ్యమై
పుల్లము కావుటే యిహము పోవఁగనిమ్ము పరంబు చూడు మీ
కొల్లలుగాఁగ ముక్తిసతికొప్పున నుంచిన పూలదండలై. 277

క. అరయ నిజమైన ప్రేమము పరస్పరవిమర్శ చేయఁ బాల్వరచదు సో
దరు శీలంబున నీ నా విరుద్ధము జనుస్స్వభావవిభవము కాకన్. 278

క. ఏకైక దోషకారియుఁ బ్రాకటగతి రాజశిక్షఁబడసి జనుఁడు న
స్తోకస్వర్గసుఖ పరీపాకాకృతిఁ బరిమళించుఁ బ్రామాణికమై. 279

ఉ. సంగడికాని సూర్యకులచంద్రుని గుర్తిడుకొమ్ము కుఱ్ఱవాఁ
డంగదుఁ డీవు వానిదెస న్యాయముకానిది చేయఁబోకు మీ
యంగన దుఃఖపున్ వ్రణము నంతకొయింతకొ మానుపట్టు రా
జ్యాంగమునందు నీకును సహాయపడున్ గుణలుబ్ధుఁడైనచో. 280

ఉ. ఎన్నఁడుగాని రాజ్యరమ యీగతిఁ జేకుఱె నీకు నెత్తికిం
గన్నులు వచ్చుఁబో మఱపుకల్గును భోగనికాయ కృష్టిచేఁ
గ్రొన్నెలవింటి కోఱయయి గోధుమత్రాచు సుమిత్రబిడ్డ నీ
కన్నలు కారయా రఘుకులాంబుధి చంద్రులు రామలక్ష్మణుల్. 281

ఉ. కాదనుకొమ్ము నీ యెడఁదఁ గ్రమ్మిన భావమునందు నాకు నీ
పై దయలేద యంచనుట వాస్తవమే యనుకొమ్ము కొంత నే
మోదుగు విచ్చెనా విరియఁబూచితి రాఘవ తర్పణంబుగా
నే దయమాట యేమిటికి నెవ్వరిన్యాయము వారు చేయఁగా. 282

క. నాదాఁక వచ్చినప్పుడు కా దీ న్యాయంబుమాట కలితహరిధను
శ్ఛేద పరిదీప్త జలధర పాదాపఘనుండు రామభద్రుని వలనన్. 283

గీ. నేను నీదెసఁదీక్ష్ణుఁడ నీవు పాల్యకపి జనమ్ములయందుఁ దీక్ష్ణతభజింతు
స్వామి చెప్పిన గతి నుంచసహజవృత్తి యా జనంబున జేయకు మాగ్రహంబు.

వ. అని తనమెడలోని బంగారుదండ తీసి సుగ్రీవున కందీయ నతఁడు బెరుకుక
న్నులతో దానిని స్వీకరింప వాలి యంగదునితో నిట్లనియె. 285

సీ. అతనికిన్నాకుఁ బోరువు లేనట్టినాళ్ళ నీవు పినవాన్న పినవాన్న, నెఱి నతండు
నెపుడునబ్బాయియబ్బాయి యావిధముననుండి రిప్పుడారీతినే యుండుడింక.

చ. కపిధరణీపతిత్వ సుముఖంబగు లక్ష్మణ మర్మిలిన్ ద్రిలో
కపతి మహేంద్రుఁ డిచ్చినది కాంచనమాల యొవం డిదిన్ భుజా
విపులుఁడు తాల్చు నాతఁడు కపిప్రభు డాతని సర్వవానరా
ధిపులును నేతగా ననుమతింతురు భక్తి ననుశ్రుతంబుగన్. 287

శా. నాకుం గొంచెము తక్కువంతె యసమాన ప్రౌఢ బాహాబలుం
డీ కోదండసఖుండు పైని సఖుఁడెంతే ఫీఁడు సుగ్రీవుఁ డ
స్తోకప్రాభవ వారిధానము ధరాశుద్ధాంతకాంతా వయః
స్వీకారార్హుఁడు నీవు చూడు మితనిం బిన్నయ్య మున్నయ్యగన్. 288

క. నా కడుపునఁ బుట్టిన బిడ్డై కోలను తండ్రి నీతఁడై యేయించెన్
సీ! కుటిలుండంచు నుండున యా కొంచెము లేకయుండ నరయుము వీనిన్.

ఉ. ఎయ్యది తప్పవెట్టి శరమేసెనొ శ్రీరఘురామమూర్తి తా
నయ్యది తప్పఁ కాదనుటయన్నది యున్నదె? కాన నీవు పి
న్నయ్యయెడన్ మఱేదొవిధమందుట న్యాయముకాదునాయనా!
కయ్యులుకోయుచుం జనెదు కర్మపుఁ గాలువ యడ్డుటెవ్వరో. 290

మ. కొరవడై యీ యొక మోహముం దొలఁచికో, గుఱ్ఱా, మదిం జాలన
మ్మెద, భార్యాధరణీ గతంబయిన దిట్టే త్రెంచితిన్, రామచం
ద్రదయాపాంచితుఁడౌచు నీదెసను బుత్రప్రేమకుం జాలన
మ్మెదఁ, దా నమ్మెదఁ గోరి మోహమునకీవే కోటియన్నట్లుగన్. 291

శా. లంకేశున్ బొమ్మి జనంబు సర్వమును గోలాంగూల రాజ్యాంగ మా
తంకం బింతయులేక పొంటకు నీ తల్లిన్ ధరానీతి ని
శ్శంకం జూడక తప్పు దాతఁడు సదంపద్బుద్ధి సుగ్రీవుఁ డా
పంకం జూడక తప్పదు స్వీను భుజాప్రౌఢున్ గుణాంభోనిధిన్. 292

సీ. పెద్దపని పెట్టుకొన్నార యుద్ధమును మహాభుజాఢ్యులు నిన్నుఁ గాదనను లేరు
అద్దియునుగాక సుగ్రీవుఁ డద్దగోలుమనిపి కాదని నే నెఱింగినది కుఱ్ఱ! 293

చ. వరుస నాకనిన్ సహాయముగఁ బట్టుకవచ్చి ననున్ వధించె ని
ర్భరతర వైరభావమున వాఁడని నిందను మోపి చెప్ప మా
యుపద్రవమందు ఏఁడెవని కెక్కువ చేసెనురయ్య వేని యం
[illegible] 294

మధ్యాక్కర

అంతట వానరచమువు హర్షభావాపేతముఖులు
ప్రాంతధాత్రికిఁ బోయి చూచి ప్రణమిల్లి బాష్పలోచనులు
చెంతకు మఱఁగి నిల్చి నతశేఖరుల్ శ్రేయోనిధానుఁ
జింతించుచుండిరి వాలి శ్రిత భుజాశ్రీచండకేళి. 304

ఆ. వేయికాగడాల వెలుతురులోవలవాలిమేను కానఁబడియెఁ దాను
నిగ్రహంబు పాసి నింగి దోఁచిన గ్రహవితతి వంగియున్న వింజమట్లు. 305

మధ్యాక్కర

వెన్నెల నీడలు దివ్వె వెలుఁగుల వెనుక నీడలును
జిన్న భూజముల నీడలును జిక్కని చెలఁగు నీడలును
కన్నులకుఁ దోఁచె ధాత్రి కాలకింకరు లేగుదెంచి
సన్ననాఁ దిరుగాడుచున్న సన్నగా వ న్నగాగ్రమున. 306

ఆ. వాలిమేనినుండి బాణమ్ము పెకలింపఁబడియె మఱి పెకల్పఁబడిన యమ్ము
నల్ల త్రిపుర సంగరాంతంబునందున శివుఁడు బండియిరుసు చీల్చునట్లు. 307

మధ్యాక్కర

ఈదృశబాణమ్ము చూడనేలేద యెవ్వరు నెప్పుడు
పొదలిపై ధాత్రి పైకిఁ బట్టిన బంగారుకంటి
ఆ దైత్యు కోఱమో యద్ది యానాఁడు హరియించి దాఁచి
యీ దిట్టయమ్ముగా మలఁచి యున్నాళ్ళ కేతఁడు తెచ్చె. 308

ఆ. అమ్ము వెఱికఁబడిన యవ్వాలి వెనుకొమ్ము తెక్కతెగిన భూమిభృత్తుకొమ్ము
చిలికి చిలికి మొక్కజీరమై మందర పర్వతమ్ము వెత్తు పాలవెల్లి. 309

ఆ. అంత శ్రీరామచంద్రుండు సలక్ష్మణుండు దవ్వు చని విశ్రమించి యుండఁ
గపిలోకమ్ము గుంపులు గుంపులై. 310

మధ్యాక్కరలు

అమ్మమ్మొ కిష్కింధ యింక నాంధ్యమ్మునందు మున్గినది
సమ్ముదైనది పుటికోఘ వనములన్ వాహ్యాళిసొబగు
కమ్మ కోసినది వైతరణి కపిలోక కనకదుర్గమునఁ
గొమ్మవెట్టెరి మమ్ముఁ గావ వటువులు భాగ్యదేవతలు. 311

ఏపునైన సంవత్సరములు పవలు రేల్ బవరమ్ము చేసి
కొలిమించి కుదియించి చంపె గులెలుని గోలభనాము
ముదిమార్త్త గంధర్వపతిని మా వాలి మహా శూరజేత
యది చెయిమెచ్చట పొరకు నట్టి మహారాజు మాకు. 312

తినినాడి తననాకి సప్తతాళక దళనోత్సవములు
కనుఁదెంచి కనుఁదెంచి దైత్యసంహార సమయోత్సవములు

వెనువచ్చి మునువచ్చి యురక వెలయించు వీరోత్సవములు
వెనుకఁబడ్డవి మనకును కపిజగతి వీరుండు పోవ. 313

గోఘృత కృత దీపము నిదిగో పుటుక్కున నార్పివేసె
తా ఘోరకర్మనిపుణుఁడు ధాత మా ధామమ్ము లందు
నోఘుంబులుగఁ గట్టి వచ్చుచున్నట్టి యుజ్జ్వల లక్ష్మి
నీ ఘోరకలి చేసి దుష్టుఁడిట్లె మాయించె విధాత. 314

గీ. అకట! యీ రాముఁడని చెప్పనట్టివాఁడు నీ మహాకపిరాజ్య శౌర్యేందిరా మ
హోజ్జ్వల ప్రవాహం బెల్ల నోడ్చిపెట్టె కపిజగన్నాథు ఱొమ్మున గండికొట్టి.

వ. అనుచుఁ గపిలోకం బెల్లఁ బ్రొద్దువోయినకొలది నొకొక్కఁడు నిదుర క్రొ
నంగదుఁడును సుంత కునుకఁ దారాసుగ్రీవు లిద్దఱే తెల్లవారుఁ లట్లె యుండిరి.

గీ. అదియెదో యిట్టిదైన దంచైనఁగాని యెఱిఁగి త న్నాడు నంచైన నెదురు చూచుఁ
గెరలయొకమాటయనదుసుగ్రీవుఁదార వదినెతోఁబల్కనాతఁడుభయముఁగాను.

గీ. తార తనలోనె తా సముద్రాలు త్రవ్వి వెళ్ళవెళ్ళలు గాఁగ త్రిప్పికొనుచు నుండె
నొక్కపుడు మిర్మురమ్ము లింకొక్కయపుడు ప్రకుపితాకాశమండలోల్కలుగాఁగ.

క. తూరుపున నుషోరాగము చేరికఁగనె నంచనెక్కి చెదరీకలు నాన్
వీరకపులు జాగ్రచ్ఛోకాయాఢి సముంబుగాఁగ నక్షులు విప్పన్.

వ. అంతఁ దార తూరుపుదిక్కునందుఁ జూపుచు నిట్లనియె.

ఆ. ఎంతమంది లేరొ యీ జగమ్మునయందు వచ్చివచ్చి కమలబాంధవుండు
తనకులంబువానిఁ దనదిక్కుఁ దన శిష్యు నక్షి నా మొగానఁ గ్రాల్చిపోయె.

గీ. మగని కసరిష్టమేదియో మదికిఁదెలిసెమొదట నేనిష్ట మనుకొంటుఁబిమ్మట నాకు
లక్ష్మి యదియిష్టమనుకొంటుఁ లక్ష్మిమీఁదనుమున మఱచినానే యున్నదని యిపుడు.

మ. ప్రథిత శ్రీపతిపాహమూర్తియును తారం జెప్పఁకో లక్ష్మిగా
పథసమ్మర్దముగాఁగ నా సకలసౌభాగ్యంబు మృగ్యంబుగా
మథితంబై సిరియెల్ల నిప్పటికి సామాన్యంపు స్త్రీనైతిఁ గా
దథమ స్త్రీ నయితిన్ సుమంగలులలో నంశంబు ధ్వంసంబునన్.

శా. ఓహో రాతిరియెల్లనున్ బ్రదికియే యున్నాను నేనీ పనిన్
దేహం బేటికిఁ దాల్చియుండను సమర్థింపంగ నేలుండుచు
శ్రీహోదుష్టత నిట్లెయుండెదన యా యాహోస్వరూపంబె నా
కాహో తోఁచదుగాక దేహగత మోహభ్రాంతి యిట్లుండునా! 324

చ. ఇవియుఁ దమంత తా మనువు లేటికిఁ బోవు మనోసుమేలను
బవు నొక గాఢసంస్మృతి విహారము పారిన నుండెకాక.

త్రవిహ్వలి యాత్మ కిష్టమును దారులు రెండును రెండుగా వృథా
భవ మిది శిష్టమైన పరిపాకము పొందని మొండికట్టెయై. 325

క. బలవంతపుఁ జావు మహా విలము నరకహేతువన్న విధమగు టెల్లన్
బొలసిన దుఃఖము లన్నియు వలపోతఁగ ననుభవింప వలసినయట్టుల్. 326

శా. ఉద్దీప్తాంబక కాలరుద్రుఁ డతఁడో హో స్వామి యచ్చోటు పో
వద్దయ్యా యని యెంతచెప్పినను నా వాక్యంబు పాటింప కీ
షద్దోశ్శీలము శౌర్యధర్మము ముముక్షాబుద్ధిఁ బాలించితే
మొద్దుంజేసితి నన్ వసంతవిదళ ద్భూమీరుహశ్రేణికన్. 327

క. ఆ వాలి చచ్చిపోఁగా నీ వనితయుఁ దార బ్రతికి యెట్లున్న దనన్
దా వర్షఋతువు పోఁగా నో విభు! పొగగుంపు మబ్బు లుండవె మింటన్

మ. ఇది యేదో యొక మృత్యుతాపముగ స్వామీ! నన్ను లోనుండి త
ప్పదు నిన్నుంబడి పొమ్మటంటిని వియత్పూర్వాప్త మార్గంబునన్
పోవ నావత్సము గాఢవాత్సల్య సంరావంబు సర్వంబు నా
యెదలోఁ బుట్టె నికొక్క డింపుకొనుటే యూ వేగ కాత్రోవలో. 328

వ. అని గ్రుడ్లు తేలవేయుచున్నంతలో నంగదుం డమ్మా యని యఱచి కౌఁగిలించుకోఁగాఁ దార నుడిగుండంబునుండి పైకితేలి తెప్పిరికొడుకు మెడమీఁద వ్రాలి యేడ్చి యేడ్చి మెఱలఁ దన్నుఁదా సంబాళించుకొని చీరచెఱఁగునఁ గన్నులు తుడిచికొని కుమిలి పోవు కొడుకు నాటుకొని తండ్రీ! లేదు లేదు నేను బ్రతికియే యున్నానురా యని యోదార్చి యంగదుండును దేరుకొనఁగా నిట్లనియె.

ఉ. అక్కట! కాననాంతమున నాడఁగఁబోయినవానిఁ బిల్లవా
డెక్కడి కేగెనం చడిగె డెప్పఁడు వానిని పేయికన్ను లం
దక్కఁగఁ జూచుకొందు క్షితిశాసకుఁ డౌనని వాఁడు చూడు కా
లొక్కొకక్కఁడు వానియెడ దయఁబూనవె వానర లోకనాయకా! 331

ఉ. సాహల రాజ్యలక్ష్మియుత దోర్బలశాలివి రాజకార్య ని
ర్వాహకుఁడైన నీకుఁ బనివాఁడుగ నెన్నఁడె యుండిపోయె ధీ
సాహస మింత లేకయ భుజాబల విక్రమవంతుఁ డయ్యె రా
జా! హరిలోకసంస్తుత సుహాలయభూజ! యనుగ్రహింపవే. 332

క. అమ్మయ్యో బుట్టె బిడ్డను జొమ్మునఁ గట్టుకొని వనులఁ గ్రుమ్మరుదునా శా
ఖమ్ము బలమ్ముండియు రాజ్యమ్మున సాహసము సేంత చాలని బిడ్డన్.

గీ. ఎవనిఁ జూచిన సర్వలోకేశ్వరత్వ మందినట్టుల సంతోష మందుచుందు
వా కుమారకు నంగదు నంతికమున శోకవార్ధినిమగ్నునిఁ జూడుమయ్య. 334

శా. ని న్నం దాఁగుమటంచు బిల్చితిని మన్నించఁడా! సమస్తంబుగా
సన్నాహంపడి దుఃఖపున్ సుడి నధస్సంచారిణిన్ వచ్చుచో
నన్నుందోడుకొనెన్ సుతుండు పయికిన్ నా స్వామి! నీ వెంట రా
నన్నా నంచనుకోకు ముంటె సుతరక్షార్థంబు శత్రుంజయా! 335

శా. ఓహో వీరచమూసమూహమ! ఇచావ్యష్టాత్మయా తార సం
దేహింపన్ మది నెంచఁబోకుఁడు ధరిత్రీజాని పుత్రున్ జమూ
వ్యూహప్రాజితఁ దల్లిదండ్రులకుఁ గాకుండం గనన్ లేని మం
దేహన్ జావక నిల్చుచుంటెని జడే యీ నన్ను మన్నింపుఁడీ! 336

మ. ఇదిగో చూడుఁడు మీరె యెట్లడుముకొం చీడ్చ యున్నాఁడో భీ
సదనుల్ కౌఁగిటఁబూనినన్ నిలువరించంజాలగా నైనయ
ట్లదయుంబౌ విధి ప్రాణముల్ తిగుచుచో నాపత్తు నిర్మాయికం
బది చేయించును హాస్యకర్మములు దేహాధీన వృత్తంబులై. 337

గీ. అనిమిషులవారిపై వ్రాలి యుంబుజాక్షి యక్షికోణంబులందు బాష్పాంబులహరి
విహరదూర్జదవశ్యాయ బిందువులుగఁ గలఁగఁజొచ్చె నుషస్తటాకంబువోలె. 338

స్రగ్విణి.

తార దుఃఖోగ్రసంతాప మీ మాత్రఁ జల్లారునం చెంచఁగా నంత కంతంత దు
ర్వారమై ఘోరమై వచ్చి వారింపఁగా నేరనట్లయ్యె సందీప్తమై యెవ్వరున్. 339

గీ. అల్ల ఖండితయైన ఛాయాలతాంగి తాను గనిపించఁగా దవ్వుదవ్వు పోవఁ
బతియు ధూర్తుండునై పైకిపైకిఁబోయి క్రమముగా లాగికోఁజొచ్చెఁగౌఁగిటికిని.

గీ. మొదలుపెట్టుచే ఓట్టెండమొదలుపెట్టె నకటమాధవుఁడునుగ్రీష్మునంత వెళుసు
చివురు నెత్తిన మెత్తన చెప్పఁచుండె వాని కాఠిన్యమును మార్దవంబు కలిపి.

గీ. అంబుజాతాళి వికసనాధ్యాపకములు జలజహిత శిలాశౌర్య శిక్షాగురువులు
శిష్టమాఘ్యప్రసూన విశీర్ణపటువు లంతఁ జెరలాడె సూర్యబాలాతపములు.

గీ. మెట్టయైన కిష్కింధ సమీపధాత్రి సమముగానున్న యటవి వృక్షముల తలలు
చివురులం దరుణాతపశ్రీ వహించె వారి మైనెత్తురులు జాలువాఱినట్లు. 343

గీ. చిఱుత తెలిమబ్బులచ్చట జీరువారి పశ్చిమాశాలతాంగి సంవ్యానకములు
నచట మార్తాండుఁ డుదయించినట్లుగాఁగ భాస్వవస్త్రోత్రకాంతులు ప్రస్తరించె.

గీ. దైన్యమునఁజేసి యచటియందఱును బొమల
యందుఁ జిట్లించుకొనిచూడ నాతపాధ్వ

ములను వెలుఁగుఁగుంగరములు గుమ్ములుగఁదోఁచె
యముఁడు కొనిపోవు వాలి ప్రాణములువోలె.

గీ. వాలి మైనుండి పెకలింపఁబడిన శరము దూరమున నుండ వానరస్తోమ మొకఁడు
దాని దగ్గఱకుం బోడు దాని వంక బెళుకులగు తెప్పగ్రిందిచూపులు నిగుడ్చు.

గీ. ఋష్యమూకాటవీ తాళవృక్ష శేఖరములు రక్తజపాతోరణములు గాఁగ
సిత జలదపంక్తి ప్రతిబింబసిద్ధి వాలి గాయమును బ్రదర్శించెదు గతిఁదలిర్చె.

స్రగ్విణి.
తార దుఃఖోగ్రసంతాప మింతేని చల్లారు నంచెంచఁగా నంత కంతంత దు
ర్వారమై ఘోరమై వచ్చి వారింపఁగా నేరనట్లయ్యె సందీప్తమై యెవ్వరున్. 348

వ. అంతఁ బరమదీనుండైన సుగ్రీవుఁడు శ్రీరామచంద్రుని వెదకు కొనుచుఁ బోయి
యడవిలో నాయనను గాంచి యిట్లనియె. 349

గీ. నీ ప్రతిజ్ఞ యేమొ నీవు చెల్లించితి నా ప్రతిజ్ఞ నేను నలిననేత్ర
చిత్తవీధియందుఁ జింతింపఁ జెల్లింపఁ గలుగునంత పటిమ కానరాదు. 350

గీ. నీవు దండ్యుని దండించినావు రాజ నేను చేసినపని యేమి యీశ్వరా! మ
హానుభావునిఁ జంపించినాను సర్వ కపిజగత్పరమేశు నగ్రజుని రాజు. 3 51

ఉ. ఆడిడ దుఃఖముం గనిన నక్కటా! నా పొనరించు తప్పు వే
మై బహులక్షకోటిగుణమై కనిపించెడు బుద్ధిలేదు నా
యా బవరంబునేంత సుజనావళిగర్హ్యము దేవనింద్య మా
హో! బహిపెట్టునట్టిది కులాగత వృద్ధజనంబు విన్నచో. 352

శా. నాకున్ రాజ్యము పాడు వద్దు ప్రభువా! నామిత్రమా! రామ! పూ
ర్వైకస్థానము ఋష్యమూకగిరియం దట్లే చరింతున్, ధరి
త్రీకన్యామణి వానరుల్ కలరు మైత్రీరమ్యులు న్నాకు న
స్తోక ప్రౌఢులు వారిచేత వెదకింతున్ దిక్కుడుంగమ్ములన్. 353

ఉ. సాః విరోధమున్ జనకజాప్రభు! హృద్గత కోపజన్య హిం
సాగుణమౌ విరోధ ఫలసంగతి కల్గకమున్న వేఁడు న
న్నా! సుడునై ఫలించిన యనంతర మింకొకఁ డాదిఁ గోపమున్
సాగిన దుఃఖమున్ హృదయశాంతియుఁ దృప్తియు రెంటదూరమై. 354

చ. కళవెళలైన దుఃఖములు క్రమ్మఁగఁ దారయు నంగదుండు ని
శ్చలితములైన గుండియలఁ దారుగ నాచుఁ బతిన్ బితన్ శుచా
కళయముపొంది చూచుటకు వచ్చిరి దుర్గమునందె యుండి క్రా
త్రశమలు లగ్గలెత్తి చలితంబుగ నిల్వరుకాక పోరికై. 355

శా. అట్లుల్ సేసిన నేమి చేయుగలనయ్యా! యన్నతోపాటుగాఁ
బట్టన్ బట్టపురాణి బంధువులనుం బట్టించి చంపింతునా

కోట్యాగ్రంబున లుంగపెట్టి వ్యవధాకూలంకష ప్రౌఢిమైఁ
జిట్టల్ రాజ్యదురాశ యే యఘములం జేయింప దాకుంచనన్. 356

క. ఆ యన్నయు నా వదినెయు క్ష్మాయధిపతి నేనటంచుఁ జాటెరి పుత్రుం
డైయుంగదుండు పోయెను నాయెద వారియెద తెలిసెనా స్పష్టముగా. 357

శా. నిత్యోద్వేగిని క్రూరకర్ముఁడను మందీభూత ధీసూక్ష్మ నై
శిత్యాగ్రూహతుఁడన్ వృథాప్రకుపితాక్షిప్రాంతరాత్ముండ సౌ
మత్యం బన్నది పర్వతాభ మగు దౌర్మత్యంబు నాదిట్లు తా
మత్యంతంబు జగంబునం దెలిసె నేనై పాపభాగిన్ ప్రభూ! 358

గీ. ఇంటిలోఁజీమకెక్కు_వం చెనఁడొయుపిహెరించుటకుఁ ..ంపచూరుముట్టించెనంట
యట్టి యున్నది నా చేసినట్టి కర్మ సాధుజన శిరోమణి నన్నుఁ జంపెనా... 359

శా. నాస్వామి! రఘురామ! యీయఘము నానాజన్మలన్ వచ్చునా
అస్వర్గ్యం బిది సర్వపుణ్యముల కడ్డై కట్టనా నిల్చునా
నిస్వార్థంబుగ ధాత్రిపాలనకళా నిర్ణేతగాఁ జేసె దాన్
నే స్వార్థంబున వానిఁజంపితిని దంద్రెంబోలు నన్నన్ మఱిన్. 360

చ. అతఁడు పరాక్రమాంబునిధి యంగదుఁ డాతని కింతచేసి నే
ప్రతనుమతిన్ మఱేమి యువరాజును జేసిన ధాత్రియందు వం
చితుఁడయి లోన విప్లవము చేయుచునుండిన నేమియౌను? నీ
క్షితిసుత కానిపించునయుఁ జేయునొ, లోననెజేయునో మఱిన్.

మ. మదిలో నన్నును సాగనిచ్చినది యా మాత్రంబునానైన నం
గదునిం జూచియె యున్న నాయెడి మెలంగన్ నాబుజం బూనగన్
గదియున్ మోమును మోము నవ్వుకొనఁగాఁ గంఠంబులం గ్రమ్ము...
నది తా నంతటి ప్రేమ వానికెని గట్టా! యిట్లుగాఁ జేసితిన్. 362

ఉ. పాపము పుణ్య మంటని స్వభావమహేశ్వరుఁ డీవు పాపపు
ణ్యావతితోగ్ర జన్మమరణాది పరంపరుఁ డేను రామచం
ద్రా! పరమాఘ మియ్యదియు నద్ది నిజంబగు చివ్వకాదు ని
న్నీ పరు వెన్క_దాచి వధియించితిఁ బాపములోనఁ బాపమై. 363

చ. మొగి నఘముం బొనర్చకయమున్న మహాంధ్య మదంతయున్నదే
తగ నఘముం బొనర్చు పయి దట్టపుఁజీకటి యింత క్రమ్ముకొం
చెగచుచు నున్నదన్న వెఱనేటికిఁ గోటి కిరాతరూపుఁడన్
సొగసగు నీ మొగంబొకటి చూచి సమస్తము నోర్చికొంటగా. 364

శా. జీవత్కా_లమునందుఁ గొందఱు పరిక్షిప్తాత్ములై నట్లు క్రో
ధావిష్టుల్బలెఁ జేష్టమాన పటుకామాధీనులంబోలె స్వ

ర్భావుల్ కన్పడి మృత్యువేళఁ బరిలుప్త క్లిష్టదుర్లోకికాం
హో విస్ఫూర్తులు తోఁచుచుండెదర యందొక్కండు మాయన్నయై. 365

శ్రీరఘురామచంద్ర! అతసీకుసుమాభశరీర! కేకికే
కా రమణీయ రావలతికా పరిహాసి మనోజ్ఞషడ్జ మౌ
ర్వీరవ! చాపసంపదురరీకృత మత్కృత జీవకర్మ మా
ర్గా! రుచిరాత్మ! మత్కృతమఘాధ్వపు నిష్కృతి యేమి చెప్పవే! 366

నాకున్ ధాత్రిరమా విధాత వొకఁడేనా! చిత్తసంశోధన
వ్యాకృద్దేశిక దివ్యమూర్తివిని నీవై నన్ను మన్నింపవే!
కా కీ సంశయ దుఃఖవార్నిధి తరంగమ్ముల్ ననున్ ముంచున
ట్లై కూర్చున్నవి మందహాస రుచిమాలా దీపితాత్మద్యుతీ! 367

ద్వ్యక్కరలు
మొల్లమ్ముచెడని నల్లవిసెవ్వూవు వంపున ప్రాలు నాగ
వల్లీ సితానూన బాలపత్ర శోభా రమ్యభావ
ముల్లోల పరివాహ ముదరి యుదరెనో యూఁగునో యనిన
మెల్లని మందహాసముల మేలు నా మేలు నారయుత! 368

సన్నని గులకరాళ్క్రింద జరిగెడు సైకతస్థలుల
చిన్నారి సెలయేటి సన్న జీరాడు చిఱునీటిపైని
సన్నసన్నని యలల్ కదలు చాయగా సాగు నీ సెలవు
ల స్నీటు లొలికెడు నవ్వులన్ వెన్నెలల్ నాకు రక్ష. 369

అనిన శ్రీరామచంద్రుండు ససౌమిత్రి సమాదృతమైత్రి సకోదండుం డాలం
బిత సుగ్రీవ బాహాదండుండు వాలివధ దేశంబు కించిత్తీక్ష్ణాతప ప్రకాశంబు
చేరిన నచటి వాలి చుట్టాలైన పెద్దలు తారను జబ్బులాని లేపిన నామె
శ్రీరామచంద్రునిఁ జూచి గుర్తించి కోపదుఃఖ గౌరవనిరాదరణ భావంబులు
నేత్రాంతమ్ముల నుద్దీప్తంబులుగా నిట్లనియె. 370

మా మా దుఃఖమ్ములు మఱి మీ మీ మృదుమందహాస మేదురవీథుల్
మా మాన ప్రాణహతిన్ మైమఱపులు మీకు కేళి మందస్మితముల్. 371

ఉ. నీవు త్రయీమహార్థ పరినిష్ఠిత బుద్ధివి కోమలాంబుద
శ్రీవలమాన మోహన శరీరుఁడ వీవు సమస్తధాత్రి ర
క్షా విభుదార సంగత భుజానత మూర్తివి సర్వదూషితాం
హో విస్మృతిక్రియా విదళనోత్సుకభావ ధృతేషు రాజివిన్. 372

అల్పాల్ప కార్యధిషణా జల్పులు నల్పాల్ప కార్యచరణాలపనా
కల్పులు మఱి త్వాదృశులు ననల్పులు మీ ద్వైధధర్మ మాకృతిఁ గొనగా. 373

సగముచేసి మఱియు సగము మానరుగదా త్వాదృశులు సమస్త దక్షులగుచు
నల్పు లేమొ యింత యంతగాఁ బొనరించి సగమునందె విడిచిచన్నయట్లు. 374

మధ్యాక్కఱలు

నీవు సమస్తధర్మములు నేర్పిన నేరుపుకాఁడ
వీవు సమస్తశిక్షలును నేర్చెడు నేరుపుకాఁడ
వీ వే పనియును మిగుల్ప వెత్తిన యిషువును మాన
వావిష్కృత త్రయీధర్మ! యానందహాసోర్మిమర్మ! 375

స్రగ్విణి.

నీ త్రయీవేత్తృతా నిశ్చలజ్ఞానమున్ సత్రపామూర్తినేఁ జాలనే చెప్పఁగా
గాత్రమందర్ధమున్ ఖండితంబై చనన్ పాత్రమా శిష్టసౌభాగ మిందుంచగాన్.

సీ. ధరణీసుతా పయోధర లగ్న కస్తూరికాలేప సంరూషి తాసితాంగ!
ఖరదూషణంగనా కజ్జల నీల దూషిత బాష్పజల ఝరాసిత శరీర!
అఖిల వేదార్థ రథ్యా శారదిక చంద్రికా లవలీలతికా సుహాస!
అఖిల లోకాపదాహాకార దర్శనశ్రవణ జన్యానవాబ్జాతహాస!

గీ. సగముపానరించి మిగిలించిసగము త్వాదృశులు పానర్పరుగద మహాశూలంబనిఁ
బురుషునకు నర్ధదేహంబు బూవుఁబోఁడి వేదములయందు నిర్ది చెప్పినదికాదె.

భుజంగప్రయాతము.

భవత్కీర్తిదీప్తుల్ ప్రభావంబు లాపూర్ణ విశ్వప్రతాప స్ఫురత్కార్యజాలం
బు విస్ఫెంతు స్వర్గాదిభూమిన్ శరాంతవ్యవచ్ఛిన్నదేహన్ గృపంజేయవే నన్.

అ. అనుచు మోయలేక యట వాలి నేసిన యమ్ము తెచ్చి చూపి యనియె నిట్టు
లిన్నినాళ్ళదాఁక నే నెఱుంగను సుందరాతి సుందరుం డటంచు యముని. 379

గీ. ధనువు నక్కఱలే దల్లెత్రాడు వలదు పుచ్చుకొను మంతె పూచికముల్లువోలె
గ్రుచ్చుకొని నేనె చత్తు వికుంఠశౌర్య! తనువు నక్కరలేదు చింతయునులేదు.

చ. అని పరిదీనమూర్తియు హృదంతర దుఃఖయు గూఢకోపయున్
వనజదళాయతాక్షుఁ గని పల్కిన రాముని గూర్చి తార, యి
మ్మునఁగొని చేతిలోని శరముం బ్రభుఁ డార్ద్ర పయోదమూర్తి ప
ల్కెను గినుకం దృజింపు కలికీ! యది చూడుము శోకహేతువౌ. 381

మ. తొలుతన్ దుఃఖమె మోహజన్యముగదా తోరంబుగా దానిలో
పలి దీ కోపము దుఃఖ మాంధ్యమయినం బాటించి తజ్జన్య ము
జ్జ్వల మా మోహముకంటె మోహమి దియున్ సంధ్యాపయోదారుణో
జ్జ్వల నేత్రాంచల రజ్యమానసుషమా! చాలింపుమీ మోహమున్. 382

గీ. ఎవరు నెవరిని దెచ్చినదేమొ లేదు నేండ్లుగాఁ బూండ్లుగా నేడ్చి యేడ్చి యతివ!
చచ్చినన్ దుఃఖమేటికి జన్మమంది నపుడు దుఃఖింప వలయుఁగా కంబుజాక్షి!

ఉ. కాలముగాని కాలమునఁ గాలము వచ్చునె, కానివేళలోఁ
గాలము కోరి మృత్యుముఖగహ్వరమందునఁ జొచ్చినన్ మఱిం

గాలము నోకిలించుకొని క్రక్కును, గాలవివేక మేదు దు
శ్శీలము జంతులక్షణము శేముషిమాలిన మోహవృత్తియై. 384

చ. చచ్చిన భర్తవెంటఁబడి స్వర్గము నేగెదనన్న భర్తయై
చచ్చినవాఁడు తాను జనె స్వర్గమటన్నది నిశ్చయంబు లే
దచ్చటె నీవు పోదు వనునట్టిది యంతకుమున్నె లేదు స్వ
స్వోచ్ఛయ కర్మమార్గముల నొక్కరి కొక్కరి కెవ్వ రంగనా! 385

శా. ఆ కించిత్త్వవమాన మేగినను దేహం బుగ్రకల్మాషరే
ఖా కూలంకష దుష్టమై దహనసంస్కారేతరాయోగ్యమౌ
సీ! కామోల్బణ మోహవృత్తి హసన శ్రీభూమి జన్మాంతర
ప్రాకామ్యంబగు జీవకామమున స్త్రీత్వమ్మున్నదా నీకునున్? 386

క. తత్కాలభావరమణము సత్కార్యము, దుఃఖ మిది యసత్కార్య మ్మి
షత్కామ వివశతన్ సదస త్కేవలభావచర్చ సాగదుసుమ్మీ. 387

శా. ఆ సన్నామకమౌ పదార్థ కమనీయాభిజ్ఞకల్గన్ సదా
వ్యాసంగస్థితి మూలమై నియమ మేకారాధ్యమౌ లోకయా
త్రా సమ్యక్స్థితి సర్వమున్ నియమబద్ధం బీషదాశాలతా
భాసాభాసము దేహి సౌఖ్యము దురభ్యాసంబు దుఃఖాకృతీ! 388

గీ. నియతినియతంబు సర్వావనీభరంబు బ్రహ్మలోకాదికముగాఁగఁ బడఁతి! నియమ
రహితమైనది నరకమార్గంబు నియమ రహితమార్గాన దుఃఖంబు ప్రథమదళము.

క. అనుచున్న రామచంద్రుని వినిభృత గళరవము మేఘవిస్ఫార విఘూ
ర్ణన మంథరగర్జామోహనరావము వినుచుఁ దార యట్లేనిలచెన్. 390

క. అయమ కోపము దుఃఖము నాయమ సోత్ప్రాసి మఖిల మంతర్హితమై
శ్రీయుతుని రామచంద్రుని ప్రేయః కంఠస్వరంబు వినుచు న్నిలిచెన్. 391

వ. అంత లక్ష్మణుండు తారునిం జూచి నీవు పురంబులోనికిం బోయి వలసిన
పదార్థ సంగ్రహణంబుచేసి మీ యాచారానుకూలసర్వ ప్రయత్నంబులు సిద్ధంబు
చేసి కైకొనిరమ్మని పంచి సుగ్రీవాంగదులం జూచి యిట్లనియె.

గీ. వయసుమీరినవాఁడును వయసుమీరనట్టివాఁడును నొకరీతియై మెలంగ
జరుగవలసినకార్యంబుజరుగఁగలుగునొక్కొ యిట్లు పెట్టుకొని కూర్చుందు రేమి?

ఉ. ఓలిన బోలెడంతపని యున్నది యేడ్చుచు నిట్లె యుండుచున్
జాలముచేయఁ దీక్ష్ణకరజాలమువాం డపరాశఁ జేరు నీ
వేళనె వచ్చుఁ దారుఁడును వెళ్ళినవాఁడు, వివేకహీన దీ
నాలపనంబు సేతు రని యన్నయుఁ దండ్రియు లేచివచ్చునా? 394

వ. అనినంతఁ దారాంగద సుగ్రీవులు లక్ష్మణునివంక బెఱుకుబెఱుకు చూపులు
చూచుచుం బ్రశమితదుఃఖు లన్నట్లుండఁ దారుండు సర్వసంభారములతో

నరుదెంచిన వాలికళేబరంబు వాహకులు శిబికారోహణంబు సేయించినఁ యిట్లనియె.

మధ్యాక్క_అ.

ఓ మహారాజ! యీ నీకు నొకనాటి యువిదను నాకు
స్వామి! తిరెబుణంబు నీవు చనినావు స్వర్గభూములకు
నా మనోనాథ! కాకుత్స్థనాథ దుర్నారాచశేఖ
రామేయవహ్నిదగ్ధా! మహావీర! యతిలోకశౌర్య!

వ. అంత బసిండి బొమిడికంబు కలది యష్టాపద మణిమయ స్తంభం బంతర్ని దేవాసురయుద్ధ చిత్రణంబు శిబిక సాగి మసనంబు దరిసి సంస్కారానంతరం వాలి దేహంబు చితారోహణంబు సేసి యగ్ని ముట్టించినఁ దార యిట్లనియె

మధ్యాక్క_అ

గోలభదుందుభిముఖులు కూళలౌ కుటిలశత్రువుల
లీలగాఁ బరిమార్చి దేహాళిసుమాలిన్ హారమట్లు
హేలగా నిర్చి నాతార యే నిదె యేగుదెంచితిని
బాలా యనుచుఁ బిల్చు నా శుభము చితిపై మండిపోవు.

వ. అని బిట్టు విలాపించిన నందఱు నోదార్చినంత నంగదుండు కర్మ శేష పూర్తిచేసి గృహాభిముఖుండైన వేళ నందే చదికిలంబడి చేతులు మొగం నిడి యిట్లు విలపించె.

మధ్యాక్క_అ

అయనయున్నచో నా భయంబున కవధి లేదాయె
అయన కేమొ నాయందు నగు ప్రేమ కవధి లేదాయె
అయన యొక్కఁడే ప్రాభవాంభోమహారాశి యనిన
నాయన యనుకొన్నఁజాలు నావంటి నలుసైన జీవి.

వ. అట్లున్న యంగదుని నోదార్చి యోదార్చి యోదార్చలేక సుగ్రీవుం డుస్సు తుదకుఁ దనుఁదాఁ బట్టుకొనలేక కొడుకు ప్రక్కఁ గూర్చుండి పగిలిపోవు నియె.

మధ్యాక్క_అ

అయన పోయెనం చక్కటా! దుఃఖమందిన నేను
మాయురే నలువురు నవ్వుమాదిరి మలినకృత్యంబు
చేయించి చంపి యేడ్చుటను జేయుదు సిగ్గుమాలినటు
నా యీ మహోఘంబు తీఱునా వేయి నాటి లింగములు

వ. ఈ దృశప్రవర్తమాన దుఃఖ వారి రాశి నిర్మథన జనితాప్సరఃకదంబ వియద్వీ సంగీతకం బటు నిటు వినిపించె

మధ్యాక్కఱలు

రఘుకుల క్షీరాబ్ధిచంద్ర! రాజీవరమణీయనేత్ర!
యఘునాశిగుణరాశి! మోహనాంభోధరానీలగాత్ర!
మఘవమాణిక్యాంశు మంజుమంజుల మధురతోరణ స
రఘమాలికారమమాణ రమ్యాంశు రథ్యాశరీర! 404

ఆనందవీథివిహార! అఖిలలోకైక ధానుష్క!
వూని వారించెను దార పోవద్దు పోరికం చతివ
నేనె వచ్చితినయ్య! మోహనీహార నీరేజబంధు!
నా నిండుకోరిక పండినది నీదు నారాచముక్తి. 405

ఖండాంతము

సీ. ఇద్ది గజపుష్పి ఖండ మాహేయహేయభావ విదళన భూషణాభ్యాస భాస!
శ్రోతృజన సాధుమండలానీత ధవళకీర్తికాంతాతనూచ్ఛవి క్రీతవపుష! 406

చ. లివలివలాడు నుష్ణకడలింబలెనైన హ్యాషీక రాశిలో
దవశిఖ రేఁగాఁ దరిచెదన్ దయతో నిది నీవు కుత్తుకన్
సవరనఁ దాల్చకున్న యెడ స్వామి! తనూదహనంబు గల్గు నా
కవుదువొ కావొ తెల్పఁగదవయ్య! సుధాహరణాభిలాషికిన్. 407

జలదము.

ఆశ్రిత పారిజాత కుసుమాకృతి! యోగాశ్రయ చిత్తవీథి నిహితాదృతి!లో
కాశ్రుతపాపకార్యచరణాధమ వృత్తిశ్రమణాసితాధ్వ నికృతి ప్రతిఘా! 408

* * *

# నియమపాలన ఖండము

క. శ్రీగంధవాహమూర్తీ సాగురు కస్తూరి పరిమళావధిక గళా!
పూగీవల్లీ ముగ్ధ తనూగిరితనయానుషక్త నూతనవక్షా!

శ్లో॥ నాహం చతుర్దశసమాః పరమవ్రతస్థః
గచ్ఛామ్యహో కమపి పట్టణ మగ్ర్యభోగం
అంబావరప్రకటభావ ముపేత్య తస్యాః
వాక్యే ప్రతిష్ఠిత మనాః పరిహీణ భోగః.

క. అనఁగా, స్వామి హనూమంతునితో నతఁడేమి యనియెనో పూర్తిగఁ దో
చని కపిరాణ్మంత్రులు రాముని చుట్టుం జేరి కేళ్ళు మొగిడిచి భక్తిన్.

మ. కృతదోషుండని యన్నగారి వధ సుగ్రీవుండు రాజానభి
ష్టుతవైక్లబ్యము పొందియుండెను మహాశోకంబునన్ గ్లిన్నమా
మతి మేమెయ్యది చెప్పినన్ వినుచునే మన్నింపఁ డీ రాజ్య ప
ద్ధతి చాపంబుననప్పు డిప్పుడునుహస్తంబందు నీ వశ్యమై.

శా. క్లిష్టంబై వ్యవహార మున్నయది సుగ్రీవుండు రాజైన వి
స్పష్టంబై చని చిక్కు లన్నియు విడున్ సందేహభాజంబుగాఁ
గష్టంబైనది రాజ్యపాలన విధాకార్యంబు తారేయుఁడున్
దుష్టుండౌఁ గద తండ్రికంటెను ధరా ధూర్వాహకత్వంబునన్.

శా. తేజోమూర్తియు వాలి యట్లు దివిషద్ధిత్యనూనుండుగా
భ్రాజిష్ణున్ నిను సన్నుతింప విని యబ్రంబంది తారేయుఁ డు
ర్వ్యాజానిత్వ మదేమియైనసరి సుగ్రీవుండె పొందం దగుం
గా జీవాతువు పట్టుపట్టుక కడంకం గూరుచుండెం ప్రభూ!

గీ. భద్రమూనిన క్షీరసముద్రములు నభద్రమెంచినఁ బ్రళయసముద్రములును
నీవు నీతమ్ముఁడును రమణీయభావ మూని యీధర యెవరిపాలో మహాత

వ. తాను పురప్రవేశంబు చేసిన సుగ్రీవుం డనుసరించి వచ్చునని శ్రీరామచం
వానరమంత్రు లడిగించి తా మిట్లు చెప్పిన శ్రీరామచంద్రుఁడు సుగ్రీవు
నిట్లనియె.

చ. సఖ! కపిలోకరాజ్యబలశాసన! యంగదుఁడేమొ చిన్నవాఁ
డు ఖిలము కాకయుండఁగఁ గడుంగడు వానరరాజ్యలక్ష్మి నీ
తి ఖనివి నీవు ధాత్రియువతీ నవతీవ్ర వియోగహారివై
సుఖపడఁ జేయుమయ్య! రిపుసూదన! సర్వజగత్ప్రియంబుగన్.

శా. బంధుత్వంబును శత్రుభావమును విస్పష్టంబుగా నైన యీ
సందిన్ దేహగతిప్రమాదనముగా శత్రుత్వ ముపెను వె

బంధుత్వం బివుడెక్కువై తతమనోబాధా నిధానంబుగా
సంధుక్షంబగు దేహయాత్రఁ గలదా శాంతస్వభావం బయో! 9

క. సజ్యమతివి కావయ్యా రాజ్యంబును గొంచు యౌవరాజ్యమ్ము గుణ
ప్రాజ్యున కిమ్మంగదునకుఁ దా జ్యాయాంసునకు నివ్వి తప్పవుధరణిన్. 10

ఉ. ఆపదలున్ సుఖంబులును నైనెడ లొంగను బొంగఁ జిత్తవి
క్షేపము నింత పొందిన నిషేవణరమ్యుఁడు గాఁడు జీవుఁ డే
యేపున జ్ఞానమార్గమున నెవ్వని కెవ్వఁడు గాఁడు లోకయా
త్రాపరమంపు ధర్మపుఁ బథంబున నందఱి కందఱో సఖా! 11

ఉ. వాఁడు వివేకశాలి గుణవంతుడు సర్వవిదాంవరుండు నె
వ్వాఁడయి తామరాకుపయి వారికణంబు విధానఁ గూడియుం
గూడకయుండు నీరములకుంబుడిసిళ్ళను ద్రావ దొన్నెయై
యోడికలైనవారి యిట నుండనె లేదను కేవలత్వమై. 12

గీ. అనుప సంహార్య మీ సృష్టి యాత్మభావ విపృతి సంవృతి రూప సంవేశ భూమి
విపృతిలోనిండియున్న సంవృతినెఱింగినడచువాఁ డాత్మయందునఁజెడనివాఁడు.

చ. విపృతి పథంబునందుఁ గలిపించిన సంవృతి భావమన్నఁ దా
నెవఁడును నాత్మధర్మపథ మింతయుఁ దప్పక సంచరించుచో
యపును విషాద దుఃఖ వికలాత్ముఁడు ధర్మము సేయలేఁడు ధ
ర్మవిరహితుం డిహమ్మునఁ బరమ్మున రెంటికిఁజెడ్డ రేవఁడై. 14

క. నా పొనరించినదానికి నీ పొందిన యఘము కల్గునే మఱి పుణ్యం
బో పాపంబో కర్తది, చాపము సాధనము చాపసదృశుఁడ వీవున్. 15

వ. అంత సంతోషసూచి సముత్తాల వాల గోలాంగూలమహామాత్ర కేలీలఘు లంఘన
గమనంబుగా సుగ్రీవుండు కిష్కింధాపుర ప్రవేశంబు చేసిన. 16

క. భేరీపటహమృదంగ స్ఫార నినాదముల దిశలు బధిరితములుగాఁ
దోరణ మాలా రమ్య ద్వారము కిష్కింధ ప్రముదితంబయి యొప్పన్. 17

క. ఒక కొంతవేళకున్ మును ముకులిత జలజాత సవిధమున సవిషాదం
బొక తేంటి ప్రొద్దుపొడిచిన మొకరి వనంబెల్ల గీత ముగ్ధము చేసెన్. 18

సీ. ఒక కృష్ణపక్షాంత మొకశుక్లపక్షాది యునుగూడియున్నట్టులొప్పెఁ బురము
ఒక శిశిర్వాంత మొకవసంతర్వాది తనరెఁగిష్కింధ కూడినవిధాన
గుడికట్టుచంద్రుకైవడి నొక్కయెలనాఁగ మొగమున దుఃఖానముదముతోఁచె
వెలిమబ్బులోని జాబిల్లిలోమచ్చగా ముదములో దుఃఖమ్ముపొదలె నొకట
గీ. నంతలోఁ దీసి మఱియు నల్లంతలోనఁ పోసికొను కొండసెలయేటిపోల్కిఁ గాఁగ
నంతలోనఁ గిష్కింధ శోకాంధకార మంతలోన నానందచంద్రాతపంబు. 19

ఉ. మాసినగుడ్డ యద్దకముమాదిరి నొప్పెఁ బురీప్రమోద మి
ష్వాసము వంగి మెల్ల ఋజుభావము పొందినయట్లుగా నభో
మాసము పోయి యాశ్వయుజ మాసము వచ్చినయట్లు సంగతా
శ్వాసము తానుదాన కని సాళగ మేళన యుక్తరాగమై.

క. ఊరూరంతయు ముక్తా తోరణములు ముగ్గులొకటితో నొకఁడు వియ
ద్ధారణుల విద్యుదుద్యత్స్ఫారమణుల కలిమి గూర్చి స్పర్థల నాడెన్.

మ. ధరణీశుం గని సంతతానత కృతోత్థానుల్ కపీశాను లా
భరణ ప్రాంచిత కంఠబాహు లతికా ప్రావార హేమావృతుల్
పరమోదారు వసంతు మందపవన ప్రాకృష్టముక్తాగ ది
వ్యరమాపుష్పిత శాఖలంబలె సపర్యాధుర్య మర్యాదులై.

గీ. అంతసుగ్రీవుఁడునునేగె నన్నయంతిపురము దౌవారికులు బరాబరులు చేయ
నవనిపత్యనుభవయోగ్యమైన వస్తువితతి స్పృశియించె సాధనావీధి గాఁగ.

ఉ. విస్తృత నేత్రయుగ్మమున విస్ఫుటమైన ముదంబుగాఁ దనూ
నిస్తులవల్లియైన రుమ నిర్మల భూషణసూన రమ్యయై
ప్రస్తుతశీల తార తన బాహునఁగైకొని భర్త సన్నిధిన్
స్వస్తిపురస్సరంబుగను బంపఁగఁ జేసెఁ బ్రణామ మంతటన్. 2

గీ. తిరిగివచ్చిన నవభూపతిం గపీంద్రు లెల్లరును బరివేష్టించి మొల్లముగను
దనుకు భక్తిని నతనిఁ గదల్చికొని నడచిరి పట్టాభిషేకమండపమునకును. 2

విజయభద్రము.

జయ ఋక్షరజసస్సుత! జయవానరాభినుత! కపిలోకపరమేష్ఠి! కదనభీకరముష్టి
జయజితానుగపాళి!జయప్రహితలోకాళి! వానరమహారాజవల్లభేంద్ర! జయ జయ
జయ రఘుక్షీరాబ్ధిచంద్రమఃప్రియసఖా! హనుమన్మహామంత్రి హార్దిక్యసుపరిఖా!
జయజయజయ యటంచుఁ జదివె మాగధకులము మఱి వెండిబెత్తాల మణి
కాంతులు వెలుంగ

అజితప్రతాపము.

కపిలోకమంత్రులు సుఖం బెసఁగన్ విపుల పీఠమునఁ బెట్టి యాతనిన్
కపురారతుల్ చెలఁగఁ గంజముఖీ సుపరిదీప్తకర శుభ్రకాంతులన్. 2

వ. పసిండి వెల్లగొడుగు పట్టిరి. బంగారుపిడులుగల తెల్లని చమరితోఁ గల వ్యా
నములు వీచిరి. సర్వరత్నములును సర్వబీజౌషధులును చెట్లపాలును పూలున
దెలిజరీపుట్టంబులును వెలిగందమును దావికల మెట్టతామరపూలును వన్యబహుగ
ధంబులును అష్టాపదంబును మధుగసర్పిస్సులును పెరుగు పులితోలు పందిచర్మ
పుఁబాదుకలును సుమనశ్శిలయును సంతరించిరి. పదునార్వురు వయసుకత్తెలు
చ్చిరి. అంత యధావిధిగ బ్రాహ్మణులను రత్నవస్త్రభోజనమ్ముల సంతోషపఱి
కుశపరిస్తీర్ణమైన యజ్ఞవాటియందు మంత్రపూతమైన హవిస్సు వేల్చి

ఆ. గజుఁడు గవయశరభగంధమాదనగవా క్షులును ద్వివిదమైందు లలఘుమూర్తి
హనుమ జాంబవంతుఁడును నళుండును నీల తారు లంబుకలశధార లొప్ప. 29

మంగళమహాశ్రీ.
హేమమయసౌధమున నెత్తయినకొమ్ముపయి హింగుళమ్మృదుచ్ఛవుల చోటన్
హేమ విమలా స్తరణ హీర మణి మాల్యమయ హిజ్జల మనోజ్ఞ మగు పీఠిన్
శ్రీమహిత సర్వనద సింధుజల కుంభముల సీరపథరీతి నభిషేక
వ్యామిళితశేఖరుని వాలి యనుజాతు క్షితిపాలకునిగాఁగ నొనరింపన్. 30
తోఁక లెగిరించుచును దూఁకుచును వానరులు తోరముగ దంతముల హీహీ
పాకముగ నవ్వుచును బాహువుల నొక్కొకరిఁ బట్టుకొనుచున్ ముదము పట్టన్
రాక యెలగోలు జయరావములు సల్పుచును రాజ్యరమ నేఁడును సనాథ
త్వాకృతిగఁ బొల్చెనని యార్భటియు నారజము నారడముమీఱఁజెలరేగెన్ 31

గీ. ఇట్లు పట్టాభిషిక్తుఁడై హేళిసూతి కేళిదూతి విధా పరిష్కృత సుహాస
మంజులచ్ఛవిఁ గాంచె రుమన్ నమన్మనోజ్ఞలజ్జాముఖాబ్జ సంతోష మంది. 32

వ. మంత్రుల వంకఁజూచి యంగదునివంకఁ జూచి శ్రీరామచంద్రుని వాక్యసరణి
మనసులో నూహించి యిట్లనియె. 33

శా. ఈనా రాజుతనంబు మీ దయిన సాహిత్యంబుచేఁ గల్గె నా
యేనోభావము విస్మరించితిరి మీ ర్హారాళధారాళ ధీ
స్థానంబుల్ పతి మీకుఁ గావలయు నీ తారేయుఁ డట్లైనమన్
నేనైతిన్ యువరాజు కావలయుగా నేఁడంగదుండింతయే.

మ. మును పెంతున్నదొ అంతలేద యిపుడున్ భూమీశ భావంబునం
దున వాంఛాబల మొక్క హేతువున నిందున్ రాజు నైతింజుఁడీ
వనజాతాక్షుఁడు రామచంద్రున కహో వాదోడు చేదోడుగా
జనకక్ష్మాత్మజ నెందుఁగాని వెదకించన్ స్వామిఁబొందించఁగా. 35

క. అది కాళఁటంబు నే నంగదునకుఁ గాదన్న ధాత్రిఁ గైకొనఁగా నం
గదుఁ డందుచేత యువరాట్పదమందిన నాయెడంద బరువు తొలంగున్

క. ఈ యుత్సవంబులోననె యాయుత్సవముం ఘటింపుఁడన మంత్రులు మో
దాయత్తచిత్తవీథులు మాయురె యని యబ్రపడిరి మఱి యతనిదెసన్. 37

క. అంతట సుగ్రీవుండును సంతుష్టమనస్కుఁడగ్రజాత సుతునకున్
దాంతమహా శౌర్యధురా వంతునకున్ యౌవరాజ్యపట్టము కట్టెన్. 38

ఆ. ఇంకఁ బొగడినార ఖ్యెల్లకిష్కింధయు మంచివాఁ డనంగ మంచివాఁడు
నిక్కువముగ ధాత్రి నొక్కసుగ్రీవుఁడే యంచుఁదోఁటఁదోట బంచఁ బంచ. 39

వ. తత్సంబంధ సర్వోత్సవములు పూర్తియైన నొక్కవినీత ప్రాతస్సంధ్యాసమ
మున సుగ్రీవుం డపనీత రాజలాంఛనుండు నాంజనేయుండు శ్రీరాముని
దర్శనంబునకు రాఁగా నందఱు నుపవిష్టులై యుండస్వామి యిట్లనియె

ఉ. ఏటికి రాజలాంఛనము లీగతి నూరక తీసివేయఁగాఁ
గోటితశోభఁ బెండ్లి కొడుకుంబలెఁ గన్పడుచుంటి విప్పుడున్
నేఁటికి సర్వభోగయుతు నిన్నను జూచి ముదంబు పొందితిన్
లోటొకయింత లేకయ తలోదరి నీవు సుఖంబుపొందుఁడీ.

క. నీరాజ్యలక్ష్మి యాశశి తారార్కముగాఁగ నుండుతన్ బ్రియసఖుఁడా!
దార పునర్లాభ నవ రమారూఢున్ నిన్ గనినను నట్లె తలఁచెదన్.

ఆ. నీకు భోగకాలమో కపిపరమేశ సతిని వెదకఁగాని జైత్రయాత్ర
పోవఁగాని కాలము నయోగ్యమియ్యది వచ్చుచున్నయదియు వర్షఋతువు.

మ. నదులుం దీవ్రతరంగ సంహతుల నైనం దాఁటుఁగానీవు, భూ
మి దరస్పృక్పటు పంక కచ్చరము కంపించుం జమూరాజి శా
రదవేళంబలె సౌఖ్యయానసముదారత్వంబు దీపింపఁబో
దిదిగో నీకును క్రొత్త ధారుణియు శ్రీపాలా వరారోహయున్.

ఉ. కంపిత చిత్తవృత్తియును గానిది, యెవ్వనికైన నాఁడు దుః
ఖంపడ నీకుఁ జెప్పితినిగాదె సమస్తవిధాల నేఁడు సౌ
ఖ్యంపడు వేళ నద్దియె మదాశిషమున్ హితమున్ దనంత నై
లింపము భోగ మబ్బినను లేదు సుమీ పరితోషమింతయున్.

క. ఇది భేదంబగు మైత్రి పదమందున నాకును బెఱవాని కనిష్టం
బొదవి చెడును బెఱవారికిఁ జెదరిన ధర్మమయి నాకుఁ జెడు సఖ్యంబున్.

మ. అన సుగ్రీవుఁడు మందహాసనిభృతంబౌ మోమునన్ రామచం
ద్రునిఁ గన్గొంచును నిన్ను నే నెఱుఁగనా దోషజ్ఞ చూడామణీ!
నిను లంఘించెడు నంతదాఁక గలదా నేర్పు భవద్దాస భా
వన కైకొన్నటువంటి నాకు సఖితా పర్యంత దత్తేష్టికిన్.

మ. ఒగి సింహాసనమందు నేనపుడు కూర్చున్నంతసేపున్ మఱిన్
మొగముంగట్టినయట్లు నీ విమలమౌ మో మచ్చునం గ్రుద్దిన
ట్లుగ భాసించెను నాకు వట్టి కఱుకుట్లుం దిందురే కమ్మ వేఁ
చిన యుత్తప్తశశామిష్టాన్నము పరిస్తీర్ణంబుగాఁ బొల్చియున్.

గీ. ఆకసంబునయందు వర్షాంబుదములు పలపలై యంత నంతనఁ దొలఁగిపోవ
జనకజాన్వేషణా పరిస్పందితంబు క్షితితలంబున వానరసేన నడచు.

గీ. మీరు కిష్కింధలోనికి రారు నాల్గు నెలలు ఋష్యమూకమున నా నెలవునం
దుందురా యనఁ బతి తలయూచి కాదు నా నెలవు సేతుఁ[illegible]

వ. తోడనువచ్చు నందఱం బంపించి యన్నదమ్ము లిద్దఱేపోయి సమీపప్రస్రవణ గిరి కందరాభాగమ్ములన్నియుఁ బరిశీలించిచూచి తుదకొక్క రమ్యగుహాదేశంబు చూచి సౌమిత్రితో నిట్లనియె.

చ. నతపరమాణురూపమృదునాగరకుల్ పరమవ్యభావ దే
వతలు గుహావినిర్మితిని వాస్తువుచూచి మనోహరత్వ ము
న్నతముగ వాయువీచి చలనం బనుకూలముగాఁగ వెల్గు నా
గతి గలుగంగఁ జేసి రను కైవడి నున్నది వాసయోగ్యమై.

ఉ. ఆయత సర్వదోష పరిహారము గాఁగను చూడు పశ్చిమా
గ్నేయములందు నున్నతము నేలయు ముంగిట నీ విశాలమౌ
రాయి వితర్దికంబలెను బ్రాంత ధరిత్రి మహామహీరుహ
చ్ఛాయము నన్ని వీళ్ళలను సంతనపెట్టినయట్లు పొల్చెడున్. 53

ఉ. కష్టములేక యక్కఱయుఁ గల్గినయప్డె తెచ్చి కోను నీ
యిష్టమువచ్చినన్ని కుశలిచ్చట నున్నవి కోసితెచ్చుచున్
బుష్టిగ నల్లి శయ్యలుగఁ బూన్పఁగ వచ్చును పైఁ బయఃపరి
క్లిష్టత లేద పార్శ్వ విమలీకృత వాహినిఁజూడు లక్ష్మణా! 54

మ. చెలువొప్పంగను బర్వతోత్తర దిశాశృంగమ్ము నీలాంబుదో
జ్జ్వల చూడా కమనీయమై పొలుచు వర్షాలక్ష్మి యీ కొండలో
పలఁ గూర్చుండినయట్లుగా నుభయపార్శ్వస్వల్పలీలాఝరం
బులు బాహుల్ బలెనై గుహానివసనంబుం గౌఁగిటం బట్టెనాన్. 55

మ. విశదంబై జలజాతబంధుఁ బ్రతిబింబింపంగనై దక్షిణా
దిశఁ గన్పించెడు శృంగ మిద్ది సితదీధిత్యుజ్జ్వలానూన స
ర్వశ ఆదర్శముగాఁ గనంబడు వనీబాలా వియల్లక్ష్మల
ర్ధశ ఉన్మీలితమైన స్వీయములు సౌందర్యంబులం జూచికో. 56

క. గిరిలక్ష్మి నృత్యవేళా పరిచంక్రమణంబునందుఁ బ్రావారము సుం
దర జఘనంబున యందున దిరిగెడుగతి చూడు మీ నదీవలయంబున్. 57

మ. కుహకుం దూరుపుదిక్కునం బరివహత్కూలంకష ప్రక్రియన్
తుహినాంబు ప్రవణంబుగా విమలపాథోవక్రలీలాకృతిన్
విహరించున్ లహరీ తరంగ నివహావిష్కార గోత్రాగ్ర ని
ష్కుహమై ముంగిటఁ బాఱు దేవతటినీ శుభ్రాంబు సందోహమై. 58

క. అతిశీతల మత్యుష్ణము వితతము మనదైన భూమి వింధ్యోత్తర మీ
క్షితి సమసుఖోష్ణశీతము నత పవనము వింధ్యదక్షిణాదేశమునున్. 59

చ. మన వనవాసమౌ తుదిసమల్ పది వింధ్యనగేంద్ర దక్షిణా
వనిఁ జరియించి యీ మృదులవాయుసుఖంబు నెఱింగి యెంతొయు

న్నను నివి క్రొత్త క్రొత్తపవనంబులుగాఁ గనిపించుఁ గొండ గొం
డను విమలౌషధీ గుణగణ ప్రవిభక్త తరంగసంతతిన్.

శా. ఈ యుత్తాలములైన వృక్షములు నాయీ సైకతశ్రేణులా
యీ యుగ్రోపలముల్ కపిప్రతతికై యేర్పాటుగాఁ జేసెనో
యీ యబ్జాతభవుండు నాగుటకునై యందందుఁ దారాడఁగా
బాయంగా దొరలింపఁ జంచలతమః ప్రారంభసంరంభముల్.

క. భగవంతుఁడు చూపించెను సొగసగు దేశంబు నవుడు చూడనువలెఁ గ్రొ
మ్మొగిళులగమి కొండంచుల నెగచెడు రెన్నెలలనాటి నిభృతపుశోభన్.

ఉ. నా ప్రియ మాచరించుటకు నాయన! లక్ష్మణ! వానరేశుఁ డెం
తో ప్రియమొప్పఁ బంపిన వినూతన కుంభము లంటుకోక యెం
తో ప్రియమొప్ప నమ్ముల పొదుల్ జలపాత్రలుగాఁగ వాడె దీ
దీప్రపుభక్తి నీ యెడఁదఁ దెచ్చిన దెచ్చటి యచ్చసొమ్మురా!

క. నేఁడీ కాచిన యెండకు బోఁడిమి గుహ కనుక బ్రదికిపోయితి మంతః
క్రీడచ్ఛిశిరాంబువులుగఁ గూడిన చిఱునీటికుండఁ గూర్చున్నట్లై.

మ. పవళుల్ ఫెళ్ళున నెండకాఁచి విదళింపం బ్రొద్దు వాటారగా
నివతాళించిన గాలి క్రొత్తరఁగలై హేలాసరోజాత సం
భవముల్ తావులు గుమ్ముగా విసరెఁ బ్రేమం బెల్లఁ బ్రొద్దుండ గా
నె వెసన్ దీపము చక్కఁబెట్టుకొనుమ స్నీతిం బ్రదర్శించుచున్.

చ. కనుగొను మీ తరుప్రతతి కాననమందున వెళ్ళిగాఁగ బూ
చినయది కామినీ విరహ సింధునిమగ్నుఁడ నైనఁ బైకి వ
చ్చిన బుడగల్ బలెన్ మునుఁగఁ జేయునిజాఁచి గ్రహింతురింతలో
తున వనరాజి నన్నడఁగఁద్రొక్కెడు నుక్కిరిబిక్కిరై చనన్.

చ. చివురులతోడ నెఱ్ఱవడి చిందిన యగ్నికణంబులై పువుల్
వనములు జ్వాలలై యుమియు నావన మింకను జెట్లు నిప్పులై
యివమయి పొల్చె రాతిగుహ యెప్పుడుపై మెఱుఁగుల్ కలట్టివా
రవుదురు దుష్టచిత్తు లొకఁడాడి మఱొక్కఁడుఁచేయుచున్ జనుల్.

మ. మన మిచ్చోటికి వచ్చినప్పుడు సమున్మత్తాకృతుల్ వానరుల్
కనఁగా వందలు వేలు వృక్షతతులం గన్పింపనయ్యెంగదా
కనుమీ యొక్కఁడు లేఁడు వాలివధయుంగా భీతముల్ లేచిపో
యెను దానర్థము నిట్లు చేసుకొనునుమ్మీ లోక మే కార్యమేన్.

మ. ఇదిగో జానకి యేమి చేసినదయా యీ గాలి కా దేవి నా
యెదలో నిండిన వెచ్చనై విసరు దైత్యేంద్రున్ దశాస్యున్మతిన్
మదిలో నెంచినయంతఁ జల్లవడు నా మత్తుండు నీ గాలిఁ దా
నదియేదో భయపెట్టియుండుఁజుమి దౌరాత్మ్యం బనూహ్యంబుగన్.

చ. అనుదినముం బ్రభాతసమయంబుల వానరనృత్య మర్దళ
స్వనము వినంబడుం బ్రభువు వచ్చిన క్రొత్తయు నింకఁబోదు తాఁ
జనినను మాసముంబయిగ సంతసమందుటకే యతించు నెం
దనుకను జీవుఁ డచ్చపుముదంబునయందుఁ దనంత భ్రష్టుఁడై 70

శా. క్షోణీకన్యక నాకు నిక్కము లభించుం దాను రక్షఃపతి
ప్రాణంబుల్ హరియింతు నే నని తలంపన్ దక్షిణాంసంబు ని
ద్రాణంబైనది మేలుకొన్నటుల స్పందం బేచునిక్కంబుగా
క్షోణీకన్యకఁ జంపలేదుకద యా క్షుద్రుం డనాక్రాంతిమై. 71

గీ. అన్న! నిన్ను నొక్కఁ డడిగెదను బ్రదికి యున్నవారు దివికిఁ జన్నవారు
స్వప్నమందు నొక్కసారి తోతురె! నాకు జానకియును దండ్రి కానఁబడిరి. 72

మ. నిభృతాక్షంబుల సర్వకానన మృగానీకంబు వీక్షించునై
రిభమున్ వ్యాఘ్రము రోహితంబు వృకమున్ ఋక్షంబు సర్వంబు వీ
త భయాకారముగాఁగ నయ్యది మృగేంద్రం బట్టులే వానర
ప్రభులం దెవ్వడు చెప్పఁ బోల్చెడు మహారాజాధిరాజాకృతిన్. 73

శా. మేలై సీతయు నీవు వచ్చితిరి నామీఁదన్ బ్రియంబొప్పగన్
మీలో సీత హరింపఁగాఁబడియెజుమ్మీ! యద్ది నీవైనచో
నేలా నా బ్రదుకేమికావలయు నీ యీ సేయు ధారాసవ
ర్యా లాభంబున నేమి కూర్పఁగలదన్నా! సీతయున్ భీతమై. 74

గీ. గాలి కీరీతి నూరక కదలిపోదు వాఁడు కైలాస మెత్తినవాఁడు వాని
నోర్వఁగల నన నవ్విపోదో జగంబు ముగ్ధుడవు నీవగుట సరిపోయెఁగాక. 75

మ. మరియుం జూడుము మంపువెన్నెలల గ్రీష్మం బోట నీ రాళ్ళని
ర్భర తీక్ష్ణాతప తప్తముల్ పవలురే ల్తద్వృహ్నలం జిమ్మెడున్
ధరణీ కన్యకతో వియోగభరమై తాపంబు కల్పింపఁబో
వరయన్ గొండను డిగ్గిచూడు శిశిరాహ్లాదంబు కల్పించునో. 76

ఉ. కార్ముక సాధ్యమైనయది క్ష్మాసుత నాకును నప్పుడిప్పుడున్
మర్మ మెఱుంగఁజాలని యమాయకుఁడన్ దొలినాఁటి శైవమౌ
కార్ముకమందె యీ కిటుకు గల్గు నెఱుంగఁగ లేకపోయితిన్
శర్మము లేదటం చిపుడు జాలి వహించిన లాభ మేమిఁకన్. 77

క. నావలనఁ జచ్చెఁ దాటక నా వలననె మంథరామన స్సరిసిపడెన్
రావణుభగిని యటైనది స్త్రీవధదోషంబు నన్నుఁ జెందినదయ్యా! 78

చ. తన సతి విప్రయోగమునఁ దాత గతించె గతించెఁ దండ్రియున్
దనయువియోగ తాపమునఁ దాదృశనిర్భరగాఢశీలురై

చను కులమందు నాదయిన జన్మము కష్టము నేను నేనుగా
మనియెద నాకుఁ దండ్రియును మానిని యీగతి లేవు బంధముల్.

వ. ఇట్లు శ్రీరామచంద్రుండును. 80

చ. చిలగడదుంప లియ్యవియుఁ జెల్వుగఁ గుమ్మనఁబెట్టి తెచ్చితిన్
సలలితహేమవల్లు లివి సంగతముల్ మధురేక్షుఖండముల్
పొలుపుగఁ జెక్కు తీసితిని ముక్కలు చేసితిఁ దామరాకు దొ
న్నెల జలముల్ గ్రహించితిని నిర్మల మంజుల వాహినీ లఘుల్.

ఉ. నీవు వశిష్ఠశిష్యుఁడవు నీ వఖిలజ్ఞుడ వాత్మ వేత్తవున్
నీవు చరాచరాఖిలము నిల్పితి కార్ముక లస్త్రకంబునన్
నీవును మూర్తిమంతుఁడవు నిర్మలవైదికధర్మరాజికిన్
నీవు మదాత్మచంద్రుఁడవు నేఁటికి భోజన మారగింపవే. 82

మ. నదులుం గాలువ లడ్డుకొన్నటుల నన్నా! నీవు సుగ్రీవుపై
మదిలోఁ బ్రేమము కల్గినన్ గడువుగా మన్నించితీ మాసముల్
ప్రదరానేక విదారితాఖిల దిశాపర్యంత రోదోంతరా
స్పదుఁడై కాలము సాగనిచ్చెదవు భాస్వల్లోక ధర్మంబుగన్. 83

మ. ఇది రేవిచ్చటనే దిగన్వలయుస్వామీ! నా బుజంబందు నొ
ప్పిదమౌ బాహువు సాఁచవే రఘుకులాబ్ధిస్ఫారచంద్రోదయా!
కదియున్ భీతములై ద్రుతోచ్చలిత లంఘస్ఫాలనోడ్డీన స
మ్మద ప్రస్ఫీత పయోవిహంగమ గరుద్భ్రాజిష్ణువుల్ నీరముల్. 84

ఉ. అగ్రజుతో విరోధమయినప్పుడు నంతును పంతులేని కో
పగ్రహణంబుగా మనినవాఁడును వారి వధాంతమందునన్
శిగ్రువుపోలె మెత్తపడి చెందిన దుఃఖమదింతకాదయా
యగ్రజుపుత్రుఁడన్న యెడఁ బ్రాణముళైనను వీడునట్లుగా. 85

శా. తార్క్ష్యకేలుఁడు నేఁడు చెందిన సముద్యద్రాజభావంబునన్
మీఁదౌఁ గ్రిందగు నీదుకార్యమును విస్మృత్యర్థ్య మందించినన్_
గా దౌనంటకు వీలులే దటులనే కానిమ్ము నష్టమ్మునన్
లే దున్నాఁడొక శూరసాధువు భుజాలీలా మహాశానుఁడై. 86

సీ. నడచుచో నీవు నీనడక యందము జాన కీ దేవివోలెనగ్గించిచూచు
పలుకుచో నీవు నీపలుకునవ్వడిలోని పొలుపున భరతుఁడువోలెఁజొక్కుఁ
గనినచో నీవు నీ కనుల కాంతులయందు మునిసమూహమువోలె మునుకలాడు
నవ్వుచో నీవునీ నవ్వువెల్గులయందుఁ దాత సుమంత్రునిరీతి వెరుగు

గీ. అతఁడువుంరూపబ్రహ్మచర్యంబు మూర్తిమంతమగుభక్తిపాండిత్యమహితమూర్తి
[illegible]

మ. అతఁడున్ నేనును గల్గ నీకును నసాధ్యంబంచు లేదిద్ధరన్
దితిజాతుల్ పదికోట్లమందిని సమర్థింపంగ నీ వౌదువున్
క్షితిజాతంగనిరా నతండు, గొనిరాన్ శ్రీమూర్తి వీ వున్నతో
న్నతు లింకేమిది నిద్రపోఁగదవె యన్నా! రాత్రియైపోయెడున్.

ఉ. లాలితమూర్తులై యతిబలా బలులుండిరి భోజనంబు ని
ద్రా లవమున్ దొలంగినను దానికి నేమి సుషుప్తిఁగాంచినన్
భూలలనాసుతన్ మఱచిపోదువు కొంచెము సేపు నిద్రలోఁ
గ్రాలిన నింద్రియోపరతి కాదదినీకుఁ బ్రమాప్రమాణమై. 89

ఉ. భాగ్య పుమాకృతుల్ కరుణవాదులు కర్మఫల ప్రతిక్రియా
యోగ్యములైన యాపదల నొందిరి తాతయుఁ దండ్రియున్ మనో
యుగ్యపుఁబగ్గముల్ విడిచి రూరక జాలిమెయిన్ బ్రతిక్రియా
యోగ్యము నీకు వచ్చినది యొప్పఁగ నీవును నాత్మవాదివిన్. 90

గీ. అంత యుపకార మందినయట్టివాఁడు అంత సంతోష మందినయట్టివాఁడు
తాఁగృతఘ్నుఁడుకాఁడు మార్తాండసూతి యాదుకొనుఁగష్టమునమనకైనవాఁడు

మ. కపిసైన్యంబు చనున్ సముద్రవిలుఠత్కల్లోల మాలాకృతిన్
విపులాశా సకలస్థలంబులను నన్వేషించు సీరధ్వజా
ధిక కన్యామణిఁ జూచివత్తురు మఱిన్ దృప్తారులైనట్టియ
ప్రపులం జంపెదు సీతఁ బొందెదు ధరా రాజ్యమ్ముకై సేతువున్. 92

చ. దశరథరాజువోలె నరుదార సహస్రములైన వర్షముల్
ప్రశమిత దుఃఖ ధాత్రి పరిపాలన సేసెదు నచ్ఛధర్మమున్
విశదముగాఁగ నింపెదవు విశ్వజగద్రమణీయ రూప స
ర్వశుభమనోజ్ఞ మూర్తివి ధరాసుత తప్పక వచ్చునీగతిన్. 93

గీ. మన మనుష్యయత్నంబున మహితనూజ కనఁబడదయేని యెల్ల లోకంబులకును
గుమ్ము వెట్టెడునట్టి నీ కోపవహ్నిఁ దాళుకొనఁగలరయ్య రుద్రాదిసురలు? 94

శా. వల్లీసక్తదళాకృతిన్ విధుతమై పొల్పొంచుకొంచుండె నీ
ముల్లోకంబును నీదు దుఃఖమున నా ముమ్మూర్తులున్ శారదా
వల్లీ సాగరకన్యకా గిరిసుతాంబా విప్రయోగవ్యథా
కల్లోలాకృతులై జరింతు రిఁక దుఃఖం బేల నీ కిచ్చటన్. 95

వ. ఇట్లుగా లక్ష్మణుండును జరించుచుండ గ్రీష్మంబు ముదిరి. 96

గీ. అతితరోష్ణతాజనిత నిర్యాసకముగ ప్రస్రవణశైలగత వృక్షపంక్తి వ్రస్సె
జానకీ విప్రయోగ నిశ్వాసకముగ గండశిలలందు రామచంద్రుండు డస్సె. 97

గీ. సమద సామజ బృంహితచ్ఛటలు లేక కాననంబులు నిశ్శబ్దకంబు లయ్యె
నిశ్వసత్సుప్త భుజగరాణ్ణికరమునను కందరాభూములు సశబ్దకంబు లయ్యె.

గీ. ఎచ్చటో కానకోనలో నెండిపోని పడియ డొక్కలో మృగరాజు పవ్వళించె
సిమసిమచ్ఛటా బాష్పవిక్షేపముగను ధూర్వహము సూర్యకాంతమ్ము నిర్వమి

గీ. పైని సలసలఁ గ్రాఁగి లోపలను శిశిర నిభృతముగ నుండె శైవాలినీఝరి
లోన సలసలఁ గ్రాఁగుచుఁ బైనశిశిరచారువుగ నుండె శ్రీరామచంద్రమూ

క. ఒకచోట నుఱిమె మఱి యింకొక చోటను మబ్బుపట్టె నొకచో మెఱసె
జికిలి యొకమబ్బు విరిసియెసకమేచెను వనవరాహ సంసారమనన్.

క. ఏకినవి దూదిపింజెలు నాకాశముగాఁకఁ గుప్పలయి నట్లుండెన్
మూఁకలుగ దక్షిణాశానీకాశ సుధాక సాంద్ర నీరదచయముల్.

సీ. వర్షేందిరయుఁ గేశపాశమ్మునందలి మెఱపుఁబూవులు చూపె మేదినికిని
ధారుణీసతియు నందము మెచ్చినట్లు చిక్కని కుక్కగొడుగులుగాఁగ నవ్వె
నెక్కడికక్కడి కెండించి తరురాజిఁ గానలోపలఁ గానరాని దొంగ
పసిమియంతయు నేడు బయటఁబెట్టె వియత్తు గుర్తించికొని పట్టుకొనెఁ గుహ
గీ. ఎడమొగము పెడమొగమైన యిలయుమిన్ను
లయు పునస్సమాగమము పుల్కలుగ నిలయుఁ
జాటుమంజుల వ్యాహార సరసవర్ష
ణములుగా మిన్నులయును బంధములుచెలఁగె.

సీ. గజదైత్యు పచ్చిరక్తపుఁ గళాసముకాననయ్యె సంధ్యోగ్రనాట్యములయందు
విస్పష్టముగఁ గానిపించెఁ దోమాలియ ·వలువన్నెపూ ల్విష్ణుపదమునందు
నష్టదిగ్గజరాజ హోరిఘీంకారముల్ విననయ్యె నఖిలదిగ్వీథులందు
గనులకుఁ గనిపించెఁ గదుఁ బ్రాణవిధుత మాయారజ్జువులును రోదోంతరః
గీ. వర్షఋతురాజు శిశిరసంభారములు పయోధరంబులు హరిధనుస్సురుముల
వానధారలు వేళాభవంబు లగుచు గనులకు నతీంద్రియపుశక్తి కలుగఁజేసె.

చ. తొణఁకిసలాడు నందములతో వినువీధికి వచ్చితానునున్
మిణుకుచునున్నభార్యయును మేఘుడు జంటగనున్న రామల
క్ష్మణులనుజూచి యా మెఱపుఁజక్కగఁ బ్రక్కగఁదూగిరమ్మునాన్
రణితము చేయఁగా గలసిరాదది జానకిలేని సామ్యమై.

సీ. ఆ కొండరాళ్ళును నా తాటి మొవ్వలో నాగిరిశృంగమ్మునా మొయిళ్ళు
మెట్లవు మొయిళుల మీఁదుగా విద్యుత్తు కదుఁదేలికైన మార్గంబు కలుగ
నర్చిస్సహస్సు పక్షాయనంబులును సంవత్సర రవిచంద్రమసులు గాఁగఁ
గ్లిష్టమార్గంబు కల్పించిరి సాంపరాయేతరం బయ్యు బ్రహ్మోష్టిఁ గలుగ
గీ. వర్షఋతురాజు సులభసోపానపంక్తి రసమయాపరిచ్ఛిన్న సామ్రాజ్యమునకు
నవనవమ్ము విద్యుద్దర్శనంబు గలుఁగుఁదతగవాక్షంబులందున దంపతులకు.

చ. దళముగ వానపాటు గిరితట్టునఁ బట్టిన తేనెపట్టుపై
నళికుల ముద్భ్రమద్భ్రమణమై మఱి వ్రాలఁగఁబోయి వారికం

దళముల తాపుచేఁ జెదరినం జనుజుమ్మను మ్రోఁత వర్షమ
ర్ధళరవయుక్త వేణునినదంబులకున్ శ్రుతిపోసె నాఁజనెన్. 107

క. అలనాఁటి స్వాతిబిందులు మొలకలుగా జలధి ముత్తెములుగా నైనన్
వలి నేఁటి యార్ద్రబిందులు పులకలుగానయ్యె నడవి మొల్లలు గాఁగన్. 108

క. ఆ మిడిసిపాటు నెండల లో మిను జను వార్ధిజలములోఁ జిక్కినవో
సౌమిత్రిజటాభారము పైముత్యము లొలుకఁబోసె వారిదచయముల్. 109

ఉ. ప్రోషితభర్తృకల్ నవఝురుల్ నినమొన్న ప్రసన్నమూర్తులున్
వేష సితాంబరల్ వినయవిస్తృత భావలు సాధుగమ్యలున్
ఘోషలు వేగముల్ వికట కూలము లుగ్రకషాయరూపశై
లూషలు నేఁడు, ధూర్తమగు లోకము మంచి దినాలు వచ్చినన్. 110

ఉ. గాలికి గంధవత్త్వమును క్ష్మాకును జల్లని స్పర్శ నీటిమే
ఘాలకుఁ దేజ మా మెఱపుగా నగు నగ్నిని శైత్యభావము
న్మీలితసృష్టిభూతగుణమిశ్రత కీ ఋతురాజె గారవో
ద్వేలుఁడు వీనితో మొదలుపెట్టియ యుండును గల్పకల్పమున్. 111

శా. కేళించెన్ బసిపచ్చపాగకొసమై గేదంగికుచ్చుల్ విడన్
లీలన్ వన్నియకాని గోర్బడము తాల్చెన్ వ్రాలు నున్సంజలన్
గ్రాలన్ దర్దురనూపురంబులును ధారాకంకణంబుల్ వనీ
కేళీ ముగ్ధకిరాతుఁడీ యెవఁడొ సాగెన్ వర్ష మాసాకృతిన్. 112

క. పవమానుఁడై యసలు వెక్కువ వాఁగులఁ నేర్చి కొనినాఁడో వా
యువు తరఁగ బురదై సివమెత్తినయట్లుగా వసేవ్యం డయ్యెన్. 113

ఉ. గాడిన కొండపార్శ్వపు టఖాతపు బెల్లను మబ్బుగుంపులున్
బూడిచి వేయ నేలయను బుద్ధి మహాభుజగంబు వర్షపుం
దాడనబాధ మారుతద్రుతంబుగ దూఁకెను నాగలోకపున్
వాడలు చేరఁగాజనిన వర్షమహోజ్జ్వల మూలధారనాన్. 114

ఉ. భూమికి డిగ్గి యింద్రధనువుల్ పరికీర్ణములైన యట్లుగా
సామజ దంతకాంతులు ప్రసారిత సారమయూర పింఛముల్
హేమ సవర్ణమౌ పువుల నెజ్జనికాంతులవూలఁదంగెడుల్
కోమలతా నిధానములు గుంటలఁ బూచిన నీటి ప్రబ్బలుల్. 115

సీ. ఒకమబ్బు గిరిశృంగ నికటమ్ము విడిపోదు క్ష్మాధరేంద్రుని కంటఁగ్రాఁగినట్లు
ఒకమబ్బు గిరిపాద నికటాన జీరాడు మన్నింపఁ బ్రార్థించు చున్నయట్లు
ఒకమబ్బు గరిమపాశ్వరకటిస్థ యూఁగాడు సంభోగ శృంగార చలితయట్లు
ఒకమబ్బు గిరిపంచ నూరక తిరుగు నిరాకృత యాస నల్లాడునట్లు

గీ. తానా యేఁడాది కొకసారి కానిపించు నవ మనోజ్ఞుఁడు దక్షిణనాయకు
మబ్బుకన్నె లిట్లొందుట యబ్బురంబె పరమ శృంగారమూర్తియోఁ బ్రస్రవణుఁ

శా. ఆకీర్ణాంబుసటాకవార్షుర మృగేంద్రారావమున్ కేకిరా
ట్కేకారావము మత్తసామజ ఘటాఘీంకారమున్ వాన హో
రేకాకారముగాఁగ మన్నతపు స్థాయిన్ రాగముం బాడున
ట్లై కన్పించెను మేఘ రంజనిని వర్షానేహ ముత్కాంతియై.

గీ. అన్ని తలుపులు మూసికొన్నట్టి యింట నప్పుడప్పుడు సుంత గవాక్షముల
దెఱచినట్టులు పడమటఁ దెఱపియిచ్చి యెఱ్ఱవెలుఁగులు సంజల నేగుదెంచ

గీ. తన గుహాప్రాంగణంబునందునను నిలిచి యంచునం జారు వాన హస్తాంగుళు
జాచిభయమున శ్రీరామచంద్రమూర్తి వెనుకకుందీసికొనెఁ జేయివెచ్చనగుట.

గీ. కమలినీకాంత కన్నులు కనులకలక వచ్చినట్టులు తెఱవుడు పడకపోవె
మండుటెండలు తొలినాడుమఱలినపుడె ధాత్రి నణగారినదిబ్రహ్మదండిమొ

అ. ప్రస్ని సగము నేల రాలిన నేరేడు పండు కానిపించెఁ బాంసురాశి
మదిరచేత నూత్నమాంజిష్ఠకాంతుల కనులతోడి శబరకన్యవోలె.

శా. జంబూ పక్వఫలంబు లర్ధదళన శ్యామారుణంబుల్ ధరా
సంబాధంబుల మృత్స్నశంబుల నొగిన్ సౌమిత్రి తా నేఱె శు
ద్ధాంబుప్లావితముల్ పొనర్చి కొనిరా నార్యుండు సేవించె నే
త్రంబుల్ చల్లన తియ్యనైన రుచు లందంబెల్ల దీపింపఁగన్.

గీ. స్వామి ప్రియముమీఱ జంబూఫలంబుల నారగించి నవ్వినంతఁ జూడ
ధరణితనయతోడఁ దాంబూలసేవనం బాచరించినట్టులయ్యె మొగము.

గీ. చిదికిపండలు వేల్పండ్లుచితచితలుగ ముసరుకొంచును భసలముల్ మూఁగుచ
ఘాసవర్షాంబుపంకంబు కలఁచ, నమృతప్రాతమథనభూమియయ్యె నేరేళ్ళక్రి

ఉ. మబ్బులలోనఁ గ్రమ్మబడి క్ష్మాధరమున్ గనరాకయున్నఁదా
నబ్బురమంద ముక్కలయి యవ్వియు జంగమభావ మంది వె
ల్లుబ్బున గంధవారణమహోన్నతరూపమునం జరించు నా
మబ్బులు విచ్చిపోవలయు క్ష్మాధర మున్నదొ లేదొ చూడఁగా.

సీ. జీరాడుమట్టలు జీబులుఁగంఠదేశములందుఁ బులిగోళ్ళు చరమ్ములుగ
మౌళిభాగములందు మహిత పత్రంబులు విస్తీర్ణరమ్యముల్ పింఛములుగ
కంఠదేశములదాఁక నపత్రకములొటల ప్రావార పరిహీణ భావముగను
బండిముగ్గినయట్టి పండ్లగెలల్ గళస్థములైన గాజుపూసలునుగాఁగ

గీ. తాళవనములు శబరసంతానములుగ నంబుదవ్యాజ వనవరాహముల వేఁట
[illegible] నెగడె వాన కాళులను బలెములు గ్రుచ్చి కొండ

మ. ప్రకటాంభోధర శైలవాహిను లభివ్యాప్తంబుగా గిర్యుప
త్యకయందొప్పిన యింద్రకార్ముకము నంతంబందు సౌమిత్రి నీ
ళ్ళకునై వాహినియందు డిగ్గి నవహేలామూర్తి భాసించె మ
స్తక రత్నాంశులు మింటిదాఁక విహరించం బొల్చు శేషాహినాన్ 127

క. ఎఱపచ్చడంబు ముక్కలు కఱుదున వేణ్యంతములను గై సేసినటుల్
చిఱుతసెలయేఱులంచుల ముఱకముగాఁ గొండగోఁగుఁ బూవులుపూచెన్. 128

క. గిరిధాతుపార్శ్వ మేఘోదర రక్తచ్ఛవులుచూచి దావాగ్నిమతిన్
విరియించిన పింఛమ్మును మరలన్ ముడుచుక మయూర మహిపతి సొలసెన్.

మ. తమకుం గల్గిన మేలు లే దరులకుం దాపైన కీడెంచి మో
దమునుం గాంతురు కొంద ఱీ కలువ లుద్యచ్చంద్రమోదర్శనం
బమరం బోదు సరోజషండములకౌ నాపత్తి వీక్షించి చి
త్రముగా రేల్బవ లొక్కటే ప్రమద ధారా శ్రీవికాసంబులౌ. 130

ఉ. వానరభల్లుకంబులును వర్షము రోమచయంబు చొచ్చినన్
మేను విదల్చికొంచుఁ గుసుమించిన నవ్వులు సీదరింపులుం
గా నటనా మనోజ్ఞ పరికల్పిత లంఘనకుంచనంబులన్
గానల సంచరించెఁ దరుకాండములందునఁ బాయ రాచుచున్. 131

చ. అడవుల జాముక్రిందట జలాహరణార్థము వచ్చినప్డు వం
దడుగుల లోఁతునం జనెడు నా ఝరి యిప్డు కొండమట్టమై
విడివడి పాఱుచున్నయది వెక్కసమయ్యె సుమిత్రబిడ్డకున్
గడువడి నేగి పత్రపుటికల్ వెస నింపుక వచ్చు నంతలో. 132

గీ. వానజోరునఁ గురియుచోఁ బక్షులెల్లనెచటి వచటివి తమగూండ్ల నెసక మెసఁగ
గూఁడు లేనిది కాఁబోలుఁ గొమ్మకొమ్మ గాఁగ నఱచెడు నొక్క యేకాకి కాకి.

చ. అలహారిణీ వశానుగములై చను రోహిత వారణంబులన్
చలిత నతోన్న తాధర లసత్కర కామయమాన వృత్తులన్
మెలఁగ గుహానివాసపుసమీప ధరాస్థలిఁ బాఱఁబ్రోలు ద
వ్వులకును లక్ష్మణుండు రఘుపుంగవుఁడుం గనునన్న భీతిచే. 134

గీ. అసలు తేనియ త్రావిన భసలచయము కామచరణమ్ము పట్టఁ బగ్గాలులేవు
కడిమిపూఁదావి చిమ్మిన గాలిచేతఁ గామ పరవశ మయ్యెను గాననంబె. 135

మ. ధరణీదేవిసుతామనోహరుఁడు ముగ్ధస్వాదుభావుండు సుం
దరుఁడౌ శ్రీరఘురామమూర్తి యసమానంబైన యోర్పొనె ని
ర్భర వర్షాజలరాశి క్రమ్ముకొన దుర్గప్రౌఢజీవుండు త
త్పరిచర్యాపరమార్థరూపము సుమిత్రాసూతి వప్రంబుగాన్. 136

చ. మొలచెనొ లేదొ పెల్లడవిముస్తెలు ముస్టెల దున్నిపోయఁ బం
దులు మలువానలుం గురియ నూత్న వనార్ధము ప్రాఁత విత్తనం
బులు తలలెత్తెడుం గడిమి మోదుగు తంగెడు నన్ని వృక్షముల్
తొలి హరిపోత్రి ధాత్రివలె దోఁటల నెత్తుచు నీ వరాహముల్. 137

చ. గిరిగుహయందు బిట్టయిన గ్రీష్మమునందునఁ జల్లనై సదా
విరిసినయట్టి వర్షముల వెచ్చనయై సుఖ మయ్యె స్వామికిన్
బరమ మహోస్త్ర దేవతలు పాలితకాంతులు దివ్యలై రహిం
తురు గుహ రామచంద్రుని తనూచ్ఛవి కమ్ముడుపోయినట్టివై. 138

క. ఎంతటి మబ్బులు క్రమ్మినఁ గొంత యెచటొ మిన్ను తెఱచుకొనియే యుండున్
వింతవెలుఁగైన కిష్కింధాంతఃపురి దీపకాంతులైనను జిమ్మన్. 139

గీ. అంత శబ్దరహిత మర్ధరాత్రంబుల రెండు సవ్వడులు చరించుచుండు
నుర్వియందు మేఘునుఱుములమ్రోఁతయు మింటరామునసుజువింటిమ్రోఁత.

వ. వర్షర్తువున శ్రీరాచంద్రుఁడు మేఘమ్ములోని మెఱపుఁగాంచి రావణాపనీయమా
నయైన సీతయంచుఁ దరురాజి జార్చు నీటి బొట్లు సీత కన్నీరంచు నేలవ్రాలు
బలాకామాల తదపనీత ముక్తాహారమంచుఁ బ్రాదేశమాత్ర ప్రదేశ పుంజీభూత
శక్రగోపంబులు సీత తలలోని రాగిడియంచుఁ బరిపరివిధంబులఁ బ్రలపించి
సౌమిత్రి చేత స్మార్యమాణ యోగవిద్యాగురుం డయి యిట్లనియె. 141

గీ. అధ్యయన కాల మియ్యది యద్రియును గుహాముఖంబులఁ జేయు వేదాధ్యయనము
రహి నుదాత్తానుదాత్తస్వరంబు లొప్ప వానధారలన్ జందెముల్ వేనుకొంచు.

క. పితృదేవతల సమభ్యర్చితులం గావించుచుండుఁ బృథ్వీపతి స
న్మతి భరతుఁడు మాతృగణార్పితుడై సమ్యక్క్రియా నిరీక్షణమందున్. 143

ఉ. కైకమ యెంతచేసె నుపకారము బ్రాహ్మణకర్మయందు న
స్తోకముగాఁగ రక్కసుల త్రొక్కిడియై చను దక్షిణాపథం
బాకులమయ్యె దైవతవిహారము సాగెడు నేఁడు నద్దియుం
గాక దివాకరాత్మజుఁడు కామినితో సఖుఁడున్ సుఖించెడున్. 144

క. మనవలన నంత యుపకృతి కనినాఁడుకదయ్య మఱలఁ గావింపఁడటం
చనియెదవా! యబ్బ! కృతఘ్నుని చనలోకములు గుత్తగొను నిరయములై.

శా. ఓయీ రావణుఁ డెంతయేనియును దుష్టోద్యోగి వాఁడెచ్చటో
యా యున్నట్టి స్థలంబునున్ దెలియఁగా నైనంత సాయంబునుం
జేయంజాలఁడొ నన్ను జానకి యదాక్షిణ్యంబునం బాయుచుం
బోయెంగాని నిజంబుగాఁ గపికులంబుం బోయి యాచింతునా! 146

గీ. నాల్గునెల లింత దుఃఖంబునకును సిద్ధపడితి నన నాతఁ డరుదెంచి ప్రణతుఁడైన
యపుడు చూడలేదా వాని యాస్య మద్ది చూచు చనలేకపోయితిఁజుమ్మి నేను.

గీ. అమృతమయ ప్రేయసీ తనుయష్టిమథన సులభజనితజ్వలన పరిశుష్యమాణ
శిశిరభావుండు ఋతురాజశేఖరుండు వర్షఋతు వాతనిన్ సుఖంపడగనిమ్ము.

మ. అవనీదేవి సుతాసమాగమన పర్యంతోగ్రభావుండు వీఁ
డవు వర్షర్తువు జానకీ విరహభావాంభోధి నిష్ఠుండు ఘో
ర విషాకారుఁడు రెన్నెలల్ గడచి యౌరా! యేమిసేయున్ సఖుం
డవు సుగ్రీవుఁడు నింతలోఁ బనుచు సైన్యంబుల్ దిశావీథులన్. 149

మ. వివృతాస్యుండయి లక్ష్మణుం డనియె నుర్వీరక్షణాబ్ధీ! సఖుం
డవు సుగ్రీవుఁడు నింతలోఁ బనుచు సైన్యంబుల్ దిశావీథులం
దవనీకన్యక నీవు తెత్తువు దిగంతాశార కీర్తిప్రభా
నవముగ్ధాకృతి వీవు కాదటె యనంతా! ధర్మమార్గాకృతీ. 150

మ. అనుచున్నంత మొయిళ్లు మింట నవకుల్యల్ ధాత్రియందుందమం
తన నల్వారక విచ్చిపోయెను వియన్మధ్యస్థలిం బాసి మె
ల్లన దూరాశలు చేరఁజొచ్చినవి యల్పంబుల్ పయోదాళి చి
క్కినవై యేళ్లును బంకమెల్ల దిగఁద్రొక్కన్ దీరదృశ్యంబుగా! 151

గీ. ఉఱుమదు వినీలకాంతులు విరియదు రవి
శశుల యుదయాస్తమయములు చాఁదుకోదు
అల్పజలదంబు లుబ్బగా నాదుకోదు
సద్దు మణఁగారినది యాకసంబు తాను. 152

ఉ. రాచిన క్రీడనోత్సవ పరంపరగా రవిచంద్రు లంత దోఁ
బూచులనాడి రంబుజ సమూహముతో నునుఁ గల్వపూలతో
వాచి మొగంబు వెక్కువగు వర్షపునాళ్ళల మోహనాతప
శ్రీ చెలువారు వెల్గుల హసించుచు సంచితకామభావులై. 153

అ. నదదమోఘములయు నదులయు సెలయేళ్ళ యొందువిఱిగుకామమొందువిఱుగ
సూచనంబులేక సుగ్రీవుఁడేపారె నిలయుఁగ్రొత్త కామినులును గ్రొత్త. 154

ఉ. తారకు వాలి బాహుబల దర్పమునందున నెట్టి బుద్ధియో
నీరజబంధుసూతి మతినీతిపదంబున నట్టి బుద్ధి యె
వ్వారికి జీవభావమునుబట్టి యొకానొక కోర్కెయుండు నా
కోరిక రాజనీతి మదకుంజరయానయునైన తారకున్. 155

ఉ. అయొడ నన్నపోయిన ననంతరసోదరుఁ బొందు దేవర
న్యాయము నంత ధర్మముగ నంగదునిన్ యువరాజుసేఁత ధా
త్రీయుతనీతిపాలన కృతి ప్రవణాభిహితార్థనా సమా
దేయుత యువిధ్యుం గలిపి తెచ్చిన యొహదలయోఁ తారకున్.

క. అటు రుమయును నిటు తారయు ఘటియించినయట్టి మోహగంధమ్ము
నటియించెను సుగ్రీవుఁడు రటన మఱిన కామవాగురా మధ్యమున్.

చ. కడఁగి యతండు సేయు నుపకారము పెక్కువచే నతండు మి
త్రుఁడనిన బుద్ధి ఫెక్కువయి రోష మదెట్టుల నుండుఁ దానెఱుం
గదు రఘురామునందుఁ బ్రభుకర్మముఖాబ్జము స్నిగ్ధభావమే
కదునెఱుఁగున్ రఘూద్వహుని కార్యమునందుఁ బ్రమత్తుడౌటకున్.

చ. చెలువల కుంకుమార్ద్రిముఖసీమలయందున రెండుసంధ్యలున్
లలనల వచ్చకర్పూరపు లాహిరినవ్వుల రేలఁ జందనం
బుల మెయుపూఁతయందు చినముల్ గడపున్ ధరణీ భరంబు మం
త్రుల నిడి కామతంత్రవిధురుండయి నీతికళా విదూరుఁడై.

శా. ఆనీతంబులు నర్ధరాత్రములయం దాభీలముల్ లక్ష్మణ
జ్యానిస్వానము లందఱున్ వినెద రేకాకారమోహపగా
శ్రీనిర్మజ్జితమస్తకుం డయిన సుగ్రీవుండు తానొక్కఁడే
గానీ యంతటి యూరునందున వినంగాలేనివాఁడుండకన్.

ఉ. సమ్ముఖమందుఁ బోవుటకుఁ జాలక యాజ్ఞయు లేమిచే నల
భ్యమ్మగు రాజదర్శనకృతార్థులు మంత్రులు రామచంద్ర కా
ర్యమున వ్యగ్రబుద్ధులు భయాత్ములు రాజయినాఁడనంగ మో
దమ్మను లేకయుండెదరు తామరసాప్తసుతేద్రుశస్థితిన్.

చ. అతి కరుణాపయోనిధి యహర్పతిశిష్యుఁడు సర్వకార్య సం
గతిచతురుండు మారుతియు క్ష్మాతనయాహృదయేశ కార్యసం
గతమతి తానుగాఁ జనియె క్ష్మాపతి యంతిపురంబులోనికిన్
హతకరణప్రవృత్తిఁ బ్రతిహారులు కాదనలేక యుండఁగన్.

శా. గేహాంతస్స్నిత డోలికాగతుఁడు సుగ్రీవుండు తారా రుమా
బాహాలగ్నశరీరయష్టి మదిరాబంధూకనేత్రుండు ని
ర్వ్యాహశ్రేణిక జాఱుచుండఁగ శిరస్సూగించున్ నర్తకీ
నేహాగీతిక లాలకించుచును బొల్చెన్ గామదేవాకృతిన్.

వ. అంత హనుమంతుఁ గంతువైరియంతటివానిఁ గాంచి నేహాగీతికలాగిపోయి కీశ్రేణి వీఁగిపోయి తారాహస్తచాలనంబున వారాచోటు బాసిపోయిరి. రుమ నంతఃపురంబునకుఁ జనిన నాంజనేయుం డిట్లనియె.

గీ. బయటసంధ్యలుతిరిగెడుఁబక్షములునదిరుగుచున్నవి మాసముల్ తిరుగుచుండె
వార్షుకములైన మాసముల్ వదలిపోయి కదలుచున్నవి శారదికములు నెల

చ. సతియు జయంబు తత్కృతము సౌఖ్యముకీర్తియునుం గులక్రమా
గతమగు ధాత్రి యన్నియును గల్గెను కల్గిన వే ప్రమాణసం

గతి నుపయోగ పెట్టబడఁగావలె దాని నెఱింగి సేఁత యూ
ర్జిత మధికంబు కాఁగలుగు చేఁత తదన్యము చెట్టసేఁతయై. 166

చ. కలిసిన యుద్దతైన చెలికాండ్రు పరస్పరకార్యకారకో
జ్జ్వల సమయంబు లాడికొని వాఁడొకరుండు స్వభాగమందుఁ బ్ర
జ్జ్వలితముగాఁగ జేయఁ బెఱవాఁడును శిష్టమునం బ్రమత్తతం
జెలఁగఁ గృతఘ్నుఁ డాతఁడని చెప్పను జేయనుగాదె యేరికిన్. 167

గీ. కడు నతీతమైన కాలంబు కలిసిరా దున్నవేళ మేలుకొన్ననైన
నొక్కొకపుడు ఫలమునుండదు తఱి నిద్రయుడిగి మేలుకనియయుండవలయు.

ఉ. ఎంతయొ దాఁటిపోయినది యిప్పటికైనను లేదు మిక్కిలిం
గాంతముగాఁగ మేలుకొను కాలము దాఁటును వాహినుల్ తట
ప్రాంతములందు గేరఁగులకైవడిఁ దెల్లవడెన్ దిగంతముల్
సుంత వినీలమేఘములు సూపెడు స్వల్పతటిద్విళక్షముల్. 169

మ. తమ చాపాంతములన్ దిగంతముల సంతాపింపఁగా జేయు దు
ర్దమ బాహాబలధుర్యులై యొకఁడు మిత్రత్వంబు నీకింత భ
ద్రముగా నీయెడఁజేసినారు తమరై తారుం బయోరాశి నీ
రము నింకింతురు ధూర్తజీవన విశీర్యన్మార్గణానర్గళుల్. 170

శా. నీయం దాయన కింత జాలి ధరయున్ నీరేజపత్రాక్షియున్
భూయోనూతనముల్ సుఖంపడఁగనీ పొమ్మంచు మిత్రత్వ రే
ఖాయత్తంబగు బుద్ధి నాల్గునెల లాహో భూసుతాయల్లక
వ్యాయామంబున డస్సిపోవుటకునే నంగీకృతిం జేయఁగా 171

ఆ. ఎవఁడు మిత్రకార్య మెగుబుజంబులఁ దాల్చు నాదిభోగి పడగ నవనిఁబోలె
నతఁడు పరమయోగి యతఁడె విద్వాంసుడు నతఁడె సర్వజీవనౌషధంబు. 172

ఉ. వీరులు వానరుల్ గలరు విజ్ఞులు నీ కనుసన్న వేచుచు
న్నా రఖిలావనీభరమునన్ ధరణీ తనయా గవేషణో
దార మనీష విక్రమ శతారులు వేగ వియత్ఖగాత్త సం
చారులు నీరజాప్తకులచంద్ర మహాః కలితాదరాంబుధుల్. 173

క. నే నుంటి కలద యష్టదిశానేక ప్రచండబాహువగు చమువు నృపా
జ్ఞా నిర్భర తీవ్రప్రతిజ్ఞా నిశితాస్త్రము సహస్రశఃకలితంబై. 174

ఉ. పుణ్యము నీకువచ్చు శివపుంగవు మై తెలిడాలుగా యశో
గణ్యత నీకుఁగల్గు హితకార్యము నేయుట లగ్గుగాదె యా
నృణ్యము వేల్పువీటికిని నిచ్చెనవంటిది రామచంద్రుఁడా
రణ్యకుఁ డౌచు నీకును శరణ్యుఁడు కావుట యెంత భాగ్యమో! 175

వ. అట్లు వినుచున్న సుగ్రీవుండు క్రమవర్ధమానశ్రద్ధాకుండయి తారా భుజ బునమున్న హస్తాగ్రంబు తీసికంటిమంకెనవన్నె నందివర్ధని వన్నియకా నీవిప్ప వచ్చినవాఁడ వెప్పుడు రారా దంతకాంతంబైన మేల్కొనుకాల మ్మెల దాఁ నిచ్చితివి. శ్రీరామచంద్రుని సఖ్యంబు నీ సేఁత తత్కార్యనిర్వహణ నీసేఁతకాదే. అ యన్నదమ్ముల ధనుఃకళాపాండిత్యమ్ము నే నెఱుఁగనా యిట్లనియె.

శా. హాలాపానము, తార, శత్రుదళనం బాయన్న కీమూఁడె స్వ
ర్వేలాభోగము లీ కపీంద్ర చలితోర్వీదేశి సంగీతముల్
హేలామోహన వానరీ నటన సాహిత్యంబులుం బట్టవు
ద్వేలాకారము బూజుపట్టినది యీ విద్యాప్రపంచంబునన్.

మధ్యాక్కఱలు.
అని నీలుఁ బిలిపించి చతురు నఖిలకార్యక్షితులయందు
మన సేన లెన్నిదిక్కులను మసలునో మఱి యంత పాలు
రనుగూడి మన వీడు చేరరాను వారం బిద్ది గడువు
గను నొసంగితి రానివాని కంఠంబు ఖడ్గకృత్తమగు.

అని హనూమంతుఁ నారసి మహామంత్రి! యంగదుం డీవు
చనుదెంచు సర్వసైన్యంబు సవదరించను వీళ్ళు సేయఁ
దనరార దుముదారులకును దళవాయి తండంబులకును
ననయ మనికినీపతుల కాజ్ఞగా నరయంగవలయు.

జనకరాట్కన్యామణీ లసద్గవేషణకోస మెపుడు
వినిపించు నాజ్ఞామహోగ్రభేరి వెన్వెంటనే కదలఁ
జనునట్లు నెల్లెడ సర్వసైన్యంబు శాసింపవలయు
ననుచు సుగ్రీవుండు చనియె నంతఃపురాంతస్స్థలంబు.

ఉ. అంతకుమున్నె శ్రీరఘు కులాంబుధిచంద్రుడు విచ్చుమబ్బులున్
భ్రాంత వళక్ష వాహినులు భాసి వికాసి సరోజ షండముల్
కాంతములైన దిక్కులను గన్గొనెఁ జీఁకటినుండి వెల్తురా
ప్రాంతము చేరినట్టులుగఁ బ్రాణము తీరిక చెందినట్టులున్.

చ. వెలయఁగ నంతకంటె నునువెన్నెల లెక్కవకాని యాతపం
బులు సుకుమారముల్ వెలుఁగు మొత్తము లచ్చని వచ్చకప్పురం
బులు పొడిచేసి దిక్కులను బోసినయట్టులఁ బొల్చె రాచయం
చలగమి మానసంబు కలుషంబయి దక్షిణదిక్కు వచ్చెనాన్.

మ. తెలిమబ్బుల్ మినువాక నుర్వులన నేతెంచెన్ మనోజ్ఞాకృతుల్
తెలియంచల్ తెలియిజ్జికానలును గుండేళ్లున్ మఱిన్ జంతువుల్
పలితంబుల్ కొనిముచ్చెరంగిడని పూర్వం బాఱఁగాఁబెట్టిన
బులు సూర్యాతపపీడులం దునిచినటుల్ పొలె నందంబులె.

మ. చలితోగ్రానిల ధూత పాతితములై స్వస్వవృవర్ణావనం
బుల లేఁతాకులు తూలిపోయినయటుల్ పొల్పేది వర్షాదినం
బుల స్వాఃస్త్రీ ల్వలిపంబులుం దడిసిపోఁ బొల్పార బాలాతపం
బులలో వానిని నాఱఁబెట్టిరనఁగా బొల్చెన్ సితాంభోదముల్. 184

గీ. స్థూలములుబాధపెట్టునుస్థూలములుగ సూక్ష్మములుబాధపెట్టును సూక్ష్మములుగ
వర్షకాలాణువులు స్థూల భావములును శారదికములు పరమసూక్ష్మములు చూడ.

వ. అట్టిశరత్తునందుశ్రీరామచంద్రుండు ప్రతీక్షాభావతీవ్రంబులైనకన్నులతోనిట్లనియె.

క. మన మున్నామో లేమో కనుగొనుటయుఁ బట్టలేదు కపిరాజునకున్
దనదగు మనపని యేమాయెనొ మన మిచ్చోటనుండి యేమైనామో. 187

ఉ. దిక్కులకేమొ తెల్వియరుదెంచెను వానికి వచ్చినట్టులే
దక్కట! భార్యతో సుఖము నందుచునుండిన యప్పుడైనఁదా
నొక్కతలంపు రాఁదగునె యుర్విజఁగూరిచి వానరోజులన్
జిక్కనికౌఁగిళుల్ విడువ సేగియ యందము నేఁటి కేమగున్. 188

గీ. నిజముగాఁ గ్రొత్త బిచ్చగానికిని బ్రొద్దు తెలియదన్నట్టు లున్నదీ తీరుచూడ
శరదృతువు సాగివచ్చె భాస్వరముగాఁగ సాగి సుగ్రీవుఁడరుదెంచు జాడలేదు. 189

క. పగ యడగించి ధరిత్రియు ముగుదయు ననుదాని కధికముగఁ జేసితి నా
కగుపడ దయగారిం జేయఁగబోయినఁ దుదకుఁ గోఁతి యైనట్లుండెన్. 190

గీ. అగ్నిసాక్షికముగఁ జేసినట్టి చెలిమి కోరి తామింతగా నార్చుకొందు రేమి
నిప్పుతోఁ జెలాటలు నిక్కువముగఁ గొంపమీఁదుగనై తెచ్చికోలుగాక. 191

చ. భృశపరిణామదుష్టముగఁ బెద్దయు నేర్చు మనంబు తత్కృత
ఘ్నశవ మయో పిశాచములునుం జని తాఁకవు వానిచన్న క
ర్కశ నిరయంబునం జనవు కాకులు గ్రద్దలు వానికంటె బా
లిశపరముండు ధాత్రిపయి లేఁడు తనంతన మూలదైత్యుఁడై. 192

చ. కడుఁ దనకైనవారికిని గాక పురంబున నుండి తండ్రి చే
నడవుల కంపఁగాఁబడి కులాంగనఁ బాసి మతేమొ గొప్పరా
యఁడు తను నాశ్రయించితి నటంచును లోఁకువయైతి వానికిన్
నడచుచుఁ జూచి యెవ్వనిని నమ్మవలెన్ గలికాలమట్టులన్. 193

శా. వాలిం జంపిన యంపకట్టకు సమీపంబందు నేగన్ భయం
బీలోకంబున కింతగర్వమును పై నింతైన యశ్రద్ధనే
నేలా యప్పుడు జాలిపొందవలె నీ యుప్డీ విచారంబు నే
నేలా పొందవలెన్ దయాగుణఫలం బేనాఁటి కిట్లుండునే? 194

క. నావంటి యమాయికుఁ డెపు డీవిధమునఁజేసికొంచునే యుండును నా
యే వేదను నాయంతటఁ గోవిదమణి నేను చేసికోనో చెపుమా. 195

వ. ఇట్లు శ్రీరామచంద్రుండు లేఁతవెన్నెలలు ప్రావారంబునందుఁడి గ్రుచ్చుకొం
చున్న పూచికముల్లులుగా బాలాతపంబులు జటాభారంబున భుజంబులఁ బ్రాఁకు
చున్న యరుణపిపీలికలుగా వెక్కసంపడుచునిట్లనియె. 196

ఉ. ముక్కలుముక్కలై యమర భోగచయం బవదాత వర్ణమే
దిక్కనయందు రాలిపడుతీరున నున్నవి రాజహంసముల్
ముక్కుల తెక్కలం దరుణముల్ మఱి చేతను లన్నయట్లుగా
నక్కట! తున్గి నప్పుడు నవాధిక రక్తము క్రమ్మినట్లుగా. 197

మధ్యాక్కఱ.
ఓసి మదమరాళగమన! యువిదా! పయోదాసితాల
కా! సౌరకార్ముకభ్రూ! ప్రకాశితాకాశాలగ్న!
యోసి మత్ప్రాణాధికా! మహోగ్రదైత్యోర్వీనాథుండు
పాసూయుఁడై వ్యర్థకోపజడుఁడు నిన్ జంపలేదుకద! 198

మ. తనరుం బోషణఁ బుట్టినింటవలె నుద్యద్వర్షలన్ గ్రొత్తవ
చ్చినదౌ యావనమందునన్ గిరిసరశ్శృంగిజంఘ దఘ్నాంబులం
దున బంగారపు వన్నెయై కలమవెన్నుల్ పొల్చె కింశారుమో
హనముల్ పచ్చని సంజలన్ నలిచినూఁగారున్ వయోదేహముల్. 199

తరలము.
కలమ జంఘ ధరిత్రిసంభవ కంజలోచన మోహనో
జ్జ్వలిత చారుతనూవిలాసిని బంభరాయితవేణి నా
వలను బాసి మఱెందుఁబోయెనొ వర్ష వేళ వియోగినీ
జ్వలనవేళ మఱేమి యయ్యెనొ చండరాక్షసకోటిలో. 200

ఉ. ఈ నది తీరభూమి నసితేతర మోహన కాశ సూన సం
తానము విచ్చెఁ గాలవసుధాపతి పోయెడు జైత్రయాత్ర హే
లా నది శంబరాశ్వక దళవ్రజ మస్తక లగ్నచామర
శ్రీనిభృతంబులై పరవశీకృత బాల నవాతపంబులై. 201

అశ్వగతి.
కాశ సుమాభ దృగంచల క్ష్మాతనయామణి నా
కాశమునందున రక్కసి కైకొని యేగెఁగదా
యాశుఁడు కాల ధరాపతి యెట్లుఁ జనున్ మిథిలా
ధీశుని కూఁతు జయించి దితివ్రజఁ దెచ్చునొకో. 202

చ. పతులకు నాఁదటన్ గుసుమపాత్రఁల దేనెలనింపి యిచ్చు నా
పతులును సంతసంపడఁగ బంధుర గీతిక లాలపించు గీ

శ్చతురలు సర్వమైన పరిచర్యలు చేయును దేంటికాంత లా
పతులకుఁ గాంపురమ్మునకు వచ్చిన క్రొత్తఁదనాల మక్కువన్. 203

మధ్యాక్కఱ.
మత్పరిచర్యామహోద్ధి మహిజాత మైథిలేశ్వరుని
సత్పుత్రి నాసేవలెల్ల షట్పదీ సదృశ చేసెడిని
హృత్పుటస్థితమధుకుల్య యెంతయేసీ ప్రేమమీఱ
మత్పరాకృత కర్మ నిట్లు మహిజాత మాయమైపోయె. 204

శా. వల్మీకంబుల లీనమై చనిన యీ వర్షా దినంబుల్ లతా
గుల్మా చ్ఛాదితముల్ శరద్దినములున్ గుంభీనసస్త్రీల్ కృతే
హ ల్మందానిల సంచరత్పరిమళ వ్యాసక్తలయ్యెన్ శర
ద్గుల్మవ్యాజి వినీల మేఘ విహరత్ క్షోణేస్థ సౌదామినుల్. 205

కవిరాజవిరాజితము.
అహిపతివేణిక నాననచంద్రిక హారితనూలతఁ బ్రాణపదన్
ముహురవనీతను భూమిసుతామణిఁ బొందుదు నాయసువుల్ గలుగన్
విహృతి పొనర్చెదు విస్ఫుట వహ్నిక విద్ధహృదంతర వీథులలో
బహుదినబాధలు పాసి చనంగను బ్రాణములైనను బాయవుకా. 206

చ. కహకహ నవ్వి యీ బకము క్ష్మాతనయామణి విప్రయోగసం
దహదమృతాత్ము నన్ను గగనంబున నిల్వక పొఱుచుండె నీ
విహగము దైత్యజాతి కను వే చిఱుమీనును ముక్కునన్ గ్రహిం
చి హనన బుద్ధినేగెడు విశృంఖలమై మఱి నేను చూడఁగన్ 207

రుగ్మవతి.
మీనదృశన్ నామీఁదను గోపం బూని చనన్ నే నొందుట యెట్లో
తా నవశన్ దైత్యాంబుధి మగ్నన్ గానన భగ్నన్ గాంచి వలగ్నన్. 208

ఉ. ఏ ముని సీతకున్ జనకు లెట్టులొ యట్టులు ప్రేమ గౌరవ
శ్రీమహనీయమూర్తి హాతిచెందని తూణములన్ ధనుస్సు తా
నే ముని యిచ్చె నాకుఁ బరమేశ్వరుఁడేముని దక్షిణాశయం
దా మునితోఁచెడుం గలుషితాంబుచికిత్సకుఁడ ప్రమేయుఁడై 209

నారీనుతము.
ఓ సీతా! కుంభోద్భవోద్యన్మునీంద్ర వ్యాసక్తచిత్తా యిటువచ్చినావే
వే సాధ్వీ! వద్దన్న విన్నావు కాదే యాసన్నమౌ నావద యట్లు త్రోయన్. 210

వ. వర్షర్తుభావంబు కాలంబునువదలి తన్నుఁబూనినట్లు వినీలకుటిలభ్రువు, సితదంత పంక్తియు శబలజటాభారుండునైన లక్ష్మణుండు మాటిమాటికిఁ గిష్కింధత్రోవ చూచుచుఁ దదనుకూలాస్త్రదేవతాభావనా విశేషంబున శ్రీరామచంద్ర విరహోద్దీపక వస్తుచయంబుల నిశితత్వంబు తగ్గించుచునిట్లనియె. 211

క. త్రవ్విన కొలంది దుఃఖము త్రవ్వక లే దింతయును ధరాముత్తువలెన్
నివ్వటిలుచున్న దుఃఖము దవ్వులకును జోపవలయుఁద్వాదృశులు ప్రభూ! 212

గీ. చంద్రునకు వెన్నెలంబోలె జనక దుహిత నీకు ననపాయిని మహావనీ మహేశ!
యవనియు మిథిలాయోధ్యలు నడచిదైత్యవసతియుననల్పములుతదావాసముగ.

ఉ. నీవు వశిష్ఠశిష్యుఁడవు నీవు సమస్త తపస్విరాట్తపః
సేవధి వెల్లదేవతలు చెందిరి నీమనమందు యోగవి
ద్యావధియైన సృష్టి భవదద్భుతదేహము నీకు దుఃఖరే
ఖా వివశత్వ మేమిటికి గాఢసమాధి పరిచ్యుతంబుగన్. 214

ఉ. లుంఠన మేదు యోగపద లుబ్ధకు సీతకు సేగిలేదు వై
కుంఠమునందు నున్న రమకున్ ఘటియించిననైనఁ గాని వై
కుంఠునియందు స్రంసనము, క్షోణిసుతామణి కెందు నీదెసన్
గుంఠముగాని సుస్థితికిఁ గొంచెపుఁ బాటు ఘటిల్ల దెన్నఁడున్. 215

వ. పార్వతీ పరమేశ్వరులు సీతారాములన్నవి దాఁటి సృష్టిలో నిజమైన ద్వంద్వస
మసనము లేదు. ప్రభూ! మన్నింపవే యని మఱియు నిదిచూడుము. 216

మ. పదునాల్గేండ్ల వనంబు కొన్ని నెలలన్ బర్యాప్తిరేఖా సమా
స్పద మీలోపుననే దశాస్యమథన క్ష్మాకన్యకాయోగ సం
ప దయోధ్యాగమనంబులున్ జరుగుఁ దప్పంబోదు త్వాదృఙ్మహా
స్పదన ప్రౌఢ చరిత్ర యింకొకగతిన్ సంధింపఁ బోదెన్నఁడున్. 218

ఉ. చిత్తయమంబు హ్రాసమును జెందఁగ నీయకువే సహాయ సం
పత్తియు నేర్పుమైఁ బొసఁగు మాదిరిఁ జూడుము కల్గియున్నదే
కొత్తయుఁగాఁగ నన్నియును గోఁతితనంబును గల్గెఁగాని తా
నుత్తముఁ డాతఁడేది మఱియున్ ఘటియిల్లునొ దానఁ గ్రొత్తయై 219

గీ. అన్నియును జెప్పి తనయును నన్నగారిదైన యాకృతిసామ్యంబునవసరంబు
మాట నదియొండుచెప్పుటమఱచినాఁడు మఱపుమిక్కిలియంతియే మంచివాఁడె.

క. అనినన్ రాముఁడు నాస్యంబున నూతన మందహాసముల కందళముల్
కనిపింప మరల నరిమెదుఘనమై యారీతిఁ జెప్పఁగా దొరఁకొనియెన్. 221

చ. వెలయు మయూర ముక్తములఁ బింఛములన్ వనమెల్ల దోఁచు మ
చ్ఛలపురివోలెఁ గాననము సన్నగ లోఁకువ చేసె నన్ను ని
మ్ములఁ ధరణీజ నన్ను విడిపోయినఁ గామిని వంక చుట్టముల్
వెలఁదియు వీడిపోయినను వీరు చరింతురు కానియట్టులన్. 222

గీ. అక్కటా వనీసతుల రజోవకీర్ణ పులిన జఘనంబులందునఁ బొందియుండె
ననుమహారులు మానస హంసరాజి సరఁగు కానుములనను హాదుపదులేదు. 223

మ. శరదౌజ్జ్వల్య విభాసి వృక్షపరితశ్శాఖా సమూలాంత భా
సుర పత్రాంతర వీథికా వినిసరత్సూర్యాతప క్రామణో
పరిశుష్కంబులు వన్యభల్లుక మహావ్యాఘ్రాది జంతూజ్జ్వల
త్ఖుర ఘట్టానుపదాల్ప గర్తములు పాదూహీను బాధించెడున్. 224

ఉ. గవ్వలు పూని పందెములు కచ్చుటకై తొలిజామువేళ తా
రివ్వనఁ జేతిలో గలపరించినటుల్ కలవింక సంతతుల్
మవ్వముగాఁగ జంక్రమణ మండలవైఖరిఁ బర్యటించెడున్
గ్రువ్విన చిన్నసంకువుల గోలకహారము నూఁచినట్టులున్. 225

ఉ. స్నానముచేసి శుద్ధవసనంబులు తాలిచి సంజవన్నె బొ
ట్టూని విపక్వశాలివన ముజ్జ్వల మోహన పారిజాతపున్
సూనములూని కాలపురుషుండును శ్రీహరి మేలుకొంటకై
తానయి వేచియుండె సముదార సమర్చ పౌనర్చ నెంచుచున్. 226

మ. ప్రకటోర్విజ సిత ప్రసూన భర సంభారోజ్జ్వలద్వేణి చం
ద్రికయన్ సన్నని తెల్లచీరను మెయిం దీర్చెన్ మనోజ్ఞంబుగా
రకమౌ చందన వాయులిప్తయు వియత్ప్రావార శుక్లాభిసా
రిక యీ యామిని యెందుఁబోయెడిని నారీరత్న మీయత్నమై. 227

ఉ. ఈతఁడు నేను దేవతలనే పరిపోషణచేయుచుండు మ
ట్లే తనయందు నేనును మఱీతఁడు నా దెస మైత్రి పూననాఁ
జేతమునందు నాకు దయచేయఁడు చంద్రుఁడు వర్షవేళయం
దీతనితో సమానముగనే పరితప్తుఁడనైతి నేనునున్. 228

ఉ. మ్రోఁతలుపెట్టు బంభర సమూహపుఁ దేనియజల్లువాఁడు సం
ఘాత లతాంతపున్ మెఱుపుమొత్తమువా ఁడసితాంగుఁ డుద్వహ
ద్వాత నిశాత ధారుఁడు లతాంత ధనుష్కుఁడు వీఁడొకండు ని
ర్యాతుఁడు క్రొత్త వర్షఋతురాజువలెన్ శరదాగమంబునన్. 229

గీ. చంద్రహంసలు సితమేఘ శైవలినులు తారకాసూనములును జ్యోత్స్నావిపక్వ
శాలికాస్తంబములు నాకసంబు ధాత్రి తెల్లనై సత్త్వగుణమె సందీప్తమయ్యె. 230

శా. పరమోద్దీప్తభుజాపరాక్రమనిధుల్ వైరాయమాణుల్ పర
స్పరబద్ధస్ఫుట మత్సరుల్ నరపతుల్ సాధింపఁగా నొక్కరొ
క్కరిపైఁ బోయెడు కాలమియ్యది నదీకాండంబు తార్యంబుగా
ధరణీభాగము సైన్యఘట్టన సహత్వం బూని యేపారెడున్. 231

గీ. ఇంతవఱకును జాడలే దే మనవలె నేను చెప్పినదే మఱి నిజము కాను
వలయు లేకున్న యెడల నీపాటికైన రావలయుఁగాదె యెన్నున్న రాచపనులు.

మ. టకటొం కాతనికోసమై యెదురు చూడంజూడ నాకున్ నిమే
షకముల్ కూడ యుగంబులై చనెడు వర్షావేళయం దే ప్రతీ
క్షకు నాలోపల నున్న యో ర్వఖిలమున్ సంస్రావణంబందె నా
యెకిమీం డెంతటి జాగుచేసినను దానిపాటికే రావలెన్. 233

ఉ. నిక్కముగాంగం జూచినను నేంబడు తొందరకంటె నాతండే
యెక్కువగా బడన్ వలయు నీతండు సర్వగుణాకరుండటం
చొక్కండువాండు చెప్పెమతియొప్పని ముక్కు మొగంబులేని వాం
డక్కట! నేను నమ్మితిన యంత వృథాచనె నాల్గు మాసముల్ 234

చ. గతము గతమ్మ వాండవును గా దనునట్టిది తేల్చుకోవలెన్
ద్రుతమతి నీవు పోయి యొకత్రోవకు వచ్చునొ రాండొ కార్యస
న్నుతమతిపూని వెంటనె కనుంగొని రమ్ము విచిత్రమౌ పరి
స్థితి ననుంబెట్టినాండు వ్యథచెందెదం బోయినకాలమెంచుచున్. 235

చ. ననుంగృపం జూడుమంచు గపినాథునకున్ వచియింపుమయ్య నేం
దనకును రాజ్యమిచ్చితిని దన్వినిం గూరిచిపెట్టినాండ న
మ్మినం జెఱుపంగ నాకమును మెచ్చరు నీకును గూడిరాదు రా
మునకును గోపముం బఱచి ముందుకురాం డెవండున్ ధరిత్రిలో.

గీ. అన్నకాండెట్లుతానయ్యెనట్లె మఱియుందానుకాండన్నకొడుకగుదండనీతి
నదియ ధర్మమార్గంబు శిక్షార్హ మేను భరత భూపతి కార్యనిర్వాహకుండను.

చ. ఉపకృతిపొంది దానిఫల మూర్జిత భోగము నందుచుండి ప్ర
త్యుపకృతి చేయవచ్చుసరి కుప్పరమున్ గనుచుంట యింత న్యా
యువుంబనికాదు నాండెలుపుమా! రిపుమారణచాపహస్తు ని
ష్కృపునిం బొనర్చకోకు మనుమీ! వినిమీలితచిత్తవృత్తియై.

క. ధర్మపరిభ్రష్టంబగు కర్మ సమస్తంబు మంటంగలుపుటకు ధను
ష్కర్మారంభము నాదియ ధర్మము లవమైనం గాండు తానని చెపుమీ. 239

చ. సఖితకు సాక్షిగానగు నుషర్బుధుం జూచి క్షమించితిన్ వియో
గ ఖరవిదారణోగ్రతయుంగా బొనరించినయట్టి దానికిన్
ముఖమును నద్ద మున్నయవి పొల్పుగం జూచుకొనంగవచ్చు న
న్న! ఖరుండు దూషణుండు తమ వాలియు వారిని జూడవచ్చునున్. 240

గీ. ఎదిరిషక్షమ్ము సాధువై యెసంగెనేని వందరెట్లు సాధువులము వారికంటె
నెదిరిషక్ష మసాధువై యెసంగెనేని వంద రెట్లసాధువులము వారికంటె. 241

వ. అదివఱకుం దానెన్నడెఱుంగనంతటి యీ యన్నగారి కోపంబు చూచి సౌమిత్రి
జానకీ విరహాగ్ని తీవ్రత నెఱింగి సుగ్రీవునందుంబట్టరానంత కోపంబు రా
వానరుండు సాధువ్రతమునందు లేండు. [illegible]

బుద్ధిమాలి గ్రామ్యసుఖము లందు మరగియున్నాఁడు. ఇదిగో నేను వానిని
బోయి వధింతునని ధనుస్సుఁబూని యల్లెత్రాడు మ్రోయించి. 242

మ. కనలుం గన్నులఁ బోఁక త్రొక్కిన భుజంగంబట్లు నిల్వంగ నం
తన కాంతార నివాసదేవత లనంత ప్రౌఢకోపుం గనుం
గొని భీతాకృతులై నటుల్ పవన సంక్షుబ్ధాగ్రశాఖంబుగాఁ
జనిరా మిన్నులయందు లోనద్రుచు భాస్వత్ప్రాణు ఘూర్ణంబుగా. 243

చ. కడువడి రామచంద్రు దశకంధరుపైఁజను జైత్రయాత్ర చొ
ప్పడు ననుకూలతా కలన భంగములేమి యెఱింగి వార్తపు
చ్చెడు వనిమీఁద నవ్వల వసింపఁగ నింద్రుఁడు పంచినట్టి హె
గ్గడులు తలంచి కింతిపురిఁగల్గిన దోసమె. మేలు నామదిన్. 244

చ. ప్రభువగు రామచంద్రునకు వచ్చినఁ గోపము భూతసంతతుల్
విభుఁడు హరింపనున్మనుచు వెక్కసపాటొకయింత లేక శాం
త భృతమనస్కులై చను ననంతక్రుధామతి లక్ష్మణుం గనన్
సభయతఁ గంపమందును విషణ్ణ మనస్కములౌచు భూతముల్. 245

మ. తనకున్ వచ్చిన కోపమేమొ యెఱుఁగున్ దా నంతకోపమ్ము నం
దున నీ సృష్టియెడన్ దయాగుణ సముద్యద్విజ్ఞులాత్ముండగున్
జనకక్ష్మాతనయా మనోహరుఁడు, శిష్టంబైన లోకంబు వ
చ్చిన కోపంబున విస్మరించెదరు సృష్టిన్ దత్సమాకృష్టులై. 246

గీ. అందుచే రామచంద్రుఁడిట్లనియె నాయనా! యదింతకోపంపడకోయి మఱియు
నేగి నిజముగాఁజంపెదవేమి? మనకుమనకుఁగలిగిన స్నేహంబుమాటచూడు.

ఉ. ఆ భరతుండు నీవును మహానియతాత్ములు సోదరుల్ ధరి
త్రీభరమందుఁ గామనిరతిం గన రెవ్వరు, చూడఁగా సతీ
లోభము చాలచెడ్డది తలోదరి దూరగయై మఱిం బున
ర్లాభముగల్గు కాలపుబలంబున కాఁగుటయంచు నున్నదే! 248

గీ. చతురుపాయంబులనుటలోఁజరమములువృథా సమస్తంబుసామసాధ్యంబెయగున
బుద్ధిపూర్వకముగ ధర్మబుద్ధి పరిహరించుటొక్కటి యది విస్మరించు టొకటి.

క. ఆ హనుమకు నాతనిపై మోహమ్మున్నది ప్లవంగ భూపతియంచున్
మోహమ్మున్నది నీకును నా హనుమవయిన్ విచిత్ర మనుబంధముగన్. 250

శా. ఈ కాంతారమునందు వానరమటం చిన్నాళ్ళుగా లేదు శా
ఖాకీర్ణమ్ముగ వ్రేలుచున్నయవి నేఁ డా భీతియున్ మానెనో
కాకిచ్చోటికిఁ గ్రొత్తవేమయిన రాఁగా నైనవో పోయిర
మ్మాకిష్కింధ యథార్థముం దెలియకేలా గుబ్బిసల్ పొందఁగన్. 251

ఉ. అంగలు వేసికొంచుఁ గుపితాకృతియైన సుమిత్రబిడ్డ సా
రంగ మృగేంద్ర భల్లుకధురా భయభాగపసర్పణంబుగా
సంగత రామకోప ఝర సారణివోలెఁ బ్రదీప్తకార్ముకో
త్తుంగభుజుండుగాఁ బురముత్రోవఁజనెన్ ధరణీ వికంపనన్. 252

ఉ. క్రూరముఖోగ్ర కార్ముకము కొప్పను గాంచి వనీభుజంగ సం
వారము వేఁడొవైరి తమపై కురగేశ్వరుఁడెత్తివచ్చు నా
దూరధరిత్రిదేశములఁ దోఁకలపై నిలుచుండి దూరముల్
చేరినయంత నూరుపులుచెందు ధరా నమితోత్తమాంగముల్. 253

వ. అంత, భూరుహప్రస్తరంబులు హస్తంబులఁగీలించి కిష్కింధాపురీ ముఖద్వారోభ
యపార్శ్వస్థ గిరిశేఖరంబుల మహావానరంబులు విహ్వలించిన సాజ్యహుత సముగ్ర
హవ్యవాహనుంబోలె సౌమిత్రి పులకిత జటాశేఖరుండై జ్యాప్రసారిత హస్తుండైన
నవిపాఱిపోయి. 254

మ. భయసంధానిత ధీకులౌచు వినిపింవంబోవ సుగ్రీవు, వి
స్మయి, మైరేయ విఘూర్ణమాన నయనచ్ఛాయాసనాథున్, మనో
హయ నిష్ప్రగ్రహవేగు, వార్త కతఁ దప్రాప్యుండుగా నద్యో వ
క్షయ సంగీతక నాట్యమర్దళ మహాస్వానాబ్ధి దూరేత్యుఁడై. 255

శా. వాలిప్రాణమహో భుజంగమము చాపప్రోఢకోట్యుత్థితా
భీలుం డుండెనె వానితమ్ముఁ డితఁ డా వీరుండు కాఁదౌను బ్ర
జ్వాలాభీలుఁడు వానికంటె విషసర్పం బేగుదెంచెన్ బురిన్
బాలస్త్రీజనవృద్ధులందఱు గుహాభాగంబులన్ దాఁగుఁడీ. 256

ఉ. గుబ్బిసలాడికొంచుఁ జిఱుగుంపులొకొక్కరిఁ జెప్పికొంచు నీ
రుబ్బిన చెర్వులోఁ దబక లూఁగిసలాడినయట్లు సర్వమున్
లిబ్బి హరింపఁగాఁబడిన లీల నితస్తత ఉద్భ్రమంతులై
కబ్బిలులట్లుగా మెలఁగఁగాఁ బురి పొల్చె విలీన మూర్తియై. 257

శా. లీలన్ వాలినిఁ జంపె నంతబలశాలిం జూడ నెట్లుండునో
శైలాభుండు పరాక్రమాబ్ధి యని యెంచన్ వాని తమ్ముండు ని
ర్వేలాశీవిషమూర్తి భ్రాత్రధికుఁ డీ వీరుండు నేతెంచె నం
చోలిన్ గొందఱు చూడవచ్చిరి బలాఢ్యుల్ వానరుల్ లక్ష్మణున్. 258

ఉ. చూచిరి రామసోదరుని సుందర కర్బుర వర్ణ దేహునిన్
జూచిరి రామసోదరుని శూర జనావళి మౌళిరత్నమున్
చూచిరి రామసోదరుని క్షుబ్ధలతాభ్రుకుటి ప్రచండునిన్
జూచినయంత పౌరజను విశుద్ధ సముత్సుకభావ మేర్పడన్. 259

ఉ. చేసిన వీనితోడ నని సేయవలెన్ మదియందు గెల్పుపై
నాసకుఁగాదు నాహవమునాడితి మీతనితోడ నన్న సం
తోసము కోసమై కడిమితో బరిమీఁదఁ జలించు పాముగా
నీ సుకుమార దేహఁడు వహించెదునేరుపు చూచుకోసమై. 260

క. మరి గోలాంగూల చమూ పరివృఢులు శిలామహీజ పాణులు దంతో
ద్ధుర వికట హాసరేఖా పరాక్రమాభిముఖులైన వారిం గంచున్. 261

శా. అంతన్ లక్ష్మణుఁ డుజ్జ్వలద్విధుర కోపానూనపాత్తై, శ్రవః
ప్రాంతాకృష్ట గుణాభిమర్శన మహాస్వానోగ్రరేఖా దిగం
తాంతస్ఫారప్రతిస్వనుండయున భీస్వాంతంబు కల్గన్ శిలా
సంతానంబులు పాఱవేసి చని రాశ్చర్యప్రహాసాస్యులై. 262

గీ. ఒక్కఁడొక్కడు కపిరాజు లుగ్రబలులు కొండఱకుఁ గల్గు వందయేన్గుల బలంబు
కొండఱకుఁ గల్గు వేయియేన్గుల బలంబు వికృత దంష్ట్రాననులు మహావీర్యనిధులు

క. నానాబిభత్సముగా నైనం గిష్కింధ చూచి యంగదుఁడు భయ
స్థానమ్ము కోట వెల్వడి యానత శిరుఁడంజలించి యరుదేరంగా. 264

వ. లక్ష్మణుఁడు చూచి వత్సా! సర్వజగన్నాథుం డయిన శ్రీరామచంద్రుని
తమ్ముండు పరవీరహుండు సౌమిత్రి వచ్చి ద్వారమున వేచియున్నాఁడని నీ
తండ్రితోఁ జెప్పుమన నంగదుండు 'తండ్రితోనా' యనిన. 265

గీ. సరగ నంగదు లోచనాంచలములందుఁ బ్రోపుగాంచి కన్నీరు గిఱ్ఱుమని తిరిగె
సరగ లక్ష్మణుమానసాంచలమునందు వాలివధవార్త సూక్ష్మవిభ్రాంతిఁ దిరిగె.

ఉ. అంగదుఁడేగి తండ్రి చరణాంబుజయుగ్మపదంబునందు సా
ష్టాంగముగాఁ బ్రణామకలితాననుడై తన తల్లికిన్ నమ
స్సంగత శీర్షుఁడై రుమకుఁ జాఁగిలి మ్రొక్కి సమీపధాత్రి ని
ల్చెం గొడుకుం గనుంగొనినఁ జిన్నరికమ్ములఁ దార యాతఁడున్. 267

ఉ. ద్వారంబందున నిస్వనద్గుణ సముద్యత్కాలపాథోధిగం
భీరారావుని నిల్చియున్న యల సౌమిత్రిన్ గనుంగొంచహో
యూరెల్లన్ భయలీనమైనయది వ్యూఢోరస్కుఁడా లక్ష్మణుం
డారూఢోజ్జ్వల కోప వహ్ని నను నిట్లాడెన్ శితాక్షంబుగన్. 268

క. నీ తండ్రి తోడఁ జెప్పుము సీతాపతి పంప ద్వార సీమన్నిలుచున్
దూతాకృతి లక్ష్మణుఁడన వే తెలుపగ వచ్చినాఁడఁ బృథ్వీపతితో. 269

క. కుణుకింకిణీక నవమధు కణ గణ సంపాత రావకంబులు గీతా
చణ గళ మర్దళ దళ నిక్వణములు వేణుస్వరారవంబులు తిరుగన్. 270

గీ. సకల పశుభావ సామ్రాజ్యచక్రవర్తి యమిత మైరేయ పానవిహ్వల ముఖుండు
సర్వపుష్పశరుండు దించని ధనువున నెడతెగని నారిమ్రోఁత మ్రోయించుచుండె.

క. అంతటిరొాద సుగ్రీవున కింతయు వినిపింపలేద యేమనెనొా పద
ప్రాంతస్థుం డంగదుఁడు తా నంతటఁ గనిపింపలేద యక్షుల కచటన్.

గీ. కిలకిలారావములు చేసెఁ గీశ వితతి సారిది హర్షాన సౌమిత్రి చుట్టు చే
తన్మహోధ్వానమును వియత్తలము చేరి గుమ్ముకొనివచ్చె నంతఃపురమ్మునం

వ. అమ్మహోధ్వానంబునకు సుగ్రీవునకు మెలఁకువ కలిగి కనులలోఁ దెలివి
చెదరిన హారంబులు సవరించుకొన నయ్యెదను చూచి యంగదుండు చె
మాటలు విని ప్లక్షప్రభావులను నిద్దఱు మంత్రులు సుగ్రీవున కిష్టులు
నిర్ణేతలు రాజుతో.

ఉ. నీ యెదుటన్ నిలంబడియె నీ ప్రియపుత్త్రుఁడు దీప్రభక్తి రే
ఖాయుతుఁ డంగదుండు కడకన్నులఁ జూడుము సుప్రసన్న రే
ఖాయతి నేదొ చెప్పటకుఁగా జనుదెంచిన యట్టులుండెఁ దా
నై యువరాజు రాజ్యవిషయంబునఁ దొరదర యేమికల్గెనో.

క. ఏదో రాజ్యభయం బుత్పాదిల్లినయట్లుగాఁగఁ బలికెడు సఖుఁడా
కోదండితమ్ముఁ డుగ్రుడు కోదండముపూని నిలచుఁ గోటముఖమునన్.

వ. మఱి వినీతుఁడై సుషేణుం డిట్లనియె.

ఉ. త్రావిన ఆొమ్మె గ్రుద్దిన విధంబునఁ జేయుట లగ్గుగాదు నీ
భూవలయాధిపత్యమును బొందిన కారణమున్ నిరాదృతి
శ్రీ వెలయంగఁజేయుట నిషిద్ధపుఁగార్యము వేల్పుపిండు లె
స్సై వినుతింపరానిది సురాధికసేవన దుష్టమై చనున్.

వ. మరి నలుం డిట్లనియె.

క. నీచేతఁ బంపఁబడి బాహాచతురుని రామచంద్రు నంగదుతోడన్
వాచించితి మప్పుడు నీకై చెప్పించుకొనుట తగునా! యీవేళన్.

వ. అంత నీలుండు శ్రీఘ్రంబుగా నిట్లు చెప్పె.

మ. నలుఁడున్ నేనును దారుఁడున్ హనుమ భూనాథుండు నీవొట మి
క్కిలిగాఁ గోరితి మా మహామహునితోఁ గిలించి నేస్తంబు తా
నలఘుం డాయన మాటపై నిలుచు బ్రహ్మాండంబు క్రిందైనఁ దా
నలఘుం డాయన వింటిపై నిలుచు బ్రహ్మాండంబు మీఁదైననున్.

వ. మఱియుఁ బులకిత తనూమంతుండైన హనూమంతుం డిట్లనియె.

మధ్యాక్కర.
పరమ ధర్మాత్ములు సత్యభాషులు బద్ధసఖ్యులును
ధరణి మహాభార వహన దక్షులు దళితాఘచయులు
నరరె! తండ్రి యెవండు ధాత్రి త్యజియింపుమన్నఁ ద్యజించు
నరయంగ నెవఁడన్నవెంట నడవిలో ననుగమించెదును.

శా. ఔదార్యాభినవాభిరామగుణ మర్యాదాస్వరూపుల్ మహో
మోదాచ్ఛాంబు సరస్సరోజ వదనుల్ పుంభావ సంవిత్తు లో
హో! దివ్యన్మధురావలోకనములు ధర్మోదార వాగ్గుంఫనుల్
సౌదర్యోజ్జ్వలతా నిధానులు భవత్సఖ్యప్రసందీపితుల్. 285

క. ని న్నాశ్రయించి రగ్గిరి నున్నప్పుడు మనము, వేచియుండిరి నీకై
యన్నట్టిమాట నిలుపుకొన న్నీకును నేఁటి కాఁగినది కపిరాజా! 286

గీ. వారిలోఁదమ్ముఁ డొకరుండు ద్వారసీమనిలిచియున్నాఁడునేఁడు జ్యానిస్వనమున
నిఖిల దిక్కటాహముల ఘూర్ణిల్లఁజేయు చిన్నినాళ్ళుగ మనకోస మెదురుచూచి.

మ. కడకన్ నేనును బోయి యా ప్రభులకున్ గాన్పించుకోలేద నా
యొడయండౌ భవదాజ్ఞలేక మఱి తానొక్కండు దుర్వారుఁడై
గుడుసౌ విల్లును బూని వచ్చి నిలిచెన్ గోట్టాగ్రభాగంబునన్
వడిగాఁ గాయయొ పండొ తేల్చుకొని పోవన్ వచ్చియుండుంజుమీ. 288

మ. భ్రుకుటిజ్వాలల రోదసీ కుహరమున్ ముట్టించునో యన్నటుల్
వికటాస్యుండును విస్ఫురద్వదనుఁడున్ విస్ఫారకోపోగ్ర వ
హ్నిక దిక్కర్ణకుటీర నీప్రములు మండించున్ ధనుర్జ్యా నినా
దక వల్లీ మయ వాగురానిపతితుల్ తారాడఁగా వానరుల్. 289

క. తనకుం దెలిసిన విషయము జననాథునకున్ వచింపఁజను మంత్రులు, ల
క్ష్మణు కోపతాపములు రాముని యవి సౌమిత్రి సహజముగ యోగి యగున్.

గీ. తనకుఁగలిగిన కోపంబు జనుఁడు తనకుఁ దానె యుపసంహ్రుతిం జేసికోనువచ్చు
పరుని కోపప్రభావంబుఁ బడయనగు జనమ్మునకును నాత్మాధికారమ్ము లేదు.

గీ. మూలభూతునిదగు కోపమునకు హేతువపనయింపంగఁబడుటయే యవధి దాని
కర్దమునయందుఁగిరణంబులక్షలందుఁబొడుచుగతి సూర్యకిరణముల్ పొడువలేవు.

ఉ. క్రమ్మిన కోపమొప్ప యువరాజును జెప్పెను దానువచ్చి ద్వా
రమ్మునయందు నుంటినని రాజునకున్ వచియింపుమంచు నీ
సమ్ముఖమందునన్ మనవిసల్పెడు నీ ప్రియసూనుఁడంగదుం
డిమ్ముగఁ గన్నువిప్పి కనుమీ! వినయాన్వితునిం గపీశ్వరా. 293

వ. చని తలతోఁ బ్రణామమును సల్పి సుమిత్రసుతున్ బ్రసాద భా
వ నిభృతుఁ జేసి నీ వనిన వాక్యము నిల్పుకొనంగఁ జూడు రా
మునిదెస వాక్యపాలన మమోఘ ఫలంబగు వేఱువాక్య పా
లనమునఁ గల్గనైనది ఫలంబున కిబ్బడి ముబ్బడై చనున్. 294

. అనిన సుగ్రీవుం డంగదునివంకఁ జూచిన నంగదుం డిట్లనియె. 295

శా. ద్వారంబందున నిప్పనద్గుణ సముద్యత్కాల పాథోధిగం
భీరారావుని నిల్చియున్న యల సౌమిత్రిం గనుంగొం చహో
యూరెల్లన్ భయలీనమైనయది వ్యాధోరమ్కుఁడై లక్ష్మణుం
డారూఢోజ్జ్వల కోపవహ్ని నను నిట్లాడెం బ్రచండాక్షుఁడన్. 296

క. నీ తండ్రితోడఁ జెప్పుము సీతాపతి పంప ద్వారసీమను నిలుచున్
దూతాకృతిలక్ష్మణుఁడని వే తెలుపంగ వచ్చినాఁడఁ బృథ్వీపతితో. 297

వ. అది విని సుగ్రీవుండు తన యాసనంబు డిగ్గి హనుమయొద్దకుఁ బోయి యాతని చేతులు పూని యిట్లనియె. 298

క. అచ్చముగ నంతకోపము వచ్చుటకును సూర్యసూతి వలనను దోషం
బచ్చుపడ నుండ వలెనా వచ్చినదన వచ్చెననుట వాక్యపుఁదగవా? 299

గీ. దున్నపోతీనిన దనంగ దూడఁగట్టి వేయుమన్నట్టు లున్న దీ విధము చూడ
నొక్కమాట నేనన్నదియున్నదా! యొకంత చెడునూహకూడ రానట్టివాఁడ.

ఉ. తమ్ముఁడుకాక రాఘవ పద ద్వితయంబునయందు భక్తి భా
వమ్మున నాకు నెక్కుడె సవప్రమితాత్ముఁడు లక్ష్మణుండు నా
తమ్మునియందు గౌరవము తక్కువకాదది నాకు నింతకో
పమ్మునతండు నాదెసను బట్టుట యర్థముకాదు నాకిటన్. 301

గీ. ఏరొ నేనన్నఁ గిట్టనివారుపోయి నాపయిన నేమిచెప్పిరో నాథుతోడ
నాపయినిఁగోపమునువచ్చునా!రఘుపతికకట!స్నేహమ్ము నమ్మటయనుచులేదె.

శా. నాయం దింతగఁ గోపమందుటకు నేనా! సీతఁ గొంపోయి యెం
దో యేరాళపు దాఁపుడుంచితిని? దా నుర్వీజ నాయింటిలో
నాయెందున్నదొ చూచుకొమ్మనుము భూషాళుల్ మఱిన్ మున్నె య
న్నా యిందంచును చేతఁబెట్టితిని నేనై దాఁచుకొన్నానయా! 303

ఆ. అతఁడు వచ్చి నన్ను నాశ్రయించెనగాని యతని నేను పోయి యాశ్రయింప
నతఁడు చూచిన జగదధికుఁడు గావచ్చు దానధర్మ మంత ధర్మవగునె. 304

క. రాముఁడు కావచ్చును మఱి సౌమిత్రియుఁ గానువచ్చుఁ జలియింప భయం
బేమీ నాకును జెప్పిన యామాటకు వెనుకఁబోయి నప్పుడుకాకన్. 305

ఆ. మనసు చంచలంబు మైత్రి నిల్చునె యెందు నగ్నిసాక్షిగాఁగ నయ్యుఁ గూడ
వారి పనిన ముందుఁ దీరిచి యాపైని జూచికొంద మాత్మశుద్ధి మాట. 306

వ. అనిన మంత్రకుశలుండైన సుగ్రీవునకు వాక్కుశలుండైన హనుమ. 37

శా. నీ వాగ్దానము విస్మరింపవనుటే నీయాత్మసౌభాగ్య రే
ఖా విస్తారత చాటిచెప్పెడును నీకంటెన్ సుహృన్మౌళియున్
సేవాదక్షుఁడు సజ్జనోత్తముఁడు దాక్షిణ్యంపుఁబ్రో వుండఁ డీ
భావం బచ్చుపుఁబెంఁడి ధర్మధిషణాపారీణ! కీశేశ్వరా. 308

క. తా ప్రాతవాఁడు, వర్షానేహంబులు మేఘవాహిని దుస్సహముల్
స్నేహ పురస్సర కోప వ్యాహారము లాడియుండ వచ్చును బ్రభువై. 309

చ. తెలుపులు కట్టెఁ జొక్కపు నదీ సతు, లంచల పూల చీర ది
క్కులు సవరించె, తెల్లలు మొగుళ్ళుఁ బరస్పరమౌ జిగీషచేఁ
బలె హిమహారి చామర విభా రమణీయ సితాతపత్రమం
జులత వహించె, నీవు దయచూడవు రాముఁడు నిష్ఠురాత్ముఁడే? 310

చ. కురువక నామముల్ కుటిల గుల్మకముల్ పరిణామ దీపనాం
తరరుణ వర్ణముల్ తెలి నవల్ కుహనాకృతి విచ్చెఁ, దెల్ల నె
త్తురు చిలుకల్లలై యుబికి తోఁచెడుపోలిక సాగివచ్చె నీ
శరదృతు వీవు నేనఁగాని సాగవు కోపమురాదె స్వామికిన్? 311

ఆ. తెలవ యున్న యునికి తెలిసి జీవితము భద్రమ్మటంచు నెఱిఁగి తత్ప్రయత్న
మందు జాగుసైన నగుఁగాక యిట్లు నిశ్చయమునందుఁ జాలు స్వామి యొకఁడె.

ఉ. నాలుగు మాసముల్ నిలిచినాఁడు కృపారస మూర్తి లిప్తయుం
జాలఁడెవండు నంత జలజంబులు విచ్చి లతాంగి కన్ను లం
దాలు స్మరించి విస్మృతి వదంబున సాగిన యూతనాశర
ద్వేళకుఁ గోపమందుటయు వెక్కసమౌ నటవే కపీశ్వరా!

క. దానికి నీవేమియు నను కోనేరా దాయనకును గోపము కలుగున్
దైనిని గోపము మిత్రుని పైనింగా కెవరిపైని వచ్చును జెపుమా. 314

శా. మరియుం గోపమువచ్చి పంపెను సమున్మత్తారి కుంభస్థలీ
ప్రరుదద్దారణ దంష్ట్రికా నఖ సటా పంచాస్య మా స్వామి యు
ద్ధురుఁడౌ తమ్ముని మంచివాఁడుగనుకన్ దోసంబు విస్పష్టమై
వరఁగుండో మనయందు స్వామికిని గోపంబెంతయున్ న్యాయమై. 315

శా. మాల్యా నీవు కృతజ్ఞలోకమునయందున్ శేఖరీభూతుఁడౌ
దల్పంబొందిన స్వామి యల్ప నిమునంబై పోవుఁబో దీర్ఘకో
పుల్కా రుత్తములైన తాదృశులు పాపుల్కారయా త్యాదృశుల్
మేల్కా స్నేహ మదెంత యుత్తమము మీమీ మధ్యఁ గీశేశ్వరా. 316

ఉ. ఆతలివాఁడు తాఁబెరిఁగినప్పుడు తగ్గవలెన్ సఖిత్వ వి
ఖ్యాతపు లక్షణంబుగ మహాత్ములు వా ప్పెరుగం దలంచినన్
భూతలమున్ దివంబు మఱి భోగి జగత్తును నిండిపోదు రే
నీతి యొకండుగా నెదురునిల్చును దాదృశులైన వారితో. 317

ఉ. అగ్నివలెం గవాటమునయందున నున్న సుమిత్రదిగ్ధమున్
దగ్గరి యుంజలించుచు విడంబన మారి సఖిత్వరీతికిం
దగ్గ నమస్కృచేసి యరుదారఁగ సాధు పథంబు చూపుమీ
మెగ్గ నౌకెంతయుం దలపవేకద! తోడవు మంచిమాటలున్. 318

వ. అంతఁ బ్రతివీరహంతయైన లక్ష్మణుఁడు ప్రతి సమాదిష్టుండై కిష్కింధాపురంబు ప్రవేశించిన ద్వారస్థులయిన మహావానరులు ప్రాంజలులై నిలిచి క్రుద్ధాకృతియైన యతనింగాంచి భీతులై దూరమునందె నిలిచిరి. 319

హయప్రచారము.

రాజతంబు రత్నమయము భ్రాజితంబు ప్రసవమయము
రాజగృహ విరాగమూర్తి తేజువెలుఁగ దిశలఁ జొచ్చె. 320

తురగవల్గనంబు.

రెండు దెసల సౌధరాజి శ్రీనిధాన హోమదీప్తి
రెండు దెసల నాపణములు శ్రీనిధాన రత్నఖనులు
రెండుదెసల పుష్పితాగ్ర వృక్షసమితి వీథివ్రాలి
నిండుచల్లఁదన మొసంగు నిబిడ పత్ర మధురరేఖ. 321

విజయమంగళము.

దేవయోనులైన కీశ దివ్యమూర్తు లేగు వీథి
పూవుదండ లొప్పువారు భూరిభుజులు కామరూపు
లావితేరు గందపూఁత లంగములను బొంగువారు
శ్రీవిలాస గంధి మాధురీ సురా విలోచనులును. 322

ద్విరదగతి.

పథమెల్ల మైరేయ బహుళ ప్రసూనాత్త మధువాసనా సమున్మాదకంబై యొప్ప
పథమెల్లఁ బటవాసపరిమళ శ్లథమాన పృథులవాయుతరంగ విధుతమై యేపార.

విజయభద్రము.

దారిప్రక్కన ధరాధరకోణఘనశిలాత్తవితర్దికా పరిస్తరణ రమ్యంబైన
దారిమధ్యన ధరాధర ఝరీ సారణీ దరనీల పరిలఘూత్తమ వారి మృదువైన.

మధురగతి.

గవయుని యంగదు గజశరభులయును ద్వివిదుని మైందుని ధృతమతిఁ దారుని
యవసథములు మణిహర్మ్యములం గను చవిరత కోపుఁడునై చను రఘుమణి.

హరిగతి.

హనుమజ్జాంబవ దవసథములు సూర్యాక్షుని సౌధము విద్యున్మాలిది
యు నలునిది సుబాహునిదియు కుముదునియు సుషేణుని తారుని గేహంబులు
కనుచున్ లక్ష్మణుఁ డరిగెన్ దర్చ్ఛి కాంతి ఝళంఝుళితాక్షుం డగుచున్
వినమత్కీశేశ్వర పరిగణనా పేత ధృశాంతుఁడు రక్తాక్షుండై. 326

హరిణగతి.

ప్రతిగృహమందు బహుమణిసుషమ ప్రతిదేహళి సుబంధురకాంతి
ప్రతితోరణము పచ్చల మెఱుపు తళతళన్మణులు ధగధగలాడి 327

వృషభగతి.

పాండురాభ్ర ప్రకాశములును ప్రభూత ధనధాన్యములు, లక్ష్మీ
భాండారములు కనుంగొంచును బ్రసవమాల్య యుతములునేగి
పాండు ఓసాల వృక్షక లతా పరిక్షిప్తము దురాసదమును
మండితవానరేంద్ర గృహమును మహేంద్ర సదనోపమము గాంచె. 328

క. నవకనక సదన భవన, యనవరత జలఝర పరివహన కమన, సలతాం
త విమలఫల నతపాదప రవణ పటుహ, ప్లవగపటల రాజస్థానిన్. 329

క. అసిపాణి కపికులేశ్వర విస్ఫుత్వర భుజాభిగుప్తవివృత ద్వారా
భ్యసనాష్టాపద తోరణ విస్ఫుమర కాంతిచ్ఛటా నవీకృత శోభన్. 330

క. కమలా నివసన, ప్రవసన కమలాప్తాతప సమృద్ధ కమనీయకుజన్
విమలామధురక ధూపిత విమలానిలవాయు మధుర వీచీపూర్ణన్. 331

వ. అంత లక్ష్మణుండు సింహద్వారమ్ము సొచ్చి నానాజన సమాకులమ్ములయిన
సప్తకక్ష్యలు కడచి యష్టాపద పర్యంతంబు సువర్ణాసనము మహోస్తరణోపేతమైన
యంతఃపురంబు ప్రవేశించి. 332

మత్తమయూరము.

నానాభూషామంజులనారీచయమంతన్ రానుంబోమన్ నూపురరావంబులు కాంచీ
స్థానాలోలత్కింకిణీ సంరావము గాఁగన్ గానంగా నైనంగని కన్నుల్ చలితంబై.

మదనదర్పణము.

కోమలకలనాగళాగ్ర సంకుచద్రవంబుగా ప్రేమమెయి విపంచికా విమర్ది
యంగుళీచ్ఛటన్
గామదివరణోగ్రగీతికాకలస్వనంబులన్ గ్రామవివృతిఁబాడవించునే కలంగిగుండెలో.

మణిరంగము.

పూలతావులు ముక్కుల లోనన్ గాలువల్గొని క్రమ్మిన యంతన్
హేల కంతని యెంచఁగరాకన్ బాలిక ల్నడువన్ దనముందున్. 335

పృథ్వీ.

తన నిలిచిన విధంబు గనుంగొనరు జడలు వికుంఠ ప్రవ
ర్తనలని కనలు రా నెద లక్ష్మణుఁడు ధనువును గైకొనెన్ దాన్. 336

వ. లక్ష్మణుండు జ్యానిస్వానంబు చేసిన వింజమాఁకిడిన తెఱంగై నవ భూషా
కనకగిరి కాంతిమణి సూర్యాంశు ప్రసారంబున వెలుఁగ దయ్యె నాట్యవేదంబులు
మాసె, హేలా గమనకర్మ లడంగె మన్మథస్వాహాకారంబులు మాటుమడంగె.337

వృషభగతి.

సౌమిత్రికిఁ గోపము వచ్చిన సంగతి తెలిసెన్ సుగ్రీవున
కేమో చెప్పలేద యంగదు డిది నిజమే యని మదిలోపల

గోమల మతి రాఘవునకు మఱిఁ గోపమువచ్చిన జగమేమిటి
యేమైత్రినిలువఁగా నేర్చున యీమైత్రియె యిట్టిలైన యెడ.

ఆ. అసనంబు డిగ్గి యంత సుగ్రీవుఁడు తారవంకఁగని యుదారమూర్తి
నీవు పోయి రాముని సహోదరుని కోప మపనయించునట్టు లాడవలయు.

ఉ. ఇంతులయందుఁ గోపము వహింపరు నిష్ఠురముల్ వచింప రే
కాంత మనస్కులైన మహితాత్ములు తాదృశులైన వీరు లీ
యింతటిదైన కోపమును హేతువులేనిది కల్గె శాంత మొ
క్కింత ఘటించిపెట్టవలె హేతువు లేదనునట్టి వేళకున్.

గీ. మిత్రునందునఁ గోపమ్ము మిళిత పంక వర్షనది కచ్చరము దాఁట వలనుపడ
అపహతమ్మైన కోపమ్ము నపుడు సితశరన్నది విధాన నతిసుకరంబు దాఁట

శా. మాంజిష్ఠంబగు కోపభావము రహింపం బట్టునే హేతు సా
మంజస్యంబు వళక్షభావ మిదియున్ మన్నించి నీవేగి ముం
దంజన్ మంచిగ నచ్చఁజెప్పుము సకృత్తా దోసమున్ సఖ్యమున్
సంజాతంబగు కోప మీదృశ ముదంచన్మార్గమా యంచనన్.

బంధురము.

వడివడిఁదడఁబడు నడుగులు మదిరా బంధుర లోచనకాంతులతో
నడుమున గుడుసగు కనకపు రశనా నాద మనోహర కింకిణితో
నొడికపు మెలపున నొఱగిన మెడతో నుజ్జ్వలహాస రదచ్ఛవితోఁ
బడఁతుక చనియెను రఘుకులపతి యొప్పంగను నిల్చిన చోటునకున్.

శా. తారం గాంచినయంత లక్ష్మణునకున్ దవ్వయ్యెఁ గోపంబు నె
వ్వారున్ భార్యలఁ బంప రాఁచికొనినన్ వైరంబు మాటాడఁగా
ధీరుం డంత మొగంబు వాల్చికొనియెన్ దీప్తాప్సరఃకామినీ
సారాభోగ మనోజ్ఞమూర్తినిఁ బురస్థున్ దారనుం గాంచుచున్.

గీ. చెలఁగి భర్తకు జీవికాజీవియైన పురుషునకుఁ గానిపింతురు పొలఁతు లెందు
స్వాంతనిశ్చలల్ శుద్ధాంతకాంతలైన నన్ననో తండ్రినో చూచునట్లుగాఁగ.

వ. మఱియుఁ దార యిట్లనియె.

క. మీ మాట యెవరు కాదని రేమీ! వాగ్దానభంగ మెవరాడిరి నీ
వేమో! యంతఃపుర్యా స్వామీప్యమునందు వచ్చి జ్యా మ్రోయింపన్.

క. చెలికాఁడవును సమర్థుఁడ వలఘుఁడవునువచ్చి యంతిపురము ముం
గిలి నిలిచి నారి లాగితి చెలికారమునం దెదైనఁ జెల్లునుగాదే.

వ. అంత లక్ష్మణుం డిట్లనియె.

గీ. అంత నిష్ఠుర మాడెద వంతెగాని మఱియు నేమందు వాతని మాట నీః
హరి సుషుప్తిఁ జాతుర్మాస్య లవధరించె మహితమైరేయ పానాతి మత్తుఁడగు

ఉ. పొసగ త్రివర్గమున్ ఫలముపూనఁ జతుస్తమమందు మూఁడుగాఁ
జెడునులు పోయి పాపమగు దేనికదే యయిపోయి ధర్మ బా
ధితమగు త్రోవ యయ్యదియ యెక్కిన మైకము దించుకోని యీ
నిరస్తము వేగుదెంచినది పాగిన దాశలు దూరమై చనన్. 351

మ. నను మాటాడెద వాఁటదాన వగుటన్ నాయన్నతో నేమి యా
జెను, నిద్రాలసుఁడౌట నేమియని యాడెన్ వానికిన్ జ్ఞాపకం
బని యున్నట్టులలేదు, భోగపరమై సామాత్యసంపత్తు ని
ద్రనుగాంచున్, రఘురాముఁడొక్కఁడుఁడె నిద్రాదూరగుండై చనున్. 352

మ. ధరణీశుం డవ్వాఁడు వల్కఁడు, ప్రయత్నం బింతయున్ లేదు, దు
ర్భరమై యూశ్రితుఁడైన వానికిని గోపచ్ఛాయయుం గూడ, దు
ర్భరమున్ బోఁజవు టెందుకోసమని? పౌర్వాపర్య మూహింపనున్
జను వన్నంతటి సౌకుమార్యము స్వభావంబౌటకుం గామినీ. 353

మ. మతి సుస్థత్వముచేత నర్థమును ధర్మంబుం బ్రపాల్యంబు, లా
మతి సుస్థత్వము పాడుచేయునది పో మైరేయ పానంబు, సం
గతమాఁ బాపము దాన, నీ క్రమమునన్ గండాడుఁబో యవ్యవ
స్థితచిత్తత్వముకంటె వేఱుకలదే చెందింప సంఘాతమున్. 354

ఉ. తనపని పాడుచేసికొనుఁ దానొకఁ డయ్యది వానికర్మ, మా
తనిని సమాశ్రయించుకొను దట్టుల నిర్మలినార్థధర్మముల్
కనుకని పాడుచేయుట యఘంబును మించు నఘంబు, దీని కే
మని సహియింతు చెప్పఁగదవమ్మ! యుదార విచార వార్నిధీ! 355

ఉ. చేసిన చేసిపెట్టెదను నిక్కముగా నని వానిచేత నే
నో యనిపించు లాభగతి నొందితి వానికిఁ జేసిపెట్టవే
గ్రాలెడు పాపకార్య పరిపాకము కాదని చెప్పుమన్నదే
బాగా కరవారు కేమి పచియింతువు శాతవచోనిగుంఫనా! 356

చ. కోపము వ్యర్థతే దెదుటఁ గోమలి యున్నదటంచు నుంత సం
కోచముచేత శాంత వచనంబులు పల్కెటకాని యన్న యు
క్తోచిత మానసోంబురుహా తార కనుల్ తెరిచుక్కలై ప్రవి
స్తీర్ణములాంచెఁ గ్రీడించు చిక్కనిగాళ్ళఁ బసిండిడాళ్ళుగా. 357

ఉ. గోడ వివాసమూనా విషయాధిక కార్యగత ప్రయత్న వి
శ్లేష సమార్తి స్థైర్యమున సంపద, గోమల మందహాస రే
ఖా విష్కృతాస్య వామపద కంజ వికస్వర హేమ నూపుర
శ్రేణి పికాకలికలికలు సన్నని ధైర్యము నాడుచుండఁగన్. 358

మ. నడిపించెన్ మృదుదంత సౌంధ్యసుషమా వాల్లభ్యరేఖా మరి
గ్రంథ గంధేర నయప్రియోక్తుల, సమాలోచింపవే, ధారుణీ

క. అవనతముఖాబ్జలై గీతవాద్యములు వదలిపెట్టి తన్వంగులు వె
ళ్ళ విమలితకుడ్యలేఖా సవర్ణచిత్రములలీల సందీపింపన్. 369

ఆ. పరమశివుని కోపవహ్నిఁ బుష్పశరుండు భస్మమైనవార్త వచ్చినప్పు
డింద్రు నంతిపురము నెట్లయ్యెనో యట్లు లయ్యె వానరేశు నంతిపురము. 370

వ. అంత సుగ్రీవుండు తనచేతులు రుమమెడనుండి సడలించి యాసనంబు డిగ్గి లక్ష్మణుని సమీపించి యంజలించి యవాఙ్ముఖుండై నిలిచిన సౌమిత్రి ముకుపుటంబు పడగవిప్పఁ బ్రయత్నించు పన్నగాఁచువలె నదరువ, విశాలారుణోన్నత వక్షస్థలంబు నడిమి భాగంబునఁ గదలుచున్న నేత్రునాళంబులు కనిపించి, కటిన్యస్త వామహస్తుఁడు బుజ ప్రకోష్ఠ దక్షిణహస్త సంగృహీత సశరకార్ముక లస్తకుండు దక్షిణపాదంబు నిబ్బరముగా నిలిచి యిట్లనియె. 371

చ. కనఁబడినప్డు బత్తి మెయిఁ గైజత మోడిచి మిత్రభావ మె
ల్లను దనమూర్తి తాలిచిన లాగున సర్వ సపర్య సేఁతయున్
గనఁబడనట్టి వేళకును గానల నుండిరొ యూడిరో కనుం
గొనఁడయునన్ దలంపమియుగా ననమర్థప్రభుత్వవైఖరుల్. 372

ఉ. [illegible]యున్న ధర్మమును నర్థము కామము తూఁచి పాళ్ళసం
గతి పరిణామ మంజులముగా ననుభూతికిఁ దెచ్చు ధారుణీ
పతి యిహమునం బరంబు సమభాగ నిషేవణ సాధుభోగియౌ
నితఁడుండు నేకదేశమున నెంతయుఁ బుచ్చిన వృక్షమైచనున్. 373

శా. సామక్రోధుండును జితేంద్రియుండు భాస్వత్సత్యసంధుండు ప్ర
జ్ఞానిష్ఠుండును వారుణీసుండు ధరాస్వర్గంబుల న్వంటచే
లానందోత్థిత సస్యదాయుల సమభ్యాసంబు భోగించు శ్ర
ద్ధానిష్ఠుండు స్వర్గధామము మహేంద్రస్వామి యెట్లట్టులన్. 374

శా. కిష్కింధాధిపుఁ డంతలం గనయుచున్ క్ష్మాభారమున్ మంత్రులన్
[illegible] నిచ్చటంబు రంతిపురిలోఁ బూఁబోండ్ల సంగీతముల్
[illegible] భోగిరతిన్ సంఫేత్తయా నీతి వీ
[illegible] కాలమున విద్రోహాత్ముఁడై యన్నిటన్. 375

క. [illegible] నిలిచిన మనుజుఁడు సురలోకభోగమండలి నిలుచున్
[illegible] ఫణీంద్రనిలయమున నట్టయడుగునన్ గుడుసువడున్. 376

ఉ. శ్రీ[illegible] చిత్తము నందు దయా రసార్ద్రివాః
పూ[illegible] పోవును కార్ముక లస్తకోగ్రవి
[illegible] ధర్మదేవతో
[illegible] నిత్యకర్మతన్. 377

ఆ. వాలిజట్టి మిగిలి వచ్చిన దేమియు లేదు నీవు నంగుళీ ప్రమృష్ట
చాపగుణ నినాద సాంయాత్రికతము కంటె మను ప్రాణగమన మొకట.

ఉ. బంధువు లైననుం గొడుకు భార్యయు నన్నలుఁ దమ్ములైననున్
బంధుర సాధుశీల గుణవంతులు కావలె వారి వారి సం
బంధము నిల్వగా మఱియు మైత్రి గుణక్రియలన్ ఘటిల్లు శ్రీ
లాంధుఁడు మిత్రతా విఘటనాంధువునం బడుఁబోయి నష్టుఁడై. 379

మ. మొదలన్ మిత్రునియందుఁ దా నుపకృతిం బొందున్ దురాలోచనా
స్పదుఁడై ప్రత్యుపకార మించుక పొనర్పంబోని దుష్టుండు భూ
త దయాదూరుఁడు వధ్యుఁడంచు నుడివెన్ బ్రాహ్మముల్ వాఁడు ధ
ర్మదుఁడున్ సర్వకృతఘ్నుఁడున్ గుటిలుఁడున్ మత్తుండు దుశ్చింతుడున్. 380

ఆ. హయమునందు గోవునందు మృషావాది వందమంది వేయిమందిఁ జంపు
పురుషునందునన్నృతము వచించునాతఁడు నాత్మహంత స్వజనహంతయగును. 381

చ. నెగులును బొందియున్ బ్రభువు నీవు విమోహము మానలేదు పూ
ర్తిగఁ జెడఁగొట్టుకోకు వనితారతి యోచించక గోప్యమున్ గడిం
దిగఁ బ్రభు దుఃఖ మించుకయు నేరన యోర్వఁగ నేను దొల్తనా
యెగచిన కోపమైన యెడ నీవఱకే వధించియుండెదన్. 382

క. నీ మంత్రులలో నొక్కఁడు శ్రీ మచ్ఛిఖరాయమాణశేముషి యతఁడున్
దా మృదువు నీయెడన్ నే నా మంత్రిని జూచి యింత యూఁగుట యుచ్యేన్.

గీ. అన్నమాటపై నిల్తువో యుంప నిష్ట సైగలయందున సర్వకేష్పిఁడ్ధ బూది
బుగ్గిగాఁ జూతువో చెప్పుము శితశరము తాళియున్నది నీ సమాధానమునకు.

ఆ. అణఁగియున్నది వహ్ని యాజ్యసంస్పర్శచే మరలఁ బ్రజ్వలించు మాద్రినాఁగ
శాంతపడినయట్టి సౌమిత్రి సుగ్రీవ దర్శనమునఁ బెంకతన్ ధరించె. 385

వ. రుమాదు లొదిఁగిపోయిరి. మంత్రులు లధోముఖులయిరి. సుగ్రీవుండు నిశ్చ
లుండై నిలిచినఁ దార యిట్లనియె. 386

గీ. అంతయంత ఘోరంబుగా నాడనేల కట్టివిరిచి ప్రోయ్యిని బెట్టినట్టు లాడ
వలెనె! విషయము విషయమువలె వచింపగాను ధర్మము ధర్మముకాని దగునె.

ఉ. తాను ప్రమత్తుడైనయది తప్ప మఱేమియు లేదు దోస మ
జ్ఞానుఁడు కాఁడు మూర్ఖుఁడును గాఁడు కృతఘ్నుఁడు కాఁ డలజ్జుఁడా
జ్ఞా నిరపేక్షభావుఁడును గాఁడు నమిత్రుఁడు కాఁడు మీకు, తే
జోనిధి సాధుశీలుఁడును శూరుఁడు సూర్యసుతుండు రాఘవా! 388

క. నీ యిట్టి మాటలకు నబ్బాయని మదిలోనఁ గష్టపడవచ్చుఁ గదా
న్యాయమగు నూహ వెంబడి పోయెడువాని మది కష్టముం బెట్టుటయా. 389

క. ఈసృష్టి కితఁడె మొదలా భాసురముగఁ గామభావ పరతంత్రుఁడుగా
నీ ననుపేతులు యోగులు మానసరమును కామభావ మహిమానతుల్. 390

ఉ. దర్పములేదు నా కవిరత ప్రభుభావన సేతు మీదెసన్
సర్పణ శీలమౌ హృదయజాత ముపేత సమస్తభావనా
దర్పణమందునం బ్రముదిత ప్రభురాఘవమూర్తియొప్పు రా
మార్పణమయ్యె నాదు బ్రదుకంతయు నేవని శోకముండగా.

ఉ. అప్పుడు కామమేచినది యప్పుడు దుఃఖముపుట్టెఁ గామముం
జొప్పడె నప్పుడేదియు విశుద్ధముకాదిది రామచంద్రుఁడె
ల్లప్పుడుశాంతభావ నిభృతాకృతి వానినిఁబట్టి నీకునా
కొప్పు వికారముల్ రఘుకులోడది రత్ను విశీర్ణకాంతులై.

ఉ. నా తనువెల్ల మీయదియె నాదగు రాజ్యము కీర్తి తేజమున్
బ్రీతియు దుఃఖ మన్నియును శ్రీరఘురామపదార్పితంబు ల
న్నా! తెలిపెద నేను కలుషాకృతినైన క్షమింపలేఁడె తాఁ
జేతిని గోసివేయుదురె చెట్టు ఫలించుక కేచినంతటన్.

ఉ. వారము పెట్టితిన్ గడువు వారము నేపటితోడఁ బూర్తియౌ
వారిధులున్ వనంబులును వానరసేన గవేషణక్రియా
స్ఫారమనంబు తా వెదకి జానకిఁ గాంచి పునర్నివృత్తమౌ
ధారణిజాతఁ గన్గొనక తా బ్రదుకం దెపఁడెందు వచ్చినన్.

వ. అని సుగ్రీవుండు మెడలోని కాంచనహారంబు త్రెంచి పారవేసి యిట్లనియె

మ. క్షితినాథుండను గాను రాముని దాసేరుండ నే ధారుణీ
సుత కన్పించినదాఁక రామజేయుతన్ జూముండు రాముండు తె
ప్పితి నన్నంతటిదాఁక భోగము విసర్జింపంబడెన్ జానకీ
పతి దుఃఖంబది యెట్టిదో తెలియ దహ్వా! నీకు నాకున్ బలెన్.

గీ. ఒక్కఁడొక్కఁడువార్నిధుల్ పుక్కిలింప నొక్కఁడొక్కఁడుభూధ్రముల్ ద్రొక్కఁ
వానరులు సర్వదేవతాయోనులుగ్రరూపులు కులాద్రులను గోటువవ్వఁగలరు.

మ. స్థిర మీ సైన్యముచేత రావణుని సాధింతున్ ధరాగర్భ
హ్వారమున్ డాఁగినసైన ఘోరభుజగున్ వల్మీకరంధ్రంబునం
గరముం జొన్పి బలాన లాగిన వడింగాఁ దెచ్చి ముందుంచెదన్
శరవిద్యాపరముండు రాఘవుని తేజస్సాక్షి సీతైచనన్.

వ. అనినఁగన్నులువెమ్మనీళ్ళ సుగ్రీవునిఁగౌఁగిలించుకొనిసౌమిత్రియిట్లనియె.

గీ. మఱియును సమర్థునకునసమర్థునకును భేద మిట్లుండునయ్య కపిప్రవీర!
[illegible] నేనుపరకోపమూనెద రఘుపతికుతిలపడఁగ.

ఉ.ఆ గుహుఁడైననున్ భరతుఁడైనను నీవయినన్ సమార్ద్రి చే
తో గురుమూర్తు లూర్జిత పథుల్ ప్రభురామ కథావతార ధా
రా గురుఘట్ట ఘాతులు ధురాక్రుధ పొందిన నేనుగాని నీ
చేగ యెఱుంగ కాడినది చిత్తమునన్ క్షమియింపవే సఖా. 411

ఉ. అన్నయు నీవు నిద్దఱె మహాత్ములు ధారుణిమీఁద నోట మా
టున్నను పద్మబంధుఁ డపరాచలమం దుదయించినన్ సరే
చన్నదిలేదు వెన్కకును సాధు శిరోమణు లుగ్రశౌర్యవా
రాన్నిధు లద్భుత క్రియులు రాజపద వ్యవహార యోగ్యులున్. 412

ఖం డాం త ము

గీ. నియమపాలనఖండనమన్వితము చంద్రమౌళి భూపాల శ్రోతృతామహిత వృద్ధి
యుద్ధిలేని రస ...నాహోల్బణమ్ము సుద్దిలోని సమస్త భాసుర గుణమ్ము. 413

ఉ. యుష్మదనంతలాస్య విభవోజ్జ్వల కింకిణి రావ మైహికా
ముష్మికభావసాంధ్య నవమోహనవేళ వినంగ నెంచెదన్
శుష్మదృశాశిఖాదమిత సూనశరాసన! తీవ్రబాధ మీ
గ్రీష్మమునందు నన్ను నుడికింపకువే! శశిఖండలాంఛనా! 414

మాలిని.

అమృతకిరణ చూడాహట్ట విక్రీతపాప భ్రమణ విమలపూజా బంధురోదారసూనా!
అమర నది తరంగ వ్యాకిరచ్ఛీకరాసేక మిలదలికనేత్ర క్లాంతి రేఖాభిగమ్యా!



# స మీ క ర ణ ఖం డ ము

క. శ్రీ మౌనిరాజ మానసతామరసోపరి తమాకృత శరత్కాలా!
హైమగిరీంద్రసుతా లజ్జా మధురోహ కృత మానసచలద్దేలా!

ఉ. వృత్రవధాదులౌ మఘవవృత్తము లుజ్జ్వలవర్ణ రేఖికా
చిత్రము లొప్పఁ బార్శ్వముల శేఖరమందున హేమకింకిణుల్
ఛత్రము రాజదండమును చామరయుగ్మము పట్టుకుచ్చులున్
జిత్రమనోజ్ఞమౌ శిబిక చేరిన లక్ష్మణుఁ డెక్కె ప్రీతుడై

మ. కపిరాజెక్కెను వెంట రాఘవ దిదృక్షాలగ్న చిత్తాత్ముఁడై
కపిరాడ్వాహకు లంతఁ బల్లకి భుజాస్కంధంబులం దూఁపఁగా
నిపుణుల్ మేనులు తూఁగకుండగను వెన్వెంటం బ్రయత్నింపఁగా
విపులారావముచేఁ బరస్పర వచో విస్పష్టతల్ కల్గకన్.

వ. అంత నమ్మహారావమ్మునకు శ్రీరామచంద్రుండు గుహాముఖంబునకు వచ్చి చిన సర్వసేనాసమూహంబు రాఘవ దిదృక్షావ్యగ్రంబు సమప్రదేశము వెనుక వృక్షస్కంధంబులు శాఖలు శేఖరంబులు పర్వతశృంగంబులు నిండి మెట్టు గాలపురుషతూలికా రచిత మహారమ్యవర్ణ చిత్రంబువోలె నొప్పె.

హరిగతి.

వీరులు పంచ గిరీంద్రనివాసులు వింధ్యహిమాచల మందర రాజత
భూరి మహేంద్రధరాధరపాండుర మోహనశేఖర ప్రస్తరవాసులు
వారుణదిగ్జలరాశి సమీపగ బాలసరోజ హితారుణ వర్ణక
ధారుణిభృచ్ఛిఖరాగ్రనివాసులు దర్పితబాహుమహాపరిఘుల్ మఱి.

మఱి సంధ్యాజలవాహ ధరాధర మండన మంబుజ మిత్రుని భవనము
హరిపుంగవు లచ్చటివారలును భయంకరపద్మకతాళవనాశ్రితు
లురుతర కుంజరదేహులు నీలమహోగ్రపయోధరదేహులు నంజన
గిరివర వాసులు శాత్రవమర్దనకేళిపాళి కాళిమూర్తులు.

హేమాంగులును నమ్మేలయున్నహ నెనకమెసఁగు వానరవీరులు దీ
ప్తామేయభుజాబలులును మేరుమహాగిరి పార్శ్వగు లుజ్జ్వలధూమ్రక
నామక పర్వతవాసులును నరుణనగవాసులు సంధ్యాసమదేహులు
భీమబలుల్మధు మైరేయవివశ విశ్రుతవేగులు విస్తృతబాహులు.

ఎట నస్తంగతుఁ డర్కుం డచ్చటి హేమమహాభాసుర దశకోటులు
ఎట శివదేవుని నివసన మచ్చటి మృగపతి కేసరవర్ణును లందఱు
పటుతరుబాహులు హిమగిరివాసులు ఫలమూలాశులు కోటిసహస్రులు
చటులాకారులు వింధ్యమహాగిరి సంవసనుల్ పదికోటులు మేటులు.

శ్రీరాంబుధివేలానిలయుల్ పతిసేవానమ్రతనూవలయుల్ సం
ధ్యారమ్యాంశూజ్జ్వల దేహులు బాహాపరిఘాగత పటుయమదండులు

పిరాసికశిరోమణిభూషలు విద్యుదుదార తనూచ్ఛవిరమ్యులు
హారాంగదభూషాంగళబాహులు హారివిశాలోన్నత ఘనవక్షులు. 9

క. ప్రభు! వీరందఱు త్వత్కృపారస సముద్రస్నానపానాతురుల్
ప్రభు! సుగ్రీవుడు త్వత్కృపారస సముద్రస్నానపానాతురుం
డభయుం డెయ్యది యెట్లు సేయుమన నీ యానంబడిం బోవు వ
ల్లభువాక్యంబు ప్రతీక్ష సేసెదరు గోలాంగూలయూథోత్తముల్. 10

వ. అని సుగ్రీవుండు సైన్యంబు వర్ణించిచెప్పిన ననంతకపిరాట్చమూ పిశంగదృ
క్సమూహ పరివేష్టనశబలితమూర్తి శ్రీరామచంద్రుం డనంతవిద్యుత్సమావృత
నీలాకాశంబువడువుననై యానందహాస విస్తారితవదనుండై సుగ్రీవు గాఢపరి
ష్వంగంబునం బట్టె. 11

మ. కపు లన్వేషణ కెంతయోగ్యులు పురీకాంతారదేశాంతరా
ళపు గేహాంతరసీమలం దయిన పాలాచారులై యొప్పు దం
త పటాక్షేపముగాంగ నల్పజనసంతానంబు భీకొల్పి కా
ర్యపు మార్గంబును సానుకూలపడు ధుర్యత్వంబు దీపించుచున్! 12

వ. అని శ్రీరామచంద్రుం డనుకొనుచుండ సుగ్రీవుండు. 13

సీ. వీరు నాదేయులు వీరు సాముద్రులు పార్వతేయులు వీరు ప్లవగపతులు
వీరి సంచాలన విధము సశైలకానన భూతధాత్రి సంధానవధము
వీరల తేజఃప్రసారము సారసహిత కరాచ్ఛాదనాహిండనంబు
వీరెల్లవారు పృథ్వీవ్యోమ సంపూర్ణతేజోనిధాను విభ్రాజమాను
గీ. సర్వలోకైకధానుష్క జలజబంధు వితత కులదీపు నిన్ను సేవింపనుండి
యవనితనయా గవేషణార్థాగతులయి వీరు నీదయ వేచియున్నారు స్వామి! 14

వ. అనినంతఁ గపిసేనం గాంచి సముద్రతీరంబున్న నిలచినట్లు రామలక్ష్మణులు
జెప్పులార్చుచు శ్రీరామచంద్రుండిట్లనియె. 15

చ. అనిలుఁడు గాలి వీచుఁ గమలాప్తుఁడు ధారుణి నెల్ల పాకముం
బొనరుచు వాన లిచ్చును నమోఘుఁడు మేఘుఁడు నిమ్నవంటి స
జ్జనులును మిత్రసత్కృతివశంవదు లౌదురు భూతధాత్రి ని
ల్పను దమ రెల్ల ధర్మశబలంబగు త్రోవలు పట్టిపోవుచున్. 16

గీ. ఇంతయైన సేనాపతు లెవ్వరెవ్వ రంచు నడుగంగఁబోవంగ నబ్జహిత త
నయుఁడదే చెప్పఁబోవుచున్నానుస్వామి!యనిచమూప్రాంగణంబుననరుగుచుండి.

మ.

ఇతఁడు శతసహస్రసేడితానీకినీపతి సురపతిసాపత్యభోగుండునున్
శతవలియనఁగా శౌర్యనారాయణుండితఁడు హరిచమూహీర మాగోంఒనగా! 18

జలదము.

ఈయన తార తండ్రి దుహితృస్థితిచేసియున కామెయంత తెలివేమనయా
యీయన కుగ్రవానర మహేంద్రసహస్రాయుత కోటి సేన వశమై తనరున్.

వనమయూరము.

ఈయన రుమాజనకుఁడేనసిన వెంతో ప్రేయమగుఁజూమఁ దనజిష్ణ యనినట్లు
శ్రీయుతుఁడు కోటిశతసేన కధినాధుఁడీయన యొకండు లయహేళిరణకేళి.

కమలనగీతి.

మేనివన్నె తమ్మిపూవులోని దుమ్ముబోలు
నాననంబు బాలసూర్య సంశుజాలరుచియు
ధీనిధాన మితఁడు శౌర్యదీప్తి హనుమతండ్రి
తాను కేసరి యనునేత దానవ గజ హంత.

ఆ. చెలఁగి బహుసహస్ర సేనాసమన్వితుం డఖిలదేవతా సమీపబుద్ధి
పరమపూజ్యుఁ డితఁడు ప్లవగసైన్యములకు నంజనాఖ్య సాధ్వి కాత్మభర్త.

కుసుమవిచిత్రము.

ఇతఁడు గవాక్షుఁడెలమి మహోగ్రా జితిశతకోట్యాయుత కపిసేనా
పతి, రణవేలాపతి, పతిసేవామతి పటుశక్తి మహితుఁడు రామా!

వితానము.

ఇతఁడు ఋక్షోద్యత్సేనాప్రతాన కోటీంద్రుండేమున్
జితారి ధూమ్రుం డాదిత్యసుతప్రభావుం డెందైనన్.

మధుమతి.

పనసుఁ డితఁడు ఘోరనిజదారి యమునుం
డు ఘ త్రికోటికమూ వనితకీర్తి ప్రభూ!

మదరేఖ.

హేలావిర్భవగోలాంగూలేశుఁ డతఁ డౌర్వన్
పిలుఁడన్ దుమునార్తి వేలాంతం బరికంధిన్.

హాలముఖి.

దండివీరుఁడు గవయునా, ముండు వీఁడు సముదిత మా
ర్తాండవంశశశి! కపిమార్తాండుఁ డుగ్రభుజబలుఁడై!

ప్రమాణి.

దరీముఖుండు నైకకోటి ఋక్షవానరావళీ
ధురావహుండు వీఁడు నిర్భరాహవోగ్రమూర్తియై.

భుజంగశిశురుతము.

ప్రథిమ[illegible]పతులు మైంద ద్వివిదులు కవలు వీరల్
[illegible] [illegible] ప్రదిగ్విమలదహిమాంశుల్.

నారాచము.
ఘాతండు రాఘవా! గజుండేతెంచు శత్రునిం గరా
ఘాతంబుచే వధించు నిర్ఘాతంబునా మహాజిలో. 30

ఉ. ఈయన జాంబవంతుఁడు మహీంద్రదివాహిజగన్నిమేషయా
త్రాయువరేఖికా పరిణత స్థిరతేజుఁడు వృద్ధమూర్తి ఋ
క్షాయుతకోటిసైన్యపతి యాప్రవదీన రిపూజ్జ్వలద్భుజా
శ్రీయుతుఁ డప్పశిలి చిరజీవి మహాత్ముఁడు జానకీపతీ! 31

కౌముది.
తొడ్డి రుమణ్వంతు డీతండు నెక్కుడు రిపుశ్రీ కుజోన్మీలనో
గ్రుఁడు భుజోద్యద్రుహాస్ఫోటనోగ్రుఁడు సమిద్ధీరుఁడున్ శ్రీపతీ! 32

ఉత్సాహ.
గంధమాదనుండు గంధబాహాసింధురం డితఁడు ఛిన్నశత్రు
స్కంధమూలుఁడు చకచ్చకద్భ్రూసంధి ఘాత రిపు చంక్రముండున్. 33

రుక్మవతి.
అంగదుఁ డీతం డాయతబాహం డంగదశత్రుప్రాంగణ నాట్యో
త్తుంగభుజాశ్రీ ధూర్వహు డుద్యద్భంగ పయోధిప్రాభవుఁ డీశా! 34

ప్రమాణి.
వడిం దారుం డీతఁడు వాయుస్ఫా
రుఁడు సంస్ఫోటోగ్రుఁడు ధీస్తుత్యా! 35

చంద్రవర్త్మము.
హేళాభుజా శ్రీకుఁడు నింద్రజానుండే లావరిన్ శత్రువు లెంచిరేనిం
గాలాహి స్వప్నంబునఁ గాంచినట్లెయోలిన్ యముం డీతఁడు యుద్ధభూమిన్.

మనోరమ.
ఇతడు రంభుఁ డాహితోగ్రదోఃప్లుతి విదారితాంబుదావలీ
కృత పరాక్రమక్రియా వియద్గతియు వీని చేగ యెన్నఁగా. 37

పంక్తి.
దుర్ముఖుఁ డీతఁడు తూఁగి సమిత్కర్మప్రచండుఁడు కాహళరా
వోర్మిచలద్రవుఁ డుత్థ భుజాకర్మఠుఁ డాహవకాలుఁ డయా! 38

వ. ఈయన హనుమంతుండు. 39

భద్రకము.
ఇతఁడు నలు డహీనమూర్తి యాయతన మఖిలమైన శూరక
ర్మతతికి సరిరాదు వీనికిన్ క్షితి శతశత సేన యైననున్. 40

వృంత.

ఇతఁడు శరభుఁడు సహ(ప్రౌఢిన్‌బృతన మొగదలఁ జరించున్ సం
గత (ప్రళయసమయ కాలుండై వితత భుజ పరిమ వీరుండై. 41

ఇతడు కుముదుఁడు సహ(ప్రౌఢిన్‌పృతన మొగదలఁ జరించున్ పై
ద్యుతసుషమ రిపువిధూతిన్ నిర్గతవిలయభయదకాలుండై. 42

నాగరిము.

ఈతని పేరు వహ్ని సం జాత రుషాచ్ఛటా(ప్రచం
డాతపనేత్రవహ్ని విద్యోతితశౌర్యవార్ధియై. 43

ఈతని పేరు రంహుఁ డాయాత మహో సమిద్ధరా
ధూత మృదుగ్రుఁడై పయోదాతి (ప్రచండుఁడా చమున్. 44

శా. వీరేకాక పరా(క్రమాంబుధులు వేల్వే లుండి రీ వాహినీ
స్ఫారాంభోనిధియందుఁ ద్వచ్చరణ సేవాభావ పర్యాప్తులై
ఘోరాకారులు దైత్యనిర్మథన దోః(క్రూరుల్ మహోయుద్ధ వాం
ఛా రూక్షేక్షణ మాలికా పరిచితాశా కల్పితోషర్బుధుల్. 45

శా. తానెచ్చోటను దాఁచినన్ ధరణిజాతన్ జాతరోషచ్ఛటా
నూనాన్వేషణ తీవ్రరేఖఁ గపి సందోహంబు దేహంబు లిం
తైనం దాఁచకయే (శ్రమింత్రు భవదీయంబైన సంయోగ రే
ఖా నిష్ణాతము మేనియందము కనంగా నెంచు కోర్కెంబడిన్. 46

శా. నిన్నుం జూచిన మీఁదఁ బూరుషులలో నీ వెట్లొ త్రిలోకమం
దెన్నన్ జానకియట్లటం చెఱఁగి నీ రెందేఁగనుంగొందు రు
ద్య న్నవ్యాంబుజ లోచనన్ గగనమధ్యామూర్తినిన్ దేవతా
సన్నాకార, బహిశ్చచాంతరిత పశ్చాదాత్మదీప్తిచ్ఛటన్. 47

శా. సైన్యం బీ యఖిలంబు దోఃపటువు నీ స్వాధీనమందుంచితిన్
వన్యావాసము సర్వపర్వతదరీ వాసంబు నంభోధి తీ
రన్యస్తంబును గామరూపమును శౌర్య(ప్రక్రియాఖండమున్
నాన్య(ప్రాభవ మాక్షిపద్గిరి వితానానేకదోః కేళియున్. 48

గీ. ఖ్యాతకర్మావదానము కలిత భీమ వి(క్రమము జితక్లమము పృథ్వీపయోధి
భయదసంచారసహ మార్యనయవిశారదమును బద్మార్బుదన్యర్బుదపరిమితము.

క. నీ వేది చేయుమన్నను నీ వెప్పుడు చేయుమన్న నిలిచినపాటన్
నీ వేగులై పొనర్తురు నీవే గురుమూర్తి వీ యనీకిని కెల్లన్. 50

వ. నా యెఱింగిన యర్థమైనను భవదాజ్ఞా(ప్రతిపాలనంబుఁ జేయుదునన. 51

ఉ. (క్రేవల గన్నుదోయిపులకించిన కాంతులు చెంగలింప సు
(శ్రీనుతిఁ గౌఁగిలించుకొని శ్రీరఘునాయకుఁ డిటనున్ మఱిన్

నీ వాకరుండ వీ యఖిలనీతికిఁ జాలుదు వేను లక్ష్మణుం
డీ వెది చెప్పె దట్ల చరియింతుము చింతితకార్యపద్ధతిన్. 52

క. ఆ సీత బ్రతికియున్నదొ ఆ సీతయు బ్రదికిలేదొ ఆ ఘోరప్రచం
డాసురుఁడెచ్చట నునిచెనొ నీ సైన్యము నీవుగాని నేర్తురు సఖుఁడా! 53

ఉ. ఈవు సరామలక్ష్మణుఁడ వీ వధినేతవు సర్వసేనకున్
నీ వఖిలార్థవేత్తవును నిన్నడి వత్తుము మేము నీదు నా
జ్ఞావశవర్తులై తొలుత జానకియున్కి యెఱుంగనైనచో
నావల యుక్తకాలమున నాడెదఁ గార్యపథంబు నెచ్చెలీ. 54

వ. అంత శ్రీరామలక్ష్మణు లొక్కదెసను పావని మఱొక్క దెసను నిలుచుండ
సుగ్రీవుం డొక్క మహోన్నత శిలాతలంబున నాసీనుండై తన చమూసమూ
హంబుఁ గాంచి యిట్లనియె. 55

మ. కపిలోకప్రళయంబు వచ్చెను ధరాకాంతా సమన్వీక్షణో
గ్రపు కార్యంబున మీరు నేను గృతులై గట్టెక్కకుండన్ ధరా
ధిపుఁడొ రాముని దొ ఋణానఁబడిపో దీరంగరా దెల్ల సై
న్యపతుల్ దీనిఁ దలంపఁగావలె స్వకార్యం బట్లు శ్రద్ధాళువుల్. 56

గీ. ఋక్షరజసుని కార్యముల్ ఋషభకోటిచేయుచుండిరి, దోశ్శక్తి చేత వాలి తన
పనుల్ తాన చేసికొంచును వహించె, నేను మీరెల్ల రాధారమైనవాఁడ. 57

చ. నలువుగ జానకీ విచయనంబున నల్దెస లంపెదన్ మిమున్
దెలిసి ధరాత్మజాత నరుదేరిన మీకును నాకుఁ బ్రాణముల్
నిలుచును చూడకుండ నవనీసుత వచ్చితిరేని మిమ్ము నే
నలుఁగులఁ గ్రుమ్మెదన్, శిలల నార్చెద శాపములం దహించెదన్. 58

మ. కితవశ్రేష్ఠులలోన శ్రేష్ఠుఁడునుఁడీ కిగ్గాడి దైత్యుండు భూ
సుత నా దిక్కునయందె యుంచు ననిపించున్ నమ్మకం బేది? ది
క్పతులన్వేషణ చేయఁగావలె ధరాస్థానిన్ మదజ్ఞాత ధా
త్రితలం బుండదు పోయి దాఁచుటకు ధాత్రీకన్య నల్దిక్కులన్. 59

గీ. నే నెఱుఁగని యంతుళమైన నేల లేదు ధాత్రీతలంబునఁ బాదరి కొని
చని, ధరాసుతనెందుదాఁచునొ కనుంగొనెదను,దుర్జాతిమాయ పూనితిని జేత.

వ. అని వినతుఁడన్న యూథపతిం బిలిచి యిట్లనియె. 61

మధ్యాక్కరలు.

శతసహస్రయూథపతి సముద్రోగ్రజలధి నిర్ఘోష !
క్షితిభృన్మహాదేహ! వినయిశేఖర! సిగ దేశాల

తతనీతివేది! నీ వేగి ధరణీసుతాస్థితి కనుము
దితిజు డుంచెనొయేమొ తూర్పుదెస యెల్లతిర్గికదాఁక. 62

ఒక కొండగుహయంచుఁగాదు నొక యేటియురవలోఁ గాదు
జకితుఁడై దైత్యుండు ధరణిజాత నెచ్చట దాఁచరాదు
ఒక చోటు విడువక కన్నులుంచుక యొక వేయెడల వె
దుకగావలయు ధారుణిసుత దూరపుత్రోవల నెల్ల. 63

శివు మింటివాకలో నచట శిశిరాంబుశీకరయు సర
యువులోనఁ గౌశికిలోన నల్లయై యున్నట్టి యమునఁ
గవిసి యేళ్ళులు కోయునట్టి కయ్యల కడుపులలోన
నవయక వెదకుఁడు యామున గిరీంద్ర నవశేఖరమున. 64

ఆకుపచ్చని సరస్వతిని నరుణ నీరాంబుధి శోణఁ
గోకవన్నియ మాటుగాఁగఁ గోపదృక్కులును మాటుగను
జేకొని దాచు మాయావి క్షితిజ నిశితదృష్టిఁ జూచి
కాక నేర్వరు కనుంగొనఁగ గళ్యాణ కంధిఁ గన్గొనఁగ. 65

అపైని గాలమహిమ యను నవనిభాగాభోగకాన
నాపీడశైలశోభితము నందమైనట్టి దేశంబు
తేపకు బ్రహ్మమూలము విదేహము దీప్తమాళవము
కాపున్న పుండ్ర నంగములు కాశి మాగధ కోసలములు. 66

జనపదంబులయందు సర్వజన మభిజ్ఞాతంబు వెలయు
నని శిల్పులున్న పత్తనములందు హేమాకరములుగఁ
జనుచోట్లఁ గోశాకార నివసనముల క్ష్మాజాత దాఁచు
వెనుకాడ కాందోళికలును వెదకుఁడు వెస శిబికలును. 67

జలధులలో నున్నయట్టి శైలముల్ జనపదంబులును
గలియఁ బెట్టి కనంగవలయుఁ గాదని కాదు త్యజింప
నల మందరాద్రికొమ్మునం దతివిశాలావని యందుఁ
గలరు కర్ణప్రావరణులు కడు నోష్ఠకర్ణకుల్ జనులు. 68

మసిబొగ్గు మొగములవారు మహితులు మఱి యొంటికాల
వెస నేగువారును నగ్నవేషులు భీకరాకృతులు
మసలి యసహ్యంబుగాఁగ మానవమాంసఖాదులును
విసరద్భుజాబలుల్ పోయి వెదకుఁడు పృథివీతనూజ. 69

ఏడనో యచటనే కలరు హేమాంగు వేపారు కర్ణ
చూడులు మత్స్యభోజనులు చూడభాసురదేహు లగుచుఁ
గూడి కిరాతు లా ద్వీప కోటి దిక్కుల వసించెదరు
వెదుక నచోట సీతఁ [illegible] వేషంబునారి. 70

అటువంటి జలచరాళి కలవవి నరవ్యాఘ్రంబులందు
రెటుపోయి తప్పించుకో నదెంతయేని కష్టమగును
జటులరసారాశి ఘోర వారుగ్రబంధంబులందుఁ
జటులజలస్తంభన విద్య వైదేహి వాఁడుంచుఁ గనుఁడు. 71

అట యవద్వీప మున్నది మహోన్నతమైన రత్నములు
ఘటియించు దేశంబు వేలు గనులును గలవందు సప్త
ఘటితరాజ్యము లందుఁ గలవు ఘనభోగకలితమై హేమ
ఘటితనిష్కము లందు జననికాయ మక్కజముగా వాఁడు. 72

అదివాఁట శిశిరాఖ్యమైనయట్టి మహాద్రి శృంగముల
ను దివము తాఁకు రక్కసులును సురలు నూల్కొనియుంద్రు
కదలి తద్గిరి దుర్గములను గడుకొని కాంతారములను
వెదకుండు జనకరాడ్దుహితఁ వెదకుండు వేప్రపాతముల. 73

క్షోణియందు జీవించు సర్వజంతువుల్ స్వగతధర్మముల
మాయురే! పాలించు గాని మానవ మహిత ధర్మంబు
లా యుష్ణ స్వర్గదేశమున కతిసమీపాత్త మార్గంబు
లా యుత్తమునీ రాముభార్య నరిగి యుందందుఁ గన్గొనుఁడు. 74

అచట రక్తజలంబు శోణ మత్స్యగాధాఢిల వేగి
పిపయునక్షిప్తంబు కలదు వేలావనీయంబు జలధి
యుచటు సిద్ధుల చారణుల సహస్ర సంఖ్యాకుల వసతి
యుచటి మనోజ్ఞ తీర్థములయందు రమ్యవనంబులందు. 75

వైదేహితోడ రావణుండు వర్తిల వచ్చు నచ్చోట
యాహారములు త్రవ్వి నాగములైల బుగులువాసనల
లో పుట్ గల మేటిపొదలలో నేళ్ళలోఁ బోయి చూడుఁ
డా దితికొడుకు దుష్టాత్ముఁ డనుకోనివగు చోట్ల దాఁచు. 76

పలుదీవు లాయుష్టిఁ గలవు భయదముల్ పర్వతగుహలు
తల మార్పరానిదా గతి లతావేల్లిత తరుప్రతాన
ములు గల్గునందు వృక్షాగ్రముల గేహములు కట్టియుందు
రలఘులైన నిషాదు లతిభయంకరు లందుఁ గనుఁడు. 77

ప్రాని యచ్చో మహాజలధి బోరన మొరయుచునుండు
దానవు లష్టటివారు ధాతచేతను దత్తవరులు
పి సిక వారిపై నుంత నిలచిన నీడ్గిలాగెదరు
కాన బుభుక్షితుల్ దీర్ఘకాలంబు గ్రసనార్థులగుచు. 78

ఆపైని లోహిత మన్న యంబుధి యతిభయంకరము
ఘనత మేఘసామ్యమ్ము ప్రవృత్తివర్తిత మహోరగము

కోపితాసుర మహోకంఠకుహరాతి ఘోరరావమ్ము
నాపైని కూటశాల్మలి బృహన్మహితాభోగభూమి.
ఏవాఁడు మా హనుమవలె నిలయెల్ల నెఱుకలఁ దాల్చు
నా వైనతేయుఁడు విద్యుదాభోగ హరితాంశుమూర్తి
యావాసమై యుండు నచట నానంద సారోప సాంధ్య
హేవాకపాథోదమూర్తి హేలా మహేశానమూర్తి. 80

కోరి యా ప్రభువైన గరుడికోసమై కొని విశ్వకర్మ
యారూఢి నానామణీవిహార రమ్యగృహంబు నిర్మించె
శ్రీరాజతాద్రి శృంగోరు శేఖరశ్రీకమ్ము తోచు
దూరాన కది లేఁతయరఁటితోఁటల తుంపెసలట్లు. 81

అట్టిచోటఁ గబోది వక్షులట్టుల నద్రిశృంగములఁ
బట్టుక వ్రేలాడుచుంద్రు భ్రంశథభ్రంకషవాంఛఁ
బట్టి మందేహాభిధులు దివాకర బద్ధవైరు లుద
యాట్టహాసులు రాక్షసులు దురంతసద్యః ప్రాప్తజనులు. 82

అది యొక నెత్తురుముద్ద యంతంత నాకాశవీధి
నుదయవేళల లేచి భూసురార్ఘ్యమహాంబు పటంబు
కదిసిన విఱిగిపోయెదును గంధిసంఘట్టితవారి
నుదయదంబుజమిత్రుతోడ నుడుగక యూను వైరమును. 83

అంతఁ దెల్లనిమొయిలేమొ యనఁగఁ దియ్యని పాలకడలి
గంతులువెట్టు కరళ్ళఁ గలితముక్తాహారమూర్తి
యెంతో యా జలరాశినడుమ యుష్షభముం పెసలారుఁగొండ
కాంతిచే నందినక్షమలు కదుఁ దెల్లగన్నేరుపూలు. 84

ఆ చుట్టుపట్టులయందు నల్పమ్ము లద్రులనుండి
వీచు సుగంధమారుతము విహ్వల విధృత నాసికము
తోఁచు సుదర్శనంబన్న లోయములె తొలకాడుచెఱువు
పోచలా పూవు దారాల పొందమ్మిపూల యంగడిగ. 85

అంబుధి గాలిఁ దపతపలాడు చేలాంచలహేమ
సంబద్ధ హేలావిలాస శారదాప్సరసలు వచ్చి
యంబువులాడి శ్రీ మత్తటాకంబునందుఁ బోవుదురు
కంబుకంధరలు దృష్ణివహాకాంతిసంక్రాంత నీరజలు. 86

కలశమహోదధిం దాఁటి కన్పించుఁ కమ్మని తియ్య
జలములకడలి యా నడుమ జలములు సలసల క్రాగి
నిలఁబడి గోడిగవాయి నిప్పు మండినమంటగాఁగ
జ్వలియించు యాదోనికాయ సంత్రాససంబంధకముగ. 87

బాడబాగ్ని శిఖావిరావ బాడసంబాధ ఘోషమ్ము
కూడె తజ్జలజంతు కంఠ కుహర నిర్ఘోషంబు కలిసి
యేడుచు విన్నార లెవరో యిచ్చోట యిచ్చోట ననుచు
నీడఁబోయి చరింపకుండు మహీజాతయేడుపు కాదు. 88

కదలి యా కడలి యుత్తరపుఁగడఁదప్త కనకకాంతులను
బదుమూఁడు యోజనంబులనుఁ బైనిఁ గన్పడు మేరు వేమొ
యది నాఁగ జాతరూపశిల యున్న మహోద్రిరాజమ్ము
త్రిదివ నమస్కృతియోగ్యదేశమ్ము ధీశమ్ము కలుగ. 89

తన్నగశేఖరంబందుఁ దప్తకార్తస్వరకేతు
వున్నది ముమ్మొనవాలు నరవైన యొక తాడిచెట్టు
నున్నది యా తాడి మొదట నుజ్జ్వల మొక రత్నవేది
కన్నులపైకుంఠ మద్ది కదలి పుల్కల నీటదొప్ప. 90

కన్నుల మిఱుమిట్లుకలుగుఁ గాంచఁగా గళవళంపడక
చిన్నగా నరిగి యామహాశిఖరి నాసీనుడై యున్న
పన్నగస్వామికి పేయిప్రణతు లర్పనము గావించుఁ
డన్నాగలోకేశు కరుణ యయినచో నవనీజ దొరకు. 91

ఒక వేయితలలతో నచట నుప్పరం బూను నాస్వామి
యకట! యా ధారుణీ శిరసునం దెట్టు లవధరించెడునో
చకితాక్షులము కాక తెలియఁజాలము స్వామి యనంతుఁ
డొక చంద్రకాంతపుబొమ్మ యొగి నల్లయుడుపులు తాల్చు. 92

అరుణకేతుక రూపుఁడైనట్టి యాదికూర్మంబు
కోరి యుదిష్టకములను గూరిచి కొండగాఁ జేసె
దూరపుదెసఁ బుట్టె వాని దోసిలి తొలివేళ్ళ చివరఁ
దూరపుగిరి యుబ్జాకార తోఁచు నదూరదేశమున. 93

మందేహరాక్షస రక్త మాంజిష్ఠ మహితకాంతులను
సందేహపడవద్దు శైలసంగత జాతరూప మని
సందీపితచ్ఛవి గగనసంస్పర్శ శతయోజనాయ
తేందుకాంతోపలవేది యేచు భూభృద్రాజు కొమ్ము 94

కానుగల్ మద్దులు తాళ్ళు గాయత్రి కర్ణికారములు
పూనిక మెల్ల వేళలను బొడిచెడి ప్రొద్దువన్నియలఁ
గానగా హేమమయములుగా నెక్తగాను మందేహ
దానవ నిరతార్ద్రరక్తతరుణ సంధ్యారోచి రాప్తి. 95

ఆ కొండ నింకొక్క కొమ్ము నధిక మొప్పునది సౌమనస
మాకాస మాపైని లేద యున్నంత యౌన్నత్యః మది. హా

షీ కేశుఁ డా మున్ను గుజ్జుచిన్నారి చెలువంబు తాల్చి
యీ కొమ్ముపై నొక్కకాలు, హేమాద్రి నితరంబు నుంచె. 96

ఒనర జంబూద్వీపమునకు నొద్దుక యుత్తరదిశకుఁ
జనినచో వరమాల శంఖచక్రభాస్వరకిరీటాంగ
ద నిబిడమూర్తి స్పష్టముగఁ దనరారు తరణిబింబంబు
కనిపించు ననిపించు దేశకాలముల్ కడముట్టె ననుచు. 97

ద్వ్యాలంబమాన శిఖరము తోఁచు నందుజ్జ్వలం బగుచు
వాలఖిల్యులు మహర్షులు తపస్వులు వైఖానసు లట
బాలసూర్యప్రభల్ కాంతి పరిణాహ పర్యాప్తు లగుచుఁ
గ్రాలుదు రచ్చోట దిశలు కనరాని కడమైన చోట. 98

అద్ది సుదర్శనద్వీప మట నొప్పు నా రాజధాని
యద్ది నేత్రము తేజమైనయట్టిది యఖిలప్రాణులకుఁ
దద్దీప్తశృంగంబులందు దరుల కందరములయందు
ముద్దియల తలమానికము భూసుతఁ బోయి వెదకుండు. 99

మేరువు మృదుకాంతి నెనసి మిహికాంశు మృదుకాంతి బొరసి
యారక్తబాలసంధ్యా నవారుణహారియౌ సుషమ
లారూఢమై యుండు నచట నద్దియే యది తూర్పుదిక్కు
ధారుణికి భువనమునకు ద్వార మాస్థలము నిర్ణీతి. 100

కోటిదేశమునందు బొడువుగుబ్బలి గుహలందు నచటి
యేటికయ్యలయందు వల్లులెత్తిన యీరమ్ములందు
మాటుంచెనేమొ దైత్యుండు మహిజాత, మహిబాత ధర్మ
పాటన దుర్బుద్ధి పోయి వైదేహి వార్త తేవలయు. 101

ఆపై నచంద్రమస్సూర్య మంధకారావృతదేశ
మాపైని వానరాగమ్యమై పొల్చు, నందాక వెదకు
డాపైని నేమున్నదో తెలియద మీర లవనీతనూజ
యే పుంత నున్నదో చూచి యేతేరుఁడిది వెక్కసముగ. 102

చ. ఒక నెలలోపలన్ దిరిగి యుండవలెంజుడి యుందుఁ బ్రాగ్దిశా
సకలపదంబులన్ నెమకి జానకి, కానక వత్తురేని ప్రా
ణకములు మీకు నిల్వవని నమ్ముఁడు ప్రస్రవణాద్రి దేశముల్
కుకపిశవ ప్రలంబులగు కూటములై కనిపించు నెల్లెడన్. 103

చ. తనరఁగ మీ రొకొక్కరుని ధాత్రిని చేతులయందు బూరె లో
త్రిసగతి నొత్తఁగల్గుదురు ధీరులు భూసుతఁ గాంచి రండు, నం
తన నను నొత్తిఁగల్గి కపిధాత్రి సమస్తము మీ కొసంగు మ
స్తనను మఱి యూయకున్న యెడ నన్నదుగుండు చనుండు వానరుల్. 104

వ. అంత దూర్పుదెసకు వారిని బంపించి దక్షిణదిశోపదేశార్థము హుతాశనసుతు
లైన నీలాంగోల్కాముఖులను వాయుసుతుడైన హనుమంతుని బ్రహ్మపుత్రుడైన
జాంబవంతుని నశ్వినీ దేవతల తనూజులైన మైందద్వివిదులను దదితరదేవతాంశ
సంభూతులను సుహోత్రుని శరారిని శరగుల్మని గజుని గవయుని సుషే
ణుని ఋషభుని విజయుని గంధమాదనుని సర్వసేనాపతిని వాలితనూజుని
నంగదునిం దిలకించి యిట్లనియె. 105

ఉ. మీ రతివేగవిక్రములు మీ రతిలోకమహత్త్వసంయుతుల్
మీరు సమస్తదానవ సమీకసముత్థ భుజాబలైక వి
స్తార పరాక్రమాంబుధులు సాధు శిరోమణు లీర దక్షిణా
స్వార దిశాగవేషణకుఁ జాలుదు రుగ్రమతిప్రగల్భులై. 106

చ. తెలియఁగ దక్షిణాదిగుపదేశము చేసెద మీకుఁ జానకిం
దెలిసి యెవండు వచ్చు నతిదేశము వానిదెసన్ ప్లవంగభూ
తల సకలాభిషేక సముదార మహోవిభవంబు వాఁడునుం
గెలుచుఁ గృతాపరాధుఁడయి కాఁడు మదాత్మసమానమూర్తియై. 107

మధురాక్కరలు.

లవలివల్లిక పాతంబులం దగుల్కొనిన దుప్పి
యుప్ప సహస్రశృంగము నర్మదాపగాకలితమూల
మనఘులించెడు వింధ్యాద్రి యతిలోకభయద జంతు
సమూహావాసం బగస్త్యసాన్నిధ్య నతశిరసంబు. 108

అది బ్రహ్మ నిర్మించినదగు సౌధ మనంగ నొప్పు
నాది యూ ఖండ మీ వింధ్య మొక ద్వారదేశ మెసంగు
గాదిశి సరస్వతియు ముందుగడవల నిడిన ముగ్గు
నా దొరయుఁ గృష్ణ గోదయుఁ గావేరి మధురవారి. 109

మెఱయు వరద మహానది మేఖల యుత్కలయును
వరదలెత్తి యుకల్ ముంచు వాహినుల్ తరఁగలెత్తి
కరుణనై బుభుక్షార్తి కావించు వాహినుల్ త
దుదు సమావేశకలయంబు నుర్విజ వెదకఁ బొండు. 110

ఆంధశార్ఙ్గనగరములు నశ్వవంతియు నవంతి
మలయు ఋషిక విదర్భులు మాహిషకాంగ వంగ
ములు కళింగముల్ కౌశికంబులు జనపదము లొప్ప
వెలయు పల్లెలలోఁ బోయి వెదకుడు పృథ్వికన్య. 111

దండకారణ్యదేశంబు తరులతాసాంద్రభూమి
గండశైల ప్రచండంబు ఘనరఘరీతరణదుష్ట
మండజాతమృగానేక హర్లీసకోగ్రదృశ్య
ముండసురయ లసాధ్యంబు లుగ్రజంతువులు వనిని. 112

మెఱయు కిన్నెరసాని దామెరతోఁగు శబరి మొదలు
ఝరులు శాఖానదుల్ కలిసి క్ష్మాప్రాలు నీటి తరువు
సరస గోదావరీనది సారీని యల్లు పటము
కరణి నేపారు వెదకుండు ఘనకబంధములలోన. 113

గుహలలోపలనుండి నిష్కుటములలోననుండి
కహకహధ్వని స్రవియించుఁ గాంతారవు సెలయేళ్ళు
విహారదమరయోషిచ్ఛటా విట పరస్పరరహస్య
విహసితం బని విడువక వెదకుండా చాటుచోట్లు. 114

కెలన నాంధ్రముల్ పుండ్రముల్ కేరళ పాండ్య చోళ
ములు మహాజనపదములు పొలుపొందు వెదకవలె
అలఘుదైత్యునకు నిషాదు లందఱు భయపడి జన
కులబిడ్డ దాచవచ్చునుజాండీ గూఢెంబులందు నెందు. 115

అచటు దాఁటి యయోముఖ మన్న పర్వతము ధాతు
నిచయ నిత్యసంధ్యారమణీయమ్ము తుంగశిఖర
కచమహాగురుచందనకాలాహివుష్పమాల
మచటు దైతేయసంవాస మద్ది గాలింపవలయు. 116

సుపరిలఘువారి కావేరి శుద్ధవారి కనిపించు
నపరిమితమోద లచ్చరలటఁ గ్రుంకు లిడుచునుంద్రు
కపురపుందావి మేనులఁ గస్తురితావి చనుల
నపనయం బొందకయ స్నాన మాడుదు రచ్చర లట. 117

ఉదధిదేవేరి కావేరి యొడ్డునఁ గుంభసూతి
త్రిదివమస్తకమాణిక్యదీధితిమ త్పదనఖుఁ
డుదితతేజోమహారాశి యుండు నా పరమమౌని
పదజలేజ కేసరమౌళిభాగులై చనుఁడు పైని. 118

మిఱుకడలి మూఁడు పుడిసిళ్ల మేరలోఁగలదు మునికి
తఱుసలుల్ రక్కసుల్ గలరు తపసికిఁ బంటక్రింద
వెఱసరెన్ మౌని గని ధరణీధరంబుల శిరములు
పిఱుతివియుఁ గాలిగోళ్ళల విద్రిచిపోవు నను భీతి. 119

అచటఁ దామ్రపర్ణి పయోధియతివఁ దీరవృక్ష
నిచయశాఖాసమావృతనీర యగురునిషక్త

క చికురయు ననూర్యంపశ్యఁ గానము తాదృగ్వేణి
ప్రచురముక్తాకలాప మరకతమాణిక్యగూఢ. 120

తాము కృష్ణాభిసారికల్ దక్షిణ దేశనదులు
వే మొయిళ్ళు క్రమ్మ నిరుల విభులకై వెడలఁదాల్చి
యామెయి న్నీలిచీరల, నందులోఁ దామ్రపర్ణి
యామె సిగ్గులబరణి రహస్యమాగమరసార్ధి. 121

బాలసూర్యుని వెల్గుల పసిఁడిడోలలు సముద్ర
లోల వీచులు చిందులలోననే పాండ్యనృపుల
లోలముక్తాకలాపంబు లోభనీయకనకమయ
మౌలిఁ దోఁచుఁ గవాటంబు నోషధీశసమణిభూష. 122

అద్ది పొలిమేర పాండ్యులదౌ రాజ్యసీమ కచట
ప్రొద్దుమింట బ్రస్థానమ్ము పోవు వేళఁ దన పైఁడి
ముద్ద యెఱుపు నంకువ లుంచిపోవుఁ గవాటకాంతు
లుద్దవిడి సముద్రసుషమ లుయ్యాల లూచు నచట. 123

అ సముద్రతీరంబున నర్థనిర్ణయము చేసి
భాసమానపయోరాశి భయదవీచీఘటాళి
కేసరంబుల గ్రహియించుకేళిఁ జరింపవలె
త్రాసకరము సాగరవారి దాఁటు యత్నంబుచేసి. 124

మత్తసామజంబు సరస్సుమధ్యమ్మునందు జొచ్చి
యత్తమిల్లుగతి మహేంద్రమన్న పర్వతము జలధి
తత్తరంపడు నీళ్ళలో దాగెఁబో కలశసూతి
హత్తె దాని సముద్రాంతరాభీలవారిలోన. 125

కుసుమసితలతాప్రావార, కుండలిరత్నభూష
విసరదంభోవిహార యుర్వీధరభాగ్యలక్ష్మి
మసలి క్రొత్తకోడలివోలె మజ్జనఁ దల తడుపదు
కొసలఁ జూడానిబంధముల్ కొమ్ములు కానిపింప. 126

వేలుపులరాణివాసమ్ము విచ్చేసికొండ పరుపు
లాళిశతసహస్రంబుల నాటలాడెదరు సతము
కోలక్రోఁతులు దూరనఁగోలలు కుంది కాళ్ల
వేలుపుందేవిడీ కన్నెపిందు వెసనాడుచుందు రచట. 127

వరవడిదినాల వేలుపుపతి వచ్చి దక్షిణాది
గురుశరధి స్నానమాడి చూడోజ్జ్వలచంద్రశకలి
పరశివున్ బూజ సవరించు పరమవ్రతంబు పూను
నరయ నుత్తాల వాశ్చుంబితాకాశ మచటి జలధి. 128

అటకు వందయామడల దవ్వైనట్టి లంకయందుఁ
గుటిల రాక్షసకోటుల కూటమౌ లంకయందుఁ
జటులవారాశి యగడిత చాయయౌ లంకయందు
గడఁగి మానవకోటి కగమ్యమౌ లంకయందు. 129

అదియ రావణునేల సహస్రాక్షు చేతిలోని
ముదుకఁడౌ మౌని వెన్నెమ్ము మూఁడిగిన యసుర
చదురు నుక్కివ మీ రెండు జతకూడు వాని
పొదరుటిల్లది వెదుకనోఁ బొందు మీ ర్లంకయందు. 130

ఒక్కచోఁ జూపికొట్టు నింకొక్కచోఁ గలుచ యసుర
యెక్కడో దాఁచు ననుకొన నింటనే దాచవచ్చు
మొక్కలీఁడు ధరాకన్య మూర్ఖును భయరహితుఁడు
నొక్క కొణిదెఁడు మేరైన యుజ్జగింపక వెదకుఁడు. 131

కటిక రాక్షసుల్ లంకలోఁ గలరు చేతికిని జిక్కఁ
జిటిక వ్రేళ్ళుల నడుమను జిదిపెద రుగ్రజనులు
ఘటితకామరూపమురలతోఁ గడలఁ గ్రుమ్మఱుదు వారి
నిటలదృష్టులు మిఱుమిట్లు నెగడు నెగడులవోలె. 132

జనకరాట్కన్య వెదకగాఁ జనుదెంచి రన్న యలుకె
మనసులోఁ బుట్ట దసురులమందకుఁ బండ్లు కాయ
లు నెమకుచు వచ్చె నివి కోతులు భయంబు లేద యంచు
ననుకొనకన్ మీరు వెదకుఁడీ యంతిపురాననైన. 133

నెగడు శరధి నట్టనడుమ నీడపట్టుకుని లాగి
యగడు క్షుధ తీర్చుకొను దయ్యు మంగారక యనుపేరి
దెగసిపాటుది మీసీడ యెంతయు దాని కెడగ
బగళముంజేసి చనవలెఁ బరమ రక్షోనివసము. 134

మిసిమి తొలుకారు క్రొమ్మొయిల్ మేని వన్నియలవాని
విసరదాశా నిపీడ మౌర్వీ మహాధ్వనులవాని
మసృణకకాశ్మీరకాంతి దృఙ్మధు కృపాచ్ఛవుల వాని
సుసఖునిలతాంగి మీరేగి చూచిరం డసురవీట. 135

లేదు వానితోఁ బనిపట్ట లేదాయె మున్ను మనకు
పాదుతోఁ బెల్లగించనౌ పనిపట్టె నిపుడు మనకు
నా దితిప్రభవుని నేల నాశాశలందు రాము
గాదిలిలతాంగి వెదకుఁడు కాంచినన్ జెప్పరండు. 136

ఎవండు భూజాత సంజాతహావాకుఁడై కనుగొను
నెవఁడు రాముభార్య ప్రవృత్తి నెనసి తా నేగుదెంచు

చిప్పురుకంటికాంతుల నభిషేకంబు పొందుఁజూడి మ
మవశిలామణో సుషమాపఘను రామునందు వాఁడు. 137

మఱియు నాపైని వందయామడమేర శైలమున్న
దరయఁ బుష్పితకాఖ్యము హైమశృంగోన్నతంబు
ధరణీధరశృంగముల్ రెండు తనరారు నొకటి హైమ
సరసిజాభము కహ్లారసదృశంబు నింక నొకఁడు. 138

తమ్మిపువ్వువంటి కొమ్ముపై తరణి తా నత్తమిల్లు
నమ్మతిం గల్వకొమ్ముపై జాబిల్లి యత్తమిల్లు
నమ్మి యేఁడాది కార్నెలల్ నరి దక్షిణాయనమున
క్రమ్ము చీఁకట్లయడవుల కార్చిచ్చులై యిరువురు. 139

నాస్తికుల్ నృశంసులు కృతఘ్నపుజాతి కానలేదు
నిస్తులపవిత్ర మగ్గిరి నీరంధ్రగగనపూర్ణ
మస్తకకృతసువినయ నమస్కృతుల్ గిరిసపర్యఁ
బ్రస్తుతమహాస్కు శేగుడు ప్రభవిష్ణువులు మహితులు. 140

ఎఱ్ఱనవు తమ్మిమొగ్గ బీటిచ్చిన పైఁడివెలుగు
నఱ్ఱుగా నైన సూర్యుఁడు ప్రాలెడు కొమ్ముమీఁద
ముఱ్ఱుబాల్జున్నుకట్టెడు ప్రొద్దులగు తొలియీఁత
కుఱ్ఱవన్నియ రెండవకొమ్ముపైఁ గూడ వెదకె. 141

దాని దాటిన సూర్యవంత మనెడు పర్వతంబు
దానిసైతము దాఁటిన తరువాత వైద్యుతాఖ్య
మైన శైలము పదునాలుగైన యోజనములందుఁ
బూని వైద్యుతగిరి ఫలపుష్పసంభరితమూర్తి. 142

నాటుకొను నిప్పపూవు లనంతము లారగించి
తాటిరేకలదొన్నెలఁ దత్సుర యాని యాని
మేటి యీఁతగుంజు భుజించి మిసరేఁగుపండ్లు తిని
కోటి కెక్కిన సౌఖ్యంబు కూర్చికొండు గిరిమీఁద. 143

కనులకెంతొ యందమ్ముగాఁగల దన్న మాటలోని
పనిత మర్థ మ్మదేమి? తద్వస్తుసౌందర్య మెల్ల
మనసునకును నచ్చిన దన్నమాట, యామాట యర్థ,
మునకు లక్ష్యమ్ము నట నొప్పు భూభృత్తు కుంజరము. 144

కుంజరముపై నగస్త్యర్షి కొఱకుగా విశ్వకర్మ
మంజుమణిరత్న శిల్పసంపద యెల్ల నవధిగాఁగ
రంజితమ్ము సౌధమ్ము నిర్మాణమ్ము మొదలి
[illegible] 145

యోజనము మేర నొకపదియోజనంబు లగు నెత్తు
రాజిత నానామణీహేమరత్న భూషితము గాఁగ
తేజపుంగూఁడు భోగవతీనామ పురి భుజగ
రాజవాసంబు కాంతిధారాపుంజ మొప్పఁ నచట.

వితత బహుకక్ష్య, దుర్ధర్ష, విష్వగ్భట పరిరక్షి
త, తరుణ భుజంగసేనావితాన దుశ్శత్రుభయద
తత సపత్నుల యులికిడి తగిలినఁ జాలు భోగ
వతి జ్వలించు దర్వీకరప్రభుమహోగ్రపు విషాగ్ని.

పరమ విజ్ఞాని వాసుకి పాలించు భోగవతిఁ
దిరుగఁగా మున్ను నా కది తెలిసినయంతవఱకు
ధరణిజాతను దైత్యుఁడు దాఁచెడుచోటు కాదు
కొలఁతవెట్టక జాగ్రత్తకోసము వెదకు డంతె.

పైన నవి యేవొ రాజ్యముల్ స్వల్పంబు లున్నవచటఁ
గాననొ నని తోచినఁ గాంచు డప్పటికిఁ బోయి
పైన నున్నది వెదకఁగావలసినయట్టి చోటు
కానిపించు దూరానకుఁ [illegible].

చందనపుఁ బద్మకపు హరిశ్యామగోశీర్షకముల
స్యంది వాసనల్ మందమందానిల [illegible]మమాన
సుందరంబుగఁ గుమ్మమంచును గొట్టు ముకుతుదల
వెందు రమ్యాతిరమ్యంబు బుష్పభ మన్నట్టిది గిరి.

జోగి నిప్పైనందాక వచ్చును బొరపాటు పొంది
చేగ తావి కాకృష్టులై చేరి చందనము తాఁక
సేఁగియౌను గంధర్వ లక్షీణతేజస్కులు మిళి
తాగురుద్రు రక్షాసుసంధామహాస్కులు గల రటు.

శిగ్రు గ్రామణి శైలూషచిహ్నితుల్ శుభ్రబభ్రు
లుగ్రనాము లైదుగురు మహోగ్రగంధర్వు లందుఁ
బ్రాగ్రసరులు కాపుందురు రవిశశివహ్నిసములు
నిగ్రహసమగ్రు లతితీవ్రనిస్త్రింశపాణు లయి.

తలఁప నచ్చోటె యీ దరాస్థలికి దక్షిణపుటెల్ల
నిలిచియున్న గంధర్వుల నీరంధ్ర నిబిడమూర్తి
యలఘుజీవులు పోరాని దాపైని యమునిపురము
నలువుగా నది దాఁటె ప్రాణాలతోఁ బోవరెవరు.

కటికిచీఁకట్లు యిండ్లులు ఘనరోదనారవద్వి
కటుకజీవలోక నిరంతగాఢాంధకారవసతు

అటకుం బోరాదు నరవానరాళికి దక్షిణా ది
గుటజవాసంబు యముండన్న యుగ్రభోగి దగు నేల. 154

పరమభర్తృవ్రతాచార వైదేహిం జూచిరండు
పరము భార్యం దపస్విని వైదేహిం జూచిరండు
పరమురాలిని శ్రీమూర్తి వైదేహిం జూచిరండు
మెఱయు నా యాశలన్నియు మీమీందం బెట్టుకొంటి. 155

శా. మాపొంతమ్ముున కింద యుండవలె రామస్వామి యాయల్లకా
యాసం బిక్కడం గూరుచుండి యొక నేనై చూడంగా లేను, మా
యీ సౌమిత్రియు నన్ను దుఃఖపడం తానేమో క్రుధాంభోధి వీ
చీసాంయాత్రికుండౌను మీ కొఱకు వేచెన్ రాజు రండీ వెసన్. 156

ఉ. వచ్చెదరంచుం గన్నులకు వత్తులువేసుక కూరుచుందు నే
పచ్చనికాంతి కన్పడిన బారుగ మిన్నున నాదు సైనికుల్
వచ్చిరటన్న యాశం గని వచ్చినవానికిం బూరుషార్థముల్
క్రొచ్చినవేలలో దొకకికోలుగ లంకెలబిందెలై చనన్. 157

చ. రమణ సదన్వవాయ జలరాశిశశాంకులు వారు వానరో
త్తములు మహోగుణాంబుధులు, ధారుణియందున జన్మ మెత్తి న
ట్టి మహితమౌ ఫలంబు ప్రకటీకృతమైచను కార్యమిద్ది య
గ్గము పొనరించినన్ యుగయుగంబుల మీ చరితల్ వినంబడున్. 158

వ. అంత వారిని దక్షిణదిశకుం బంపించి పశ్చిమాదిశాప్రేషణార్థ మర్చిర్మాలా మహో బలులను మారీచులను జూచి తదధిపతియుం దారాజనకుండును భీమవిక్రముం డును వైనతేయసమద్యుతియు బుద్ధి విక్రమసంపన్నుండును నర్చిష్మంతుడును నైన సుషేణుని మరీచి మహర్షి యపత్యంబును బ్రదక్షిణించి నమస్కరించి యిట్లనియె. 159

చ. ద్విశతసహస్రసంఖ్యయును దెప్పరమైచను సేనమీది మీ
విశదపరాక్రమంబు నతివేలము పశ్చిమదిగ్గవేషణా
నిశితమనస్కులై చనిన నీ వది నా కభివాంఛనీయ మే
ను శరణుచొచ్చెదం జుమి నిమున్ రఘురాముని కార్యసిద్ధికై. 160

ఉ. తీరుచు నేర్పుమై వరుణదేవుని దూరధరిత్రి ముద్దమం
దారపుం బూలతోట రఘునాయకు భామిని సాధ్వి లోకమం
దారము దాచెనో యసుర దట్టులు వానరసేనం గూడి సం
చారముచేయు పశ్చిమదిశాగ్రహణైకమతిప్రగల్భతన్. 161

అల్పాక్కఱములు.
ఓ సైన్యపతులార! యుర్విజాత, భాసురగాత్ర ప్రభావైకదీ
పా... వెందె...ని శ్రీ సముపేతనరింపజూడగా. 162

శ్రీసుషేణులు మీరు శ్రీరామకార్యాసక్తి వరుణదిశాంతవీధి
ఆ సురాష్ట్రంబులయందు శూరదేశంబు బాహ్లికదేశంబునన్. 163

భీమాఖ్యమగు నేల స్ఫీతజనపదామేయదేశంబులందుఁ బోయి
భూమికన్యావార్త పొలుపు తెలిసి యీ మాసపుంగడ కిటకురండు. 164

పున్నాగకాంతారముల్ పొన్నలున్ పొన్నారిగేదంగిపూదోటలున్
సన్నని వకుళాగ్రసంతానముల్ క్రన్న గవేషించి కాంచి రండు. 165

పడమటికొండల పరువులై కడుపులలోపల క్రమ్ముపొదల
మడుఁగుల చలినీట మత్తికాఁడు పడఁతుక నుంచెనో పాలింపుడీ! 166

ఎదురుపాతెడు నీళ్ళయేళ్ళలోన ముదియెత్తునీళ్ళుల పొదలలోనఁ
గదియు కొమ్మలతోడికాంతారముల్ వెదకుఁడీసతి దాచిపెట్టవచ్చు. 167

కొండలఁ బొడుచుక గ్రుచ్చుకొను దండిశిలల పర్వతంబులందుఁ
గొండరాలకు మధ్యగుహలదాఁచియుంచెనో రాక్షసుఁడుర్వీసుతన్. 168

ఒకమొక్క మొలవని యూషరక్షితికి బొమ్మలై యుంద్రుదీప్తాస్యులై
యొకజాతితబిసులం దుంచెనేమొ యొకరిరక్కసుఁ డందుబోయికనుఁడు. 169

ఏ కల్పములవారో యింత మనిసులా కొండకొమ్మలయట్లు నిలిచి
వే కాంచునట్లు కన్పింత్రు భయదాకార మొప్ప మీ రటకనుఁడు. 170

అవ్వ్యమన్ గాలి వారికెడంబు తలలు జవ్వజవ్వన నూఁపె సాగరంబు
నవ్వుల నురువుల నర్తింపఁగా దవ్వులఁ గనిపించుఁ దప్తజలధి. 171

అంతరాక్కలు.

మొగలిడొంకల కాన్గుపొదలఁ గపీంద్రు లగవిహారులు వత్తు రాహారవాంఛఁ
జిగురుకన్నులవారు క్షితిజనందుంచునిగరణార్థము దైత్యనీచుఁడు కనుఁడు. 172

జలధివేలానివిష్ట శైలాంతగుహలఁ జలితతాళీవనాంత జాంగలభూమిని
చలువ సరకుచెట్లున్న సైకతస్థలానఁగలదొ భూజాత పోయి కనవలె మీరు. 173

మురచిపత్తన మొందు పోవఁబో నవంతిమరి జటీపురమొందు మణియంగలోప
పురమునందునఁగనుఁడు భూజాతఁ బంక్తిశిరుఁడుదాఁచనువచ్చు జీవాంతకుండు.

మహితసాగరసంగమస్థలంబునందుమహీధరం బుండె మహీమహితాఖ్యమొందు
విహితమౌ శతశృంగవిభువును నుత్తాలమహిజరమ్యంబు రత్నమణిప్రస్తరంబు. 175

చెలువురెక్కలతోడి సింహముల్ చరించువలయమమూర్తి హేమగిరిప్రస్థంబులందు
జలధిలోపలి మత్స్యసామజతిమిరాజివెలచి తమగూండ్లలోనఁబెట్టు సింహరాజి. 176

చెట్లపై గూండ్లలోన సింహముల్ వసింపఁగట్లపైఁ గొమ్ములందుఁ గరులు చరింపఁ
జిట్లు కుంభములందు జీర్వారు నెత్రుబొట్లుగా దాత్రి తోఁచు బోక్కాణ మన.

సోల యాకొండ జలధిచొచ్చి వందయోజనాలదూరానఁ దేలి నాయంకరంబు
గ్రాలఁ బారియాత్రగిరిగాఁ గానిపించు నేలపై దానికొమ్మునిక్కఁ గాంచనంబు.

నడుమ శతయోజనంబుల నాగేంద్రపాలికడఁగి చరియించు మేఘఘటలోయనంగఁ
బుడమికన్యక నీటి ముడుతలయందుజెడుగురక్కసి దాఁచు జీకాకుపొంది.

అదిఁ గాంచన శృంగమందు వృక్షరాజిపొదులం గొమ్మలందుఁ బారీంద్రరాజి
చాఁదు నీడంబులందుఁ జార్చిక్యకాంతులూఁదు కందరములను నుర్వీజ తోఁచు.

అంత దుర్దర్శపారియాత్రంపుఁ గొమ్మువింత యష్టాపదచ్ఛవియు శతయోజ
నాంతముం గాంచుఁడచట నాశంసితార్థచింతులై చూడవలయు సీతమ్మయున్కి.

కర్ణాటక చతుష్పదలు.

చతుర్వింశత్కోటి సంఖ్యాకు లనల ప్రభీకాశులు భీమబాహులున్ ఘోర
గతుల్ కామరూపులు గంధర్వు లచటవితతముగను రక్షావేశులై యుంద్రు. 182

అచటఁ గించిత్కు మాహార మాహారవిచయనార్థంబు మీ ర్వెట్టికోరాదు
నిచితనాదేయంబు నిర్మిమీష యట విచల్లిక మొదలైనవి పత్రములు తిని. 183

నాకేమి యంచు గంధర్వాళిపై నదూఁకబోకుఁడు సమిద్ధార్వహుల్ వారు
మీకు సాధ్యులుకారు మీరు వానరులజోకగా నున్న మీ జోలికే రారు. 184

సముద్రాంతరావర్జనాపోరమమ్ము వమద్వహ్నిగంధర్వమాలాకమ్ము
సమచ్ఛత్రుసంతానరక్షాకమ్ము సముదితోగ్ర బాహాశక్తి రక్షించు. 185

మీఁద వజ్రాఖ్యభూమిధరలక్ష్మి వైదూర్యవర్ణాభ వజ్రసంస్థాన
మేదినీజానేకమృదులమారకత చోదనచ్ఛాయావిశుద్ధై కధాత్రి. 186

తదవనీభృద్గుహా తాపింఛకాంతి మదాంధ్యధరాంతశ్చమల్లెఖవోలె
విదితశంపాదేహ విభుధర్మపత్ని యొదిగియున్నదొయేమొ యుర్వీజకనుఁడు. 187

ప్రావేలు పుర్వీధరశేఖరమందు శ్రీవిదేహ పతిదుహితృమణి నట నెందొ
మే విగాహితమైన యిరుల గుహలోన నో వెట్టుఁ బెట్టునా యొగిఁ బశ్చిమదిశ.

శతయోజనాయామ శైలాగ్రగుహలు శతధృతిసృజనాధిషణా చిత్రములు
క్షితిధరరమ స్నానమ్ము సేయుచో నాభి గతవారి జాఱునాఁ గనిపించుఁ గడలి.

అంతఁ గడలిలో నాల్గవపాలు మేర కాంతవార్బంధమ్ము కడచన్న చక్ర
వంత మన్గిరి తోఁచు వాఁడి వేయంచుసంతన సుదర్శనము సంతరించె నట.

మును విశ్వకర్మ, వేమొన వాలు పూని దనుజుని హయగ్రీవు దండించె స్వామి
కొని శంఖచక్రముల్ కోరింద చెట్టు మను బంకవలె నోట నుచ్చిళ్ళు క్రక్క.

హృషీకేశుఁడన్నన్ పేరాశకోపి తృషావేగి యసుర వైదేహి నచ్చోట
ముషితబుద్ధి త్రివిక్రమునిదెస నిరాదరషాడ్గుణ్యకారి నెఱపి దాఁచవచ్చు.

శిలోచ్చయసానువుల్ చిత్రముల్ రమ్యములు విశాలములు పరిమూఢనాసాగ్ర
బిల పరిమళములు నట వెదకుండీ సీత జ్వలితరత్న క్షితిసుషమ మెఱుఁగుబోణి.

అఱువదియు యోజనా లాపైని కలదువరాహ మను ఘనపర్వతమ్ము సువర్ణ
భరశృంగము నగాధభయదాంబుధి యనుమురువుకంబము కాకిబొడ్డు పట్టెనన.

అందుండుఁ బ్రాగ్జ్యోతిషాఖ్య పట్టణముసందీపితోర్జితాష్టాపదోజ్జ్వలము
నందుండు నరకుఁ డన్నట్టిదానవుడుచిందిపోయిన మట్టె క్షితి నెత్తువేళ. 195

ఏధితైనోనిరాకృతి సేయఁడంచు సాధింపంగా భూమి జలరాశి మునుఁగ
స్వాధీనపతిక యొయ్యారంపుఁ బోత్రి ప్రోథమ్ముతా నెత్తిపూను నవ్వేళ. 196

ఆ మట్టిముద్దకును బ్రాణప్రతిష్ఠ స్వామి చేసెను నేలచాన నోదార్చ
నా మనటు నసుర యేడవు కంచుకోటలా మీఁదఁ గట్టె రోదోంతరం బాఁపు.

వడిఁ గశ్యపప్రజాపతికూఁతుఁ గొనియెంబడఁతుకఁ జతుర్దశిని వానిచావామె
పిడికిటంగల దసురవీటిలో నెల్లఁబుడమికూఁతును జూడఁబొం డెల్లగుహల. 198

మేఘవంత మనియెడి మేదినీధరము ఓఘధారాప్రస్రవోరుకందరము
మాఘమాఃప్రాతస్సుమల్లీ రుచి, విధుతాఘంబు సర్వకార్తస్వరంబు గిరి. 199

విరచితోదన్వ త్కృపీటతాడనరు దురుఘోషగిరి కందరోరుప్రతి స్వ
న రీణామతి మృగేంద్రవ్యాఘ్రగర్జ లొరపిళ్లు పెట్టు నట నుప్పరంబెల్ల. 200

తురాసాహునకు నిందు నభిషేకంబు సురానీకముల్ భాసురంబుల్ చేసె
గిరీంద్రంబు పూజాకృత్సుమూర్తి కపి వరుల్ సపర్యాసవంబుగ వెదకుడు.201

జాతరూపమయంబు క్ష్మాజసంతతియు వే తరుణమార్తాండవిభ్రమావహము
నాతతగిరిసహస్ర మంతఁ గన్పించు శ్రీ తావి మునరు పుష్పితకాననముల.202

ఉన్న దా గిరులలో నుత్తరవు మేరు వన్నాడు మార్తాండు డతిప్రసన్నుఁడయి
మున్నా మహాశైలముం గాంచి నేఁ బ్రసన్నుడైనాడ నిశ్చయము నీయందు.203

పగలు రేల్ నీకు లోపములేదు పైడి జిగులవెల్గుల కోయి క్షితిభృన్మహేశ!
తగులు నీ శృంగసంతతి వసించెడు సుర గంధర్వుల శరీరముల పసిఁడిజిగి.204

దివౌకులును విశ్వేదేవతల్ సురలును వసువులు నుదీచీనూత్నసంధ్యా వి
భవదర్శనార్థంబు వచ్చి యీ మేరునవధరింతురు తరణి యర్చానిరూఢి. 205

ముహూర్తార్థమందున్ మొగి శతసహస్రమహహా!యోజనములఁగలాక్షించు దరణి
రహోమూర్తియట్టుల్ రాజతక్ష్మాభృ దహోపురుషిక కనుల కస్తంగమించు. 206

అచ్చోట విశ్వకర్మాభినిర్మితము పచ్చలును నీలముల్ ప్రాసాదపరిఖ
లచ్చుపడఁ గట్టినది యలరారు వరుణు నుచ్చస్థలీసౌధ మూటాడి మిన్ను. 207

అస్తగిరిమేరువుల యంతరమునందు నిస్తులము మణివేది నిట్టలము పొందు
ప్రస్తరము కొలువుండు వరుణదేవుండు విస్తార మిరమ్మదవేశంతమూర్తి. 208

తన్నుఁ దా భావించు తత్త్వజ్ఞమౌళి సాన్నాయ్యనిధి మేరుసావర్ణి కొండ
కన్నా కపరబ్రహ్మయుఁ గమలాప్తతేజుడున్నాఁడు కొండపై యోగీశ్వరుండు. 209

చరణమూర్తులు మేరుసావర్ణిఁ గాంచి ధరణిజాత ప్రవృత్తి తగును బ్రశ్నింపఁ
బరమమౌనిని జూచి ప్రశ్నించు ఫలము ధరణిజాత ప్రవృత్తి తనయంతఁ దెలియు.

జీవలోకమున కా శిలోచ్చయవేది కావల మఱేమున్న దవగతము కాదు
దేవుఁడౌ సూర్యుం డదేవుండు పైనిఁ గావిరులుచీకట్లు క్రమ్ము దేశమున. 211

మహాక్కఱ.
మిఁగిలి యచ్చోట జీవలోకాక్షినిమీలనం బంబుజాప్తు తుదివెల్గు
తఁగిలి చీఁకట్లు కృష్ణసర్పముల మొత్తము లుండు లోతైన పెద్దగుహా
ప్రగతజానువు లూర్ధ్వజానులు దైత్యపతులెవ్వరో కాని యిరుల మొత్త
ముగఁ జరింతు రసూర్యుల చంద్రముల్ మూర్తిమదజ్ఞానపుంజములు. 212

వరుణదేవుని పూఁదోటలో ఁబూలుప్రాలుసంజల నెఱ్ఱవెలుఁగులొప్పి
మరుసటిదినంబు ప్రొద్దుట నల్లనై మఱి తెల్లనై పవల్లెల్ల నవి
యరయ నచ్చటనున్నవారికిఁ దెలియదు వస్తురూపంబు తెలిసికోను
ధరణిజాతవియోగభావముచేతఁ దగు నెఱుంగను స్పష్టమార్గమున. 213

చ. వెసఁ బరిపూర్తికాకమునుపే నెల యిచ్చట నుండఁగావలెన్
మసలినవాఁడు వధ్యశిల మధ్యమునందున నుండు మీరు ధా
త్రిసుత గవేషణాధిగతదేశులు చూచియ రండు నీలర
క్తసితవిధా దినప్రళయకాలము కల్గెడు చోటు దాఁకనున్. 214

ఉ. ఏను కపీశ్వరుండగుట యెంతయు నిష్టమయేని మీకు నీ
వేను కపీశ్వరుండగుట నిక్కము రామునిసేఁత, తాను ప్రా
ణానికిఁ బ్రాణమొడ్డి యవునా మఱి నన్ను సముద్ధరించె నిం
తైనను జేయజాలమె గుణాబ్ధికి బ్రత్యుపకారలేశమున్. 215

ఉ. ఎప్పటి కేది కావలయు నెప్పటి కేది పొనర్పఁగావలెం
జెప్పఁగఁజాలు మామయు సుషేణుఁడు భీమపరాక్రమాబ్ధి మీ
కొప్పఁగ వెంటవచ్చు వరుణోపలపశ్చిమవార్ధి దాఁక నా
కెప్పుడు మీరు కన్పడుదు రిచ్చటఁ జూచుచునుందు మీకునై. 216

చ. ఉదయములందు రెండు మఱియున్ మలుసంజల యెఱ్ఱ వెల్గులున్
గదలిన మీ నవారుణితకాంతిదృగంశు చకచ్చకద్విధా
ఛిదురముగాఁగఁ గన్పడదు పృథ్వితనూజయుఁ గానిపించిన
ట్లైది పొడ యున్న దాని ప్రకటీకృతి మున్నుగ గోచరింపఁగన్. 217

పట్టిన యొజ్జజేగుఱుల పశ్చిమదిగ్గిరి దుమ్ముకొట్టుకొ
న్నట్టి శరీరధారులకు నాయువు మిక్కిలి యిచ్చుఁ దమ్మిపూఁ
జుట్టము నచ్యుతంబు తన శోభకు నా ప్రళయాచ్ఛముల్ ఛవుల్
నట్టువ కీ గతిన్ దినదినప్రళయంబగుఁ గోప మూనుచున్. 218

అంత వారి నందఱఁ బశ్చిమదిశకుఁ బంపించి యుత్తరదిశాప్రేషణార్థంబు సర్వ
వానరసేనా ప్రథమయూథపతిని శతవలిని శతసహస్రవానర వీరప్రాజితఁ గాంచి
యిట్లనియె. 219

బంధులము మీరు నేను వైవస్వతులము నీవు నీతోడి సదృశంబు నీ చమువును
మొగి మనోవాయువేగాములు తలంపఁ బ్రథమదుర్గములరు కపిరాజ్యమునకు.

ఇమ్మగ నుత్తరాశను మహీస్థలి మిక్కుట మొప్ప మార్గిత
వ్యమ్మొ నెలన్ సమస్తమునయందునఁ జూడఁగ మీర నేర్తు రు
గ్రమ్మగు దోర్బలంబు నధికంబగు వేగము సూక్ష్మబుద్ధి మీ
సొమ్ములు రాముభార్యఁ జని చూడుఁడు మత్ప్రియమాచరింపఁగన్. 221

ఉపకారంబును బొంది ప్రత్యుపకృతి వ్యాఘాత్ముఁ డెవ్వాఁడు కా
డపరాధం బని యంతకంటెఁ గలదా యా పాపమున్ నారకా
స్రవుఁ గుల్యాక్రిమితన్ ఘటించుఁదను దూరంబైన యామాటకా
దిపు డీ నెచ్చెలికాని కార్యకరణం బేలాగు కాదందుమో! 222

మన మింత యింత వారము మనతోఁ బనిలేదు మనకు మైత్రీఫలమై
చనుఁగాక మన పరాక్రమ మనితరసంస్థానరమ్య మాశ్చర్యదమున్. 223

అవనిని జూడగా వలసి నట్టివి సర్వ ముదీచియంద యు
న్నవి హిమవన్నగంబు కనినన్ మఱి చాలు నదొక్కఁడే మదిన్
బవి యన నెట్టియాయుధము పర్వత మెంతది దాని ఱెక్క లె
ట్టివి సురరాజు కీదృశుండు డెప్పర మౌను దలంచినంతటన్. 224

క్కఱలు.

మొదట నిచ్చోట నున్న నదీవనంబులు గిరికందరములను జూచి
పిదప మ్లేచ్ఛముల్ శూరసేనపుళిందపృథువులు ప్రస్థలమద్రకము
లుదితకాంభోజయవనకురుభరత లుర్వీభాగములును శకధరిత్రి
వెదకి బాహ్లీక టంకణపౌరవ వీథులన్ ఋషికముల్ చూడవలె. 225

పరమచీనముల్ చీనముల్ నీహారపటుధాత్రిదరదములు హిమవంత
మరసి శివజటాజూటికాభోగ సీమంతశైవాలినీ నీరముల
సరగ లోధ్రపద్మకషండపున్నాగ సల్లకీ దేవదారు వనరాజి
ధరణికన్యక దూషితాత్ముండైన దైత్యుండు దాచెనో చూడవలె. 226

అంత సోమాశ్రయం బున్న దర్భాసమాయాత దేవగంధర్వయక్ష
కాంతల పునంగు జవ్వాజి పరిమళాక్రాంతదిగ్దేశాంతభాస్వరము
వింతసేయునొ వేల్పువల్పులు కట్టివెస లొద్దుగుల పూవుదుమ్ముతలకు
చెంతలన్ రాచి విస్మయానిమిషదృక్సిద్ధి జానకేయక్షి యన్నటుల. 227

అట మహాసానువు మహాద్రికాళమన్నాఖ్యది మంత్రించినట్టులుండు
అట మహాష్టాపదపదంబు హేమగర్భాఖ్యమ్ము శైలరాజమ్ము కల
దట సుదర్శనభూధరము లతాంతకాంతార ధాళధళిపటువు
నట మహాక్షేత్ర మగు గిరిదేవసఖాఖ్యమ్ము దేవతాగేహకము. 228

ఉరక దిక్కులుతెలియక యాడాడ నూఁగాడుచుండంగ విరిసిపోక
మఱియుఁగార్తస్వరాశావికృష్టులై మహిమంబుచెడక మీరెల్లరును
గుఱుతుగా లుప్తదుష్టులయి సౌందర్యగూఢభావ పరిహీనమతి లేక
మెఱయు దేవతాకన్యా కనకచేలమృదుతాసమూహాలు కాకయును. 229

కాళహేమగర్భ సుదర్శనములందుఁ గనువడి దేవసఖగిరియందు
హేళికాంతులు తగ్గకముందు మహిసుతపాడ యున్నఁ జూచుచును
గేళిదీర్ఘికలందు డోలలయందుఁ గేతకీ వకుళక వనములందు
హేళి దేవతాకాంతలు చరియించు నాయాయి కందరభూములను. 230

ముసలితొండలు బహువర్ణచిత్రితామోఘ కాంతిచ్ఛటాతనువులొప్ప
మసలు బహువర్ష కాలపతితములు మాఁగి నీళ్ళ గిరిదరీస్థలుల
మొసళులున్ బయోగ్రస్తార్ద్ర దేహముల్ మొద్దులై ప్రస్తరపల్వలముల
నెసఁగువాని దారుభ్రాంతి సామీప్య మెనయక ధాత్రిజఁ జూడవలె. 231

ఎటులఁజూచిన శతయోజన మెడారియేచు నచ్ఛోనిర్వృక్షకంబు
ఘటితత మిథ్యాజలాసార, సనిదాఘ, కాలిదారియునైన ఁగన్పడదు
పటుమహాలంఘనంబుల నది దాఁటి పరమ విశాల మాకసము దాని
కుటజముల్ వృక్షముల్ ఫలంబులు నదీకుల్య లేనిదాని నంతటను. 232

అటనె కైలాసమున్నది శివనంది యమ్మవారును భృంగిరిటుఁడు దుంఠి
యుటజవాసి మహాపరమేశుండు యోగీంద్రులకుఁ గాని కన్పడరు
ఘటితమౌ మహాశ్వేతభావమున నాకారమ్ము లేర్పరింపఁగను రాక
పటువులు పరమహంసలు స్వచ్ఛమౌళితమహస్సు లోఁగాంచెదరు. 233

మింటిమెఱపుల వెలుగైనది వళక్షమేఘ సన్నిభమైనదియును బైడి
బంటి సుషమామనోజ్ఞమైనది మణివైదూర్య మరకతశ్లిష్టమును
కంటికిం జారితార్థ్యము కలిగించు కలుముల తుదియెల్ల యనఁగనైన
దంటమోములదేవర జిగులసౌధము కుబేరునిది కన్పించు నట. 234

చెలిమికాఁడైన ముక్కంటి తలమీఁది శివనది రత్ననిర్మితము నేల
వెలసి ప్రతిబింబరూపమ్ము పొందినవిధముగా నొక తటాకమ్ము కల

దలఘుకారండవాకీర్ణ మష్టాపదాంభోజరమ్యంబు చెఱువునొడ్డు
జలము వనరాజి కోలుపుచువ్వ లచ్చరలవిహారదేశంబు నది. 235

పరమభక్తుడు నిజముగాఁ జెలికానిభావమ్ము పడయు టనాదిమతము
ధరణిజాపతికేను మిత్రుఁడ నైనదారిఁ దాను పినాకపాణికిని
బరమమిత్రుఁడు వైశ్రవణుడు యక్షపతిసర్వభూతవంద్యుడునుబొల్చు
బరమవీరశైవాచారపరుఁడు దిక్పతి యలకాపురాధీశుఁడయి. 236

జ్ఞాతిశత్రుత్వ మది పరాకాష్ఠ నెసంగు రావణవైశ్రవణులమధ్య
సీత నచ్చోట వైశ్రవణుఁడెఱుంగు చెలు వేర్పడకయుండ దాచినను
చేతను లయినవారికి ననుమాన చిహ్నంబుగలుగదు మఱియునిద్ది
హేతువై దాఁచనువచ్చును వెదకుఁడీ హేరాళచంక్రమప్రాభవులు. 237

పైడిమేడలలో ముందువెనుకలు వచ్చునట్లుగ గట్టినవియునైన
గోడలందున మూలలందున మణికుట్టిమస్థల రత్నపుత్రికల
నీడ లాఱని వెలుఁగులచోటుల నిర్వ్యూహగిరికందరములఁ దరులఁ
బైఁడికంటుల బావురాలయు గూండ్లవలభులందున రత్న దేశముల. 238

ఇవతళించిన నీళ్ళ చెర్వులయందు హేమాంబుజాతసంతతియుఁ జిత్ర
మవును రేకులంచుల పైఁడిచాఱలు నాదిమ్మ నంటుచో నందముగ
నవనిధుల్ సూచితంబుగ మఱియునానావర్ణములుగాగ జిలుఁగుజిల్గు
ఛవుల చుక్కలు చుక్కలు పరిమళాభ్యాసంబు నాసాగ్రతర్పణము. 239

అంతటిమనోజ్ఞమైననెడఁ బరమమనోజ్ఞాకార భూజాత నెచటనైనఁ
గొంత మందమ్ములోపల నందమ్ము కలసిపోయెడునట్లు దాఁచనగు
సంతసమ్ము వివిచ్యమానంబుగా సంగతహేతుసంచయ విమర్శ
పొంతనలబెట్టుమీరు సౌందర్యంబు పొరలుతీసి కనుండుభూమిసుత. 240

క్రౌంచగిరియున్నదాపైఁ గనుపవులుకాంతారజంబైన వెలుఁగురేక
చించు బెజ్జమ్ము కన్పించుఁగొండలోఁ జేరఁగావలె నప్రమాదముగ
బ్రాంచితుల్ దేవరూపులు సూర్యప్రభావంతులు మహర్షులచటనుండు
రంచులంచులఁబడి పోవు డాయాస మనక యుదీచీదిగంతములు. 241

గురునితంబయు వరగుహయును గ్రౌంచకుధరేందిరయు దానిసొగసు చూచి
యరుగుడాపైన వృక్షము కామశైలాఖ్యము విహగాలయంబునకు
సురలు యక్షులు గంధర్వసమితియుఁ జొరరాద యాప్రదేశమ్ము దైత్య
వరులు పోరాని వాచోట్లు వెదకుఁడా పరమదేశమ్ము భూకన్యకయి. 242

ఇదియు మానససరమును గ్రౌంచభూభృత్కోటిదేశసంస్థములు వాని
వెదకి మైనాకనామకగిరిరాజు వెదకుఁడు దానవశిల్పి గృహ
పదము మయునిది మైనాకగిరి యశ్వవదనలు గిరిమీఁద నచ్చటచట
సదనముల్ కట్టి వసియింత్రు గగనమ్ము సంగీతభంగీతరంగముగ. 243

పైన వైఖానససరస్సు నవరంజిపన్నె యంచల విహారములచోటు
చానలంగూడియట సార్వభౌమంబు చనుదెంచును గుబేరుసామజము
పూనివైఖానసుల్ వీతకల్మషుల్ పురుషవంద్యులు మహర్షులు వసింతు
రానెలవులందుఁ దలతోఁ బ్రణామంబులాచరించి యడుగుడీ లతాంగి. 244

ద్యక్కరలు.
ఆ చెర్వు దాఁటినమీఁద నర్కచంద్రాంశు ప్రసార
మీసీదరిద్రమ్ము మొయిలు పిసరు కన్పింపనిచోటు
పోఁచగానైన నక్షత్రముల వెల్గు పుట్టనినేల
ప్రాచీనమగు చోటు విగతప్రాణి నిష్పక్షికంబు. 245

దేవకల్పులు తపస్సిద్ధదీధితి దివ్యకాంతులను
దేవతామూర్తులు ఋషులు దేశమ్ము దేశమ్ము సూర్య
దేవుండు వెలుఁగుల పిండు తీర్చిన తీరుగాఁ జేతు
రా వెగ్గలంబైనచోటు నవసరవ్యాహతంబుగను. 246

ఆ పైని శైలోద యను మహానది యంగదట్టముగ
నేపు పొందిన కీచకములు నిరుతీర మిమ్మడింపఁగను
జాపర్వు వెట్టుచునుండు నవరిల్లు సన్న వేణువులు
గీ పెట్టు నావర్తతీవ్రకీలిత కేళివాయువుల. 247

అచ్చోటి ఋషుల వెదుళ్ళు నవియుఁ దమంతటఁ బడవ
లచ్చుపడంగ నీయొడ్డు నాయొడ్డు నరుగుచుఁ జేర్చు
విచ్చిన పొదుగైనయట్టె వెదురెక్కి వెస వాల్చినంతఁ
జెచ్చెర నవతలియొడ్డు చేర్చు మూసినకంటిలోన. 248

పొలుపుగ నట నుత్తర కురుభూములు పుణ్య దేశములు
నెలవులు విమలశైవాలినీ సుధానీరములకును
గలితమనోహరసస్య కాండైక కాంతారములును
జెలువొప్ప నాత్యుష్ణ నాతిశీత మశీతాంశు వెలుఁగు. 249

ఎరాక్కరలు.
ఎఱ్ఱతామరపూఁదోట లిందిరానివసభూము
లిఱ్ఱికన్నులవోనివి యిఱ్ఱిగోరజము తావు
లుఱ్ఱుకట్టువిధాన సముద్ఘాతమధురసమ్ము
లెఱ్ఱవారిన మలుసంజ లెత్తిపోసిన విధాన. 250

నల్లకల్వపూఁదోటలు ననుపువెంచు సునుఁదావు
లల్లలాడు తరంగాళి నాకుపొత్తి యుడుపములు
తల్లడంపడు నవషట్పదప్రియము వేగదర్శ
నోల్లసన్మందహాస కృతోన్మీలన ప్రణయినులు. 251

చెఱువు లుల్లలదూర్మికాశృంగాటకములు నొద్దు
నిఱుకటంబైన ననుపూవుటీరంబులను మరుఁడు
తఱిమెనంబెట్టు సంకేతిత నిమేష మనభియాత
గఱకు దేరు వృషస్యంతికై భుజంగతతి యార్తి. 252

అచటి సెలయేళ్ళిసుకతిన్నె లందంబు చిందుకొంచుఁ
బ్రచలితప్రతీపదర్శని వరువెత్తజఘనభాగ
సిచయ మది జారినట్టులఁ జెలువొందు నిత్జగిరిజ
లెచటు వొందు నచ్చటు ప్రియాహితనఖక్షతము లన. 253

అంతరాక్కులు.

భూమిధరములు నిత్య పుష్పితము లొప్ప
భూమిపరిమళభరితములు స్పృహ. లీను
భూమిజంబులు వస్త్రములు సమర్పించుఁ
గామధేనువు నేయు కై సేతలట్లు. 254

మొగిని సర్వర్తు సేవ్యముల ఫలరాజి
నగము లిచ్చు సమర్పణాయత్తబుద్ధి
మగువలకుఁ బూరుషులకు ముంద్రాట లేని
నగలు రత్నముల్ మణికనకము లొసంగు. 255

ఇద్ది కావలెనన్న యూహ కల్గుటొందు
యిద్ది లభియించె నన్నతృప్తికనుటొందు
తద్ద రెం డవికావు తత్ క్షణాత్తమతులు
నద్దిలే దా తరులకు నుపద లర్పింప. 256

అల్పాక్కులు.

కలుగును వస్తునికాయ మూహ కలిగిన సమకాలికం బైనద్రై
మల కోర్కి కలుగి లేదన్నట్లుగా నిలచిన యానందనీరధిగ. 257

నెట్టులు సంగీతహేలాస్వనం బుప్పరం బుమియు వాయువు చరించుఁ
జప్పరించిన తాళహేసరవము మప్పితమవు నాట్యమందిర మన. 258

మహోక్కులు.

అల నకల్పాగసంభూత దివ్యభూషావళీ లలితావయవలు నంగ
నలును పూరుషుల తపస్సమాత్త మహోసిద్ధమహిమలు భోగులును
నలఘు లముదితుఁడని లే డసత్ప్రియుఁడని లేఁడు నవ్వినజనులనవ్వ
లొలయు వీణాగ్రశబ్దానమత్తంత్రికోత్పన్న తీవ్ర స్వరస్వనము. 259

కుసుమశరచాప శింజినీ మంజుల ఘుమఘుమారావాంకురములు రమ్య
కుసుమపరిమళ ఘూర్ణత తరువల్లి గుల్మసంతానమ్ము నిత్యమును
వినరదోంకార సుశ్యామ బంభరావిర్భూత సంరావ సుపరిణాహ
మెసఁగు నచోటి [illegible]

నాగకన్యల గంధర్వసిద్ధకిన్నర కన్యకలయు విద్యాధరాంగ
నాగురుసమూహములయు చేలాంచలనాట్య రేఖాహాతు లర్కసమ
భాగ తేజోనిధానులు కృతపుణ్యభాగధేయులు పూరుషులు చరింత్రు
మాగగుండెల యందుఁ దేగా కత్తిమోపినట్లున్నవౌ కోరికల. 261

ఉత్తరకురుభూములమధ్య కనకమయోర్వీధరం బున్న దచటనింద్ర
పత్నీసమాయాతులు శతధృతి పత్నాయాతులు నుండుదురు
పుత్తడి వెలుంగు· నెండలు కాయు నా భూధరమందు నది విసూర్య
మాత్రదేవేక్షణాకాంతి సంయోగమై సోమగిరి దాని పేరు మణి. 262

అట ననస్తంగతుండైన శీతాంశునంశుల ననుమేయతఁగను సూర్యు
డటదపించు సూర్యునిచేత ననుమేయ మమృతాంశుమౌళి యేకాదశ ని
కటమూర్తులు శతధృతిబ్రహ్మర్షిఘటలచేఁ బరివృతుండయి వసించు
నట నచటుదాఁటి మీకును నఖిలభూతముల కగమ్యమగు. 263

సోమగిరి చూచి వెనుకకుఁ దిరుగుడు సోమగిరి వెనుక నది యసూర్య
మాము కవిసి మీ రేగినఁ దిరిగిరా రాచో టమర్యాద మంధతమ
సామయాస్థానియు నచంద్రమసము భూతాజ్ఞాత మెవ్వరుచనిన గుర్తు
హోమధూమమ్ము పొలసిన గుర్తులే దుచ్ఛ్వాస మాడినగుర్తయిన. 264

క. నెల కాకమున్న రావలె సలలితగుణఁడైన రామచంద్రు దిదృక్షా
వలితాపాంగచ్ఛవులల్లల నరుణితమైన రేక లాఱకమున్నన్. 265

క. ఒకవంద దిక్కులైనను నికరంబుగ లేవు భక్తి నిండినదగు పొం
గుకుఁదగినయట్లు వెదకించి కపిసమూహంబు పంపు చిత్తముచాలన్. 266

క. జలజాప్తు వెలుఁగుపిండులు చలించుపర్యంతమైన క్ష్మా వెదకుటమై
వెలి నెచట నుంచు జానకి ములుచయుఁ దా నంధతమసమునఁ జొచ్చిననున్.

క. మొదల ధరాకన్యకదగు మెదలిక తెలియంగ నగుట మేల్కాక మరీ
కదలిక కదలిక, శాత్రవ విధళన గమనార్థవిజయభేరి పొనర్తున్. 268

క. ఆ మాట యిప్పు డెందుకు భూమీజను వెదకిరండు పోయి వినతసూ
ప్రామాణ్య తేజు లౌపయి వ్యోమసమాపూర్ణ శితశరోదధి యగుతన్. 269

మ. మహనీయంబు రఘుప్రవీరుని కృపామౌగ్ధ్యంబు శాఖామృగా
ళి హారం బెట్టిదో స్వామికార్యమతికేళీవైభవం బెట్టిదో
ద్రుహిణాండంబునఁ దెల్లమైచను రవీందుజ్యోతి ముక్కాలమున్
విహరద్వానర శౌర్య చంచల దిశావీథుల్ ద్విపీత్యంబులై. 270

వ. అంతవారి నుత్తరదిశకుఁ బంపించి సుగ్రీవుండుమనంబున నిట్లని విత్కరించె. 271

క. అతి నిర్భయుండు దైత్యుఁడు క్షితిజాతను దనపురంబు చేర్చును గడు
శతయోజనముల జలధియు నతార్యమన్యులకు నాకు హనుమకు దక్కన్.

గీ. జాంబవంతుఁడు దానికిఁ జాలుగాసి నాకఁజాలడు మోకాలు నొప్పిపట్టె
నాకు హనుమంతుఁడొక్కఁడున్నాఁడుగాక యీ మహాకార్యభారము నెత్తలే

వ. అని వాయుదేవతాపత్యంబు హనుమంతుం జూచి యిట్లనియె.

క. అదియేమి క్రిందిచెక్కిలి మొదలింటె శతారఘాతమున నగు మచ్చన్
మెదలుననుచుఁ జేఁ దాఁకుచు నది యేమియు లేదటంచు హసితాననుఁడై

మ. అవనీదేశము సర్వ మెంత పరిణాహం బొప్ప నాకాశ మెం
తవు నీ రెండును వైనతేయుఁడొకఁడాహా! ఱెక్కలం బట్టుఁబ్రో
డవు బాహాయుగళంబునందునను గూడల్ వేయుదున్ నీవు, వి
ష్ణువు శ్రీరాముఁడు దీటుగాఁగలరు నిన్నున్ వైనతేయుం గనన్.

చ. తలపయిఁదా ననంతుఁడును ధాత్రిని దాల్చు నతండు భారమున్
దొలఁచిన నీధరావహనధూర్వహుఁ డెవ్వఁడు వైనతేయుఁడు
జ్జ్వలచలపక్ష చంచలుఁడు పట్టినభారము నాల్గునాల్గు ది
క్కులకును ద్రిప్ప నీదు భుజకోటి యనంతఫణాప్రమాణమై.

చ. మతికలిమిన్ వచించెదరు మానక వేల్పుల యొజ్జయౌ బృహ
స్పతి నతినాస్తికం బయిన భావపరంపరచేత వక్రమౌ
నతని మతిప్రగల్భతయు నర్థవినిర్ణయ రూపమైనదే
మతి యొకనిన్ను వీడి హనుమా! యనుమానము లేదు లేదటన్.

మ. సురగంధర్వభుజంగదైత్యఖగయక్షుల్ లేరు దక్షుల్ నినుం
దొరయన్ లంఘనచాతురిన్ జలధి గండూషింతు దూషింతు ని
ర్జరదైతేయచమూసమూహము నఖచ్ఛాయాప్రమీతంబుగా
స్థిరయుష్మన్మతివిక్రమంబులు జగత్ క్షేమంకరంబుల్ సఖా!

క. ఒకవేయి గండములనుండి కాచితివి తెచ్చి తెచ్చి నేఁడీ నను ముం
పకు రామకార్యపాథోధి కృపీటోన్నత తరంగదృప్త భ్రమిలో

శా. నేర్పొప్పంగను నాకు రాఘవునకున్ నేస్తంబు గావించి తా
నేర్పొప్పంగను భూమికన్యఁ గని యా నేస్తంబు నిల్పందగున్
సర్పిష్మద్దవిసున్ బలెన్ గృతభవత్సంస్పర్శ గార్యంబు లెం
దర్పించున్ ఫలితంబు మింటి కొనలందౌ స్వర్గచూడంబునన్.

వ. అంత వినయావనత హసితాననుండైన హనుమంతునిఁ గాంచుచు శ్రీ
చంద్రుఁడు సుగ్రీవుని ప్రశ్రయం బెఱింగి తత్పూర్వహనూ మద్గత సద్భా
ణరేఖ స్పష్టంబుగా నిట్లని వితర్కించె.

ఉ.ఇమ్మగ నింత ప్రాభవము నింతటి దర్పము సూర్యసూతి ధై
ర్య మ్మితఁ డన్నమాట యితఁడం చనుకొన్నదియే సమగ్ర శౌ
ర్యమ్మును బుద్ధిమత్తయును బ్రాభవయుక్తము భక్తిభావమున్
గ్రమ్మిన యింతయో వినయ గౌరవ మెయ్యెడ లేని హంతవల్. 283

ఉ.ఈతనియందు నుంచి విధియేనియు సర్వము సృష్టికార్య సం
జాతము నిద్రపోఁగలఁడు కార్యవినిర్వహణైక దక్షతా
శ్రీతను బొందినట్టిఁడు నిరీక్షణమంజుల హాసత స్సమా
ఖ్యాతనిజాతిలోక మహిమాఢ్యుఁడు సుందరమూర్తి యెంతయున్. 284

వ్యవసాయోత్తరుండని నిర్ణయించి రహస్యంబున నతనిఁ బిలిచి స్వనామాంకింత
మైన యంగులీయం బతని కిచ్చి 285

నీ వెవ్వఁడవో తెలి[illegible] నీ వియ్యది చూపు తెలియు నీరజదృశ నీ
కై వేచియుండుఁ గన్నులు నీవచ్చినదాఁక విచ్చు నీరజములుగా. 286

హనుమ స్వామి యిచ్చు నంగుళీయకమును అంజలిన్ గ్రహించి యాత్మమూర్ధ
మందు నునిచి మ్రొక్కినట్టి యాస్యంబునఁ దళతళమ్యె హరిశతారరేఖ. 287

అంత హనుమ దక్షిణదిగ్దేశగమనార్థనిర్ది ష్టేతరవానరయూథ పతులం బోయి
కలిసికొని 288

వరమయజమానివేల్చిన ప్రాణమయమహవిసు మ్రోయుచునున్న క్రత్వగ్నివోలె
శ్రీసమర్పితమై ప్రావృషేణ్యజలద వారిధారలు వహియించు వాయువువలె. 289

పారరూపమౌ ఛందోవతారుఁడగుచుఁ గడఁగి యమృతంబువహియించు గరుడివోలె.
సరగ స్తోభాధిదేవతాజ్ఞాతమైన మహితుఁ డుద్గాత తాల్చు సామమ్మువోలె. 290

అంతట నాంజనేయు హృదయంబున మ్రోఁగుచునుండె నోహనూ
మంత! నరేశ కార్యప్రథమాన వినిర్వహణైకదీక్ష! ధీ
మంత! వరిష్ఠకార్యసుకుమారపథాభిమతానుయాయి! శ్రీ
మంత! సురారిలోక వినిమారణఘోరభుజాది భారతుల్. 291

అంత రాముండు ప్రస్రవణాద్రిమీఁద చేరుకొని ససౌమిత్రి వేంచేసియుండె
గుళికలైసూర్యునికరాంగుళులు మదయభూమిధరసానువులఁ బూలువుణుకుచుండ.

బహుకోటి వానరచమూ విహారమగు నచటి నేల విప్పెడు చీఁక
ట్ల హాలాహలవున్ మొదలి ప్రవహముంబోలి విను వీధి వెడలిన గుములై. 293

పో నొకవెంట మింట నొక ముద్దగఁ గన్పడి నాల్గుభాగముల్
గా నయి నాల్గుదిక్కులకుఁగాఁ జని దిక్కులు రూపమందెనో
నా నెగడెం జలచ్చలఘనాఘనముల్ పెనుఁజివ్వ్రమోతలుం
గానయి సర్వవానర నికాయము ప్రస్థితమయ్యెఁ గ్రమమై. 294

మధ్యాక్కఱ.
శతవలి యుత్తర దిశకు సాగె ఝంఝూమరుత్తువలె
ధ్రువమతి వినతుండు తూర్పుదెస కేగె దీప్తార్చివోలె
క్షితిభృత్తు వలె సుషేణుండు చేరెఁ బశ్చిమదిశావీథి
క్షతిలేక దక్షిణ దిశకుఁ గాలసాగరపయోవిధృతి. 295

గీ. హనుమదాదులు బాహుపర్యంతలంబమాన వియదధ్వులై, సమున్మత్తసింహ
నాగ బధిరితాశామహా నాగరాట్ఛ్రి వశ్చలిత రంధ్రులై కపిపతులు, చనిరి. 296

మధ్యాక్కఱలు
దిగ్గజదంతముల్ పెఱికి తెత్తుము తేమేని సీత
దిగ్గురు మన గుండె యసురఁ దెత్తుము తేమేని సీత
వగ్గెలాడుచు నిట్లు చనఁగ వానరపతులు దిక్కులకు
గగ్గురుపాటయ్యె నాడలు కమలినీకాంతాత్మజునకు. 297

అఱతురు కుప్పించి యెగసి యార్తురు హాసంబు సేతు
రఱకడ చేతులు చేర్చి యంతంత యరిగి వచ్చెదరు
నుఱుగొట్టుదురు గాలిఁ జూచి యుగ్రులై యురవడించెదరు
పఱివోవ శత్రుల ధైర్యభావంబు పరవళ్ళు ద్రొక్కి. 298

గోళ్ళతోఁ బాతాళలోకగుహ లెల్ల గ్రొచ్చఁ గల్గుదుము
వేళ్ళతో దానవలోకవృక్షముల్ పెల్లగించెదము.
నీళ్ళతో సాగరం బెల్ల నేలపై నిండింపఁగలము
గ్రేళ్లువాఱి ధరిత్రియెల్లఁ గెరకొట్టి కేడింపఁగలము. 299

సీ. శతయోజనమ్ముల జలధి దాఁటెద దాఁటకున్న మార్వేరున నన్నుఁ బిలుము
నాది సమాధాన మూఁది దానవభర్త దంతమున్ పగులంగఁ దన్నులటకును
ననుఁ జెప్పవలయు మానక నిట్టిపనికి ధరాత్మజ వెదకెదునట్టిపనికి
నసుర నేనొక్కఁడ నరిగి చెవుల్ పట్టి తెత్తు నాకేమి యిత్తు చెపుమ.
గీ. యనుచు నాత్మపరాక్రమాహంక్రియాభియాతి మారణకరణ సంయమనవాక్కు
లగుచు దిక్కులకేగి రంతంత దూర గగనములఁ జిన్ని మెయిళులుగాఁగఁ దోచి.

మధ్యాక్కఱ.
శ్రీరామచంద్రుండు హనుమ చేతి కిచ్చిన యుంగరంబు
వీరుండు సౌమిత్రి ప్లవగవీరుల విక్రమోల్బణము
కోరి సుగ్రీవుండు ధాత్రి కూఁతురు కొసఁ గనంబడుట
నారేయి యూహించుచుండి రాలోచనాధీనమతులు. 301

క. తన దర్శనానికై వచ్చిన సుగ్రీవునిఁ గనుఁగొని శ్రీరాముం డి
ట్లనె నీపాటికి దిక్కుల మనసేనలు చూడవచ్చు మహిజాత. సఖా! 302

చ. కకవికలై కదున్ నిజముగా వెదకంగను నైనచోటు నే
రక చకితాస్యులై తిరిగిరాకయుఁ గల్గెడి దప్పదైన, నా

ద్రిక నిపుడైన నీదు నుపదేశముపొంటె మఱెందునెందు జొ
నకేఁ గనావలెం దెలిసినా రటనచ్చటఁ జూచివత్తురున్. 303

మ. మఱియున్ నాకును జిత్రమైనయది సుమ్మా, యాదిగంతంబు భూ
ధర నానాస్థితటాక సన్నగర కాంతారోగ్రశైవాలినీ
భరమై నీగతి సర్వధాత్రి యెవఁ డప్పా నేర్చుఁ జెప్పంగ ని
ర్భర మీజ్ఞానము నీకు నేగతి లభింపం గల్గెనో చిత్రమా. 304

మధ్యాక్కర.
అనినంత సుగ్రీవుఁ డనియె నంబుధు లద్రులు నదులు
వనములు దేశముల్ వాలిభయమునఁ బర్యటించితిని
గనులు మూసిన వాలి తెలియఁగా ముందుఁ గన్పడు వాలి
వెనుకవచ్చును వాలి పార్శ్వవీథుల వెస వాలి గాఁగ. 305

చంద్రరేఖ.
మాయావి వెంబడిన్ భీమప్రౌఢి నవ్వాలి యేగన్
నాయున్న భూమిభృచ్చండక్ష్మాగుహాస్యంబు రక్త
వ్యాయత్తవాహినుల్ ఘోరాకార మేపారఁ బాఱన్
మాయన్న మృత్యువాతం బడ్డాఁ డిఁకేమున్నదంచున్. 306

సుగంధి.
అందుకోసమే దురాత్ముఁ డద్రికందరంబునన్
వింద్రుగాఁగఁ దూఱినాఁడు వేలమంది బందుగుల్
క్రందుగాను గూడి చంపగా నటంచు దుఃఖినై
కందరాముఖంబు ఱాతఁ గప్పియింటి కేగఁగా. 307

చంద్రరేఖ.
ఆ మంత్రు లెల్లరున్ న న్నారీతి భూజానిఁ జేయన్
నే మొఱ్ఱపెట్టితిన్ దండ్రీ! బాబు వద్దండి యంచున్
నామాట విన్నచో నీ నాఁడిట్టులే లౌను గాఁగా
నామీఁద నేడు పోఁగా నవ్వాలియే యెంచి యట్టుల్. 308

శిఖరిణి.
హఠాన్నిర్భిన్నాద్రిప్రకట కుధరాహంకృతిఁ గ్రుధా
హరప్రౌఢిన్ నన్నున్ జరజర ధరాహర్త నసుచున్
శరుం డౌచున్ సింహాసనమునను గేశాహృతి శిరో
లురన్మాంసత్వగ్రక్తముగను గృపాలుప్తి విద్రిచెన్. 309

మనోజ్ఞ.
అరయ నదే మొద లన్నమంచు జలంబటం
చెఱుఁగ దిశాప్రతతిన్ విశీర్ణలతాకృతిన్

విరియు మహానిలరాజి వెక్కసమై యనుల్
మెరయుచు గుప్పిటంబూని పోయిన పోకగా. 310

ఫలసదనము.

అచటి కరిగి యిచటి కరిగి యెటుచూడన్
విచయునపటు వగుచు విఱిగి చను వాలిన్
సిచయువుఁగొన మలచుచెలు వఱియ చూతున్
గచము విరియ దెసలు కలఁగి పరువెత్తన్. 311

తరళము.

అపుడు పోయితిఁ బ్రాగ్దిశాంతము నద్దిఁ జూచితి వాస్తరం
గ పటుమూర్తి వియత్తలంబున గ్రమ్ము నుర్వ్యలనవ్వ్యలన్
గపియు నన్బడి వచ్చుచుండఁగఁ గాలికొద్దిగ దూసితిన్
గపిశకాంతులఁ దూర్పుకొండను గాంచితిన్ రవి పుట్టుచో. 312

హరనర్తనము.

ప్రొద్దుపొడ్వని కాంతిగుంపులు ధాత్రి శ్రీపురుహూతుఁడా!
తద్ద తోఁచిన యంత నాతఁడు నా వెంటన్ దరుణార్కుఁడై
యుద్దిగా నిరువైపులం దానరన్ బ్రాణం బురి గోలగా
సుద్దులేకయ పాఱితిన్ సుడిగొట్టున్ భాసురవేగినై. 313

మద్రకము.

దక్షిణదిక్కు పోయితిని చంపనాగభుజంగ విషానల ఝురీ
కుక్షి గిరీంద్ర మెక్కితిని దిక్కుడుంగవితాన నిరూషిత మతిన్
దీక్ష నగస్త్యవాసము హసంతి దివ్యతపశ్ఛటఁ గాంచితి విరూ
పాక్షుని వాలి నందుఁ గని దీర్యదాశ భయానఁ బలాయితుఁడనై. 314

స్రగ్ధర.

మేనెల్లన్ ముండ్లుగాఁగన్ మిళితభయమతిన్ మేరుసావర్ణి దాకన్
నే నొచుం బశ్చిమాశా నిఖిలగిరి దరీ సీవ్రవిన్యస్తపాదుం
డై నేలన్ నింగిఁగాకన్ హతుఁడయితిరుగన్ హాస్య రేఖానిరూఢిన్
గానంగానైన వాలింగని భయపడినా కాళ్ళు వేత్రిప్పికొంచున్. 315

కరిబృంహితము.

ఉత్తర దిశకుఁబోయితి హిమవదుర్వీధరమున వాలియై
కత్తళ మనుచుఁ బోయి పరుగునఁ గ్రౌంచగిరిపయి వాలియై
జొత్తిల నడుగుదోయి తుదికొన సోమగిరిపయి వాలియై
తత్తరపడుచు వేరుదెస మది తట్టక ముడుఁగుచుండఁగా. 316

క. ఆ బుద్ధిమదగ్రణికిని ధీ బంధురునకును నిన్ని తిరిగినమీఁదం
గాఁబోలుఁ దోచె రిపుమృగయాబద్ధుఁడు తోచనిచ్చునా వాలి వెసన్. 317

ఉ.తూలు మతంగ శాపపవితో నథితో వినికృత్తపక్షుఁడై
వ్రాలఁడు ఋష్యమూకమున వాలి మఱప్పటిదాఁక నిద్రయున్
జాలదు త్వత్పరాక్రమ వశంవదమై కపిధాత్రి పొల్చెడున్
వేళకుమాత్రమే కునుకుపెట్టితి ముట్టితిఁ ద్వత్పదాబ్జముల్. 318

క.అప్పుడు చూచితి నాల్గు కకుప్పులు తత్తత్పయోధి ఘోషలు పొదలుం
దిప్పలు నెల్లలు గుంటలు నప్పటికిప్పటికి నాకు ననుకూలముగా. 319

క.ఒకచెడ్డ యొక్కమంచికిఁ బ్రకటితముగ జరుగు నన్న పలుకది నిజమై
యకటకట వాలి చేసిన నికార మదియున్ ఫలించె నే డుపకృతియై. 320

క.తెలిసిన లోఁతుల నీఁదుట చులకన కపిసేన తిరిగిచూతురు నెలలో
పల నిది యిది యని తెలియక తలమే బ్రహ్మకును ధాత్రిఁ దట్టాడంగన్. 321

ఉ.ఇన్ని పయోధులున్ గిరులు నిన్ని నదీనదముల్ చరింపఁగా
నెన్నఁడు నేర్వ డెవ్వఁడు మఱెవ్వడు ప్రాగ్గిరిపశ్చిమాద్రులన్
గ్రొన్నన యెఱ్ఱగన్నెరుల కుప్పలు కోసిన తోఁటలోపలం
గన్నుల చారితార్థ్యకృతిగాఁ గనఁజాలెడువాఁడు ధాత్రిలో. 322

వ.అంత నింటికిఁ బోవు సుగ్రీవుండు శ్రీరామచంద్రు ప్రశంస నిట్లని వితర్కించె.

ఉ.మెచ్చెను మెచ్చలేదెపుడు మెచ్చుట యాయన చూడలేద యీ
మెచ్చినమెప్పు వస్తుగుణ మిశ్రిత మశ్రమమైన బుద్ధియై
యచ్చెరువంచుఁ గన్పడద యక్కట పండిన బుద్ధిశాలికిన్
దచ్చువుకంబు దిక్కులకుఁ దారిన యీ వెఱఁగెల్ల నల్పమై. 324

మ.పదునేసీకలు కల్గు ఱెక్కకుదియింపన్ జంటఱెక్కన్ మఱిం
బదియౌ నీకలు ముద్దు చాశ్వయుజమ న్మాసాఖ్యమౌ షక్షి నే
ల దిగంబోయెడు నంత మేఘ మన నేలం దూఁకి యేతేరఁ దూ
ర్పు దెసం జన్న కపుల్ ధరారజము మున్ ముంగాముఱంబై చనన్. 325

వ.ప్రథమ కక్ష్యాగత ప్రతిహార దత్తదర్శనుండైన సుగ్రీవునితోఁ గలిసి ప్రస్రవణాద్రికిం
బోయి శ్రీరామచంద్ర సన్నిధానంబున వినతుం డిట్లనియె. 326

మధ్యాక్కఱలు.

అమ్మ యిట్లుండు నిట్లుండు నంచు నా యాత్మలోఁగలద
యమ్మకన్పడెనేని యెఱుఁగ నంతటి యల్పుండఁగాన
యమ్మఁ దూరుపు దెసయందు నసుర కొంచరుగఁడు లేద
యిమ్మగాఁ దూర్పుదెసను మఱెందు నేనే ప్రమాణమ్మ. 327

శతసహస్రంబు నాదు కపిసేన యక్షిశతసహస్ర
వితతిఁబుగాఁ జూచె గిరుల వివరముల్ వివరంబుగాను
నతవారు లగు నదుల్ సర్వనగరముల్ నగరులు శబర
తతుల గూడెమ్ములును నరుదారఁ గాంతారదేశములు. 328

ఈ దేశములు దాఁటి యడవులేగి వార్ధీంద్రులఁ జూచి
యా దేశవర్తుల మౌచు నాశాసమన్వీక్షణముగ
నే దివ్వెసుడి చూడకుండ నేతేర మేవెల్గు సీత
యో దొసంగో నంచు సేనయును నాకు నురవడించినది. 329

వైకుంఠసదనంబు మొదలి వాకిటవఱలు దీవముల
పేకంబముల చాలుపోలె వెలుఁగు దర్వీకరరాజు
నాకాశ మంటిన మౌళు లందు రత్నాంశుసంతతులు
నాకల్పముగ నున్న ప్రాగ్దిశాబ్జాప్తు నర్చి చూచితిమి. 330

క. అని చెప్పినంత సుగ్రీవునకును బ్రాగ్దిక్కునందు భూమీసుత లే
దనిపించె నెంత వినతుఁడు వినతుండై కన్నుకొనలు విప్పృతంబులుగా. 331

ఉ. ఇక్కఁటినంపుఁ గార్యకృతి యెవ్వఁడు నేరఁడు చేయఁగా నతం
డొక్కఁడు దక్క బాహుయుగళోగ్రపరాక్రమ వహ్నిమాలికా
ధిక్కృతదిగ్విజయ త్సకలదేశుఁ డధీశుఁడు సర్వకార్యపున్
ఫక్కికలందు నంచుఁ బెడఁబాసెను రామపదాబ్జనమ్రుఁడై. 332.

మ. పరితోవృక్షకపత్రధూనన నభస్వద్వేగమై వచ్చె ని
ర్భరమై యా మఱునాఁడు పశ్చిమదిశా వ్యాకోచమై చన్న వా
నరయూథంబు తదుగ్రవేగకృతమంథానాకృతిన్ ధూళి యు
ర్వర నల్పాతపమార్గముల్ చిలుకఁగా స్వల్పీకృతాభ్రంబుగన్. 333

వ. శ్రీరామచంద్ర పదాంభోజ ధూళిమిళిత మస్తకమౌళియై సుషేణుం డిట్లనియె.

అంతరాక్కఱలు.

నేను జూచిన మేర నీరజాతనేత్రకానగారాదు రామ! కల్హారనేత్ర!
నేను చూడని చోటు నిజముగాఁ బశ్చిమాన నంగుళమైన మహియును లేదు.

ఏగి ప్రాగ్జ్యోతిషమున నిన్నగోడలందుపీఁగు కన్నులుగాఁగ వెదకితి నేఁ
లోగు నసురులకనులలో దుమ్ముకొట్టి సాగిచూడని నదియు శైలమొండు లేదు.

ఉర్వినాసేన నేను నుప్పళించినాము పర్వి పశ్చిమదిక్కు ప్రథితగుణాంక!
గర్వమింతయుఁగాదు కడుమముమించి ధూర్వహుఁడు లేఁడు సీత దూపిల్లి చూడ.

స్వర్ణమూర్తియౌ మేరుసావర్ణి మౌళి వర్ణధర్మముల్ రూపవంతముల్ చలింప
వర్ణవారుణకాంతు లమరఁ దత్కాంతి గీర్ణియగుట కని తిరిగితిమి యుర్వెపు.

క. అని చెప్పినంత సుగ్రీవునకును బశ్చిమపుదెసను భూమీసుత లే
దని పెంచె నట సుషేణుఁడు ఘనసేనుఁడు విప్పృతవదనగహ్వరుఁ డగుచున్.

ఉ. ఇక్కఁటినంపుఁ గార్యకృతి యెవ్వడు నేరఁడు చేయగా నతం
డొక్కఁడు దక్క బాహుయుగళోగ్రపరాక్రమ వహ్నిమాలికా

ధిక్కృత దిగ్వ్ియద్వలయదేశుఁ డధీశుఁడు సర్వకార్యపున్
ఫక్కికలందు నంచు నెడఁబాసి చనెన్ వినయాక్షివీథియై. 340

మ. ధ్రువతేజుండు సపక్షధావదచలేంద్రుండై యుదీచీపరీ
ష్టివిధిం బంచిన యోధుఁ డంతఁ జనుదెంచెన్ వ్రాలు నున్నంజలం
దవనీభాగము డిగ్గి వానరపురీహర్మ్యాభిముఖ్యంబు చెం
దొవతోటల్ బలె వచ్చిరిం గపిమహేంద్రుల్ సూర్యసూతిం గనన్. 341

వ. అంతఁ బ్రస్రవణ నివాసగుహాముఖంబున నిలుచున్న శ్రీరామచంద్రుని కాభి
ముఖ్యంబు దీపించి దివ్వెటీలవెలుతురున శతవలి నిలు చుండి సుగ్రీవునిలో
నిట్లనియె. 342

మహోక్కఅలు.

నేను చన్నట్టి దిక్కునఁ దా నవనీజాత లేకున్కి సిగ్గుపడెదఁ
బూని మర్యాద పాటించెనేకాని భూసుత యున్నట్టి దిక్కునకుఁ
దాను పంపింపలేదు నా రాజు నన్ దగ నుత్తరాశాసముదితవీధి
కానలున్ గిరుల్ నదులును పల్లెలు కాంచినా మేను నా సేనయును. 343

అల్ల నీహారపర్వతోపత్యక లాపైని కైలాస శృంగములుఁ
దెల్లపైన మొగాలు వేసినవి ధాత్రీసుత మేము నెఱుంగ మని
యల్లనెదురుపడి మహేశునడుగుదమనుకొంటి స్వామికిఁదెలియదంచు
నెల్ల ప్రమథులు చెప్పిరి భూజాత హిమగిరి చాయల లేదు మఱి. 344

పోయి చూచితి మెల్లనుత్తరకురుభూములు భోగాయతనములందు
మాయురే మహిజాత రక్కసికొన్నమాటయే యెఱుఁగరు శ్రీనిధులు
పోయి శిశిరాంబువేశంతసీమలు పున్నాగముఖ్యభూజముల పూలు
దోయిలించిన తేనెలు భూసుత దొరకునో యంచు గాలించితిమి. 345

సోమగిరి చూచితిమి బ్రహ్మకొలువున్నచోట నారసితిమి పదియునొండు
గా మెలఁగు రుద్రాకృతి శోధించి కాంచలేము ధరిత్రికన్యకను
మేము చెప్పనువలె నింక రక్కసి మేదినీకన్య దొంగిలె నటంచు
నా మహాత్ముల కేల దుఃఖము కల్గుటని చెప్పకుండనే వచ్చితిమి. 346

క. మతి సుగ్రీవున కప్పుడు దితిసుతుఁ డతఁ డుత్తరంపుదిశ సతి నిడఁడం
చతివిశదమయ్యె శతవలి శతవలితాననుఁడు నవరసప్లుతిగాఁగన్. 347

ఉ. ఇక్కతిసంపుఁగార్య మిది యెవ్వఁడు నేరఁడు చేయఁగా నతం
డొక్కఁడు దక్క బాహుయుగళోగ్ర పరాక్రమవహ్నిమాలికా
ధిక్కృతదిగ్వయత్సకలదేశుఁ డధీశుఁడు సర్వకార్యపున్
ఫక్కికలందు వాఁడొకఁడు వానరలోక విధాతృమూర్తియై. 348

క. అనినంత నాంజనేయుఁడు జనకజఁ గని వచ్చినట్లె సంతోషం బ
య్యెను నాల్గు దెసలు దక్షిణమున ముడివడియున్న భావమున నంకురమై. 349

ఉ.అంతట రాజయుగ్మక హృదంతరమందున మ్రోఁగె నో హనూ
మంత! నరేశకార్యప్రథమానవినిర్వహణైకదీక్ష! ధీ
మంత! పరీక్షికార్య సుకుమారపథాభిమతానుయాయి! శ్రీ
మంత! సురారిలోకవినిమారణ ఘోరభుజాదిభారతుల్.

ఖండాంతము

గీ.అల్ల ముక్తీలపతి శ్రవణాభిలాషమిద్ది వానరసేనల నెల్ల ప్రోవు
చేసికొనునట్టి ఖండంబు, శివ! శివామృదూహసంగ్రహణక్రియా దోహలాత్మ.

ఉ.ఐహికవాంఛ లెల్ల వెనుకాడెడునట్లు సదా ప్రయత్నమై
యూహకొలందిఁ జేసితిఁ బ్రభూ! భవదాకృతియైన వెల్గహో
యూహ కసాధ్యమైనదయి యున్నది నీదయ లేని భావమై
సోహమటంచు నీ నడిమి శూన్యమునందున విహ్వాలించెదన్.

సుగంధి.
నందమూర్నివాస! శోభానాద్రిసాధుభావనా
మందిరా! హిమాద్రిరాట్కుమారికాత్మసుందరా!
మందిరాయమాన శోభమాన రాజతాచలో
త్కందరా! నతార్తపాప కంధిలగ్న మందరా!

* * *

# అన్వేషణ ఖండము

క. శ్రీశోభనాద్రికృత గేహాశయ! గంగాన్నపూర్ణికాంబా సహితా!
పేశల ప్రాణమయాదిక కోశాంతర సూత్రనాళ కోమలమూర్తీ! 1

చ. సకలజగత్తు సీతఁ గనఁజాలిన దిట్టతనంబు సర్వమే
యొకనికి నున్నదంచు ననుచున్నదొ యాయన దీనమూర్తియై
యొక పెనుజెట్టునీడ నిలుచుండె ధరాత్మజఁ గానలేని దా
నికి దిగులొంది వింధ్యగిరినెత్తములం దదియేదొ చోటునన్. 2

ఉ. జాంబవదంగదుల్ మిగుల సైన్యపతుల్ పరిదీనవక్త్రులై లా
లంబనలేక కార్యపు విలంబన మోర్వనులేక యశ్వమా
సంబును బూర్తికానగుట జానకి యెచ్చటొ యోజనాల దూ
రంబున నున్కియున్ దెలియరాకయుఁ జేతుల నప్పళించుచున్. 3

ఉ. అంతకుమున్ను వారముగ నన్నములేకయు నీళ్ళు లేకయున్
వింతయెడారి గుజ్జయిన వృక్షములేకయుఁ జిన్నతుప్ప యొ
క్కింతగ మండుటెండఁబడి యేర్పగు కాళ్ళులు పెట్టు నీడయుం
బొంతనలేని యూషరపుభూమిఁ జరించుచునుండి యొక్కెడన్. 4

ఉ. జొత్తిలి కండు మౌని తన షోడశ వర్షుఁడు పుత్త్రికుండునున్
మిత్తినిబొందఁ గోపమున మేదినిఁ దా శపియించె, క్షామము
వ్రేత్తుగనయ్యె, నాక్షితినివీరులు వానరసేన దప్పియుం
గత్తెరవెట్టునాల్కలకుఁ గాళ్ళులు నీడుచుకొంచు నీగుచున్. 5

మ. అసితాంభోధరరూపుఁ డొక్కరుఁడు రౌద్రాకారుఁడై చెట్టర
క్కసి మిమ్మెల్లరఁ దిందునంచుఁ బయిదూఁకన్ వాఁడెయో రావణుం
డసురాధీశుఁ డటంచు నంగదుఁడు బిట్టొ ముష్టిఘాతంబునన్
వెస భ్రమించెను వాని నాఁకలి బలావేశంబు కల్పింపఁగన్. 6

చ. కనపడి వాఁడు రావణుఁడు కాకయపోవుటయున్ నిరాశయై
జనకజ వల్లి పత్తన రసాధరవాహిను లెన్నిచూచినన్
గనపడకున్కి ధైర్యమును కత్తళ మూడిన చిత్తరూపులై
వనచరవీరు లుత్తములు వట్టువ కన్బొమలన్ గలంగుచున్. 7

ఉ. చెట్టులఁ దుప్పలన్ వెదకి సీతను గానఁగ లేక, కొండలన్
గుట్టలనన్నిటన్ వెదకి క్షోణిజఁ గానఁగ లేక, సింధువా
రట్టములందుఁ జూచి జనకాత్మజ గానఁగ లేక, ధారుణీ
కుట్టకులయ్యు దుఃఖములకున్ బెనుదీవులుగాఁగ నెంచుచున్. 8

మ. అశనాయాపరిపీడితుల్ ఘనపిపాసాయత్తులై భావక
ర్కశులౌ వానరవీరులంగని దివాకస్స్వామిపౌత్రుండు నం

త శనైర్వాక్కుల నిట్లు చెప్పె గిరిమంతంబైన యీ ధాత్రి మీ
రుశనోబుద్ధులు చూడుడీ తిరిగి యింకొక్కండు పర్యాయమున్.

మ. ప్రియసుగ్రీవులు మీర లెల్లరు ననిర్వేదంబు చేతోపరా
జయమున్ దాక్ష్యము గల్గువారలకు భాస్వత్కార్యసిద్ధుల్ ఘటి
ల్లు యథార్థంబుగ వింధ్యధాత్రి యిది పెన్ లోకంబు దీనిన్ దృశా
మయులై యింకొకసారి చూడుఁడు మఱిన్ క్ష్మాకన్య కన్పించునో.

శా. పశ్చాత్తాపము చెందినట్లు కనిపింపన్ వచ్చు నా పైని చే
తశ్చండుండు మహోగ్రశాసనుఁడు సంతప్తారి సుగ్రీవుఁడా
యుశ్చైతన్యము కోఁతి దేహముల నిండూఁగాడఁగాఁ గోర్కియే
ఆశ్చర్యంబుగ లేచిరందు మఱి వింధ్యక్ష్మా గవేషింపగన్.

ఉ. పాళముకానిబర్వు తలపై నెపఁడెత్తికొనెన్ మనాగతం
ద్రాళువుగాఁగ నుండవలె నాతఁ డనిద్రుఁ డశోకుఁడై యనీ
ర్ష్యాళువు నోచు సర్వము యథార్థముగాఁబొనరించి లెండు కాం
తాళము మాని వింధ్య వసుధాధర మార్గణ మార్గణంబులై.

ఉ. ఆవలఁ దీక్ష్ణదండుఁ డిసుమంతయు వ్యత్యయ మొప్పనేని సు
గ్రీవుఁడు కోపనుండయిన తేఁడు, మఱిన్ రఘురామమూర్తి యా
దేవికి దూరగుం డయిన దేవుఁడు సత్కరుణాబ్ధి, మీరు చే
తోవిభులై శ్రమన్ విడిచి తూఁగుడు దేవి గవేషణార్థులై.

శా. ఈతంద్రాళుత నీరువట్టుగొని చావే మేలొ! వింధ్యాద్రి నా
నా తామిస్రగుహాగవేషణ నిలీనన్ ధాత్రికన్యన్ బుభు
క్షాతిప్రాకృతు లౌచుఁ జూచు కృతిఁలోఁ జావౌట మేలో! మఱిం
జేతోవీథిని మీరె చూడుఁడు మతిం జింతించి వాక్రుచ్చితిన్.

ఉ. అంగదుఁడిట్లు పల్కఁ దడియాఱిన నాలుకతోడ బిట్టుగా
నంగద గంధమాదనుఁ డహంతయు నేర్పడ నిట్లు పల్కె నీ
యంగదుఁ డెట్లుచెప్పె నదియంతయు తథ్యము నిష్క్రియా పయో
భంగము పొందనేల తుదిప్రాణము కల్గినదాఁక నీఁదకన్.

మ. పమదూర్జస్వలశౌర్యు లౌచును బునఃపర్యేషణావ్యగ్రు లౌ
దము, శైలోన్నత కందరా నదనదీ ద్రాఘిష్ఠకాంతార దే
శము లెల్లన్ దిరుగంగఁ బోసినగతిన్ శ్రాంతాకృతిం జచ్చి స్వ
ర్గము రా,దుజ్జ్వలకార్యమగ్ను మృతి శూరత్వంబు దీపించెడున్.

శా. అంతన్ సర్వకపుల్ పునర్విచయన వ్యగ్రాత్ములై లేచి ర
త్యంత మ్మబ్దము క్రమ్మిపాయఁ బునరుద్వాంతార్కపాషాణపున్
సంతానమ్ములువోలె వింధ్యగిరిరాజప్రస్థకూట ప్రపా

చ.సవసవలౌచు భూతతతి సల్పిన ప్రార్థనఁ జేసి కుంభసం
భవముని వింధ్యపర్వత కవాటము తీసిన నాటనుండి యీ
యువని సమస్తమున్ బఱపులై ముదివింజము సాచుకొన్న ద
ద్భువసన దక్షిణావని కుభృత్కృతీకృతపాద దేశమై. 18

గీ.సపరివారంబుగా వింధ్యశైలరాజు విడిదిచేసెను దక్షిణావీథియందుఁ
బ్రథితకూటస్థుఁ డా సాగరంబు వెదకి వెదకి తఱుఁగని కొండలై వీరులెల్ల.

చ.కడు నిది యల్పమైన గిరికందర మిచ్చట దాఁచవచ్చెనా
యుడుగను వచ్చునంచు మతి నూహ పొనర్పగరాదు, కొండలం
దడుగడుగన్ బ్రయాసపడు చల్లల నాడుచు వీగికొంచుఁ ది
మ్మడిపడు చుస్సురంచు మితిమీఱిన వెక్కసపాటు నందుచున్. 20

చ.పవడపుఁదీవ యాడిన దుపత్యక పార్శ్వగుహాముఖంబునన్
జివురుల జొంప మూఁగినది చిన్నగఁ బ్రస్రవణార్ద్రమౌ తటిన్
సవిధ నగేంద్ర శేఖరపుఁ జాయ మలంగెను బ్రొద్దుపొద్దు పూ
వవనిజ యంచుఁ బోదురు మహోకపు లల్లలనాడు గుండెలన్. 21

చ.రజతనగం బొకండు కనరాఁ గనరాని గుహాంతరంబులన్
రజత నగాభిమాని యగు రక్కసి యక్కడ దాఁచెనేమొ భూ
మిజ నని పోయి కన్గొనిరి మిట్టలఁ జట్టుపలెత్తు పక్షిరా
జ జవమునన్ జరించెద రసాధ్యులు సిద్ధులు సాధ్యులున్ బలెన్. 22

సీ.శీతాంబుధృత్తత్ప్రపాత నిర్ఝర సతీ దత్తార్ఘ్యములఁజేసి తనిసి తనిసి
యుత్తాల తచ్ఛేఖరోపాయనీభూత కాంతార ఫలమూలికములు మెసవి
యరుణాంశుమత్తన్మహో నితంబస్థలీ మృదు దేశముల విశ్రమించి మించి
పరిణద్ధ తద్గుహా ప్రతిరావముల భూమి జాతఁ గాంచమి సానుభూతి పడిసి

గీ.అచటి దేవమాతృకలైన యాళ్ళమడుల కంకులను ద్రుంచి కరతల ఘట్టనముల
నలిపి యూది భుజించి వానరులు దిగిరి తద్ధరాధరరాజ ప్రస్థములనుండి. 23

క.మఱి వెదకిరి మఱి వెదకిరి వెఱవక వానరులు సర్వవింధ్యమునందున్
మఱి వెదకఁగ మఱి వెదకఁగ వెఱవక వానరులు సర్వవింధ్యమునందున్. 24

ఉ.పండినచేను కోయనగు పద్ధతి ముమ్మలుపెట్టి యొక్కఁడొ
క్కండును యూథనాథు లిరుకంధులమధ్య ధరిత్రి తూర్పునం
దుండి ప్రతీచిదాఁక నియతోర్విగ ముక్కల నేర్పరించి బ్ర
హ్మాండము కొల్చునంత ధృతి నందిరి దక్షిణసాగరాంతమున్. 25

వ.గజ గవయ గవాక్షులు శరభగంధమాదనులు మైందద్వివిదులు జాంబవ దంగ
దులు నల తార సుషేణులు హనుమంతుండును దక్షిణాపథము పనలు పెట్టి
గాలించి చివర కంద ఋక్ష గుహా ముఖంబుఁ జేరి. 26

గీ. ఋక్షబిల మన్న పెద్ద పేరిటి సొరంగ ముగ్రదానవ రక్షితం బురులతావ
కీర్ణముఖము దంష్ట్రాసమాగిళితలోక యమవదన మట్లు వారిముం దవతరించె

గీ. క్షుత్పిపాసాపరిశ్రాంతి జొత్తు కనులc దుత్తిమేనుల నాల్కలు తోడుకొనుచు
నమ్మహాబిలమునంజొచ్చుటా! పిపాసంజచ్చుటాయన్న ప్రశ్నయై సైన్యపతులు.

శా. దైత్యాభీల నివాసమన్నప్రథ నేతద్గహ్వరాస్యంబు నా
దిత్యుల్ పోవని త్రోవ కంటకలతాధిష్ఠాన మజ్ఞాత ని
ర్గత్యుచ్చండము క్రూర వన్యమృగ రక్తప్లావితక్ష్మాక మ
స్తుత్యం బచ్చట నిల్చి వారలు సమర్థుల్ క్షుత్పిపాసాతురుల్. 2

శా. నిర్భీకుల్ త్రిదివేశశౌర్యులు సమానీతోరుబాహా జగత్
స్వర్భానుల్ బహుభూధ్ర పర్యటన విభ్రాంతుల్ మహారాక్షసా
యుర్భోక్తల్ సురలోక కార్యఘటనా యుంజానమూర్తుల్ వృథా
విర్భూతోగ్రరుషుల్ ఋషీశ్వర కృపావిష్కార కార్యజ్ఞులున్.

చ. అపహృతయైన శాబక కృతాధిక మార్గణ రుష్టమై క్షుధా
నుపమ మహాగ్ని గ్రక్కదలి నూల్కొను యత్ననిరర్థకత్వమై
విపులిత గర్జలన్ దెసలు విహ్వలితంబుగc జేయుచున్న వె
ద్దపులి విధాన నొక్కొకcడు దాత్రనిభ భ్రుకుటీ నిటాలుcడై.

ఆ. అంతc బర్వతాభుcడైన హనూమంతుడా బిలాస్యమందు నార్ద్రసస్య
మరసి మిన్నునందు నరిగెడు క్రౌంచాళి నరసి యట్టు లనియె వెఱపుతోcప.

మ. నలినీఖండ విలగ్న చంచులు బిలాంతర్దేశమందుండి హం
సలు పక్షాంచల కీర్ణ వాఃపృషదుదంచన్మూర్తు లేతెంచి మి
న్నులకై యేగెడు లోననున్నవి నవేందుస్ఫార వీచీ సర
స్సులో వాపీ నివహంబులో కుముదినీ శుద్ధాంతరమ్యాకృతుల్

చ. అనుచునె లోని కేగcగ మహాకపు లందఱు వెంటనేగి రే
గను వెలివెల్గు సన్నగిలcగా బెనుజీకటి కారుముద్దయై
కను కను పొడ్చుకొన్నc గనుcగానక యందఱు నుండిరన్న గు
ర్తునకును వార లొక్కరొకరున్ జనుచుండిరి చేతు లూనుచున్.

చ. ఎవరును నీకుc గన్పడరు నేరికి నీవును గానిపించ విం
తవు తిమిరంబు దేహికిc దనంతటు నిర్భయహేతు వయ్యెc బ్రా
ణి వెలివెలుంగు కోసమయి నిర్భర తాపమునందు లోనివె
ల్గు వెలయకుండినన్ వెలివెలుంగులకోసము నావటించుచున్.

మ. అవి యెందుండి వినిర్గమించెడునొ ఘోరాభీలశార్దూల సిం
హ విరావంబులు వీనులం బడెడు సీమాంతమ్ము కన్పింప దాం

ధ్యవిమూఢాక్షి పథంబుగాఁ గపి సమూహం బేగు దుర్దాంత శౌ
ర్యవిశేషాబ్ధులు నీటిబొట్టు కనరా కా గండుచీఁకట్లలో. 36

ఆ. రాత్రినుండి పగలు రా నెంత పరిణామ వీధి వెలయు వెలుగ్గుపిండులకును
కొద్దిలోన నంత కూడివచ్చెను గుహాంతర్దరిత్రి తుదకుఁ దారువేళ. 37

శా. నానాపుష్ప ఫలస్రజంబుల ననంత ప్రౌఢమాణిక్యభూ
షానిర్వ్యాజ మనోజ్ఞముల్ త్రిదివయోషామూర్తులౌ భూజముల్
కానంగా నయి యొక్కస్వర్గ మనఁగాఁ గన్పింపఁగా వానరుల్
సానందాత్మ లౌకళ్ళొకళ్ళను బరిష్వంగమ్ములం బట్టుచున్. 38

ఉ. ఆమడదవ్వు పోయిరి తృషార్దితు లాగతి కాలుతీసి కా
ల్వామిని బెట్టజాలక విమూఢహృషీకచయుల్ తదాస్థితిన్
భూమిజ లేదు మానవ విభుండును లేడు కపిప్రభుండు లేఁ
డేమి మనస్సొ యాడని దదేమి మనస్సు దృశాంత లగ్నమై. 39

ఉ. కానఁగనయ్యె నంతటను గాంచన వృక్షవనంబు దీప్తవై
శ్వానర కాంతిమంతమయి చంపకవంజుళనాగ వృక్షకా
నూన రసాలసాల సుమనో రమణీయ మణీయధాన్వసం
స్థానికకర్ణికార వనసంగతమై తటతాళబృందమై. 40

చ. భసలపు తెక్కనీడగమి వాతినయంతన పిందె లయ్యెడుం
గుసుమచయంబు యౌవనలఘుత్వము పొంది కిసాల వారుణీ
ప్రసృత దృశా విలోకన భరంబుగ నెంత తపించి పోవునో
మసలదు తేఁటిప్రోడ యణుమాత్రము కాలిడి లేచిపోవుచున్. 41

ఉ. ఎచ్చట చూచినన్ లతిక లింటరమై పయిరాలు పూవులం
బచ్చని రాతివేదికను బ్రధ్నమరీచి విశారదంబులై
పచ్చని వింటివాఁ డురలవైచిన వ్యర్థశరంబు లట్లుగాఁ
దచ్చనలాడు వెచ్చపువుఁదావుల తావులయందు దట్టమై. 42

చ. విహగగరుత్ప్రచాలిత కృపీట వినిర్గత మత్స్యశాబకో
పహిత నఖాగ్రసంగ్రహణ బంధురవారిచల త్తరంగ సం
వహన సరస్సులున్ దట విభాసుర మాసర వృక్షసంహతుల్
మహిత సితాంబుజాత సుకుమార తనూచ్ఛవిమత్ర్పథాకముల్. 43

ఉ. అచ్చటి తమ్మిపూలు తమయంత నవే యుదయార్కరమ్యముల్
వెచ్చని వెల్గువాని కయి విచ్చగనేల తమంతఁదాముగా
విచ్చెడు గంధవాహపదవీ మద వీచికలన్ భరించుచున్
దెచ్చిన తావిచే నవచితి ప్రతిపత్తి దిగంత రమ్యమై. 44

చ. పసిడి హొరంగులీనెడు గవాక్షము లుజ్జ్వల రత్నఖండ సా
రస నవశిల్ప చాతురి భరంబులు ద్వారము లచ్చ కుడ్యముల్

మసృణ శశాంకప్రస్తర సమాప్తములట్టివి సౌధముల్ కనుల్
మసలిన యంతమేరఁ గపిమండలి కాంచుచు నేగె నంతటన్. 45

చ. గృహములలోని కేగినను గేవల మెవ్వరికోసమో స్పృహో
విహ్వాతుల కోసమై విగత విఘ్నము గాఁగను సిద్ధపెట్టిన
ట్లు హిమిక వారిపూరములు లోలిత పానకముల్ పసిండి గిం
డ్ల హారువుగాఁగ భోజ్యము లనంతవిధంబులు పూలవీవనల్. 46

చ. కనకపుఁ బట్టెమంచములు గంధపుగిన్నెలు పావకోళ్ళు భో
జన హిత భాజనంబులును సర్వము రత్నమయంబులై చనెన్
గనఁబడె భక్ష్యభోజ్యములు క్రమ శలాటు వినిర్మితంబులై
వినత మరీచి గంధములు పిచ్ఛిలముల్ దధి కూర్చికా తతుల్. 47

గీ. అప్సరఃస్త్రీలు తాల్చెడునట్టి యుడుపు లగురు కస్తూరికా చందనాదిద్రవ్య
ములును బన్నీరు లత్తరుల్ భోగ సకల సాధనంబులు కనుల కాశ్చర్యములుగ.

చ. బయటికి నన్నిటిన్ బలెనె పర్వతమం చనిపించె నీగుహా
లయమునఁ బ్రాణ మింత మెదలన్ జగదండ మొకండు రాతి డి
ప్పయుఁ బయి నొప్పనా నెసఁగు ప్రాణము వెల్గునఁజేసి యీగుహా
లయము నసూర్యచంద్రము తళత్తళలాడు మనోవిచిత్రమై. 49

చ. అవిదితమైన గహ్వరమునందునఁ గంటికి నింత రమ్యమై
పనివలె నేదొ వచ్చిపడవచ్చును మూర్ధమునందు దాన దా
నవ సుర యక్ష దైత్య ఖగ నాగజగద్యుగప త్రపమాధనో
త్సవ భుజకేళి ముందు నిడి సాగిరి ధీశివతాతి మారుతిన్. 50

సీ. స్వతనూ వినిర్గత చ్ఛవి మత్కిరణమాలికాబద్ధయగుట గాయత్రి యేమొ
సంస్కృతేతర శిరోజ యయి ప్రోషితభర్తృ కాకార యగుట గాయత్రికాదొ
మహితశార్దూలచర్మమహోగ్రపరిధాన ధృతిఁజేసి పార్వతీదేవి యేమొ
చూడా మనోహర సురవాహినీ చంద్ర ధృతిలేమిఁ బార్వతీదేవి కాదొ
గీ. ఒక్కవేళ నే తల్లికై యుర్వి యెల్లఁ బర్యటింతుమొ యాతల్లి ప్రభు వియోగ
భావపరిదీన యోగినీపరమమూర్తి యిచట వేంచేసియుండెనో యేమొ వచ్చి. 51

చ. మణినికరాయమాన ప్రథమాన తనూచ్ఛవి నేతదూహకా
రణ మగునట్టిదై యువతిరత్న మొకానొక దేవి హేమ కిం
కిణి మృదురావ సంహనన కృత్కలనాధరసన్నివేశ స
ద్గుణ నికురుంబ కార్తికిక తోయదమూర్తిని గాంచి వానరుల్. 52

ఉ. ఆయమ యెవ్వరో తెలియనాడఁగ నాలుక యాడ కందఱున్
శ్రీయుతమూర్తియౌ హనుమచెంత నిలంబడ నా మహాత్ముఁడా
ర్యాయతబుద్ధి భూధర మహోపఘనుండును సుంత చెంతకుం
బోయి వినీత దేహుఁడు నమోఘవచస్కుఁడు పల్కె నీగతిన్. 53

క.అవ్వా! యీ మణిసౌధం బెవ్వరి దీ పూవుఁదేట లెవరివి వెలుఁగుల్
క్రువ్వెదు సితాంబుదచ్ఛవి నివ్వసుధాధరగుహాంత రేచ్ఛామూర్తీ! 54

క.మఱియు ననె హనూమంతుఁడు మఱి వింధ్యాటవీ సమస్తక్షితి ని
ర్భర మనువులు ససురుసురుగ దిరిగి తిరిగి యిట్లు తిండి త్రిప్పలు లేకన్. 55

చ.కడువడి నాలుకల్ పిడుచకట్టఁగ నీ రెచటన్ లభింపదో
యొడలునఁ బ్రాణముల్ నిలువవో యని యీ గిరిగహ్వరాస్య మే
ర్పడఁ గని రెండుసార్లుగను రాదది మృత్యువటంచుఁ గన్ను క
న్పడని మహాంధకారమున వచ్చితి మిచ్చటి కేమి చెప్పుదున్. 56

చ.ఇచటికి వచ్చి మా మనసు లేమియు నాడ విదేమి యద్భుత
ప్రచలన మింత దృశ్యము సబద్ధమొ నిక్కువమో మహామణీ
ప్రచయ వినిర్మితంబయిన భావవివర్త మిదెల్ల నేరి భో
గచరణవీధి యెవ్వరివి కాంచనహర్మ్యములుం దటాకముల్. 57

సీ.ఎవని తేజో వివర్తము లివ్వి యెల్ల నచ్చ జాంబూనదమయంబులైన తరులు
పచ్చఱాకట్టడములైన భవనములును మచ్చలేనట్టి శశిశిలా మండపములు. 58

మ.నవతామోహనముల్ ప్రకృష్ట శుచిమంతంబుల్ విపాకంబు ల
భ్యవహారంబులు కందమూలఫల సంపన్నంబు కుస్తుంబురూ
త్సవ సంధాయకవాసనా మిళితముల్ శాకాదిపాకంబు లీ
వెవరో యింతటి దేవభోగులు మనోహేలాప్రపంచాధిపుల్. 59

మ.అవి కార్తస్వరకల్పితంబులును మత్స్యాళుల్ తటాకంబులం
దవి మాణిక్యఫలంబులున్ గనకపత్రాళుల్ కుజవ్రాతమం
దవి [illegible] శ్రీ[illegible]వ్యాకృష్ట నాసాగ్రముల్
[illegible] తెలుపవే సీమాంత యోగవ్రతా. 60

[illegible] యింత దప్పియుఁ దటాకోపాత్తమున్ వారి, నీ
[illegible] ఫలములున్ బ్రాత్తాద్భుతోహన్ మఱి
[illegible] చేసెద, గుహాసంపత్తి దెవ్వారిదో
[illegible] విదళనక్రీడా పవిత్రాకృతీ! 61

[illegible] సునిశితంబుగాఁ జూచి యాతని మహాను
[illegible] కపిరూపపరమేశ్వరుం బోలెఁ గన్పించునని
[illegible] నిట్లని సమాధానంబుచెప్పె. 62

[illegible] మాయావి తా నీ హిర
[illegible] పాకాంతిమద్వాస్సుధా
[illegible] సృష్టిచేసెను మరీ మత్స్యాళి జాంబూనదో
[illegible] దళ్ళైన రత్నాంశులన్. 63

ఉ. అవయి విశ్వకర్మయు సహస్రసమల్ విధి గూర్చి సత్తప
స్థావము పొంది యబ్జభవదత్తవరుండయి దివ్యరత్న సం
దీపితమున్ మహాధనము దివ్యము సౌధచయంబు సేసె నా
నా వరమోపభోగకలనా నవనూతన భావ రమ్యమున్. 64

ఆ. హేమగర్భుసృష్టి హేమాశ. మొదటిది హేమజపము సేతు రెల్లవారు
నకట! హేమ యన్న యక్షరా లవి రెండె హత్తుకొందు రెడఁదలందు జనము.

ఆ. ఇంత మోహ మంది హేమాఖ్యమైన యప్సరసఁ దెచ్చి యింద్రుపురమునుండి
ఋక్షబిలమునందు నిట నుంచెఁ బైఁడితో హేమ మేనివెలుఁగు లెన్నుకొంచు.

ఆ. మఱి శతారపాణి మన్నించునా యది రాఁగ కలియు పైఁడిరంగు కలుగఁ
గఱకునెత్రుచార గ్రైవేయకంబుగా నంధతమసమునకు ననిచె వాని. 67

క. ఈ యాస్తి హేమపేరిటి దాయెను హేమకును నాకుఁ బ్రాణము, నన్నిం
దే యుండుమనియె నాయము నా యునికిని దీని రక్షణంబగు ననుచున్. 68

గీ. మేరుసావర్ణి నా తండ్రి మీరు చాల బడలి యున్నారు వెను క్షుత్పిపాసలఁబడి
యచ్చెరువు మిమ్ము రక్షించె నద్ది యిద్ది త్రావి తిన్నారుకా రాపదల్ ఘటిల్ల.

వ. ఇవి యెల్ల నారగింపుఁడన వారిముందు బహువిధఫలంబులు భక్ష్య భోజ్యములు
సుధానీరంబులు ప్రసన్నమయిన వారందఱు క్షుత్పి పాసాపనోదంబుసేసి సొలసి
యతివక్తవ్యతామూఢులయియున్నంత నా యోగిని మఱియుఁ బ్రసన్నురాలై. 70

గీ. మేరుసావర్ణి యన్నట్టి పేరు వినుచుఁ గపిచయం బవనత మస్తకంబు నగుచు
గౌరవంబున దేవి వాక్యములు వినుచు గౌరవంబున నొక్కరొక్కరిని గనుచు.

గీ. దేవి యిట్లనె మీశ్రమ తీరెనేని యొప్పటికిఁ గానిపింపని యీ గుహాస్య
మెట్లు కన్పించె మీకు మీ రెచటి కేగ చిట్లు చనుదెంచితిరొ చెప్పుఁడీ యనంగ. 72

మ. దుముదారుస్థముదా ర్శరాగ్రమునయందుం గ్రుచ్చియుంచెన్ ద్రిలో
కముఁ దమ్ముండును నంతవాఁడు తనతోఁ గాంతారముల్ వచ్చె, దే
వి మఱిన్ ద్వాద్విశ కానఁ జేరెఁ బత్తివెన్వెంటన్, మహారాక్షసుం
డు మఱిన్ రావణుఁడామె దొంగిలిచనెన్ నూల్కొన్న వైరంబునన్. 73

మ. రణబుద్ధిన్ బవి దాఁటినట్టి వ్యవహారంబిద్ది, సీతమ్మ కా
రణమై యింకొక దేవదానవ రణ ప్రారంభ బీజంబుగా
నణుమధ్యన్ దితిజాతుఁ డెందునిచెనో యాతల్లిఁ గన్గొను మా
ర్గణబుద్ధిన్ జరియించుచుంటిమి కడంకన్ దక్షిణావీధికన్. 74

శా. సుగ్రీవుం డని వాలిసోదరుఁడు రాజౌంగాఁగ వర్షాపయో
ముగ్రావాకృతులైన వానరచమూ ముఖ్యుల్ చతుర్దిగ్గతుల్
నిగ్రాహ్యుం డగు దైత్యుఁ డెం దునిచెనో, నేమీ దిశావీధియం

శా. ఆ సుగ్రీవుని యన్నగారి కొడుకు కీ యంభోధిగంభీరుఁడున్
దా సుగ్రీవుని రాజుచేసె రఘునాధస్వామి తా నర్యమ
స్సూను సుగ్రీవుఁడు నన్నబిడ్డ యువరాజుం జేసె వారిద్దఱున్
వే సఖ్యంపడినారు తా రుభయతఃపృథ్వీసతీభ్రష్టులై. 76

ఉ. ఇంకొక తమ్ముఁ డాయనకు నీశ్వరుఁడే యను వానికై ధరా
కింకరి వానితల్లి యపకీరితి మోసెను, రామపాదశం
ఖాంకితపాదుకల్ శిరసునందునఁ దాలిచి యేగెఁ దమ్ముఁ, డా
వంకను దండ్రిమాట నిలుపం జనుదెంచెను స్వామి కానకున్. 77

చ. ఒక నెల యిచ్చె మాకు నదియున్ గడుపైనది వానరేశ్వరుం
డిక వెదుకంగనైనయది యించుకలేదు, సమస్తవింధ్యధా
త్రికి మొలనూలు చుట్టితిమి, తెచ్చి మమున్ భగవంతుఁ డీ గుహో
స్యకమున దించె నీవ పరమార్థమయైన సమస్యలోపలన్. 78

శా. కాళ్లేతుల్ కదుపంగలేక తతశోక ప్రౌఢపాథోధి బా
ర ల్వాచంగను లేక యూరక వివర్ణంబైన యాస్యంబులన్
వే ల్సీమల్ గని వేధరాధరములన్ వీక్షించి పెన్ రాతిగూఁ
డి ల్సేరంగను నయ్యె నీయది మతీవే మత్ప్రమాణంబుగన్. 79

ఉ. అక్కడ గహ్వరాస్యమునయందునఁ దామరతూఁటిఖండముల్
ముక్కులఁ బూని హంసములు పోవఁగ లోన జనంబు కల్గునం
చిక్కడి కేగుదెంచితిమి యేగతి వచ్చితిమో యెఱుంగలే
మక్కడ నట్టెమూసికొను నక్షుల నిక్కడ విప్పినట్టులై. 80

మ. ఎవరో రాక్షసు లుందురంచు నది యింకేమౌనో యంచున్ సహ
స్రవిధాలం దలబోయ నిచ్చట నజస్రప్రాణమూర్తీ! భవ
త్సవిధక్ష్మాతలి చేరినార మిఁక నస్మత్ క్షుత్పిపాసల్ తొలం
చి వెసం బ్రాణము నిల్పబెట్టితివి నీ సేమంబు వాంఛింపఁగా. 81

క. ఉపకృతికిం బ్రాణులు ప్రత్యుపకృతి సేయంగఁ గనుట యొక పుణ్యము ప్ర
త్యుపకృతి యని వచరింపఁగఁ గృపాజలధి యానతీయవే మా కనినన్. 82

చ. హనుమ మహార్థసంగ్రహణమైన వచోవిభవంపుఁ బ్రౌఢియున్
వెనుకను దోఁచు శౌర్యరమ విస్ఫురితాద్భుతవృత్తి సేయ యో
గిని నిభృతాక్షి సంకలిత కేవలభావముగాఁగఁ బల్కె మె
ల్లనఁ గృతపుణ్యబుద్ధియు ఫలంబునఁ బొందుట వంటిదే మఱిన్. 83

ఆ. కనులఁ బసిమివన్నె కాంతులూగునో యన హనుమ సుంత మసలినట్లు మసలి
యురక యనియెనంత నొకమాటయనఁబోయి యొక్కమాట జారెనో యనంగ.

క.ఏ గడు విడెనో కపివతి యీ గడువును దాఁటిపోయె నన్నట్లే మే
మీ గహ్వరము విడి చనం గాఁ గల్గుట యెట్లొ నిజముగాఁ గన్పడదే. 85

ఉ.ఇచ్చటనుండి పోవు టది యెట్లను చింతయెకాని పోయి మే
మచ్చట నేమి చేయవలె నంతకు ముందె యెఱుంగరాదు మ
మ్మచ్చట వానరేశ్వరుఁడు నందఱఁ జంపినఁ జంపవచ్చు మీ
ర్ముచ్చ్రముగాలు మీరు చన భూమిజ కన్పడునా యటంచొగిన్. 86

క.వ్రూనిన కార్యపుగౌరవ మూనిన వాచోమహత్త్వ ముద్దిగ నాడున్
దాను గపీశానుం డాహో నిర్భర వృత్తియుంచు నామె యిటులనెన్. 87

ఉ.ఈ గుహయందుఁ జొచ్చుటకు నిబ్బడికష్టము నిర్గమించు, టా
యీ గుహఁ జొచ్చు వారెవరు నేగినజాడ కనంగరాదు, మి
మ్మీ గుహనుండి పంచెదన యెల్లరు గన్నులు మూసికొండు, నా
దౌ గురుశక్తిచేత నియమాత్తముచేత వెలార్తు మిమ్మనన్. 88

చ.కాకిదికిప్రేళ్ళ కా కనులకున్ సరిపోయెను, గన్ను లింత మూ
యకయును మూసినట్లుగనె యైనది, కన్నులు మూయుటెంత వి
ప్పా కలుగు టెంత, వానరసమూహము కన్నులు గిఱ్ఱుమంచనన్
జకిత చకచ్చకత్స్ఫురణగా రవివెల్గుల నాడె నేత్రముల్. 89

క.ఇది వింధ్యధరాధరమును నిది ప్రస్రవణాద్రిరాజ మిది సాగర మ
న్నది యంతలోనఁ గనిపింపదు చూచుచునే స్వయంప్రభాదేవి మఱిన్. 90

క.ఆ లిప్తలోన గర్జా ఖీలంబుగ నెపుడు మున్ను విననిది రావం
బాలింగిత రోదోంతర హేలాధారావిచిత్ర మేదో వినుచున్. 91

సీ.చెట్లసందునను వీక్షించినయంత నీలాకాశ మనఁగ బాహాటమైన
ధృతిమై నిదానించి తిలకించినను ననంతాంభోదమనఁగఁ బర్యాప్తమైన
నిబిడ విహ్వలిత డిండీరమై యొద్దునన్ బర్వు లెత్తెడు మహోశ్వం బనంగఁ
బఱపులై యొఱగుచుఁ బ్రవహించుఁ గెరటాల నూఁగాడు భూమీధరోర్వియనఁగ
గీ.నది యదే సముద్రంబన నఖిలకపులు మస్తకంబుల విన్యస్తహస్తులగుచు
నింతగా గొంతుకూర్చుండి యెగువ తెప్ప లలవరింపక చూచి రభ్యర్థు లగుచు.

క.బ్రదకునఁ బరమార్థం బన నదేయదే చూడఁదొడఁగి రంభోధిని నా
ల్గుదెసలు లేని యఖండాస్పదము స్ఫురింపించు భైరవ వ్యవహితమున్. 93

ఆ.పరమయోగులైనవారలే యాత్మదర్శనము చేసి దృష్టి జగతిఁ ద్రిప్ప
నచట నిచట రెండు నాభాస మైనచో దృష్టి తిరిగెననుట దెప్పరంబె. 94

చ.మరలిన దృష్టిఁ దత్కపిసమాజము వింధ్యగిరీంద్రపాద వి
స్ఫురత విశాలకాననపు సొంపుల పచ్చని వన్నెఁ గాంచుచున్

మెరమెరలాడఁ గమ్మఁగవ మించిన హోయనవేళ సంస్మృతిన్
విరవిరలాడె గుండియలు విచ్చిన గండము చొచ్చు గండమై. 95

చ.వనరమ స్నానమాడినది వాసకసజ్జికవోలె గ్రొత్త చీ
రను మెయిఁదాల్చుకొన్న దవురా! యొక మాధవమూర్తి సిగ్గులే
కను దనుఁ బొందవచ్చు ననఁగా వినిగాహిత సర్వవింధ్యకా
నన గిరికందరాళుల మనన్ జనకాత్మజఁ గానమైతిమే. 96

చ.కపిపరమేశ కోపవినిఘట్టిత దంతపటాత్కృతిన్ సమీ
పపుఁ దరుశాఖలన్ జలుక భైరవ నాదముచేసెడిన్ ధరా
ధ్రపు గుహలన్ భజించి ఖగరాజుల నీడములం జరించి స
ర్వపతి శిఖల్ భ్రమించి కనరాదు ధరాత్మజ మా మనోరుజన్. 97

మ.చివురుంగేలుల హేలగా వనలతాసీమంతినుల్ మందవా
యువు రమ్మంచును సైగ చేయు రఘురాడ్యోషా నిసీషా మృషా
వ్యవసాయంబున వింధ్యభూధర నిరంతారణ్యమౌ దక్షిణా
భువియుం బాతరలాడి కానమ సుఖాంభోరాశి వీచీధుతిన్. 98

ఉ.కొమ్మన నెందునేన్ దుసలఁ గోమల వత్రములుండవచ్చు నీ
కొమ్మ మొదల్ మొదల్ తొడిగికొన్నది పావడవోలికం గిసా
లమ్మలు నాట్యకత్తెవలె లాస్యముసేయుగ వానరేంద్రు కో
పమ్మను మృత్యుతాండవము భావి విపత్తును జెప్పసంచనన్. 99

చ.జలజహితుండు వత్సరప్రచారము చేయుచునుండుఁ గాని యా
నెల సగ మట్లునిట్లు గమనించి వచించు నెలన్ నెలైనదం
చులుకుచునుండ నెన్ని నెలలో పరిభుక్తములైనవంచు నీ
నెల తొలికట్టు క్రొందవ్వుడు నిద్సాతి మారి వచింపజొచ్చెడున్. 100

ఉ.ఈ మధుమాసమింత వెలయించిన నెత్తురుముద్దలై కిసా
లామిషఖండముల్ తరులతాగ్రములందున జొంపముల్ బలెన్
దీనములయ్యె దక్షిణపతిప్రథితోగ్రనిషాద దత్తముల్
రాముని జూచి మమ్ముఁ గపిరాజు క్షమింపఁడు రిక్తబుద్ధులన్. 101

వ.గుండెజారిపోయి మహానుభావులయిన యావానరవీరులు గిరిసాను దేశంబునఁ జతికిలంబడియున్న సింహవృషస్కంధుండు తద్వానర సేనాప్రాజిత బుద్ధిమదగ్రేసరుండయిన యంగదుండు వారినిట్లనియె. 102

సీ.ఎంత సేయవలయు నంతయుఁజేసితి మింతమిగిలి సేఁత యెవఁడు సేయుఁ
నాలశిఖరమందుఁ గపిరాజు కూర్చుండెఁ జివురుకనుల మనలఁ జెక్కికొంచు. 103

క.మనమొదలు దాఁచమైతిమి తిని త్రావుచుఁ బ్రాలుమాలితిమొ క్షితిజాతన్
గనరామి యొకఁడు మన తెలియనిదాఁకను సన్నిధత్తమై యొప్పారెన్. 104

క.మీ రొక్కరొకరు చతురంభోరాసులు పుక్కిలించు మొనగాండ్రు దిశా
ధారుణి కొనగోటికిరా దేరది దోసమ్ము చెప్పుడీ మనయందున్. 105

మ.మనయం దించుక లేదు దోసము మరిన్ క్ష్మాజాత కన్పించకుం
డిన దోసంబిది దైవకారణముగా నెక్కొన్న దీ మిమ్ము న
న్నను బ్రాణాత్యయకాలవుం బ్రణిధికిన్ నూల్కొన్న వైరమ్ము నీ
మనయం దేటికిం గల్గెనో విధికి సంసారాంధ్యనిర్మాతకున్. 106

చ.కపిశవ లంబమాన తరుకాండము ప్రస్రవణంబు చేతునం
చపుడె వచించె నింతయును నా సమయంబున నూహచేసి, గుం
డె పగిలె నాకు నెంతగ ఘటించునొ వానరరాజు సూర్యసూ
తి, పరమదైవ మిట్లనుమతించెన యంత ఘటింపంజేయగన్. 107

ఉ.తాం జనుదెంచియున్ వెదకి ధాత్రిజ కన్పడునే చెదారముల్
గాం జదలున్ లతాతరు లెగాదిగ త్రవ్వి ధరాధరావనిం
జాజర లేక దోంగితిమి క్ష్మాసుత తోచని భాగధేయమై
రా జతం డేను భృత్యుండను భ్రాతృసమానము భృత్యభావమున్. 108

చ.మునరెడు రామచంద్రు మొగమోటమిచే యువరాజుం జేసె న
న్నసువులయందుం దండ్రి కధికాధికుండౌదున కామభావపు
ల్కసుండయి తల్లిం గైకొనియెం గావున నాకది రక్షయౌనటే
ప్రస్ఫుతజగత్తునందు స్మరభావము మిక్కిలియెల్ల దానికిన్. 109

క.అప్పుడు నను యువరాజును దప్పక సేయమియు నది యధర్మం బిపుడో
కుప్పించి నన్నుం జంపుట యొప్పెడు ధర్మంబు నీతియును మర్మంబై. 110

శా.నాతో మీకును తప్ప దీ విలయసంధ్యానృత్య మే నందు రా
నీతాత్పర్యము మీ రెఱింగికొని మీ రేగుండు కిష్కింధకున్
నాతోం బెట్టికొనంగ రా దిపుడు నాసౌ గూఢకాంతార ర
థ్యాతృష్ణాక్షుధ లార్చుకోనయిన ప్రాణాకృష్టి మీ కేటికిన్. 111

ఉ.ఆ రఘురామచంద్రుం డొక యధ్భుతశీలుండు సీతలేకయున్
మీరట కేగినన్ ద్రుత నిమీలితనేత్రుండు మాటలేనివాం
డౌ, రుమభర్తసేయు సమయ మ్మకృతమ్మగు నేను రాన యా
ఘోరము చూడలేక కనుగోసల నాడుచునున్న మృత్యువున్. 112

మ.ఇకం బాతాళము త్రవ్విచూడవలెనా యెవ్వారొ యీ యుప్పనీ
ళ్ళకు వింధ్యాచల పాదదేశమున ప్రేలంజోటు కల్పించి రిం
తకు వింధ్యాచలధాత్రియంతయు సముద్రంబౌను గాదన్న పూ
నికకైనన్ నెలతప్పె మృత్యువునకున్ నిర్వ్యాజ దుష్టాత్మకున్. 11

మ.బహుమార్గంబుల నెంతచూచి యొకండే ప్రాయోపవేశంబు సం
గ్రహకార్యంబుగ నాకుం గన్పడెడు మీరా! రాజబంధుల్ ప్రతి

గ్రహయోగ్యుల్ కపిరాజ్యధూర్వహులు పోగా నౌను కిష్కింధకా
గ్రహమో లేకయవగ్రహంబొ యదిమీకార్యంబు మీయోజనల్. 114

ఉ.జేగుఱుచుక్కలౌ కనులఁ జిందెడు బాష్పచయంబుగాఁగఁ దా
రాగురు వైనయట్టి యువరాజు వచించిన మాట లన్నియున్
మూఁగలవోలికన్ గపిసమూహము వించు యథార్థమన్న యా
గూగణనంబు చేసిరతికోవిదు లంగదబద్ధచేతసుల్ 115

గీ.తిరిగి కిష్కింధ కేగుట తెచ్చుకొనుటె నిక్కముగ మృత్యుదేవత నెత్తిపైకి
దానికంటె మఱీ సముద్రంబునందు దిగుట యుత్తమ మెంత చింతించియైన.

క.వెదకించునంచు జానకి వెదికింపఁగఁ జాలఁడయ్యె వీఁడని రాముం
డదయుండగు సుగ్రీవున కది యిది మనమీఁది కే సమస్తము వచ్చున్. 117

ఉ.ఆ పురమేగి దోషులము యందు నికృష్టపుఁ జావు చచ్చుటే
లా! పరమంబుగా నిది స్వరవ్యయసౌఖ్యము కల్గనేమొ ప్రా
యోపవిశక్రియన్ మరణమొందట మేల్యువరాజ వాక్యసం
దీపిత మార్గ మిం దనుమతించిన భృత్యత లోప ముండదున్. 118

వ.అని సర్వవానరసమూహం బంగీకరించినట్లున్నఁ దారుం డిట్లనియె. 119

మ.మఱి యిచ్చోటనె యున్నచో మృతి వరింపం జెట్టయోఁ జావ న
క్కఱమే లేదు స్వయంప్రభాగుహ యనంగా దేవ దైతేయులున్
వెఱఁగై రారట యోగినీమణి కృపావిర్భూతచేతస్కయ
క్కఱగాఁ గాయలు బండ్లొసంగదె తినంగా నెట్టులో మన్కికై. 120

క.అయనరాజై మనకు మఱీయన కాడేమి యీాయనే రాజు నిజం
బీయన పిత లేకున్కి మఱాయన రాజయ్యె లేమి యది యెట్లయ్యెన్. 121

ఉ.ఇంతకు దేవి కన్పడిన నియ్యది యేమియు లేదు, కాలసం
క్రాంతముగాఁగనై గడువు రాజ క్రుధావరిదీప్తవహ్నిలోఁ
జింతయు లేక చచ్చుటది చెట్టతనంబు నబుద్ధిమత్త, వి
క్రాంతికిఁగాక వట్టి బ్రదుకం గను టెందుకు చచ్చినట్లులె. 122

ఉ.ఈ వెడగౌ గుహాయతన మెవ్వ రెఱుంగ రెఱంగనేని సు
గ్రీవుఁడు చెప్పియుండు నుతకీర్తి నుతించి దిశోపదేశ వే
ళావిపులంబుగా నృపతి లక్ష్మణు లిద్దఱెఱుంగలేరు నా
చావును లేదుపో మనకుఁ జాలినయంత గుహానివాసమై. 123

వ.అనిన నంద ఱాలోచనాధీన మనస్కులై యంగీకృత్యభిముఖులై యొకరి మొగ మొక్కరు చూచుచుండ వ్యవహారము చెడిపోవు చున్నదని యెఱింగి హనుమంతుం డిట్లనియె. 124

క.మీరన్నది యోగులకును వీరులకును గాదు మీరు వీరు లుదార
స్ఫార భుజావంతుల రిది యోరిమి యెటు కల్గు నూరకుండుట కలదే? 125

గీ.మనకు నామెకు నేమి సంబంధముండెఁ జెలఁగి కూర్చుండఁబెట్టి పోషించుటకును
ఆమె సొమ్మా గుహాలక్ష్మి యప్సరసది యెవరి సొమ్ము మఱెవ్వరో యిత్తురేమి!

శా.నన్నున్ నిన్నును జూచి పంపదు గృహాంతర్భాగమందుండి శ్రీ
మన్నామంబది రామ యంచు వినిపింపం బంచె నందేగి మీ
రన్నంబంచును దేహి యంచడుగఁగా నాదేవి యోగ్రప్రభా
సన్నాగ్నేయ శిఖాళులన్ మిము దహించన్ వచ్చు దుష్టాత్ములన్. 127

ఉ.ఇద్ది యగమ్యమంచు మరి యెవ్వరు చెప్పిరి మీకు లక్ష్మణో
ద్య ద్దళనక్రియాచణ శరాలి కగమ్యమటన్న నేల లే
దుద్దవిడిన్ ద్రిలోకమున నూరక ఋక్షబిలంబునం దెదో
ప్రొద్దుటఁ గ్రోఁతినెత్తురుల ముద్దగఁ జేయకుఁ డార్తబుద్ధులై 128

ఉ.ఉత్తముఁ డైనవాఁడు తల యూనిన కార్యపథాన కడ్డమౌ
మిత్తిని లెక్కసేయ డొక మేదకుఁడెవ్వఁడొ పేదయౌచుఁ దా
నొత్తిగిలున్ జగత్త్రితయ మూరక బాహుల నప్పళించు మీ
రుత్తములో నిరర్థకులొ యూహపొనర్చుఁడు మీరె మీ యెదన్. 129

ఉ.తక్కిన మూఁడుదిక్కులకుఁ దారిన వానరయూథనాథులున్
మిక్కిలి యూహచేసెదరు మీవలెనే యికఁ దిర్గిరారు తా
నొక్కఁడు సూర్యసూతి ప్రభువో భటుఁడో రఘురామకార్యముం
జక్కఁగఁ జేయు నల్దెసల సైన్యము నల్దెసలందు దాఁగఁగన్. 130

ఉ.సాహసి తాను చేసికొనఁజాలక కాదు స్వకార్యమందు స
న్నాహులఁ జేయుటల్ సఖిజనంబు పరుల్ మృదురీతి పూనఁగా
ద్రోహము పుట్ట దెచ్చటను ద్రోహముపుట్టుఁ దనంతఁ జేసినన్
సాహసి కోపభావమున సాగుట చేత స్వకార్యమందునన్. 131

క.మీరందఱు ఘోరభుజా పారీణు లటంచు జెప్పఁబట్టి కపీంద్రుం
డా రాముఁడు నమ్మెను మీర్యారు లనుచుఁ దెలిసి యాడె సుగ్రీవుండున్.

వ.అనినఁ గపివీరు లెల్ల రవనతవదను లైనంత హనుమంతుం డంగదునిఁగాంచి
యిట్లనియె. 133

ఉ.విఱిచెద వేల నీవు కపివీరుల బిడ్డగ నిన్నుఁజూచి నీ
యఱకడఁ బెట్టెఁ బెద్దపనియంతయు నీ దెసఁ జిన్నతండ్రికిం
గొఱకొఱ లేదు నీ వెఱపుగుండియు వాని కెఱుంగరాద యే
త్తెఱ రఘురాముకార్యము గడించెదు వీరుఁడ వీవు కావుటన్. 134

న్నాళ్లు సీతకన్పడ దన్నాళ్లును పోనెపోను యప్పుడు చనినన్
న్నేమను మఱి భయమేమున్నది చిఱుమొయిలు లేని యుఱుములనుఱుమున్

ఉర్విజయెల్లదిక్కులను నుండునొ యేయొకదిక్కు నందునే
యుర్విజయుండు దక్కుదిశలూనిన వానరరాజి కుత్తుకల్
గర్వనణోగ్రకారియయి నీ పినతండ్రి యురుల్ బిగించు నీ
సర్వన బుద్ధి దిక్కులను బట్టదు లోకములైన బట్టదున్. 136

కాదు నీ మీఁద నతనికిఁ గసియెసంగఁ గసిమసంగఁ జూచు నకారణముగ
కారణము మత్తమని చంపుకోరు కోరుయుద్ధ మది సిద్ధమై వచ్చుచున్న వేళ

వీరుని నిన్ను నింతపనివెట్టుక ముందఱ సంహరించునా
నేరని నీతిశాలియగు నీ పినతండ్రి మఱిన్ హరింపఁగాఁ
దారయు నీదు తల్లి కపిధారుణిఁ జక్రము త్రిప్పు చుండెనొ
వీర! యదెంత చెప్పినను నంతకదా మఱి తార యాతఁడున్. 13

నేనును జాంబవంతుఁడును నీలసుహోత్రులు మేము, మమ్ము నీ
శాన పదాశయున్ విఱువఁజాలఁడు నీ పినతండ్రి యర్యమ
సూనుఁడినుండి, యింతకును సూర్యసుతుండును నేమి చేసిన
న్లైనను లేదు నీకుఁ, దదనంతర వానరధాత్రినేతకున్. 13

కలిమిన్ వాలికి బాహుయుద్ధ మొకటన్ గాఁడుద్ది బాహాబలో
గ్రుఁడు సుగ్రీవుఁడు వాలి నొక్కని భుజోగ్రున్ బూన లోకాన నె
వ్వఁడులే డాతనిముందు సూర్యజుఁడు నిల్వంజాలఁ డన్నట్టి దే
ర్పడఁగా దక్కువకాదు తక్కిన సహస్రాధ్వంబులన్ మిన్నయై. 14

తన కధికుండు శాత్రవుఁడు, తా నొకవేళఁ బ్రమత్తుఁడైన నా
తనిఁ గికురింపఁబోయి యలఁతన్ బలహీనుఁడు సర్వనాశనం
బును తనుదానఁ జేసికొను, బొమ్మరవోక యతండు తన్నుఁ దా
ను నిలువుకోఁబ్రయత్నమున నూల్కొనియుండఁదగున్ వివేకియై. 14

ఈపగిదిం గపుల్ విఱుగ రింతకు నంతకు నింటివిందులై
పాపము వారి కిండ్లకడ భార్యలు పిల్లలు వీరికోస ము
త్తాపితచిత్తులై చనినదారి యెఱుంగక పల్లటిల్లఁగా
నీ పరిచర్య చేయుచు వనిం జరియింతురు భృత్యభావులై. 1

ఆ చరియించు టెందనుక నందనుకన్ మఱియెంతదాఁక విం
ధ్యాచలకాననాఖిల గుహా పరిమార్గణ దహ్యమాన నా
రాచ పరంపరా కలన రామసహోదర చాప నిర్గతం
బూఁచిన ఝుంఝుగా ననువు లుంకువకైకొనవో ముసుందులై. 1

ఆ స్వయంప్రభ గుహా సుంతయైన రక్ష కాదు కాదయ్య సౌమిత్రి కాండచయః
ముందు హరిపవి తృణకాండమును నిజంబుకాదు, మీకద్దియేమిరక్షాబిలంబు.

శా. ఈ మీ దాఁగినచోటు నా కెఱుఁగనాయెన్ గోపనం బున్నదే
నే మోసంబును జేసి రాజును జలన్నిర్ఘోషసంఘాత ధా
త్రీమాంజిష్ఠకయాతనావఘనధూళిన్ బొందఁగా లేన, దో
ష్లేమన్ జంపినఁ జంపుఁ బోయెదను గిష్కింధాపురం బింతటన్. 145

చ. అలఘుఁడు రాజు నే నెఱిఁగినంతకు, నన్నును మించి యెవ్వఁడుం
దెలియఁడు, ధర్మకాముఁడు పితృవ్యుఁడు సాధువు ప్రీతికాముఁడున్
దెలియ దృఢవ్రతుండు శుచిదీపిత సత్యవచస్కుఁ డెన్న ని
న్నిల యువరాజుచేసి వధియించెడు బుద్ధిని బూన్పఁ డెన్నడున్. 46

శా. వాలిం జంపితి నంచు నీదెస నదిన్ వాత్సల్యభంగ మ్మటం
చాలీఢోగ్రశుచావిదీర్ణహృదయుండై యుండు, మీ తల్లి న
ట్లాలుంగాఁ గయికొంట నీ కవనియం దర్హత్వ మర్పింపగా
బాలుండై పితృభావ మీ వెఱుఁగ వహ్వా! గుండెలో నీసుచే. 147

క. అతఁడు నిరపత్యకుం డీ వతనికిఁ జిననాఁటనుండి యనుఁగప్పు చేతో
ధృతి స్వీకరించె దప్పక క్షితి నీవును నంత యింత చిన్నవుగానన్. 148

ఉ. ఏదిశయందు రక్కసి మహీసుతఁ దప్పక దాఁచియుంచునో
యాదిశ కన్చె నిన్ను, మము నందఱ నీ దుముదార్ల జేయుచున్
నీ దెస వాని ప్రశ్రయము నీవకనుంగొనుమెంతొ, నేత్రుతన్
గాదని జాంబవంతునకు గాని యెసంగెనొ యంతవానికిన్. 149

వ. అనిన మున్నే కపివీరులంధఱు తిరిగిపోవుటయు నాంజనేయునివలని భయమునను దారేయుం డవరోహించి తన యువరాజ పదంపు దండితనమున నిట్లనియె. 150

ఆ. నీవు లక్ష్మ చెప్ప నిజముగా సుగ్రీవు నందు శౌచభావ మానృశంస్య
మధికమైన యట్టి యార్జవంబును లేవు నీవుపొగడవచ్చు నీకుఁగూర్చి. 151

ఉ. ఒప్పఁగ నాడినన్ మొదటనుండియు నాతని సర్వవృత్తియున్
దప్పుడుదారి పట్టినది తాతను వీరుని లోననుంచి పైఁ
గప్పెను పెద్దఱాత గిరిగహ్వరవక్త్రము దాని కేదియో
చెప్పెదరాయె మీరు గుణశేఖరుఁడంచును విశ్వసించుటన్. 152

మ. తన భార్యన్ రుమఁ దండ్రి గైకొన నదిన్ దప్పయ్యెఁ, దానిప్డు త
ల్లిని గైకొంటయుఁ దప్పుకాదు, రణకేళీచండసాహోయ్యుఁ డా
తని ధర్మాభిరతిం బరాక్రమమునుం ద్వాదృగ్విపశ్చిన్మణుల్
వినుతింపన్ వినుచున్న లోకమునఁ గన్పించున్ నిజం బన్నటుల్. 153

క. తన కుపకారంబును జేసిన రాముని మఱచిపోయి స్త్రీలోలుం డౌ
చును నడుమంతరపున్ సిరిపెనుచు గుణములింతకంటెంబెనుచునెయచటన్.

ఉ. ఆ ప్రళయాంతకాకృతి మహోత్కుఁడు లక్ష్మణుఁ డుగ్రమూర్తియై
దీప్రశరాసకోటికుసృతిం జనఁ గాళ్ళ వణంకు పుట్టె యీ
క్షిప్రత పుట్టె సర్వకపిసేనఁ జతుర్దిశలందుఁ బంపఁగా
గప్రపుఁగీర్తి కల్గు ననఁగా వచియింతురు దీనినందఱున్. 155

చ. అదియును నే నెరుంగుదున యాయనకున్ మమకారమైన ను
న్నది యని నాపయిన్ మఱియు నాజనకున్ బరిమార్చు హేతువై
మది బెదరుండె, రెండును సమానము యయ్యును రాజ్యకాంక్ష పె
ద్దది, ప్రకటించి చూపియొక తప్పను పెద్దది నన్నుఁ జంపెడున్. 156

క. ఇటు కొడుకను సుగ్రీవున కటు కొడుకగు రామభద్రుఁడా కైకకుఁ, దా
నటవికిఁ బంచిన దాయమ యిట యమపురి కంపునన్నునీయన యంతే. 157

క. ఆ యదియుఁ గల్ల కిష్కిం ధాయతదేశమ్ము నేను నరుగు టనునదిన్
ప్రాయోపవేశ మూనుచు నాయసువుల నిచట విడచినా ననుకొనుడీ. 158

ఉ. ఆ కరుణాపయోనిధికి నాశ్రిత రక్షనకున్ నవాంబుద
శ్రీకమనీయదేహునకు శ్రీరఘురామున కంజలించెదన్
జేకొని నా నమస్కృతులు చెప్పుడు వేఱొక జన్మనైన న
స్తోక తదీయ సత్కరుణ చూచెదనంచుఁ బితృప్రియాచ్ఛమున్. 159

ఉ. పక్ష్మము లార్చి యచ్చెరువు భావమునం గనుచుండు నెప్పుడున్
సూక్ష్మమతి ప్రగల్భుని విశుద్ధమహోగ్రహదండశూకునిన్
లక్ష్మణదేవునిన్ వినతులన్ వచియింపుడు శౌర్యభావపుం
లక్ష్మ నపేతకామవిమలాయిత శుద్ధమనస్స్వరూపునిన్. 160

చ. వరమమనోజ్ఞ రాఘవకృపా బహుసూక్ష్మకళానివేదితో
ద్ధురతరధర్మశీలునకు దోసిలియొగ్గి నమస్కరించెదన్
గురునకు వానరేశ్వరునకుం బినతండ్రికి సూర్యసూతికిన్
గరములు నాదు దోషములు కాచి క్షమింపు మటంచుఁ జెప్పుడీ. 161

ఉ. తల్లియటన్న నెల్లపుడు తల్లియె, ద్వేషము నింద మోహ మీ
యెల్ల మనోవికారముల కేమియు స్థానముకాని మూర్తి, యా
తల్లికిఁ దారకున్ జరణతామరసంబునఁ గేలుమోడ్చెదన్
మెల్లనఁ జెప్పుడేను ప్రణమిల్లితి నంచు దయార్ద్రచిత్తులై. 162

ఉ. తా నొక పిచ్చితల్లి రుమ, తాల్చిన కైజతఫాలమందు మో
డ్పెనతి చేసినాఁడ నని యాడుఁడి, యంగదుఁ డొక్క పెద్దతే
డైనను చచ్చినా డనిన నన్నియునొక్కటె తీవ్రసౌఖ్యదుః
ఖానుభవంబు లేని జనునై చను నామెకు బాలభావకున్. 163

వ. అని దర్భాస్తరణంబు సేసి యంగదుండు ప్రాయోపవేశంబుసేసిన గవు
మేము నీ తోడివారమే యని కుశాస్తరణంబు లేర్పఱచి యుపవసించిన
నేయుం డిట్లనుకొంచు నుండె.

క. ఒక తప్పు చేసి బాలుఁడు ప్రకటితముగఁ దల్లి కోపపడినం దప్పొ
ప్పికొనక నా కన్నంబే యకటా! వలదంచు బిగిసినట్లుగ నుండెన్.

క. తననీతి చెఱిచినా నని మనమున నాగ్రహమును నభిమానము కలుగ
నను సాధించుటకును బట్టును బట్టె నిదెంతసే పిటుల్ చేసెడునో.

మ. నెఱి నీ సంగతి తల్లిఁ దెలిసెనేనిం దన్ను కోపించు, ని
ర్భరవృత్తిన్ సకలంబు తా నభినయింపంగావలెన్, నేను ని
ష్ఠురరీతిన్ వచియించినా ననుచు నీసున్ రోసమున్ గల్గి, నం
దఱముందున్ యువరాజుఁ దన్నిటుల నన్నన్ శీవికిం దక్కువై.

మ. చిననాఁటన్ బినతండ్రియుం దెటులనో చెల్లించు నాయందు న
ట్లనె గారాబము, నేను నా బిగువు చిట్లన్ సర్ది చీవాట్లు పె
ట్టినఁ దూష్ణీంకృతి పూనియుండుఁ, దనుపొంకెన్ నేనునున్ నీతి
ర్చిన బాలుండయి తల్లక్రిందులయి పేర్చెన్ సాహసాధ్వంబునన్.

మ. ఇవు డేదన్నను నేను బిఱ్ఱబిగియున్ హ్రీధూర్తుఁడై, నేను న
బ్రవుఁ గోపం బరుదెంచినట్టుల నటింపన్ బల్కరించున్, మనో
ల్పవు ధైర్యంబున జారివచ్చు, నవబాలత్వంబు నానావిధం
బుపలోధింపఁగఁరాదు సాగఁగలడే యోరంత ప్రొద్దై చనన్.

చ. ఇది యొక తిక్క, యెప్పుడు పితృవ్యుని నిట్లనుటేమొ లేద, యే
హృదయములోపలం గలవొ యీదృశభావము, లుండకుండ నుం
డదుగదు యెంత ధర్మ మయినన్ జనకుండు గతించె నన్నయ
ట్టిది, యొకవేళ యందుఁ బ్రకటీకృతకోపముగాఁ జెలంగెడున్.

క. తన తండ్రులిద్దఱును పూనిన వైర మ్మన్నినాళ్ళు నే నెఱుఁగను,
లున కెంత తెలివి వచ్చెను వినిగూఢవ్యంగ్య వాక్యవిభవము నేర్చెన్.

వ. అని హనుమంతుండు తనలో దాను చిఱునవ్వు నవ్వుకొంచుఁ గు
దక్కిన కపులంద అంగదునిచుట్టుకూర్చుండి యిట్లువేవిధంబుల నాడు

క. అసురులు గుహలో నన్నను గసిమసఁగినఁ దనకుఁ జేతకాదా శౌర్య
బెసఁగఁగ దాఁ జని చంపెడు నసురుల మఱియెవ్వఁడైన మైగుణమున్న

ఉ. ఆజ్యము పోసినట్టులయి యన్నయు మండె నటన్న మండఁడా

పూజ్యుని యన్నగారి సిరిపొందెదు నూహయె లేకయున్నచో
రాజ్యవుగద్దె యెక్కఁడు సరాసరి పోయి ధరాధినాథుఁడై. 174

ఆయన యెక్కడ మఱిమఱి యీాయన యెక్కడ భుజామహేశ్వరుఁడతఁడున్
బోయిన దైపోయెను కానీ యిల మనదే యటంచు నెంచిన దితఁడున్. 175

తనకున్ మించిన శత్రువున్ గెలువఁగా ధర్మం బధర్మం బటం
చును లేకన్ మఱి యెవ్వఁడిట్లు తలఁచున్ శూరుండె వాఁడేమి చే
సిన రాజాన్వయమంచు వానరపతుల్ సేవింత్రుగా కా మహా
త్ముని వాలిం బలియన్నబుద్ధి యిచటన్ బుట్టించుకోనయ్యెడిన్. 176

రాజన దోర్యుగాధిక పరాక్రముఁడై యధికుండు కావలెన్
గా జొకఁడొప్పి వెన్క మణి కాసెడు వెల్లులచేత రత్నమౌ
నా! జగ మాది మోహపడినన్ దుదిఁ గుప్పిగ నుండిపోవు, శ్రీ
రాజితమూర్తియైన రఘురాముఁడు వెళ్ళినఁ దాను తానెయౌ. 177

పొరిపొరిఁ దా భయంబునకు బుట్టియి యంగదుఁ డన్నయట్లుగా
బరబర ఋష్యమూకమునఁ బ్రాకెను నాటికి నేటికిన్ మఱిన్
బఱబఱ రామచాపమునఁ బ్రాఁకెను బ్రాఁకుటయందుఁ బెద్దనే
ర్పరి సరికాఁడు తానె గజరాజును నోలమునందుఁ ద్రోయుచున్. 178

ఊరక పోల్చి చెప్పటయు నొప్పని చెప్పట సౌమ్యమే, నిరా
ధారము స్వర్గమున్ నరకధామము పోల్చినఁ బోల్చుకున్ననున్
దీరని జంట మూఁడవయదిన్ గనిపింపదు వాలియున్నచో
ధారుణి యిట్టులుండెడిదె ధర్మముశౌర్యముమాసియుండునే! 179

ప్రజయొక మంద, రాజనిన రాజొక యెవ్వఁడొ బుద్ధిమంతుఁడా
రజ గళరావ మొప్పఁ గుహరస్థితి చెప్పిన వాఁడుగా జఘ
న్యజుఁడగు బుద్ధిలేని జగమందున నెవ్వఁడు నిట్లె యుండు నీ
ప్రజకును నిట్లె కావలయు రాజపదంబున జాగిలంబులై. 180

సుగుడిం దారుగఁ బట్టుచేరి యువరాజుం బిట్టు సంతోష వె
ట్టఁగ వాలిన్ మఱియున్ బ్లవంగ శిపివిష్ట ప్రోన్నతుంగాఁగ నా
డఁగఁ దా రేయుఁడు వారి పల్కులు లఘిష్ఠంబుల్ మదిందాల్పఁడే
మిగ నూహించునొ యాంజనేయుఁడని సామీరిన్ విలోకించుచున్. 181

నాయన చిన్నవాఁడ విది న్యాయము కాదని చేయి పూనినన్
రా యన నేను రానొ వెఱరాజుగ నన్నును జూచి పల్కినా
డీయన నాకు రాజ్యమది యేటికి మంత్రులుగాఁగ దల్లి లే
కీయన లేక మంత్రులుగ నిద్దఱు కల్గినవాఁడె రాజగున్. 182

ధన్యతలేమి యెంత పినతండ్రిదిదోస మటన్నఁ దండ్రి కా
తిన్యము కాదనంగఁ బ్రకటీకృతి కల్గదు, చిత్తమం దసా

మ. క్షితిధూస్స్ంవహనాతిదక్షుడును వర్షీయాంసుఁడున్ ఛిన్నప
క్షతి తానొక్క మహాఖగేశ్వరుఁడు దృక్చండుండు వచ్చెన్ గపి
ప్రతతిం గాంచె నధోగిరిస్థల గుహాభాగంబునందుండి య
ర్థితులన్ దర్భలపై శయాను లగువారిన్ వారిముజ్జ్నేత్రులన్. 192

క. మొగ మెత్తిచూచి క్షుధ యెంతగఁ దీఱెడు మంచివేళ దైవము తెచ్చెన్
దెగిన గరుత్తుల దిశలం దెగురఁగ లేనట్టి నాకు నీ వృద్ధునకున్. 193

ఉ. కొండలమంద కీ పడుచు కోతులు చచ్చినఁ జచ్చినట్లుగాఁ
దిందును మత్ప్రియాచరణ ధీకము దైవము నా వసించు ని
కందర భూమికాజిర విగాహితులం గొని తెచ్చె నెందుఁజా
వం దలపోసి యిచ్చుటకి వచ్చియు చచ్చుట యంచు నున్నదే. 194

ఉ. చిత్తములందున న్నిఖువఁజేసిన ధాన్యము చూచి యెంతగా
మెత్తురొ లోకవున్ జనులు మిమ్ముటమై దొరకొన్న తిండియై
హత్తిన సంతసం బెఱకలాడని నాకుఁ బయోధిమీఁద ను
వ్వెత్తుగఁ బాఱినట్లు వెలయించెను వించిన మోదవార్తనాన్.

మ. అకటా! చాలియుఁ జాలనట్టి కబళంబై యిన్నినాళ్లొక్క దిం
చుక పోవున్ దినమైనతిండి కనుగొంచున్ జిత్త ముత్తేజ మా
టకుఁ బూర్వక్షుధతోడి బాధ యది గాటం బెంతగా నైనదో
వికటాస్యంబగు వానరవ్రజము కన్పించున్ సుధావర్తమై. 196

క. అనిన ఖగరాజు నుడుల న్వినుచును వానరులు నిలువు నీరైరి మఱిన్
గనుఁలను ఖగరాడ్రూపము గనుచును వానరులు గగ్గుగగ్గులకాడై. 197

చ. దనుజులకున్ శిరోజముల మాదిరిఁ బక్షులకున్ గరుద్ద్వయం
బు నిశితమూర్తిమత్త్వమును బొల్పును దెచ్చును లేకయున్నఁ గ
న్గొనఁగ వికారభావమునకున్ నిధిగాఁ గననౌ నసహ్యతా
ఖనియయి వాఁడు భూధ్రనిభకాయము కల్గిన భీతి గొల్పెడున్. 198

మ. అటఁ గిష్కింధకు నేగ దుష్టమగు చావౌనంచు శైలాగ్రమం
దిటఁ బ్రాయోపవిశక్రియన్ మరణ మూహింపంగఁ జిచ్చారు పె
న్పటకారై కనవచ్చె ముందర మహాపక్షీంద్రు పెన్ త్రోటి, దు
ర్ఘటమౌ మృత్యువు వ్రాసియుండవలె, స్వర్గం బేగినన్ బ్రాప్తమౌ. 19

ఆ. భక్ష్యలుబ్ధుఁడైన పక్షిరాజును గాంచి యంగదుండు నిర్వైతైన కనుల
నంకములను బెద్ద యాయాస మొప్పంగ నిట్టు లనియె హనుమ తట్టు చూచి

మ. కనవయ్యా కను మేగుదెంచి యెదుటన్ గాలుండు కూర్చుండెఁ బే
ర్చిన పక్షీంద్ర మహోగ్రరూపధరుఁడై, సీతాపదేశంబునన్
వనికిన్ రామునిఁ బంపుటన్నయది యావాపంబుగాఁ గైక వి
త్తిన యీ వృక్షమునం గపివ్రశయ మేతెంచెన్ ఫలావాప్తిగా.

ఉ. కావలులై యురుల్ బిగియఁ గంఠములందున నంత ఘోరవుం
జావును జావలేమనుచు శైలవుఁ గొమ్మున గూరుచుండగా
గేవల మిట్లు వచ్చెను నికృష్టవుఁ జావులు వేయి చచ్చిన
క్లై విలయంవుఁ జావు వదనాంగణమందున నృత్యమాడుచున్. 202

శా. చచ్చి చావని సాము పీనుఁగుల చంచచ్చంచదాశుక్రియో
ద్యచ్చంచూగ్ర విధూననంబులు వియద్వ్యావల్గనంబుల్ మఱిం
జచ్చుం జావుగ నేమి చెప్పవలె నీ సంధాన వైచిత్రి తా
నచ్చో రాఘవ కార్యమున్ గపిచయ వ్యాపాదన ప్రౌఢమై. 203

శా. ప్రాగ్జన్మార్జిత పాపకర్మఫలమై రామోగ్రకార్యంబు తి
ర్యగ్జంతూగ్రవిచిత్రచిత్ర మృతిధారాస్యూతమై యొప్పఁ దా
దృగ్జీవుండు జటాయు వప్పగిదిసంధించెన్ గపివ్రాత మీ
దృగ్జీవాళిని నేఁటి కిప్పగిది సంధించున్ ధురాక్రాంతమై. 204

చ. మఱి రఘురామచంద్రు ముఖమండలదీధితి యాత్మలోపలన్
గుఱుతుగ నిల్పియుండుట యొకొండు నిజంబు పరిత్యజించినన్
వెఱఁగగుఁ దత్కథావిభవ వీథిక నాతని సొంటు కల్గినన్
తఱుగని దుఃఖసంతతులు తప్పవు చూడు మయోధ్యగా మొదల్. 205

ఉ. అరయ నుత్తమోత్తమ మహాపురుషాళి చరిత్రముల్ నిజం
బేరికి సౌఖ్య మంత వెలయింపవు, ధర్మపుసూక్ష్మతల్ పరి
ష్కారము చేయఁ దత్పురుషసత్తమవృత్త సహాయులందు సం
థా రతి దుఃఖభాజనత తప్పదు తచ్చరితానుబంధియై. 206

చ. విధియును దొడ్డకాఁడు కపివీరుల ప్రాణములన్న ముద్ద వీ
వధమును జంకఁబెట్టి చని పక్షికులేశ్వరు కుక్షిలోపలం
గ్రథితము చేయఁబోయెడిని రామకథాపటుసంప్రయోగ వీ
వధమున రాక్షసుల్ కపులు పక్షులు లేళ్ళు హరించపోవఁగన్:

చ. మఱియును నిందులోన గపిమండలి పక్షిచయంబు మిత్రులై
మెఱయగ, రాము చాటుగను మిత్తికి నగ్గముగాఁగ నొటయున్
మెఱవడి రామచంద్రుకథమేలిమి మాలిమి శాస్త్రవైఖరిన్

చ. చనియెడు ప్రాణమెట్టులును జన్నది శ్రీరఘురామచంద్ర ద
ర్శన సుకుమార బంధముగ సన్నిధినైనను గొంతమేలు, నా
జనకున కద్దిమాత్రము సుసంగతమైనది నాకుఁజూడు మా
తని కొడుకై రఘూద్వహా నదర్శన వేళ హరించిపోవుటల్. 209

చ. అది యొక నేను లెక్కలె, జటాయువు రావణునంత నంత కా
ల్కదపక నిల్వఁద్రొక్కిన హలాయితపక్షకృతి విక్షతిం గనెన్
బదురు జటాయు సామ్యమునఁ జచ్చెద మేము జటాయువెందు బ
ల్లిదుఁ డయిపోయె మేము నవలీలగఁ జేరెద మాఖగేశ్వరున్. 210

గీ. ఆజటాయువుచచ్చినయదియు మేలె యుదిరి సుగ్రీవుభయములేకుండఁ జచ్చె
భయముతోఁజచ్చుచున్న యీప్రాణ మేమిలోకములకేగునో మదిలోనెఱుంగ.

వ. అంత హనుమంతుండు తార యంగదుని నీతిమతి విభవునింజేసినదని శ్రీరామ చంద్రుఁన కితండు పట్టి బంటేకాఁడు రాజకార్యనిపుణుండయిన రాయబారియుఁ గూడనగునని తలంచుచుండ నా పక్షిరాజు వానరవీరులంగాంచి యిట్లనియె.

మ. అవు మీ మాటలయందు విన్పడెడునయ్యా నిక్కమా! మాజటా
యువు ప్రస్తావన, మీర లెవ్వరు? చిరాయుష్కుండు తమ్ముండు మీ
కవునా మిత్రము, రావణుం డనెద రేలా! వాఁడు కుత్సిన్ జటా
యువుఁదా నేమి పొనర్చె? వే పలుకుఁడీ యుల్లంబు పల్లంబగున్ 213

చ. విశదపరాక్రముండయిన వీరుఁడు రాముఁడు వేల్పునేస్తుమా
దశరథుబిడ్డ యాతఁడు, శతారికి నాతఁడు మా జటాయువున్
వశచరణుల్ సఖుల్ త్రిదివబంధులు, తమ్ముని నేమి చేసెఁగ
ర్కశనఖచంచువున్ సమరకాలునిఁ బక్షతియామ్యదండునిన్. 214

క. ఎన్నాళ్ళకు వినిపించిన దన్నా! నా యనుజుమాట యద్రిగుహోస్థున్
నన్నున్ గ్రిందికి దింపుడు విన్నది స్పష్టముగ నాకు వినిపింపంగన్. 215

మ. లలితాకారుఁడు శౌర్యవార్నిధి గుణశ్లాఘ్యుండు నాతమ్ముఁడు
—య్యేలలో నూఁచినయట్టు లూచితిని మున్నీ కోలుగా నాదు ఱె
క్కలపై, వాని వధించినాఁడనిన రక్షస్సున్ శిరోరక్తపి
చ్ఛిలమచ్చంచువుగాఁగ జంప నెఱకల్ చిల్లాణముల్ లేవుపో. 216

శా. ఏదీ మీఱును సుంతదగ్గఱకు రండీ! స్థావిరం బొక్కఁడే
కా దుద్వేష్టన పక్షసంపాతియు లేకన్ నేను రాలేను, తా
నా దైతేయుఁడు వానితో సమరమేలా చేసెఁ? జేసేత నే
నై దాదుంగను బెట్టి చెక్కదనుగాదా యుందు నేనున్నచో. 217

ఉ. ఐనది పాతికేండ్లయిన దప్పుడు చూచితిఁ దమ్ముని౦ జన
స్థానమునందు వాఁడనికషాతన దేశమునన్ వసించు ము

స్నీ ననుఁ జూడవచ్చుఁ దన యెల్ల పరాక్రమమున్ వచించు నే
మైనది వాఁడు నేనెఱుఁగనైతిని మీరిది చెప్పనంతకున్. 21

శా. అయ్యో! మీరిట నాత్మబంధువు లటం చజ్ఞాతమై ముక్కునన్
ద్రయ్యన్ బెన్ క్షుధతీర్పఁగా దలఁచితిన్ వార్ధక్యచిహ్నంబుగా
దయ్యంబం చనుకోకుడీ యిటకు మత్సాన్నిధ్యమేతెంచి ధీ
క్రయ్యంబాటుగఁ జెప్పు డీ యతని వార్తాయోగ సర్వస్వమున్. 219

క. అన నంగదుండు తన తలఁచిన సర్వమ్మాధిముఖ్య శివతాతి పథం
బున కొగ్గిన, నుద్గ్రాహంబునఁ బట్టిన నీతిఫలము పొందించుటకున్. 220

శా. సంతోషించుచు వృద్ధపక్షివయుఁడు మోసం బెంచునో యుంచునన్
జింతించెం, గపులెల్ల రప్పగిడనే చింతించి, రీ పక్షి రా
జింతం బోవునె మంచిదౌ యిటకి భక్షింపగ వాంఛించు న
న్నాంతర్యంబున భీతి ప్రుగ్గిరి మహాయస్త్రైకకోణంబులన్. 221

ఉ. విస్తరిలోన వడ్డ నను వీఁడొకఁడేమి పరిత్యజించువాఁ
డస్తమితంబులైన వని ప్రాణము లింకఁ దలంపవచ్చు నా
గూస్తవనీయబుద్ధి కయికోలు. నాడెనయేన్ గుప్పన్నిదే
శ్యస్తనయిత్ను మేఘపరిషత్తులమై చనవచ్చు మంటుకున్. 222

క. ఒక యాపదవచ్చి కుటుంబక కలహము లంతనంత మాపి చనెదు, నీ
వికృతిం గడచిన నంగద్యుఁ డొక మారుతి మాటవెంట నేగుట జరుగున్. 223

చ. నిజముగఁ బక్షిమోహము గణించిన నిర్ఘృణ ముష్టిపాత మా
రజపవ మొప్పఁ దూల్చెద, ధురామతి మారుతి వెన్కనుండి యం
డజపతి కంఠనాళదళనంబుగ దూఁకి మలంచు గొంతు బే
రజమది లేకయున్న రఘురాముని కార్యము చక్కనైనదే 224

వ. అని యంగదుండు గిరిశృంగమునుండి యవతరించి తనచాలనంబున జూ(
త్తయుఁ బ్రశ్రయంబు తోఁపమి లేకున్నయుఁగా సమీపించి యయ్యా నీవెవ్వరు
నతండు నాపేరు సంపాతి. జటాయువు నా తమ్ముఁడు. నాయనా మీ
రెవ్వరు వినవలతు నతనివార్త సవిస్తరంబుగా నుడివెదరే యన. 22

గీ. ఋక్షరజసుం డనంగ దోర్వీర్యశాలి నాఁడు కపిలోక పరమేశ్వరుండు కలఁడు
వాలి సుగ్రీవులిద్దఱు వాని సుతులు వాలి త్రిభువనవిదిత దోశ్శాలి రాజు.22

గీ. ఇపుడురాజయ్యెసుగ్రీవుఁ, డిద్దఱుకునుపడక చంపించెఁదమ్ముఁడు వాలినొకఁడు
రాముఁడరుదెంచె నీ కపిరాజ్యగురుతచెంది సుగ్రీవునాజ్ఞ వచ్చితిమి మేము. 22

చ. అఱువదివేల దైత్యచము వర్ధముహూర్తము మాత్రలోన నే
డ్తెఱ రఘురాముఁ డూడ్చిన వడిన్ ఖరదూషణనాయకంబు రూ
పఱ నొక వింటిమీఁద నుఱుమాడెనుబో, పినతల్లిబిడ్డ లి

చ. దొర భరతుండు కావలయుఁ దోయజనేత్రకుఁ గైక కెప్పుడో
వరము లొసంగె రాజు నని బంపెను రాముని, స్వామితోడ వ
చ్చిరి యనుజుండు లక్ష్మణుఁడు సీతయు, నామె గవేషణార్థమై
వర కపియూథనాథులను బంచె దెసల్ కపిరాజు మైత్రికిన్.

ఉ. ఆ మహనీయపక్షబలుఁ డద్భుతవృత్తుఁడు మీ జటాయువున్
బ్రేమను రామచంద్రు నొక బిడ్డవలెం గనుచుండఁ గానలో
నా ముది వెఱ్ఱి రక్కసి ధరాత్మజఁ గొంచును బోవఁ జూచి సం
గ్రామ మహోర్బటిం బ్రళయకాండము చేసెను జూడ రెవ్వరున్. 23

వ. అచట నా రాక్షసుని రథంబు చెక్కచెక్కలై వానివర్మంబు ముక్కముక్కలై వానికిరీటాంగదంబులు వానియొక్క మణికంకణాభరణహస్తంబు వాని వీపుచర్మంబు దిక్కుదిక్కులై కనంబడె. శ్రీరామచంద్రుం డమ్మహానుభావునకు బరకర్మలం జేసె. 23

క. నా తండ్రి వాలికంటెను మీ తమ్ముని జన్మ మెంత మేలో రాముం
డే తండ్రికిఁ జేఁయని యవి చేతులతోఁ జేసె ముక్తిసీమలు సేరన్. 23

గీ. రామ శరకృత్తవక్షుఁడై వ్రాలె వాలి వాలికృతధర్మపక్షుఁడై వఱలె సూర్య
సుతుఁడు సుగ్రీవుఁడున్ గపిక్షోణినేత నలినదృగ్గిశాపర్యేషణా విధాత. 23

గీ. నాల్గుదిక్కులు కపియూథనాథు లేగ మేము దక్షిణావని వచ్చినాము తాత!
మేము వెదుకని రెండు వ్రేళ్ళెడములేదు వింధ్యగిరి శిలాకాంతార వీథి నెచట

చ. నెల గడు విచ్చె నా గడువు నీకడకుం జనుదెంచు నంతలో
పల నయిపోయె నొక్క గుహపట్టితి మచ్చటఁ బట్టె మాసమున్
దెలియక సీతయున్కి నరుదెంచిన మాదెసఁ గంటి యెట్లు చా
అలుగను మండిపోవుఁ గపిరా, జిటఁ జచ్చుటమేలు దానికిన్. 23

శా. క్ష్మాకన్యం గన దక్షిణాపథ ధరన్ గాలించినా మెందు నే
లోకంబందున దాఁచెనో యసుర ముల్లోకంబు తచ్చౌర్య రే
ఖాకల్లోలిత మింకఁ జత్త మనుచుం గాయంబు ప్రాయంబుగా
నై కూర్చుంటిమి నీవు కన్పడితి కాలాకారమిత్రంబవై. 23

క. కాలికిఁ గాదేన్ దప్పదు వ్రేలి కనినయట్లు నిన్ను భీతిం గనుచున్
మాలో మేము జటాయువు కాలగతుండౌట మొదలుగాఁ జెప్పికొనన్. 23

వ. అవునవును నేను విని మిమ్ము పలుకరించితినని సంపాతి నాయనా! నీ పేరేమి యనిన నంగదుఁ డంగదుఁ డనిన సంపాతి దుఃఖ సంపాతియై యంగదా యని పిలిచి యిట్లనియె. 23

ఉ. అప్పుడు వృత్రుఁడున్ మఘవుఁ డాహవముం బొనరించువేళలం
దప్పుడు పూర్వపు మనువు నాదియుగంబునయందు, విన్ము మే

మిప్పటివారమా, చెలఁగి యిద్దఱ మొక్కర మొక్కరంచు పై
యుప్పర మంటఁగా నెగురుచుంటిమి దీర్ఘగరుత్ప్రణాదినా. 24

ఉ. ఒక్కరిమించి యొక్కర మహో త్రిదివంబును ముట్టుకొందు మం
చొక్కరిమించి యొక్కర మహో దిశలంతము లందుకొందు మం
చెక్కడలేని వేగమున నేగఁగ నూగుల తోచరాని మా
ఱెక్కలుకావు ఱెక్కలు వఱిన్ మిను దున్ను యుగాతివేలముల్.

మ. నడిమింటన్ హరిదశ్వమూర్తి హుతభుఙ్నాడీ పిచండార్చిరు
గ్రుఁడు నిప్పుల్ వడిఁగ్రుమ్మరింపఁగ మహోగ్రుండౌచుఁ, దమ్ముండు పి
న్నడుమన్ జాఱుచు సీలయూడిన విమానం బట్లునా నైన నే
గొడుగుం బట్టితి వానికిన్ జ్వలనసంక్షోభంబు వారింపఁగన్. 24

క. తగ నగ్ని మండలంబును దిగు వేళకు ఱెక్కదోయి తెకతెకమై యు
గ్గి గురుసు మలంగి పొనుపడి యెగచిన ప్రాణముల నేన యొఱుఁగను నన్నున్

శా. ఇచ్చోటం బడినాడ, నన్ వెదకికొం చెన్నాళ్ళకో తమ్ముఁడున్
వచ్చెన్ నన్నును జూచి దుఃఖపడియెన్ వాఁ, డేను వానిం గనన్
విచ్చున్ ఱెక్కలతో ముదంపడితి, నీవృత్తాంత మే నాఁటిదో
యచ్చై కన్నుల గ్రుడ్డిన ట్లిపుడు నా కానందముం గూర్చెడిన్.

క. నా కంతటి మమకారం బా కోమల హృదయుమీఁద నవు నవు నాతం
డా! కొంచుఁబోవ రక్కసి భూకన్యకఁ జూచి యడ్డుపోవక యుండున్. 24

ఉ. నా విధ మీరె చూడు డొకనాఁటికి జేనెఁడుమేర మింటికిన్
లేవఁగ లేను రక్కసి మలీమస కృత్యము నిట్లె గుండెలో
నే విలయంబు పొందవలె నిట్టుల చేసినవాని గుండెలోఁ
బ్రేవులు తీసియుందు నురరీకృత కోపముచేత రక్కసిన్. 24

క. తుడుచుకొను వెరవు కానని కడుకొను బాష్పములు నార్పగా సంపాతిన్
దుడుముకొని వానరేశ్వరు లడుగడుగున వచ్చి చుట్టి రాప్యాయితులై. 24

ఉ. క్రీతమనుల్ జటాయుగుణకీర్తన చేసిరి వానరాళి, సం
పాతికిఁ దమ్ము నందు గల మక్కువ మెచ్చిరి వానరాళి, దీ
ర్ఘాతతకాలజీవుల యుగాంతర పూరుషులన్ గపీశ్వరుల్
చేతము మెచ్చుపుట్టఁగను జెప్పిరి తేరుకొనన్ ఖగేంద్రుఁడున్. 24

శా. అన్నాదమ్ముల ప్రేమఁ గూర్చిన నుతివ్యాహార పారీణులై
యున్నన్ వానరకోటి యంగదుఁడు లో నూహించె సుగ్రీవుపై
మున్నా చేసినచేఁత వాలి మదిలోఁ బుట్టంగ నేవమ్ము, నఁ
వన్నంబైనది బుద్ధి సూర్యసుత సంబంధాభిమానంబునా. 24

ఉ. అంగదుఁ డిట్లు చెప్పెను ఖగాధిపుతోడను నీవు రక్కసిన్
ముం గొనముక్కునన్ విదిచి పుట్టిన కోపము తీర్పరామికిన్
బ్రుంగఁగనేల రావణుఁడు పొల్చిన యిక్క యెఱింగితేని మే
ముం గల మేగి తీర్చెదము మూదలికన్ వచియింపు మింతటన్. 250

మ. అన సం ... యుఁ గంఠగద్గదిక నిట్లాడెన్ వచస్స్వాహ్యమం
దున క్ష ... లధూమ కేతు పగ నార్తున్ జూడుఁ, డేనన్న నే
మని, నే వారుణమైన లోకములు కన్నారన్ విలోకించితిన్
మును త్రైవిక్రమమైన విష్ణుచరణంబుం జూచితిం గన్నులన్. 251

ఆ. నే నెఱుఁ ... నద్రిమంథానమథిత దుగ్ధ పాథోధి నిందిరతోడి విష్ణు,
దేవుకళ్యా... ...ఁగుదు, దేవతలయసురుల కృతయుగాది రణంబు చూచినాఁడ.

క. అంతటి వ ...ది వగ్గను నా కింతటి యపకృతిని జేసి యీ రక్కసి తా
నెంతగను బాగుపడునో చింతితసాహాయ్య మేన జేసెద మీకున్. 253

క. నావంటివాని కన్నుం గ్రోవులఁ గన్నీరు తెచ్చి కొఱ ప్రాణముతో
నీ వెంగలి విత్తుండునె నా వాక్యమె మొదలు రావణ క్షణనమునన్. 254

మ. అసితాంభోదముతోడ నిల్చి చనునో యైరావతీ వల్లి యం
చు సితాకాశమునందుఁ జూడఁగ భుజాక్షోదంబుగా మిన్నుర
క్కసి యీదంగను చూచితిన్ సుమలతా కల్పంబుగా నొక్కసా
రసనేత్రన్ హ్రియమాణ నొక్కతెను శారచ్ఛాయ దీపింపఁగన్. 255

చ. మెయినగ లెల్లఁ దీయుచును మేదినియందు విదల్చుచున్ శుచా
మయమగు మూర్తి రామ యనుమాట యనన్ విసువైన లేక య
వ్యయమగు మింటిత్రోవఁ గననైనది, యాయమ సీత కావలెన్
దయయుగ నుండియుండి యొకతాలిమి లక్ష్మణయన్న పిల్పుగా. 256

శా. రక్షోనాథుని యున్కి చెప్పెదఁ బునఃప్రాయోపవేశంబులున్
పక్షిప్రార్థనముల్ పొనర్పకుఁడు, మత్పక్షంబులే యున్నచో
దక్షుండై మిము తెక్కలం దిడి సముద్రంబింతయుం దాఁటి త
ద్రూక్షప్రాణకవాటమందు నిడియుందున్ లేవునా పక్షముల్. 257

చ. ఇచటికి సూటిగా నెగుర నీ జలరాశికి వందయోజనా
లచటను లంక యున్నయది యయ్యది వాని నివాసభూమి ది
గ్విచయన మన్న నొక్కఁడగు వింధ్యముతోడనె పూర్తియైన దా
ప్రచురబలాఢ్యుఁడౌ నసురపట్టణ మాతల నెంతయున్నదో. 25

క. మీ పని తేలికయైనది ప్రాపింపఁగ నొక్క రోజుపని లంక నిరా
క్షేపముగ వెదకఁగల బాహాపటువులు మీరు లంఘనానాయాసుల్. 25

ఉ. సత్తముఁడౌ కుబేరు ననుజన్ముఁడు దుష్టుఁడు వీఁడొకండు సా
క్షాత్తుగ విశ్రవస్సుతుఁడు శ్వాపదశీలుఁడు వాని కుత్తుకన్
లత్తుక మెత్తుమిత్తి పదలాంఛనమౌ రఘురామబాణ సం
పత్తులు నూపురంబులుగ సర్వము నాకెఱుగంగ వచ్చెడిన్. 260

చ. కుతుకపుఁ బాలరాతి యరుగుల్ రతనంబు పసిండి వాకిళుల్
ప్రతతము సూర్యవర్ణకము వప్రము పూర్వము విశ్వకర్మని
ర్మితమవు పట్టణంబున నరిందముఁ డాదనుజుండు నిల్చుదో
రతితర గర్వనిర్గత మహాంకృతి పట్టణమెల్ల నిండఁగా. 261

చ. తన యొక పట్టుచీర మెయి దాలిచి బోసిగ నున్న మేనితోఁ
గనులను బాష్పబిందువులు కాల్వలు కట్టఁగఁ జుట్టు రాక్షసాం
గనలు ఫెళాఫెళా వికవికా నగుచున్ బెదరింప నీటి యొ
డ్డునఁబడియున్న బేడిసల డస్సిన చూపుల సీత యుండెడిన్. 262

చ. కళవెళలాడు నీరముల కంధి వియద్వలభి ప్రకోష్ఠకా
హళ రవ చండ కంధి పరిఖావరణంబుగ దుష్ప్రవేశమై
హాలిహాలిసేయ శత్రువుల కందను బొందను రాని యూర ని
ర్దళిత పరాక్రముండయిన రావణు నూర వసించు దీనయై. 263

శా. మీ రచ్చోటికిఁ బోవఁగావలె భుజామేయప్రథా కంధి ధా
రా రూక్షోజ్జ్వల బాడబాకృతులు మీ కచ్చోటఁ గన్పించెడున్
శ్రీరామాంగన, మీరు చూచి యిట విచ్చేయుండు, క్ష్మాకన్యకన్
మీరుంజూతురు తిర్గివత్తురు కుటుంబిన్ రాముదర్శింతురున్. 264

క. ఆ సంగతి నే నెఱుఁగుదు మీ సంగతి కలిగె స్వామి మిథిలాకన్యా
శ్రీసంగతి కన సత్పురుషాసంగము కార్యనిర్వహణ దక్షంబౌ. 265

వ. అనిన వానరులు తాతా! సీత యందున్నదని యెట్లు తెలియునన సంపాతి ధాన్యజీవులైన కులింగుల పథము ప్రథమము వృక్షఫలాశులైన బలిభుక్కులది ద్వితీయము క్రౌంచ కురరములది తృతీయము శ్యేనములది చతుర్థము గృధ్రము లయది పంచమము బలవీర్యోపపన్నములు రూపయౌవనశాలులైన హంసములది షష్ఠము పరమేశ్వరవాహనంబయిన వైనతేయునిది పరమంబైన గతి. 266

క. స్వామియగు గరుడి సంతతి మే మే నిచ్చోటి నుండి మిథిలాకన్యా
శ్రీమంతము సీమంతజటా మాంజిష్ఠచ్ఛవిచ్ఛటన్ గనుగొందున్. 267

క. మా నియతాహారంబును మా నైసర్గికగుణంబు మఱిమఱి యిరునూ
ఱైనామడ పైచిలుకుగఁ గానంగల శక్తి నిచ్చుఁ, గపివరమేశుల్. 268

క. కుటిల నఖాకుంచన పటు ఘటిత కరండమున మాంసఖాదుల మది క
ర్కటవృత్తి వ్రాసెఁగానీ నిటాలమున బ్రహ్మ మేము నిస్తుషితులమే. 269

మ. నిగుడున్ సోదర పింజ పైరకలనా నిర్యాతనంబున్ బొన
ర్పఁగ వాంఛింతును మిమ్ముదైత్యుఁబరిమార్పంగల్గు రాముండు ము
న్నుగ నా విన్నది మీకుఁ జెప్పితిని మిన్నుంబట్టి యంభోధి దాఁ
టగ యత్నంబున నుండుఁడీ యిఁకఁ గృపీటశ్రేణికాగ్రంథికన్. 270

వ. నన్ను దయయుంచి సముద్రముకడకుఁ దీసికొనిపోదురా! తమ్మునకు నివాప వారి వదలనెంతు నన వానరు లంతకు మున్ను దేవాసురులు మందరపర్వతము దెచ్చినట్లు సంపాతిని మోసి స్నానాదులైన తరువాత మఱల నాయనను దెచ్చి గిరికందరామూలంబున నుంచిన మైనీరు విదలించుకొన ఱెక్కలులేక యట్లే సూర్యాతపంబుల నెండుచున్న యతనిఁ జుట్టు చేరియున్నవేళ జాంబవంతుఁ డిట్లనియె. 271

శా. ఆ మైనాకుఁడు మింట నొక్క యపు డింద్రాయస్తుఁడై చాటుగా
నేమో పోవునటంచు నెంచితిని గానీ! నీకుఁ దమ్ముండె యా
శ్రీమన్మూర్తి జటాయు వంచెఱుగ నీ ప్రేమమ్ము లోకోత్తరం
బీమైఁ దర్పణమిచ్చి ధన్యులరు మీరిర్వు ర్పరిజ్ఞాతలై. 272

ఉ. చింతయు శోక మివ్వి యశుచిత్వము లిచ్చట సాంపరాయక
ర్మాంతమునందు క్షాళితములై చనుఁ, దమ్ముని దుఃఖమూఁగి ము
న్నింతగ విన్నదంటి వది యెవ్వఁడు చూచె నెవండు చెప్పె, మా
కంతయు నీవు చెప్పఁగదవయ్య గరుత్మదుదారబంధువా! 273

ఉ. ఆ రఘురాముఁ జూడక దురాత్ములు పల్కుటకాదు చూచి యా
శ్రీరఘురామమూర్తిఁ బయిఁ జెప్పవలెన్ మృదుచండసర్వ క
ర్మారభమాణ సంక్షయ దనంతజగ ద్ధ్రియమాణజీర్ణి తే
జోరుచికోటి పాటిత నిశుం డతఁడొక్కఁడె వింటికాఁడునున్. 274

మ. ఎవడా స్వామి శరాస నిర్గత పృషత్కోచ్చా పురస్తాద్గతుం
డెవఁడా యాయువు తీరినట్టిఁ డెవడో యింతంత నీలీకృతి
వ్యవసాయుం డతఁ డిట్లుకొంచుఁ జనఁ దా నెవ్వాఁడు వీక్షించె జె
ప్పవుగా మాకును మాకృతార్థత వచింపం గల్గె నే సాధువో. 275

గీ. అనినఁ గనులు విప్పి యనియెను ఖగరాజు మఱి యెఱుంగఁగలను మా జటాయు
వంత చేసినప్పు డాతని ఱెక్కలు లేని నేను కనులు లేనివాఁడ. 276

ఉ. సర్వము చెప్పెదన్ వినుఁడు సౌర మహోగ్నుల నాగతిన్ గరు
ద్గర్వము మాలి వింధ్యగిరి కందర దేశమునందు రాలినన్
గుర్వనుయాయి నా కొడుకుకూడి సుపార్శ్వుఁడు వచ్చి మత్క్షుధా
నిర్వహణంబు సల్పు గమనించుచు వేళయుఁ బాళయున్ ననున్. 277

చ. ముసలితనంబు క్రూర మిది భోజనవేళ యతిక్రమించుచో
నసువులు నిష్క్రమించు ననునట్టుల యుండును గోపమింత వె

క్క సమయి పోవు నల్పమగుఁ గారణమైనను నిల్వలేమియున్
గసకసలాడుచుండుటయు గల్గును బోషణ చేయువారిపై. 278

ఉ. ఆస్యము వెల్వెలై యసువు లాఁగ వికం చనుకొన్న యంత యా
లస్యముగాఁగ వచ్చె ఖవిలాసి సుపార్శ్వుఁడు వానిజూచి నే
నాస్యము బిట్టుగాఁ దెఱచి యాములు ధూములు చేయు చో యవి
శ్వాస్యుడ! నేను చావవలె నంచుఁదలంచుచు నుంటి వాదిగా. 279

క. పడకుము తొందర పీడయు నడగునులె యంచు నేను నాలాపింపన్
గొడుకిట్లనె నయ్యయ్యో కడు జాగగుటకును నేడు కారణ ముండెన్. 280

మ. తొగమూతం గని నీడ సన్నిధి ఝరీతోయంబునన్ బ్రొద్దుము
న్నుగఁ బ్రాగంబర కర్షణార్ద్రమతినై నూల్కొన్న వాంఛన్ మహేం
ద్రగగిరిద్వారమునందు నిర్భర వృషత్సంతానవార్బంధతన్
తగు రాజీవ సమూహ సంగ్రహణ బద్ధస్వాంతుఁడై యేగినన్. 281

మ. గుహలో ఘూర్ణన ధూర్వహంబగుచు వాఁగుల్ చుట్టు కొల్లారు ని
గ్రహ డిండీర విమర్ద వార్లహరికాగ్రంబందు దండాభ సం
గ్రహ షక్షద్వితయంబుగా నుపరిభాగస్థేమమూర్తిన్ దనూ
రుహసంస్పృష్టజలంబుగాఁ దెఱచు నోరుంగాగ నేనున్నచో. 282

ఉ. వనచయ ధూళిధూసరిత భల్లుకరోమచయాభకాంతితో
మునుపటి వృత్రుఁడో యనిన బొద్దగు దేహముతో నొకండు న
న్ను నడిగె నిద్ది త్రోవ యగునో యని సంగతదక్షిణాదిశా
వనధిని గల్గు ద్వీపములవంకకు నేఁదలయెత్తిచూచినన్. 283

ఉ. వాడిన పూలమాలవలె వాల్చిన కన్ను నొసంటఁ దట్టుము
ట్టాడిన ముంగురుల్ కటు నిటాలముగా నొకచాన వానిదోః
పీడిత యుండెనా మనసు విద్రుతముద్గరపాళి నుండె న
న్నాడిన మాటకున్ దెలియనంతటి కోపము వచ్చె నా యెదన్. 284

చ. మివులఁ జిరాకు పుట్టును జుమీ! ఝషరాణ్మృగయా సమాధి వే
ళ విరియు మాటలన్ దెలియు లాగున దీనతఁ బల్కరింప నే
నవునని పంపితిన్ బతియు నంగన యామినివేళ వింజపుం
గవి విహరించి పోదురనిగా మఱి వారును దూరమేగఁగా. 285

ఉ. ఖేచరులందుఁ గన్పడినఁ గేవల సిద్ధులు వారి గూర్చి నే
నా చనినట్టివార లెవరంచన వారలు స్వస్తివాక్కులై
యేచి యదృష్టవంతుఁడవు నిట్టులమై విసుగూనలేదు దు
ష్టాచరణుండు వాని కదియైనను గోపము తెచ్చి యుండెడిన్. 286

ఉ. వాఁడు గరాసు దాశరథిభార్యను రాముని భార్యఁ దద్దఁ బూ
బోఁడిని బట్టి దొంగిలిచుఁ బోయెదు రామవచో నిబంధనన్

వేఁడిన రిత్తకోరికగ వేఁడుఁబు నెత్తిన యామె రక్కసుల్
గూఁడగు లంకలోపలికిఁ గొంచును బోవునటంచుఁ జెప్పఁగా. 287

ఉ. పుక్కిలియందు బొత్తులుగఁ బూన్చిన చేఁపలతోడ నీకుఁ బ్రొ
ద్దెక్కనటంచు వచ్చితిన యియ్యది కారణమంచు నాడఁగా
నక్కట! యేమిచేయవలె నయ్యా! యహోకృతపక్షుఁడన్ వృథా
ముక్కిది యుండియుండనిదె పుట్టిన కోపము తాపమై చనన్.

శా. మీర్మీరేగతి పౌరుష ప్రకటనామేయప్రభా రూక్ష దోః
కర్మం జేయఁగఁజాలుటల్ కలుగు వక్కాణింతు నా సర్వమున్
గిర్మీరీకృత దిక్పతివసన శాఖిశ్రేణీ పత్రాంచలాం
తర్మగ్నాక్షిమృదుచ్ఛవిన్ రఘుపతిన్ దాల్తున్ రిపూన్మాథనున్. 289

శా. మీమీ బాహాలు నంసముల్ నయనముల్ మీకంఠముల్ దీప్తతే
జోమర్యాదలు కన్న నా యొకఁడు రక్షోభర్త లెక్కా! యథే
చ్ఛామౌర్వీరవ దిక్కటాహకృతమూర్చామూర్తి రాముండు హి
క్కాముండుం బొనరించు రావణుని దిక్కాలాద్యతీతప్రభన్. 290

ఉ. ఇంతటి నిశ్చయార్థముగ నేటికిఁ జెప్పెదనో వినుండు నే
శాంతగరుత్ప్రచారముగ సౌరమహోగ్నుల మాడిపోయి నే
నంతట నా యొడల్ తెలియ కంగము బిమ్మిటివోయి కూలినా
నంతము నాదియుం దెలియనట్టి యొకానొక కొండకొమ్ముపై. 291

గీ. అంత స్మృతిలేనియప్పుడు నాత్మరక్షభావ మెచ్చటనో యుండుఁ బడెదు వేళఁ
దల యెగచి పట్టుకొంటిఁ గావలయు ముక్కలైన జాడలే దది తదనంతరమున.

గీ. ఆఱువవళులు నిశలును నట్టులుండి నా యొడలు నగ్నిగోళ మన్నదిగ నుండె
నామనసునందుఁదిరిగెను నాల్గు జలధులేడుకులగిరుల్ దిక్కులునెన్మిదియును.

గీ. అవి కొఱప్రాణమెప్పుడు పోవునంచుఁబక్షిజంబుకములు చూడ నక్షులకును
బరి చితంబైన వింధ్యపర్వతము తోఁచెఁ గంధరాప్రస్థ సానూత్సుకములతోడ.

గీ. అట్టిస్థితిలోనఁ దెలిసినయట్టిచోటు ధైర్యమును దెచ్చెనన్నచో ధైర్య మనెడు
దినుస దెట్టిదో నిజముగాఁ దెలియలేన వచ్చెఁ గ్రమముగ నోపిక వచ్చెనాకు.

మ. పరిగత్యంతర మేమికావలెఁ బునఃపక్ష ప్రరోహంబు శ
క్వరిగా దుప్పటిగాఁగఁ గల్గవలె భావం బిద్ది సైరించుకో
వెరవుం గానక వల్లటిల్లితిన యాశాస్యంబు నే రీతి సు
స్థిరమౌ నప్పు డొకంతటన్ స్మృతికి వచ్చెన్ మార్గశీర్షంబదిన్. 296

ఉ. నేనును మాజటాయువును నిత్యము వింధ్యగిరీంద్రదూర భూ
మీ నిభృతేంద్రియుండయిన మిత్రపదాచరితున్ నిశాకరా

ఖ్యానుతు మౌనిరాజు చరణాంబుజ దర్శన మాచరింతు మా
మౌని యొకండు నన్ను దయమన్నిన మన్నునటన్న కోర్కిమై. 297

చ. ఎనుబదివేల యేండ్లయిన దిప్పటి కామిని నేనెఱింగి వహౌ
నిని గను కోర్కి శైల ధరణింబడి నూరక డొల్లుకొంచు గ్రు
మ్మినదగు కత్తిగడ్డి వనిమీదుగ ఆళ్లలు డొక్కలందుగ్రు
చ్చినవగు సాను దేశముల జేరితి మౌని నివాస భూమికిన్ 298

ఉ. అ పొలిమేర చేరుకొనినంత సుగంధులు పిల్లగాలు లా
హో పువుండావి మొత్తముల నశ్వతరంబుల మీఁద వర్తకుల్
ప్రోవు సుగంధి వస్తువులు పూనిచి యేగెడునట్లు వచ్చెనా
తాపసి యున్నచోట స్తిమితంబులు వాయువు లెప్పుడట్లులై. 299

గీ. పూవులేని రెమ్మ ముగ్గినపండు లేనట్టి కొమ్మ లేదయాశ్రమమున
నెడదంజెమ్మకాద ఋషి నిల్చునా సీమ యతడు మూటకట్టినట్టి కరుణ. 300

మ. భగవంతుండు నిశాకరుండును జటాభారస్రవత్స్నాత వా
రిగ సర్వాంగ సమార్ద్రమూర్తి వన ధాత్రీ జంతు సంతాన మె
త్తుగ నల్వంకలం జుట్టిరా నచటికిం దోతెంచె భూతప్రజా
నుగుండై వచ్చెడు కృత్తివాసునువలెన్ దూంటాడుచుం బాపముల్. 301

మ. స్పమర వ్యాఘ్ర సరీసృపోగ్రమృగరాడ్వృక్షంబులున్ బక్షు లా
శ్రమముం జేరిన మౌనిరాజు విడి యిచ్చంబోయెనచ్చుంపుం బ్రే
మమునన్ నాదెస చూచి యప్పరమహంసస్వామి లో నేఁగి యుం
త మఱిన్ వచ్చెను స్వామి పాదముల చెంతన్ మొక్క నేనుంచగా. 302

మ. ఇది యేమీ మఱి యిట్లులైతి వవి యేవీ తొంటి నీ ఱెక్కలుం
గదలున్ మూవిచివుళ్ళువోనియవి నిక్కం బీవు నీ తమ్ముడున్
బొదిగొన్నత్తిని వచ్చి నాపదములన్ మూర్ధంబునన్ మున్ను తాం
కుదు రీ వొక్కండ వేల వచ్చితివి నాకుం జెప్పుమీ సర్వమున్. 303

క. అతని పేరు జటాయువు శాత గరుత్కుండు నీవు సంపాతివి కా
దా! తమ్ముండేమి యయ్యెను ప్రీత మహావేగ మాతరిశ్వులు మీరల్. 304

ఉ. వారముపైన నైనయది వాఁడును నీవును వచ్చి, పక్షిసం
భారము మీరు దూరమగు పర్వతకాననదేశ మేగిరో
కూరు బుభుక్ష నంచు ననుకొంటిని, వ్యాధి యెదేని కల్గెనో
యేరయినన్ శపించిరొ యిదేమి వివక్షుండవైతి బోసిగా. 305

మ. స్మయదూరుం డతఁడంత ప్రేమ యొలికింపం జూచి నానోటమా
టయు రాలేదు మఱిన్ మఱింగనుల వెంటన్ బాష్పముల్ వాఁడుగా

భయమై యిచ్చటిదాఁక వచ్చి వచియింపంజాలనో యంచు వి
స్మయ మేపారఁగ నంత దేహ మపరిశ్రాంతమ్ముగా నౌటయున్. 306

చ. ముని కనులందుఁ గన్నులను బూనిచి చెప్పితి, నేను తమ్ముఁడున్
గనుకని స్పర్ధపూని వడిగా మఱియెత్తుగ మిన్నులందుఁ బో
వనువలె, వాఁడొ నేనొ చనువాఁడధికంబుగ నంచు నిర్ణయిం
పనువలెనంచుఁ బోయితిమి మౌనివరేణ్య వియత్కటాహమున్. 307

శా. కైలాసంబున మౌనిసంతతుల మున్గాన్ బందెముంబెట్టి మా
యీ లావుం దుది నిర్ణయించుటకు సర్వేశున్ జగచ్చక్షునిన్
వాలాయంబున మధ్యవర్తియవు నేర్పాటొప్పఁగా మిన్నులన్
హేలం బట్టితి మెల్లచూపఱు త్రిధాహేళిభ్రమం బొందఁగన్. 308

అశ్వగతి.
ఇర్వుర మద్రిశిఖాగ్రము నేకపదోద్గతిగా
గర్వితపక్షబలంబునఁ గావడిమోసినటుల్
పర్విత మాకసమందున భాస్కరు తేరున రెం
డర్వము లీతల వీడ్వడి యాఱడిపోవునటుల్. 309

శ్యేని.
మిన్ను ఱెక్కలాగి మేలమాడుచున్ మున్ను దవ్వునెల్ల మోహరించుచున్
నిన్ను నేను నేను నిన్నటంచు సంపన్నమైన స్పర్ధవాక్కు లాడుచున్. 310

జలధరమాల.
ఆకాశంబందున గరుడాక్షోదంబై యే కోనల్ పోయితి మట నే దిక్కేదో
కాకుండన్ గన్నులు జతుకావర్ణంబై యేకోవల్ తోచవు మది కేదో భీతిన్. 311

చంద్రవర్త్మ.
ఉర్వియెల్ల నొకయుండవలె మహో ఖర్వమూర్తి కనగాను వెలసె దా
మూర్వి పెద్దనదు లూచకొనియె నా దూర్వకాడ లన దోచె నచటికిన్. 312

మధ్యాక్కఱలు.
ఆకాశమందుండి పడిన నద్దిలో నవనిపైగాక
యాకాశమున నిల్లె యుఱక యల్లాడు టానేమొ యనగ
నాకిట్లు భూమియు పైన నలిన భాంధవుడు సమాన
మై కానిపించెను భూమి యది యెంతో యంతగా రవియు. 313
అప్పటి భయ మింత యంత యని చెప్పనైనది కాక
యుప్పరం బూరకే మ్రింగునో యున్న యూహ కల్గినది
యప్పటిలోఁ బడి గ్రుక్కయాడక యంతమ్ము గనిన
గొప్పయే యిదియేమొ తెలిసికోరాని గుండెతో చావు. 314

వ్రక్కవచ్చు జటాయు వొకని రాకచే బ్రతికియుంటి నను
నొక్కయూహ త్యజించి యేమియును లేద యుల్లంబునందు

తెక్కలాడించుచున్నాను ఋషిమహోవృషభ! యాడించు
టక్కటా! తెలియదు నాకు, ననుకొన్న నాశ్చర్య మిపుడు.

ఇటు చూడఁగా జటాయువు నొకింత పల్కొనియు లేని
పటుగరుద్యుగ్మంబు చచ్చుపడి జాఱిపడుచుండె మింటఁ
బటు తీక్ష్ణకర భాను పటలిచే వాని తెక్కలును
జిటమట లాడుచున్నవియు శిఖిధూమ చిహ్నంబుగాఁగ. 3

క. అప్పుడు నాతెక్కలనున్ నిప్పంటుకొనంగ వలయునేకద యంచుం
జొప్పడనే లే దూహయుఁ దప్పక దక్షి చవలయుఁ దమ్మని నంచున్. 3

మ. అతఁడే వంపులు వంగుచుంబడెనొ తా నాకాశ మందుండి ప
క్షతి కా వంపులు వంచుకొంచును గరుచ్ఛాయాపరిత్రాణసం
గతిగా నాతని వెంటనే దిగితి నక్కంజాప్త తైక్ష్ణ్యంబు త
ప్పితి మంతన్ స్మృతిలేక నేఁబడితిఁ బృథ్వీభృద్దరీ భూమిపై. 3:

ఉ. తాను జటాయువుం బడెడి ధారుణి చూచుచు నంతలో జన
స్థాన మటంచుఁ దోచినది సంస్మృతిపోయెను నాకు సంతటన్
గానఁగ రాని యేమి మెలికల్ తనుపిండము కాంచియున్నదో
నే నిట వింధ్య శైలదరణిం బడినాఁడను సొమ్మసిల్లుచున్. 31

క. లేదు వియత్సామ్రాజ్యము లే దిఁకఁ దమ్మనిఁ గనంగ లేవు గరుత్తుల్
మీ దర్శనంబు నైనది యేదో పుణ్యమున సెలవు నిప్పింపగఁదే. 32

గీ. ఒక ప్రపాతంబునన్ బడి యుసురులింక వీడెదను సెల విప్పింపవే యనంగ
నీకు తెక్కలు కావలె నిజము మరల నేల మొగమాట పడియెద వింతచెప్పె

శా. నీకున్ తెక్కలొసంగఁ గల్గుదునుగానీ యీయఁగా నొల్ల నీ
వే కార్యంబు ఘటింప దైవ మది నిన్నీరితిగాఁ జేసె నీ
వా కార్యంబును నిర్వహింపవలె నీ వందే వసింపన్ వలెం
గా కిం కొక్కవిధాన నెట్టులగు నక్కార్యంబు నాలింపుమీ! 32?

శా. ఏ సూర్యుండు భవద్గరుద్ద్వయము నిట్లేర్చెన్ మహోర్చిర్వ్రతుం
డా సూర్యాన్వయ రాజసంతతి యయోధ్యాధీశు లాశాంతరా
భ్యాస స్వచ్ఛయశః ప్రబంధులును బాహోశౌర్యకులోగ్రధా
రా సంపూరిత దేవతానగర సౌర శ్రీ తటాకంబులున్. 323

ఉ. వారల నేటి భూమిపతి పంక్తిరథుండు కలంగి పుత్త్రికుల్
లేరని యశ్వమేధ విమలీకృత పాపపథుండు నల్వురన్
గూరిమి పుత్రులం ధరణిగోపనబాహుల గాంచు వారిలో
శ్రీరఘురాముఁడొక్కరుఁడు సీతయు నాతని ధర్మపత్నియై. 324

. ఒక పినతల్లిమాటపయి నుర్వి త్యజించి రఘూద్వహుండు పా
యక వనసంతతిన్ వట పయః పరిబద్ధ జటా నిటాలుఁడై
సకి యగు సీతతోడ ననుజన్ముఁడు లక్ష్మణుతోడ వచ్చు నం
తకు నుత దక్షిణామునివితాన వితాన కృశాను దీప్తిగా. 325

. నావెనుకతట్టు లంకను దీవిం గల రావణుండు దీప్తభుజుండున్
దేవానధిగమ్యుఁడు దో రావిష్కృతయామ్యదండుఁ డవనీజాతన్. 326

. ప్రళయ పినాకి వోని రఘురాముని భార్యను దొంగిలించుఁ గం
దళమున నిప్పు కట్టుకొని తాను వణిక్కు విధాన ఘోరము
ర్దళరవుఁ డేగి లంక కొస దద్దడ మందునఁ బెట్టి సీత సం
బళమును భద్రపెట్టినను బమ్మెరఁ గాలుని కాలిబంటుగా. 327

. పృథులములైన భక్ష్యములు పేణులు లడ్డులు ముందుఁబెట్టి య
వ్పృథివితనూజచేతఁ దినిపింపగఁ జచ్చిన చావగున్ మనో
వ్యధఁబడి చెట్టరక్కసికి నామె భుజింపదు చిక్కిపోదు న
వ్విధము నెఱుంగలేక వలభీకృత దృష్టి నిశాచరుండు కాన్. 328

. చిత్ర మన్నమ్ము తెచ్చి ప్రాచీనబర్హి అర్ధి పరమాన్న మమృతప్రఖ్యంబు నముచి
సూదనైకభోగ్యంబు భాసురసురాళి దుర్లభము సీతకొఱకు ముందు నిడిపోవు.

చ. తొలి కబళంబు తీసి యిది తోయజనేత్రులు రామలక్ష్మణుల్
ప్రళయ సముద్రశౌర్యులది భాగ మటంచును దెట్టు సీత, వా
రలు జనకాత్మజాత యిడు ప్రాశనవేళకుఁ జేతిలో బలా
బల లిడు తృప్తిమించిన ప్రభం గనుచుందురు కానలందునన్. 330

. గిరిసంకాశులు సూర్యతేజులు భుజాక్రీడామహాశాను లు
ర్వరయం దేగుచు వత్తురిం దవనిజా పర్యేషణావ్యగ్రులు
ద్ధురులై వానరయూథనాథులు దిసంతుల్ కొట్టుకొం చీవు మ
త్వరమార్థోక్తులు వారికిం దెలుపుమీ బాలించు చీ కొండపై.

మ. సరిగా వారిట కేగుదెంచునెడఁ బక్షవృష్టి నీకున్న నే
గిరిపై నుందువొ యేమహాంబునిధిపైఁ గ్రీడింతొ సీవిందె వా
నరయూథంబు ప్రతీక్ష సేయుచు నిరంతం బుండు మంచున్ నిశా
కరుఁ డాజ్ఞం బొనరించె నేను నది ఱెక్కల్లేక పాలించుదున్. 332

క. సురలకు మునులకు బ్రాహ్మణ నరులకు నభివాంఛనీయ బంధుర కార్యం
బురవడిఁ జేయఁగ నేలా గరుత్ప్రరోహాభిలాష గలుగును నాకున్. 333

క. మఱియును ముని చెప్పెను మీరరుదెంచినయంతమీఁద నాశాస్యంబున్
విరచించిన యంతటిలో గరుదుద్గమనంబు నాకుఁగలుగు నటంచున్. 334

నా గర్భమునఁ బుట్టినావా! నిజంబుగ వైనతేయుని దైన వంశమెల్ల
నీ మూలమున నపనింద పాలైనది యని లక్ష్మ తిట్టితినయ్యా! కొడుకు
గీ. నెంత గుబ్బిసలాడిపోయితి నెడందఁ బ్రాణమిత్రుని దశరథు ననుఁగుబిడ్డ
యిట్టి దుస్థితి పొందఁగా నేమిచేయ లేకపోయితి ఛిత కదళీ విధాన. 343

సీ. మఱియువిచారింప మాజటాయువుఁబోలె గసిమసంగియయుండుఁగాదెయసుర
కొడుకు వాఁడటులైనఁ గూడు లే కిచ్చట నేఁ జచ్చియుందు, మనీషిలోక
సార్వభౌముని మునీశ్వరు నాజ్ఞ పాలించుటది యెట్టులౌనని యాశ్వసిల్లి
కపియూథనాథు లింకను రార యంచును నెలలు దినములు గణించుకొంచు
గీ. మెట్టఁ బ్రాయోపవిష్టుల మిమ్ముఁ జూచి పట్టికోఁతు లేమోయని పట్టిచూడ
నట్టులాడిలి ననుకొన్నయట్టులైతి రిట్టలంబైన కార్యంబు నినుమడింప. 344

వ. అనుచుండ వానరయూథనాథుల యుత్సాహంబు శతసహస్రాధిక గుణంబై
సంపాతి గాంభీర్యంబు గాంభీర్యం బంత పౌరుషంబు పౌరుషంబంత విజ్ఞానంబు
విజ్ఞానంబంత మెత్తనిగుండెయుఁ జూచి మన్వంతరజీవులస్వరూపం బిట్లుండు
ననుకొంచు ఋషిపరమేశ్వర ప్రాగభిజ్ఞాత రామకార్యసిద్ధిలోఁ దమకార్యసిద్ధి
యున్న దనుకొనుచుండ. 345

మ. ఒక యేఁడాదియు సంగృహీతమయి యే యొక్కండుగానొ నిమే
షక కాలంబునఁ గుంచుకొన్నటుల వృక్షశ్రేణి కాంతారకా
మకమౌ బహ్వృతుకాలికంబు పరిణామం బొక్క హిక్కానిమే
షక కాలంబునఁ గుంచుకొన్నటుల దృక్కాలూక ముద్భిన్నమై. 346

క. సంపాతికిఁ బక్షంబులు శంపా తీవ్రంబుఁ గాఁగఁ జనుదెంచుటయున్
సంపాతికి సంతోషము శంపాతీవ్రంబుగాఁగ జనుదెంచుటయున్. 347

చ. కనుఁగొనుచున్న వానరులఁ గన్గొనుచున్ ఖగనాయకుండు న
న్నిప్పుడు [illegible] నా యసువు ముంగిలినేస్తు నిశాకరుండు న
న్నిప్పుడు [illegible] తెక్కలును మొల్చిన వమ్మని చెప్పినట్లు మీ
[illegible] గరుత్తులనుం జనుదెంచెఁ జూడుఁడీ. 348

క. [illegible] వడి యుత్సాహంబు గలుగు నాలోఁ దొల్లిం
[illegible] వచ్చిన యది మఱి యబ్బురముకావె యమ్మనిమాటల్.

వ. [illegible] డింక నాలస్యం బేల? మిమ్ము లంకాపురికిఁ
[illegible] సంపాతికి దోయిలించి తాతా! నీవు మేరుబలశాలి
[illegible] నీ తెక్కలయందు స్థలము చాలదు.
పైగా [illegible] బర్వతాభులము. మేము సము
[illegible] రావణుని పడిజుట్టుపట్టికట్టి తేఁగల మన్న సంపాతి
[illegible] చేసితి నింక మీ యిష్టము నేనును బ్రస్రవణగిరి గగనలంబినై
[illegible] శ్రీరామచంద్రునిగాంచి పోదు నని వెడలిపోవ. 350

సీ. కపిచమూ హీహీ నికామ హాస విదీర్ణ దంతకాంతిచ్ఛటా తాండవములు
కపినాయకాప్లవలంఘన సమాక్లప్తోరు జంఘా విఘట్ట నాస్ఫాలనములు
కపిరాజ తనుపార్శ్వ కండూత్యపాకరణోగ్ర వక్రనఖాగ్ర నిగ్రహములుఁ
గపినాథ కంఠనిర్గత తర్జనాభీల ఘుర్ఘురారావ సంఘోషణములు
గీ. వగ్రతరుశాఖికా డోలికాత్తవేగ లంబమా నాన్యశాఖికా లంఘనములు
జనిత సంతోష వల్గన చాలనములు వింధ్యగిరిగుహా నిస్వనాభీల ,మయ్యె. 351

సీ. లాంగూల పరితాడనాంగార నిర్వమ ద్భృంగీ శిలాకోణ భాసురములు
సంజాత కోపదృక్కుంజాత నిర్దహన్మంజావనీ సముద్ఘూర్మాలకములు
శింజాన మధుకరీ యుంజాన మదభావ గంజారవత్కాంతకాహళములు
సంఘాత విచలితా జంఘాల పటుమేండ శింఘాణవద్ధరా శీత్కృతములు
గీ. ధరణి లంఘితశైలాభ దర్దురములు సరణివద్ఘోర నికష శౌర్యాగ్నికములు
జనిత సంతోష వల్గన చాలనములు కపి మహాసేన లద్రిభాగమున నరిగె. 352

గీ. ప్రవిసర ద్ఘోరవార్బంధ వాగురా విలగ్న తిమితిమింగిల విగళన్మహోగ్ర
నాద మేదురితాకాశనాళమైన వారిరాశిని జూచెను ప్లవగచమువు. 353

భుజంగ విజృంభిత.
పాతాళాయాతాహిశ్రేణీ బహుళకుటిలగమన విభావనాద్భుతమాలికా
సీతాన్వీత ప్రౌఢాశ్లేషానితర జలచర నిచయ నీలవర్ణసితచ్ఛవిన్
స్రోతోవ్రాత వ్యాకీర్ణాంబు క్షుభితదళిత సిత కిసలసోమపల్లవరాజ్యలున్
ద్రేతాధూత క్రీడాభూమాతిపక్ష చలిత సుబంధవిస్ఫురితాశనిలజ్జలున్. 354

అష్టమూర్తి.
నాకస్పృగ్వ్యధుతినేగున్ నతమహాసారమాంసున్ నగమహోక్కలితోగున్
బాకారి ప్రముఖసారప్రణతి గంభీరరేఖా ప్రవిమలాద్భుతతేజః
ప్రాకారాంతర నిగూఢప్రచలనాభోగ ధర్మప్రసరణాంచితమూర్తిన్
లోకాలోకకుధరాంఘో లుళితపర్యాయమూర్తిన్ లుఠనమంథరమూర్తిన్. [illegible]

లయగ్రాహి.
స్ఫూర్జటితపీచిచయ దుర్ఘటిత నిష్కరుణ దోర్ఘటిత జంతుతతి నిర్ఘృణజలౌఘాం
తర్ఘృణి మణినిచయ దుర్ఘటమహాచ్ఛవి సుదీర్ఘపరిణాహక వపుర్ఘనమహోర్మిన్
దుర్ఘటకసంతరణ దుర్ఘటికలందు సువిదీర్ఘభుజతాడనము ఘుర్ఘురరవంబుల్
స్ఫూర్ఘటనదేరెదు నదర్ఘమణివాంఛయదిదుర్ఘటము వార్ధహరినిర్ఘృణునియందున్.

వలాహకము.
దిక్సీమాంతకమిత ధిమితధిమిత ధిమకధిమక పటుతరమృదంగోద్యత్
స్రక్సంరావమల నటనచతుర శపర శకునినిచయకృతసాహాయ్యున్
ప్రాక్సృష్టిన్ వెలుచు జలజభవకృత నుతిభరిత సవనఘటనావేహః
స్రుక్సందీపిత మహితచరునిహితనుత రుచిర మహిమహాధాయ్యున్. 357

స్రగ్ధర.

సంత్రస్తప్రాణిలోక జ్వలిత జలమహోచండు మైనాకభూభృత్
సంత్రాణోపేతకార్యచ్ఛదన వదనవిచ్ఛాయగంభీరభావున్
సంత్రైవిద్యప్రశస్తక్షతిరహిత సమజ్యామహోద్యత్ప్రసామ
జ్జ్మంత్రాయాత ప్రకీర్ణోన్మథురరవ మహోమండలీభూతరావున్.

పద్మనాభము.

హేలాజగద్రూప సర్వేశ్వరాముక్త హీరావళీప్రౌఢ హారాళిభూషా
ప్రాలంబికాయుక్త ముక్తావళీ హేమగ్రైవేయక ప్రోజ్జ్వలత్పారితథ్యా
మాలాచల ద్గుచ్ఛగుచ్ఛార్ధనక్షత్రమాలా చకత్పత్రపాశ్యాసవంచ
ద్వ్యాలోల సత్కర్ణికాకుండలానేక వస్తుచ్ఛటా నైష్కికాకారదివ్యున్.

సీ. భోగవతీ ఝురాంబువులు క్షేత్రాజీవులాసారముగ గూడవేసినట్లు
మౌళి రత్నచ్ఛటా మహనీయ చక్షుశ్శ్రవశ్చమూతతి దండు వచ్చినట్లు
రత్న సంగ్రహమతిం బ్రస్ఫోటనములంతో జిట్లు బస్తకమును జెఱుగునట్లు
జగదంకురములు విశ్లథ వళక్ష దళ భాసుర వనంబులు తలసూపునట్లు

గీ. నాగలోక మహోగ్రవానరచమువులు తమ్ముంగని తర్జనాభీల దంతదర్శ
నోగ్రముగ దూకంగా బోవుచున్నయట్లు నచ్చెరువు భీతిం గొల్పెడు యామ్యవ

గీ. దేవతలురాక్షసులునుమథించినారు పూర్వమెపుడొ యాభయమింకం బోవలే
తనకు నవిరతకంపునకును జగమ్ము భయముపెట్టు దురధికారి వార్ధిరాజు.

గీ. ఎచటనైనను కట్టిన సిచయ మనిల ధూతమై చెంగు లవి మేనం దొల
నవనిదేవి యీ కట్టినయట్టి బట్ట యామె దేహాంచలంబుల హత్తుకొనెడు

గీ. అయిదుఋతువులయందు వర్షాగమంబు కావలయు నల్ల నాగలోకంబునం
నచట వర్షించుస్తనయిత్నువైన మేఘ పటలి యుపరిభాగంబ యీ వార్ధిర

వ. ప్రథమదర్శనభయంబు తీఱి యాశ్చర్యంబునం జూచుచు సంతరణ భావ
గదుర నిస్పృహ లగుచు వివర్ణులై గ్రుక్కిళ్ళుమ్రింగుచు విచారించి విచా
విషాదంబు భజించి యచటం బ్రాయోపవేశంబుమేలైనది సంపాతివాక్య
త్సాహంబు వృథాయని కటిమస్తక విలోచన విన్యస్తహస్తులైయున్న వానరవీ
గని హనూమత్సమాన ప్రతిభుండైన యంగదుండిట్లనియె.

గీ. జడము దుఃఖంబు నతితరోత్సాహవృత్తి చేతనత్వంబు నుత్సాహసిద్ధి ప్రా
వత్త్వమును మృత్యువు విషాదభావ మీ వివేకమున మనంగవలయు వీరచయ

శా. ఈ యంభోధి తరింపలేమనినచో నిందేల రానయ్యెడిన్
బ్రాయాసీనత నందె యుండెదము సంపాతిక్షుధాపూర్తిగా
శ్రేయోదూత నిశాకరుండు వచియించెన్ దేని నయ్యర్థ మం

చ. ఉదధియు నొక్క యీదిశనె యున్నదొ తక్కిన మూఁడుదిక్కులం
దుదధులు పెక్కులున్నయవి యూర్జితబాహులు తద్దిశాగతుల్
త్రిదివ సముల్ కపీంద్రు లరుదెంచెద రింతకె యన్నిగాంచి యా
మ్యదిశకు వచ్చినట్టి మనయందున నున్నది దోషమంతయున్. 367

చ. కవియు నిషాదమై యకృతకార్యుల మేగినఁ జండశాసనుం
డవు పినతండ్రిచే బ్రదుకుటన్నది యుండదు నాత్మహత్యచేఁ
గవిసెడు రౌరవాది నరకంబు ఫలంబగు, వీరజాతికిన్
దవిలిన కార్యమార్గమునఁ దారుట చచ్చియు స్వర్గహేతువే. 368

ఉ. ఈదెస సీతయున్కి నదియెంతొ యెఱుంగును వానరేశ్వరుం
డీదెస నామె యున్నదనియే వచియించె జటాయునన్న, మి
మ్మీదెస కన్పె రా జుదధి యిచ్చట నున్నదటంచుఁ జెప్పెనే
కాదె పయోధితారకునిఁ గానకమే వచియించెనందురా. 369

మ. తనయూహల్ మఱి తానెఱుంగుఁ గసిరాడ్ధాత్రీశుఁ డీయింతమం
దిని రత్నాకర చండవాస్తరణ సందీప్తోరు బాహో నిబం
ధనులెవ్వారొ యెఱుంగకే పనిచెనా తచ్చౌర్యరేఖాట్టు లిం
దున వారెవ్వరొ వారివారిఁ గనుగొందున్ నేన యేలా వ్యథల్. 370

క. ఇతర దిశా పర్యేషణ కతని నతని నొకని నొకని నంపించెఁ జమూ
పతులను బన్నిద్దఱ నీ క్షితికిం బంపించె నేమి చిత్తము కలఁడో. 371

ఉ. అందఱు మాకుఁ గాదనినయట్టుల నిట్టులఁ గూరుచుండఁగాఁ
గ్రందగువేళ వాఁడు యువరాజగదా మనకేలయంచు నా
కెందును దప్పదిందు మఱి యెవ్వరొ నిర్ణయమాచరించెదన్
వందురనేల ముంగిటికి వచ్చిన సిద్ధిని స్వీకరింపకన్. 37

మ. పగటం జూచితి మీ పయోనిధి నిశాబాంధుర్య మెట్లుండునో
తగ నీరెండు నెఱింగి పోవలయుఁగాదా! వార్ధిపైఁ బోవ నెం
చగ నేదోయొక వందయామడలు నుజ్జాయింపు లెక్కేవదో
మిగులంగల్గిన నంతమించి చనలేమిన్ వాఁడొకం డేమగున్. 37

శా. అన్యాధారములేని యీయిరులు ఘోరాంభోధినైల్యచ్ఛటా
జన్యంబుల్ జలజాంగనాప్రియ జగచ్చక్షుశ్ఛటా వాహినీ
జన్యప్రాప్త నిశాజయంబులు దిదృక్షామూర్తిమ ద్విఘ్నముల్
వన్యేభంబులనన్ దటీ ధవళ వార్యాజోగ్రదంతంబులై. 37

వ. అనుచున్న యంగదుని నొసంటఁ బ్రొద్దుపొడిచిన నాంజనేయాదుల ప్రాతః
లిక జపతపఃకర్మాదులైన యనంతరంబున శరవణభవాది యోధసైన్యాగ్రయాం
యయిన పురుహూతునింబోలె నొప్పారి వాలిపుత్త్రుఁ డిట్లనియె. 3

గీ. ఈ మహాకార్యమిది ఘటియిల్లె మనకు నన్యులకు శతయోజనాయత మప
నుఱుకఁగా దుస్తరంబు దోరూరు జవన ప్రౌఢ మహానిలులైన వారికిని గా

ఉ. ఈచము వెల్లరుం దిరిగి యింటికినేగుచు నాలుబిడ్డలన్
జూచుకొనం బొనర్పఁగల సుందరమూర్తి యెవండు రామకా
ర్యాచరణంబునందుఁ బ్రభువై చను నెవ్వఁడు వార్ధిమీఁద జం
ఘాచణుఁ డెవ్వఁ డింత దుముకంగలవాడు గరుత్మదాభుఁడై. 3

చ. తరణి వియత్పదంబునను దా ననిలుండు దిశాంతరంబులం
దరిగెడునట్లు దక్షిణదిశాంబుధి నే మహనీయమూర్తి యు
ద్ధురతరవేగపాతమున దూఁకగఁజాలినవాఁడు వానరే
శ్వర పటు కోపభాక్పటుల శాసనభీతిని నిస్తరింపఁగా. 3

చ. క్షితితనయానభిజ్ఞతను శ్రీరఘురాము ధనుర్వినిర్గమత్
శితశరవహ్నిమాలికలచేతఁ ద్రిలోకము పేర్చి భస్మసా
త్కృతముగఁ గాకయుండ నురరీకృతసత్కరుణాబ్ధి వేఁడు దో
ర్నుత పటువేగ లంఘన గరుద్వినతాసుత నూత్నమూర్తియో. 37

మ. నను లంఘించెడు వీఁడటన్న యభిమానం బబ్ధి రాజానకుం
డను, దల్లంఘన తీవ్రకార్య మదియున్ మర్యాదగాఁ జూచుకోఁ
గను, దానెవ్వఁడు సర్వధర్మమయ మాకారంబుగా నూఱు యో
జనముల్ దాఁటెడు దక్షిణాంబుధి శిరశ్చామీకరాకల్పమై. 38

మ. అనినన్ గుండెలు చాల కే కపియు మాటాడంగ నుంకింపకుం
డినఁ, దారేయుఁడు కార్యమింత తలపై నిం గూరుచుండంగఁ బ
ల్కనురాకుండిన నెట్టు లిట్టిపగిదిం గాకున్న నింకొక్కరీ
తిని బ్రశ్నించెద నంచుఁగన్నుఁగవ సందీపించునుత్సాహమై. 381

ఆ. ఎవ్వరెవ్వరెంతయెంత దవ్వును బోవఁ గలరొ వార్ధిమీఁదఁ దెలియవలయు
వారువారు చెప్పవలయు నాకిప్పుడు కార్యవశతఁ జెప్పఁగడఁగుడనిన. 382

వ. గజగవాక్షులు దశవింశతులు గవయుండు ముప్పది శరభగంధమాదనులు చత్వా
రింశ త్పంచాశద్యోజనంబులు మైందద్వివిదులు షష్టి సప్తతులు సుషేణుం
డెనుబదియు యోజనంబులు గమింప సమర్థులమని చెప్పి యూరకుండిన
వృద్ధతముండయిన జాంబవంతుం డిట్లనియె. 383

ఉ. తొంబదియైన యామడలు దూఁకెదనంచుఁ దలంతుఁ బూర్వకా
లంబున మాట యేటికి బలంబున వేగమునందుఁ దొల్లి న
న్నుం బురుడించువానిని గనుంగొనలేరును బెద్దవాఁడనై
తిం బహుకాల మేగినయదిన్ జవసత్వము లింతతగ్గగా. 384

క. పదిపది తక్కువగాఁ జెప్పెదరు సుషేణాదు లవియు వెస నాచను తొం
బదియును నొక్కటియే, కార్యదశోనము లెన్నియైనను నిష్ఫలముల్. 385

శా. పైకింజూచిన రామకార్యముగc గన్పట్టున్ గపివ్రాతహా
లాకృత్యంబుగc దోcపవచ్చు మదిcబోలంజూచినన్ ధర్మవే
లాకైడర్యము సర్వపక్షిమృగ మాలాభోగ్యమున్ ముక్తి రే
ఖా కళ్యాణ పథంబు సర్వసుమనః కాండాభిసంస్పృష్టమున్. 3

గీ. ఒక్కస్త్రీయొక్కపురుషుండహో! యనాదిపథమిదిదీనియందు విపక్షలేదు
చెలిసగంబుగ మేనొందు చెందియున్న యీశ్వరాకారమునకు నా యేడికోళ్ళు

మ. జగమున్ విప్లవహేతుకోహలను విష్టబ్ధంబు గావించు జీ
వ గణంబుల్ ప్రవహింపకుండను, నిలింప ప్రత్నభావంబు జా
రcగనీకుండను, ధర్మదేవతలః సంరక్షింత్రుగాతన్ మమున్
బగదీర్పంగc బరాంగనామతి మహోపాయంబు కల్గింపకన్. 3

ఉ. మున్ను త్రివిక్రముం డుఱియ మూcడుజగంబులు మేననిండ నేc
డన్నిగమాంతమూర్తికిc బ్రదక్షిణముల్ పొనరించినాcడc గా
లున్నిలుపన్ మహాజవన లోలత నట్టిcడ నేను రామకా
ర్యోన్నయనంబువేళc బదియుంగొఱుయ్యైతిని కాలమెట్టిదో. 3

క. వేల్పులకు మృతియె కల్గన యుల్పులకున్ జరయుc గల్గి నవి యెన్ని మహ
కల్పములు బ్రతికియైన ననల్పం బీ ధర్మబుద్ధి యది రక్షించున్. 3

క. ఒక్కcడ నే నిట్లొటను దక్కcవ కారాదు సముదిత ప్రభుకార్యం
బిక్కపిలోకము నానా దిక్కులంతన వార్ధితరణ దివ్యంబగుతన్. 3

వ. అనిన నంగదుం డీ వందయోజనంబులు నేc బోవcగలను గాని తిరిగి రా
నన్న భయ మున్నది యేమి చేయుదు ననిన జాంబవంతుం డిట్లనియె. 3

శా. చాలుంజాలును నే నెఱుంగుదును నీశక్తిన్ శతంబంచు నే
లా లక్ష్మైన మఱిం బదైనc జన నేలా నీవు మా స్వామిపై
పోలన్ బ్రేష్యుల మేము ప్రేషయిత నీవున్ నీవు పంపింతువున్
మాలో నెవ్వcడొ నేయుస్వామికృతియున్ మన్నింపకెట్లొప్పెడున్. 3

ఉ. స్వామి కళత్రమెల్లపుడు సైన్యచయంబున కీవు లేక మే
మేమియుc జేయcజాలము మహీయసుc డీవును స్వామిభావర
క్షామహితాబ్ధిపై నిలువ సర్వపయోధులు జానుదఘ్నముల్
గా మసలన్ మఱెంతటనుకన్ బ్రతిపాల్యుcడ నీవు మాకిటన్. 3

క. గురుcడవు గురుపుత్త్రుండవు పరమాధారమవు మాకుc బ్రతిపాల్యుcడవున్
భరణముగ మూలమే చెడc దరువు కిసాలయు పిశంగ దళఫల మగునే? 3

వ. నిన్నాశ్రయించి మా బుద్ధివిక్రమంబులు ఫలించు, నిన్నాశ్రయించి మే మర్థ
ధకుల మగుదుము, నిన్నాశ్రయించి జగంబులు నడచుచున్న వన నంగదుc
హనుమంతునివంకc గాంచి జాంబవంతునితో నిట్లనియె.

చ. అవు నిది నేను చేయనిది యన్యులు చేయరు చేయకున్న నే
మవు రఘురామకార్యము వృథాంగదహస్త విలగ్నయత్నమై
వివర మెఱుంగఁ బ్రాయ ముపవేశనమే మఱలన్ బొనర్పఁగా
నవు. విపులాగ్రహాగ్రహ విహారుఁ గపిప్రభుఁ జేరు టెట్లగున్. 397

శా. ఏనా! రాజనుగాదు కాననుటలే దీ సంధిలో నుంటిఁ బో
నైనం జాతురు వచ్చు మాట యది వే అన్నన్ భవద్వాక్యసం
ధానం బిట్టుల నున్న దింక నెవరో తన్నిర్ణయం బీవ సం
ధానింపన్వలె నన్నుఁ బ్రేషయితయన్నన్ బ్రేష్యుఁడన్నన్ సరే. 398

మ. శితధీకుల్ శ్రిత బాహులందఱును దూష్ణీంమగ్నులైయున్న ధి
క్కృత సర్వారిచమూనిబంధనుఁడు సుగ్రీవుండు నాతండ్రినన్
బలిగాగం బొనరించి పంపిన చమూభారంబు నా నేఁడు ప
ద్ధతిగా జేసెద చేయుచున్ జలధిమధ్యం బందు నేమైననున్. 399

గీ. అదియు సుగ్రీవుఁడేమొ నన్నధిపతిగను జేసి పంపించనే లేదు చిత్తములను
మీరె యనుకొనుచుండిరి మెరమెరైనఁ కనులు దివ్వెయటం చూహ కలిగినట్లు.

వ. అనిన జాంబవంతుండు నేను సాధించెద నీకెందు కూరకుండుమని మాటా డకుండ దూరముగాఁబోయి కూర్చున్న హనుమంతుని సమీపించి విషణ్ణమైన వానరసేనఁ జూపించి యిట్లనియె.

క. నీ వొకఁడవు కాకుండగ నీ వానరసేన దుఃఖ మెవ్వఁడు తీర్చున్
నీవేమొ పట్టనట్టుల భావించెదు మూఁగనోము పట్టినయట్టుల్. 402

శా. నీకున్ భక్తుఁడు రాజు నంగదుఁడు వానిన్ నీవు మన్నింపనుం
గై కోమన్వలయున్ భవత్ప్రతిభ యాకాక్షించి కూర్చుండె నీ
వేకాంతంబునఁ గూరుచుంటి విట నేఁడీ రామకార్యంబు బా
హాకుంఠీకృతవార్ధి! వార్ధితటమం దాందోళితం బయ్యెడిన్. 403

శా. ఈ విన్ మించరు సూర్యసూతియునుగానీ! రామసౌమిత్రులుం
గానీ శౌర్యమునన్ బలంబునను వేగంబందుఁ బాండిత్య మం
దీ నీ జన్మయె వేదశాస్త్రపరిషద్ధేలా మనోజ్ఞావతా
రానూన ప్రభామయంబగుఁ గపివ్యాజాకృతీ! మారుతీ! 404

వ. అనిన సర్వసేనాపతులును సర్వవానర చమువును నిర్నిమేషదృష్టి శ్రీహను మంతుం గాంచుచుండ జాంబవంతుం డిట్లనియె. 405

ఉ. దండిత దందశూక సముదాయుఁ డనంతసఖుండు పేర్చి బ్ర
హ్మాండము లెల్ల తెక్కకవయందునఁ దాల్చు నరిష్టనేమి పు
త్రుండగు వైనతేయుఁ డొకరుండు గరుత్మదభిఖ్యఁ బక్షి మా
ర్తాండుఁ డనంత పక్ష జవహారి వియద్భ్రమణ ప్రచండుఁడై. 406

ఉ. అయిన నెన్నిసార్లయిన నారసినాఁడ మహోద్భుతాక్షి సం
ఛాయుతమూర్తి నేచు గగనంబున సాగర వర్తమాన నా
దేయ భుజంగలోక కుస్మృతిప్రవిదారణ కర్మభాగ్గరు
చ్ఛ్రీయుతవేగ నేత్ర వివశీకృతి వైష్ణవ చక్రసన్నిభున్. 407

శా. ఈనిన్ మించరు వైనతేయుఁడునుగానీ రామ సౌమిత్రులుం
గానీ తీవ్ర వియద్భ్రమత్తను సమగ్ర ప్రౌఢవేగంబుచే
నీ నీ జన్మ సతీ పరిగ్రహణ పూర్వేచ్ఛాక శ్రీకంఠ రూ
పానూన ప్రతిభామయంబు మతి సంస్థాయ్యాకృతీ! మారుతీ! 408

గీ. బలముచే బుద్ధిచేత సత్త్వంబుచేత నధిక తేజస్సుచేత నీ యంతవాఁడు
చెలఁగు త్రైకాలికంబైన సృష్టియందుఁ గానరాడయ్య! మేలుకో కపిమహేశ! 409

వ. అనుచుండ సర్వవానరపతులును సర్వవానరసేనయు విస్ఫుతాక్షి గోళంబులఁ గను
చుండ జాంబవంతుం డిట్లనియె. 410

ఉ. నీవు మహాభానువుఁడవు నీదగు జన్మకథాసుధాఝురిన్
నా వినినట్టిదాని నొకనాఁడు వచించెద మిత్రులొ మరు
ద్దేవుఁ డుషర్బుధుం డటవిదేశవిహారము సేయుచున్ దహా
త్వావకు నంటి యేగు వృషదశ్వుని నగ్నివచించె నీగతిన్. 41

చ. ఒక శిలవెన్క నే నొదిగియుండి సమస్తము విన్నదాని, భ
ల్లుకములు వహ్నిభీతి కడలున్, సఖ! నీకును నంజనాప్లవం
గికి జత యెట్లు కూడినది కీశకులంబున నీకుఁగోర్కి యే
ల కలిగె మైత్రి భావశబలంబుగఁ జెప్పుమటంచు నాడినన్. 41

చ. అనినను ప్రక్కచెట్ల చివురాకుల నీలలు వేసికొంచు నం
తన యనిలుండనెన్ గిరినితంబిని సంపిహితోత్తరీయమో
హన కుచమండలీ విరచితాంగజ కౌసుమ ముగ్ధవర్మ, తా
రిన కనుమేరలన్ మధు ఝురీ శఫరీవిలుఠత్తరంగయై. 41

ఉ. అమెను నే నెఱుంగుదున యాయమ యచ్చర పుంజికస్థలా
ఖ్యామస్పృణాంగవల్లిక యొకానొక శాపముచేతఁ గుంజరా
ఖ్యామహానీయుఁడౌ కపికినాత్మజయై జనియించెఁ గానలం
దామెయుఁ గామలబ్ధ వివిధాకృతియై విహరించుచుండెడిన్. 4

చ. మొగమునఁ గోతియై సకల ముగ్ధతమాంగములం దలౌకిక
ద్విగుణితమౌ వనోత్సవ విశీర్ణిగ నొక్క శిలాతలంబునం
దు గిరినితంబఁ గొంచిన కనుంగవ సొంగ వపుశ్ఛవి ప్రపీ
తిగఁ దిగ కంటికిన్ మరులు తెచ్చెడి యందము ప్రుచ్ఛిలింపఁగన్.

ఉ. సంగమవేళ భావ రససంగత వృత్తులొ యేమొకాని మా
తంగమనోజ్ఞయానలు ఘృతాచియు నూర్వశి రంభ, భావ సం

ధ్యంగ మనోజ్ఞతా కఠినతామృదుతా నవయౌవనోత్సవా
సంగకుడుంగమూర్తిఁ గనినన్ సరిపోలరు పుంజికస్థలన్. 417

చ. ఎఱుఁగని వేళ స్త్రీవసనమింత హరింపుము కన్నువిచ్చపెన్
వెఱఁగున నీ వెఱుంగకయ వేచు నొకానొక యాభిముఖ్య మీ
నఱుమగ నొక్కసాహసము నార్ద్రిత సాంత్వన చాటువైఖరుల్
మెఱవడి నీకుఁ బొల్కడలిమీఁగడ యందు మథింపకుండఁగన్. 418

మ. రతిభావాంబుధి సూక్ష్మనిర్మథన సారంబౌ రహోవేళ నా
సతి వక్షోంశుకముం బిఱుందుపయి వస్త్రం బవ్వియే జాఱెనన్
గతి సూక్ష్మంబుగ నే హరించితి నెఱుంగన్ లేద నేఁ గౌఁగిలిం
చితి గాటంబుగ నెంతదాఁక వివృతాక్షిక్లిన్నభీతత్రపన్. 419

శా. నా కౌమార హరుం డెవండనియొ, సంధ్యావల్లి నోదార్చితిన్
గోకన్ లాగుచు నే భయంపడకు నీకుం గీడుకావింపనే
నీకుం బాపము రాదు నేఁ గొనెద దానిన్ మంజుగుంజద్గళా!
శ్రీకారశ్రవణా! నవాధర సుధాశ్రీకా! కపోలారుణా! 420

ఉ. అప్పుడు పుట్టె మా హనుమ యున్మదనంత జవోగ్రమూర్తి తా
నప్పుడు పుట్టుచే యెగిరె నాకసమం దుదయించు పేవెలుం
గొప్పిన యాఁతపండ్లవి నతోజ్జ్వల గుచ్ఛమటంచటంచుఁ దాఁ
జెప్పచు నేగె వాయువును జేరని విన్కలిగాఁగ దవ్వులన్. 421

మ. మరి వీఁడెవ్వడొ క్రొత్తరాహు కబళింపన్ వచ్చుచున్నాఁడు బం
ధురునిన్ సూర్యునటంచు నేసె బురుహూతుం డంజనాసూను బం
ధురునిం జెక్కిలిక్రిందిచోట హనుమంతు డంత మూర్ఛన్ గనెన్
కురువుం గాంచిన యంజనాగళ రవాక్రోశంబు క్రోశంబునన్. 422

మ. వినుచుంగాలి బిగించె ముజ్జగమునన్ విజ్జెన ప్రాణుల్ హరిం
పను ముక్కోటులు కాళ్ళవేళ్ళఁబడి సంప్రార్థించి యుజ్జీవితుం
బొనరింపన్ హనుమంతునప్పటికి వంపుల్ తీఱె లోకంబునన్
దునుగన్ రానివి చేరె నిన్ బహు మహత్తుల్ సర్వదైవత్యముల్. 423

ఉ. ఓ మహనీయ వానర కులోదధి పూర్ణశశాంక! నీకు ని
చ్ఛామరణం బొసెంగె జలజాసన మూర్తి యశస్త్రవధ్యతన్
నీ మెయిలావు ధారణియు నింగియుఁ బట్టవు నీ జవంబు ది
క్సీమలు వట్ట వెంతయు నసీమ పరాక్రమ వార్ధి! మారుతీ! 424

మ. ఉదయత్సూర్యుని దొట్టి యస్తమయసూర్యుండైన దాఁకన్ సమల్
చదువన్ దోఁజన మిన్ననం దెవనికో సాధ్యంబు దా నట్టి నీ
కిది యేపాటిది గోటిమీఁది పని మ మ్మీయల్పవారాశియుం
దదయత్వంబున ముంపకే సకల విద్యాభారతీ! మారుతీ! 425

వ. అవినంత సర్వవానరపతులును సర్వవానరసేనయు మహాశ్చర్యరస నిమగ్నులై భయభ్రాంతబాష్పనేత్రంబుల నతశిరస్కులై నిలువ జాంబవంతుండు. 426

మ. మునుపో తాత! యధోక్షజుండు సహసాపూర్తిన్ ద్రిధావిక్రమిం
చిననాఁడేను ప్రదక్షిణించితి మహోక్షిత్యాకృతిన్ వెంట వెం
టనె ముమ్మాఱు జరాభరంపడిన తోడం జన్న వానాళ్ళు నే
నును చన్నన్ మఱి నీవు చన్నదగునే నూల్కొఁగదే మారుతీ! 427

శా. ఆపన్నగ్నుల నుద్ధరింపవె ప్లవంగానీకినిన్ నీ రహో
నీ పంతంబును నీమహాబలమునున్ నీమింటి సాంయాత్రిక
త్వాపూర్ణోగ్రజవంబు చూడవలెనం చెంతం బ్రతీక్షింతుర
య్యా! పాలింపవె మమ్మిటన్ గగనబాహావ్యాపృతీ! మారుతీ! 428

చ. వివృత విలోచనాంబుజుఁడు విస్మృతదేహుఁడు జాంబవద్యథా
ర్థ వచన పాలికాశ్రవణ రంజితచిత్తుఁడు స్వస్వరూప సా
ధు విమలభావనా మతియుతుండయి పొల్చె బుగర్ధదీపనా
శ్రవ పరితో వివర్త మధుర స్థితిఁగాంచు బిడౌజువోలికన్. 429

మ. అట యోగింబలెఁ గూరుచున్న ప్రభువా నయ్యాంజనేయుండు వి
స్ఫుట సంస్తోత్రము లాడుచున్నకొలఁదిన్ స్తోత్రోక్తికార్థాన్వయ
స్ఫుటతేజోపఘనోల్బణంబుగ దిశాస్తోమంబునిండారె నం
తట దర్శించెడు వానరోత్తముల నేత్రంబుల్ దువాళింపఁగన్. 430

మ. ఒగిఁ గూర్చుండినయట్టిఁడౌ హనుమ కూర్చున్నట్లుగా నొక్క హే
లగ నర్దిక్కులు చూచి చూచు త్రుటిలో లాంగూల మాభీల జి
హ్మగపుచ్ఛోగ్రవిచాలనాద్భుత రవ వ్యాదీర్ణరోదోంతరం
బుగ సంతాడన మాచరించె వసుధాభోగంబు నిమ్నంబుగా. 43

ఉ. అంత నభస్వదాత్మజుని యాననమండల మంబరీష వి
భ్రాంతిగ నేత్రగోళక భరంబగుచున్ హసనీ జ్వలంబుగాఁ
జెంతలనున్న వానరులు చేతములందు భయంబు హర్ష వి
క్రాంతులు దండడింపఁగ ముఖంబుల మిశ్రవికారభావులై. 43

ఉ. ఉంభితదేహమై గిరిగుహోరు శయానము నిద్రలేచి పెన్
జృంభణ మాచరించిన మృగేంద్రమహాస్యమువోలె దర్శనో
త్తంభన మూర్తియైన వృషదశ్వతనూజుని వక్త్రగహ్వరా
లంభితమౌ విహాయసతలం బతియామ్య జగత్ప్రబర్హమై. 43

ఉ. మున్ను త్రివిక్రముం డఖిలభూభువనంబులు నిండె నెట్లుగా
నన్న నదిట్లుగాననను నుదాహృతిఁ, జండదిగుంభితంబుగా
మిన్నున కంతనంతఁ బయిమెల్చిన మౌళి తలంబుగా జగా
కన్నులు చంద్రసిప్పకలుగా హనుమంతుఁడు నిల్చెనుగ్రుఁడై.

చ. నలుగురున్ మహాకపియనన్ వినుటొక్కటి మంత్రిభావ ము
జ్జ్వల మధికార మొక్కటియు సంగత గౌరవహేతువుల్ కపీం
ద్రులకును మున్ను నేఁ డసిత తోయదమూర్తి నభోంతరాళ సం
జ్వలిత తనూరుహోపఘన చండునిఁ గాంచిన గుండెబ్రద్దలై. 435

వ. అంత హనుమంతుండు హరివృద్ధులకు నమస్కరించి యిట్లనియె. 436

మ. పృథివీభృత్ప్రవికంపనోగ్రము యదాభీలప్రవేగంబు సా
రథి యెవ్వాఁడవు జీవకోటికి సమారబ్ధాసు యాత్రా మహా
పథమం దాపృషదశ్వు నౌరసుఁడ మద్బాహూరురేఖల్ జవా
వధికంబుల్ ననునేన పోలుదుఁ బ్రభావస్థైర్య వేగంబులన్. 437

ఉ. ఎంతటివాఁడు కావలయు నెప్పుడు యత్ప్రతిభా విశిష్టుఁడై
యంతటివాఁడు నేనగుదు నప్పుడు తత్ప్రతిభా విశిష్టుఁడై
యంతక ప్రాంగణస్థిత మహోధ్వజవ ద్భుజదండ తీవ్రుఁడన్
జింతితకార్యముల్ తనరఁ జేయఁగఁ గల్పతరూపమానుఁడన్. 438

ఉ. నా జవమున్ బలంబును మనస్సున కందవు సర్వభూమిభృ
ద్రాజులఁ బెల్లగించి విసరంగను జాలుదు దిక్చయంబులన్
భ్రాజితవార్ధి వాశ్చయభరంబును జిమ్ముదు ధారుణీ స్థలిన్
నా జనియింపఁజేయు గళనాదముచేత దిశల్ చలింపఁగన్. 439

ఉ. ఇంతటివాఁ డెవండనిన నింకొకరుండు మరుత్తనంగనై
నంతటి వైనతేయుఁడు మహాగరుదుత్థమహోగ్ర వేగుఁడై
క్రాంత వియత్పథంబు జనఁగా నొకనేన ప్రదక్షిణింతు నే
కాంతమనస్కుఁడై యొరులు కానని సారణ కుంచనంబులన్. 440

మ. పుడమిం జీల్చెద రెండుగా నడిమికిన్, భూమీధరంబుల్ పొడిం
బొడిగాఁ జేసెద, వార్ధివారి ధరణిం బూరింతు గగ్గోలుగా
వడి మద్వేగ వికృష్టమై చని వియత్ప్రస్థానవేళన్ ననున్
బడి యే తెంచున మింట వృక్షచయముల్ వల్లీప్రతానంబులున్. 441

ఉ. ద్విత్రివిలిప్తలన్ గగనవీథిఁ జరింతును నేను స్వాతి న
క్షత్రమువోలె నన్నుఁగని కంపము నొందఁగ సర్వభూతముల్.
ధాత్రియు మత్పదాహతికిఁ దాళదు లంఘనమందువేళ మ
ద్గాత్రపు బర్వుచేతను దిగంబడిపోవు మహాబిలంబుగా. 442

మ. మరి మింటంజన నేను నన్నుసరింపంగల్గు భూతంబు లే
దురువేగంబున మింటికేగఁ గనుఁడోహో మీరు శాకామృగే
శ్వరు లీనన్నుఁ ద్రి విక్రమ క్రమ తనూసంస్థాయి మెట్లుండెనో
గరుడుండుం బవనుండు నిద్దఱిది వేగంబాగు నాముందటన్. 443

౽దివేల యోజనంబులను దూఁకెదను మీకుఁ జాలునో, ధరణిసుతన్
ముదితాత్మం గని వచ్చెద ముదితాత్ములుకండు భయముపొందుకుడెదలన్.

౻దియునుజాల కింక వలెనేనియు లంకను బెల్లగించి తె
చ్చెదఁ బురుహూతుఁడున్ విధియుఁ జేతులయం దమృతమ్ముఁదాఁచియుం
నెద రనుకొండు సాయుధులు, చెచ్చెర దానినినైనఁ గొంచు వ
చ్చెద నిది చేయలే ననిన చేఁత యెఱుంగను నేను సృష్టిలో. 445

అంత. 446

మును శ్రీరాముఁడు జానకీవిరహసంభూతోగ్రకోపుండు వి
ప్లన భ్రమందించెదనంచు నన్నపుడు ముల్లోకంబు ముల్లోకమెం
క నితాంతోగ్రభయంబు పొందినదొ యంతంబొందె నా డాంజనే
ముని యీ రీతిగ విక్రమించెడు ప్రతాపోక్తి ప్రపంచంబులన్. 447

కపి తమవాఁడునుం దమది కార్యము కావున సంతసంబులో
నపుడు భయం బెఱుంగదు మహాకపి వాహిని విస్మయాక్షిని
స్త్రపముఁగ జూచుచుండి,. యరుదార జగం బిది స్వోపయోగమా
త్రపుఁ దెలివైన యట్టిదియ తత్త్వవిచారణ లేదు దానికిన్. 448

అంత జాంబవంతుండు హనుమంతుని వాక్యంబులు విని వానరుల సంతోషంబు
కని పరిసంప్రాప్తుఁడై యిట్లనియె. 449

తాతా! కేసరిపుత్ర! యార్యనుతవృత్తా! వీరచూడామణీ!
జ్ఞాతుల్ సంతసమంద సాగరతితీర్షం బోయి రావయ్య! యీ
ఖ్యాతిఖ్యాతాద్భుతబాహుశౌర్యవిభవా! అంభోధిగంభీర! య
జ్ఞాతోదాత్తమతిప్రభావ! సుసమజ్ఞావ్యాకృతీ! మారుతీ! 450

గురువృద్ధానుమతంబునను ఋషిప్రసాదమహింబునను మహార్ణవంబు లంఘించి
వమ్ము నీ కోసము మే మిచట నొంటికాలి మీఁదఁ దపస్సు చేయుచుందు
మన నాంజనేయుం డిట్లనియె. 451

ఈయల్పశిలాసంహతి క్ష్మాయిది మత్పాదఘాతచటులత నణఁగున్
పోయెద మహేంద్రగిరిశిఖరాయత గాఢాశ్మబంధురావని కనుచున్. 452

కపిమూర్ధన్యుఁడు నమ్మహేంద్రగిరిశృంగం బెక్కె మేరూర్విభృ
ద్విపులప్రస్థము పంకజాసనుడు నాన్ బృథ్వీధరం బెక్కె యా
క్షిపదుగ్రోపలపాళిగాఁగ విహరించెన్ లంఘనాది ప్రథా
ప వరాభూతనగేంద్రవాసి సకలప్రాణి ప్రకంపంబుగన్. 453

కెవ్వున గీపెట్టె క్షితిధరంబంతఁ బంచాస్యంబు మదకుంభిఁజఱచినట్లు
ఖరఖురీధారలై యొడ్చెను గిరిరాజు తడిగుడ్డ చేతులఁ బిడిచినట్లు

ఘనశిలాతతి వ్రీలఁగానయ్యె నగము చేతులఁ బండ్లకొమ్మను దులిపినట్లు
నగసి క్రిందికి వ్రాలె నగరాజు నల్లనౌ నుడుపులు చవుదులో నుప్పినట్లు
గీ. ఉమ్బరనెఁ గొండ పాములు బుస్సకొట్ట కందరాబిలసీమలు, కత్తిరిల్లి
యొకవిరక్తి వహించెఁ దానుర్విధరము కదలు చఱియల సిద్ధులు వదలిపోవ

చ. మంగళరూప! యయ్య! హరిమర్కటమర్కట! పంచవక్త్ర! ఖ
ట్వాంగమహాసిఖేటకుధరామృతకుంభసృణి ప్రదీపితో
త్తుంగకరాంబుజాత! నవతోయదమూర్తి! త్రిపంచనేత్ర! స
ర్వాంగదకంఠహార! కరుణాంబుధి! నన్ దయచూడు మారుతీ!

శా. నీపాలం బడినాము చంచలమతిన్ నీ దోరుదగ్ర ప్రభా
శ్రీపాండిత్య మెఱుంగలేమును గటాక్షింపంగదే రామకాం
తాపర్యేషణ పెండ్లికూతురయి యందాలొప్పెడున్ వార్ధిర
థ్యాపల్యంకిక నూత్నధాత! హనుమంతా! యాపదుద్ధారకా!

ఖండాంతము

మ. ఇది కిష్కంధము స్వామి! కోమలచమత్కృత్యర్థ్వనిర్మాణ సం
పదనూనోజ్జ్వల రమ్యభావరససామగ్రీసమగ్రంబు నీ
పదపద్మోపరి సంభ్రమద్భ్రమర రావాశ్లేషణాకూతి నీ
పదరాజీవపుఁ దేనె నా పెదవి నబ్బా! తాకనీవే! శివా!

మ.తా నస్మద్విలసత్కృతిశ్రవణసంధాబుద్ధి ముక్తీల ధా
త్రీనాథుండతడున్ మహాత్ములును ధాత్రీమండలోద్యద్రథా!
నీ నిర్వ్యాజకృపాకటాక్షములు పండింపంగదే! యేది కూ
ర్పో నీ నేర్పె యెఱుంగ నాంతరరసాహృత్యాకృతీ! వారికిన్.

ఉ. ఓ ప్రభు! నిన్ను నేనడుగుచుండిన యట్టులఁ దోచు ముక్తికై
దీప్రములైన భోగములు దీనిని విన్నటువంటి వారికై
క్షిప్రమువోని నాయునికి కమ్మని గాలివి నీవువీవఁగా
క్షిప్రముగా హరించి చనుఁ జెందఁగ దప్పక నాకు నీకునున్.

శిఖరిణి.
విషగ్రీవాకాంతి ప్రసృమర సుధావిర్భవజగత్
తృషాపూర్త్యుద్రేక ప్రవిమల దయాదీప్తివిభవా!
మృషావ్యాహారాఘాంబుధిజల సదాదృత్యవరధీ
తుషాగ్ని వ్యాపార ప్రకటిత మహస్స్ఫూర్తిధిషణా!

మాలిని.
ప్రణవప్రకృతిమూర్తీ! పార్వతీచ్ఛందవర్తీ!
తృణచలననిదానా! దేశరూపాత్మనీనా!
ద్వ్యణుక కలలహేతూ! పాశుపాల్యార్థ సేతూ!
అణిమముఖవిభూతీ! అశరత్వాభియాతీ!

ఓం తత్సత్.